# వినూత్న కథ

(డైరెక్ట్ కథల మూడవ సంకలనం)



సంకలనకర్త

**డా॥ వేదగిరి రాంబాబు**

**శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్**

1-8-59/1/71, చిక్కడపల్లి,

హైదరాబాద్ - 500 030.

ఫోన్స్ : 667665, 661116

**VINOOTNA KATHA**

*(Direct short stories compilation - Volume III)*

*Compiled by*

**Dr. VEDAGIRI RAMBABU**

*First Edition :*
26 May 1996

*Cover Design :*
BAPU

*Art Work :*
BNIM



Price : **Rs. 50/-**

*Laser Type Setting :*
Sri Venkateswara Graphics,
424, 'C' Block, IV Floor,
Datta Sai Apartments,
R.T.C. 'X' Roads,
Hyderabad - 500 020.

*Printed at :*
Planographers,
Chirag Ali Lane,
Hyderabad.

# ముందుమాట

కథా సదస్సులలో కథకులందరం కలుసుకుని తెలుగు కథానిక గురించి కేవలం చర్చించుకోవడమే కాకుండా, మంచి కథలు రాయడానికి నడుం కట్టడం అవసరమనే అభిప్రాయంతో రాయడం మానుకున్న సీనియర్ కథకులతో తిరిగి రాయించడానికి, ఈ తరం కథకులలో స్ఫూర్తిని కలిగించడానికి, వచ్చేతరం కథకులకు ప్రోత్సాహాన్నందించటానికి కొత్త కథా సంపుటాల ప్రచురణ ప్రారంభించాము.

కొత్త కథ సంకలనంలో పాతతరం కథకుల కొత్త కథకులు, సరికొత్త కథ సంకలనంలో ఈతరం కథకుల కొత్తకథలు ఎక్కువగా వున్నాయి. **ఈ సంకలనంలో కొత్త కథకుల కొత్త కథలెక్కువగా వున్నాయి. వాటిలో ఉత్తమ కథగా ఎన్నిక చేసిన 'ఉష'గారి 'మరో భేతాళ కథ'కి రూ. 1,116/- బహుమతిని రావూరి కాంతమ్మ స్మారక కథా అవార్డుగా బహూకరిస్తున్నాము. డా॥ మధురాంతకం రాజారాం, నరేంద్ర గారలు లాంటి సీనియర్ కథకులు కొత్తకథలు రాసి మా ఈ ప్రయత్నానికి సహకరించారు.** అందుకని ఈ సంకలనంలో కొత్త కథకుల రచనలతోపాటు సీనియర్ కథకుల రచనలూ వున్నాయి.

ఈ మూడు సంపుటాల్ని కేవలం కథకులకు స్ఫూర్తినిస్తూ కథలు రాయించే ప్రయత్నంలోనే తెచ్చాం. ఇకముందు కథకులు తెలుగు కథకి వన్నె తెచ్చే కొత్త కథల్ని రాస్తే సంవత్సరానికి ఒకటి చొప్పున కలకాలం నిలిచిపోయే కథా సంకలనాల్ని తేవాలన్నది ఆలోచన. మీవంతు సహకారం వుంటేనే ఈ ప్రయత్నం నెరవేరేది... ఆ సహకారాన్ని కోరుతూ.... శలవు.

- వేదగిరి రాంబాబు.

# కథాంజలి

ప్రముఖ రచయిత, శ్రేయోభిలాషులు

**ముళ్ళపూడి వెంకట రమణ** గారికి

ప్రేమతో

ఈ '**వినూత్న కథ**' సంకలనం

అంకితం

- వేదగిరి రాంబాబు

# కథకులు - వినూత్న కథలూ....

# 'ఓ'కు ముందక్షరం

"ఏమయ్యా, అయ్యవారూ! ఎన్నిసార్లడిగినా సెప్పకనే పోతివి. ఇప్పుడైనా సెప్పేదుందా, లేదా? 'ఓ'కు ముందచ్చరమేందయ్యా బాబూ?"

రివాజుగా ఈ ప్రశ్నను మా అయ్యవారిపైకి సంధించే వ్యక్తి పేరు నెటాలం సాయిబు. అది అసలు పేరు కాదు. పరుగెత్తే పామును తరిమి పట్టుకునే కోడె ప్రాయంలో అతడు సముద్రాలు దాటి వెళ్ళి దక్షిణాఫ్రికాలోని నెటాల్ బంగారు గనుల్లో నాలుగైదేళ్ళపాటు పని చేసి వచ్చాడు. అందువల్ల జనవ్యవహారంలో అతడి పేరు నెటాలం సాయిబై పోయింది.

బంగారు గనుల్లో పనిచేశాడు గనుక అతడెంతలేదన్నా ఒక వెలగకాయంత బంగారంతో స్వదేశానికి తిరిగి వచ్చి వుంటాడని మా వూళ్ళో ఒక పుకారుండేది. అడిగిన వాళ్ళకు, ఆపదల్లో వున్న వాళ్ళకు లేదనకుండా తృణమో, ఫణమో ఇస్తూ రావడం పైపుకారు బలపడడానికి తోడ్పడింది. అవసరమైనప్పుడల్లా అతడు బంగారాన్ని డబ్బుగా మార్చేసుకుంటున్నాడని అనుకోవడం ఆనవాయితీ అయిపోయింది. అందుకు తగ్గట్టు ఉందో, లేదో తెలియనివ్వకుండా అతడు తన పిడికిలిని బిగించే వుంచాడు. ఉన్నా లేనట్టు, లేకపోయినా ఉన్నట్టు గుంభనంగా బ్రతకడం అతడి ధ్యేయమై ఉండొచ్చు. కానీ అతడు భాగ్యవంతుడైనదీ, కానిదీ కూడా ఒక మిస్టరీగానే వుండిపోయింది.

మూలధనం సంగతేమిటో నాకు తెలియదు కానీ, నడమంతరపు సిరిలాంటిదేదైనా దాపురించి వుంటే నివసించే యింట్లో, కట్టే బట్టల్లో, తినే తిండిలో మార్పు కనిపించాలి. నెటాలం సాయిబు జీవితంలో అలాంటి హఠాత్ పరిణామమేదీ పొడసూపలేదు. నాకు

తెలిసినంతవరకూ అతడు తన చేతుల బలంతోనే సంసార రథాన్ని లాగుతూ వచ్చాడు. అతడికి పిత్రార్జితంగా లభించిందల్లా మెట్ట వీధిలోని చుట్టిల్లు ఒక్కటే! అది కోడిపిల్లలపైన మూసి పెట్టిన కుక్కి తట్టలా కనిపిస్తుండేది. మొదటి భార్య కొద్ది సంవత్సరాలు కాపురం చేసి, భర్త పాలిటికి యిద్దరు బిడ్డల్ని మిగిల్చి, కాలం చేసింది. ఆ బిడ్డల్ని అత్తవారింట్లో అప్పగించి, అతడు నెటాలం వెళ్ళాడు. తిరిగి వచ్చాక అత్తవారింట్లో ఉండడానికి మనస్కరించక గంజి కాచి పొయ్యటం కోసం రెండో పెళ్ళి చేసుకున్నాడు. సాయిబు నిబ్బరాన్ని పరీక్షించడాని కన్నట్లుగా రెండో భార్యకు అయిదుగురు బిడ్డలు కలిగారు. పూటకొక శేరు వుడకేస్తే మెతుకు మిగలని పరిస్థితి! అన్నముంటే సరిపోయిందా? కూరనారలుండద్దూ? తిండి సంగతి సరే. బట్టమాట? ఈ ఖర్చులన్నీ నిభాయించుకోడానికి అతడెన్నెన్ని పడుబాట్లు పడివుంటాడో ఊహించుకోవలసిందే! బావులు తవ్వేపని, ఇటుకలు మోసే పని, చింతకాయలు రాల్చేపని, మామిడికాయలు కోసే పని, రోడ్డుపైన గుల్ల పరిచే పని, పొలాల్లో పంటలు కోసే పని - ఇలా ఎన్నెన్నో పనులు చేసి చూచి, ఆఖరకతడెట్లాగో ఎద్దులూ, బండీ సంపాదించి, బాడుగలకు బండి తోలుకునేవాడని విన్నాను. 'సాగితే బండి, సాగకపోతే బండ' అని సామెత. నెటాలం సాయిబు బండి సాగినందువల్లనే, అతడి సంసారమున్నూ సాగివుంటుందని ఊహించవచ్చు. ఒకరిని యాచించకుండా, ఒళ్ళు దాచుకోకుండా తనపనేదో తాను చేసుకుపోయే వాడిని కర్మయోగిగా భావించి ఉండవలసింది. అబ్బే, నెటాలం సాయిబుకు అలాంటి కితాబేదీ దక్కినట్టులేదు. పైపెచ్చు అతడి యాతనంతా మావూరి వాళ్ళ పాలిటికి అంతులేని వెంపర్లాటగానే తోస్తూ వచ్చిందేమోనని నా అనుమానం!

చేతుల బింకంతో సంసార సాగరాన్ని ఈదడంలో పాసుమార్కులు కొట్టేసినప్పటికీ, పెళ్ళిళ్ళ ఘట్టంలో మటుకు ఊపిరాడక చేతులెత్తేసి అతడు బుడుంగుమని మునిగిపోవడం ఖాయమని కొందరు సంశయాత్ములు భావిస్తూ వచ్చారట! అయితే సాయిబు వాళ్ళ ఊహను వమ్ము చేశాడని తెలిసింది. ఎంతో కొంత నగలు పెట్టి, కొద్దో గొప్పో కట్న కానుకలు ముట్టజెప్పి, యేటలు కోసి, అండాల్లో పలావులూ, కుర్మాలు వండించి, అతడు వీలయినంత దర్జాగానే ముగ్గురు కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేశాడట! కూతుళ్ళని అంతస్తులో తనకంటే ఒక నూలు వాసి ఎక్కువైన కుటుంబాల్లోనే యిచ్చినప్పటికీ, కొడుకుల విషయంలో మాత్రం ఎదుటివారి పెట్టుపోతల కోసం ఆశించకుండా గుణానికే ప్రాధాన్యం ఇచ్చి పేద కుటుంబాల నుంచే కోడళ్ళను తెచ్చుకున్నాడట! సమిష్టి కుటుంబమనే సర్కస్సుతో వేగే ఓపిక లేక పెళ్ళి కాగానే ప్రతి కొడుక్కూ ఒక ఆశ్రయం కట్టించి యిచ్చి, బ్రతుకుతెరువు కేదో దారి చూపించి, దానికి కావలసినంత డబ్బు కూడా సర్దుబాటు చేస్తూవచ్చాడట!

ఈ వివాహ తతంగాలన్నీ ముగిసేటప్పటికి అతడికి అరవై యేళ్ళొచ్చేశాయి. వయసులో ప్రొద్దు పడమటికి వాలిపోయింది. అరవైకీ, డెబ్బయికీ మధ్య మళ్ళీ కోలుకోకుండా అతడికి రెండు ఎదురు దెబ్బలు తగిలాయి. ఒకటి, తోడునీడగా, వెన్నుదన్నుగా వుంటూ వచ్చిన భార్య కళ్ళు మూసింది. రెండు, ఒక సందెచీకటి సంత నుంచీ తిరిగి వస్తూ వుండగా వెనకనుంచీ వచ్చిన లారీ ఒకటి ఎద్దుల బండిని గుద్దేసింది. సాయిబు వొకపైన్నుంచి ఎగిరి క్రింద పడ్డాడు. బెదరిన గొడ్లు పరుగులు తీయగా బండి చక్రం అతడి మోచేతి మీదుగా

వెళ్ళిపోయింది.

పుత్తూరు వైద్యంతో అంగవైకల్యం తప్పినా, కుడిచేతికి పగ్గాలు బిగపట్టే సత్తువ లేకపోయింది. 'అయినా సాయిబుకేమిలేవయ్యా! వీరుళ్ళూ సూరుళ్ళూ మాదిరిగా నలుగురు కొడుకులుండారు, వాళ్ళే ముసలి కట్టెను కడతేర్చలేకపోతారా?' అనుకున్నారు మా వూరి వాళ్ళు.

నిజమే, సాయిబు కొడ్కుకులాపాటికి బాగా ప్రయోజకులై తమ బ్రతుకేదో తాము బ్రతకగలుగుతున్నారు. అశక్తుడైన తండ్రి పట్ల నిరాదరణ చూపించడమన్న దురుద్దేశాన్ని సైతం వాళ్ళకంటగట్టడానికి వీల్లేదు. కానీ బాధ్యత నలుగురిదీ గనుక, ఆ మేరకు వంతుల వారీగా దాన్ని పంచుకోవాలని వాళ్ళనుకున్నారు. ఆ వంతుల వారీ పద్ధతి ఎలా వుండాలన్న విషయంలో మాత్రం ఒక పట్టాన అవగాహనకు రాలేకపోయారు. రోజుకొకరింట్లో భోం చేయడమా? వారానికొకరింట్లో చొప్పున గడపడమా? లేకుంటే నెలలవారీ ఏర్పాటా; ఎటూ తోచక నిర్ణయాన్ని తండ్రికే వదిలేశారు.

అయితే కొడుకుల కెదురైన ఈ విచికిత్స, తన ఆత్మాభిమానానికి తగిలిన దెబ్బగానే నెటాలం సాయిబు భావించాడు. 'అక్కడా ఇక్కడా ఎందుకు? నువ్వు నాదగ్గరే వుండిపో నాన్నా' అని ఏ కొడుకైనా అంటాడేమోనని అతడెదురు చూచాడు. అప్పటికి తానేమో ఒక మోయరాని బరువైనట్టు, వంతుల వారీగా తప్పితే దీన్ని మోయడం తమతరం కానట్టు వాళ్లు భావించడం సాయిబు కిష్టం లేకపోయింది. 'మంచిదిరా అబ్బాయిలూ! అంతగా వుడిగి పోయినాక అప్పుడాలోచించుకుందాంలే' అన్నట్టుగా ఊరకుండిపోయాడు. ఊరుకున్నాడంటే ప్రత్యామ్నాయం ఆలోచించకుండా కాదు.

అదిగో ఆ ప్రత్యామ్నాయమే - ఈ జలపుష్పాల వ్యాపారం!

కడుపులోని చల్ల కదలకుండా అల్లాను తరుముకుంటూ కాలం గడపవలసిన వయసులో తన బ్రతుకు తెరువు కోసం తానే అవస్థ పడవలసిన అవసరం కలిగినందుకు అతడేమాత్రం చింతించలేదు. చిన్న గుడిసెలో ఏకాకిగా కాపురం చేయవలసి వచ్చినందుకు క్రుంగిపోలేదు. ఉదయం ఏడింటికల్లా చద్దన్నం తిని, తట్ట తలపైన పెట్టుకుని, ఊళ్ళు తిరిగి ఎండు చేపలమ్ముకునేవాడు. తనకిలా జీవనాధారంగా మారిన ఎండుచేపలకు అతడు ముద్దుగా 'జలపుష్పా'లని పేరు పెట్టుకున్నాడు. 'జలపుష్పాలమ్మో, జలపుష్పాలు' అని అరుస్తూ, మా బడికి దగ్గరగా వచ్చినప్పుడల్లా అతనిలో 'ఓ'కు ముందచ్చరమే'దన్న సందేహం చోటు చేసుకుంటూ వుండేది. తట్టను అరుగుపైన పెట్టి, గుమ్మంలో నుంచి లోపలికి చూస్తూ, అయ్యవారితో ఎన్‌కౌంటరుకు తగులుకునే వాడు. బడిపిల్లల పాలిటికి ఘండామార్కుడైన మా అయ్యవారు నెటాలం సాయిబు ప్రశ్నకు బదులు చెప్పలేక చిక్కిబిక్కరిస్తుంటే మాకు చాలా ఆశ్చర్యంగా ఉండేది.

'నా అక్షరాలు వెన్నెల్లో ఆడుకునే పారావతాలు' అంటాడు కవి. పామరులకంత గొప్పగా చెప్పడం సాధ్యంకాదు 'గదా! ఒరే నాయనా! కళ్లుండే గుడ్డోడివి కావొద్దురా! నాలుగచ్చారాలు నేర్చుకోరా' అంటుండే వారు కొందరు. అయితే ఏళ్ల శాతం చాలా తక్కువ. 'సదువుకోని వీల్లేం రాజ్జాలేల బోతారా? ఎద్దుల్ని గొట్టి ముద్దలు తినేవోల్లకు సదువు లెందుకు?' అనే వాళ్ల సంఖ్యే ఎక్కువ. అప్పుడు దేశాన్ని పాలిస్తూ వుండిన వాళ్లు ఇంగ్లీషు

ప్రభువులు, దేశం విద్యా గంధంలో పరిమళించి పోవాలన్న అత్యాశ వాళ్లకే మాత్రమున్నూ లేదు. గుమాస్తాలు, బిల్‌కలెక్టర్లు, అమీనాలు, పోలీసులు మొదలైన చిన్న ఉద్యోగుల్ని తయారుచేయడానికి జిల్లా కొకటి రెండు హైస్కూళ్లు మాత్రం వుండేటట్టు చూచుకున్నారు, అయినా ప్రాథమిక పాఠశాలుంటేనే గదా హైస్కూళ్లు! ప్రాథమిక స్థాయిలో అట్టడుగు తరహాకు చెందినవి వీధి బళ్లని నాటు బళ్లనీ, వీధి పలుకూటాలని గూడాలా అనేవాళ్లు. పలుకూటమనగా పలుకు కూటానికి నామాంతరం, విద్యాభ్యాసంలో ఉచ్ఛారణకున్న ప్రాధ్యానికి ఈ వేరొక తార్కాణం గావచ్చు. బడికంటూ ప్రత్యేక కట్టడం వుండేదిగాదు, గ్రామచివరిలోనో, గుడి మండపంలోనో, సత్రం వసారాలోనో - యిలా ఎక్కడ వీలైతే అక్కడ వీధి బడికి ఉనికి కల్పించ బడుతూవుండేది. "చెల్లూ, బిల్లూ' అనే మాటకు ఆరోజుల్లో అర్థంలేదు, మావీధిబడి ఉదయం ఏడుగంటలకల్లా ప్రారంభమైపోయేది. పిల్లలు వయసు వారిగా నిల్చుని 'అ ఆ ఇ ఈ....' అంటూ అచ్చులు కొందరు, 'క ఖ గ ఘ.......' అంటూ హల్లులు కొందరు, "కకు ధీర్ఘమిస్తే 'కా' కకు గుడిస్తే 'కి' గుడిదీర్ఘమిస్తే 'కీ'....అంటూ గుణింతాలు కొందరు, 'అల, ఆట, ఇల, ఈక....., అంటూ రెండక్షరాల పదాలు కొందరు, ఇంకా ప్రాస వాక్యాలు కొందరు, సామెతలు కొందరు, యిలా జట్లు జట్లుగా సామూహిక ఉచ్ఛారణ ప్రారంభిస్తే మా వీధి పలుకూటం ఆ ప్రాంతాని కల్లా ఒక పెద్ద శబ్ద ప్రసారక యంత్రంగా పరిణమిస్తూ వుండేది. కొద్ది క్షణాలు పాటు శబ్ద ప్రసారం ఆగిపోయి నిశ్శబ్దం ఆవరించిందంటే జలవుప్పాల సాయిబు వచ్చేశాడన్నమాట! అతడి ప్రశ్నకేమని జవాబు చెప్పాలని మా అయ్యవారు ఆలోచనలో పడ్డారన్నమాట!

మా అయ్యవారి పేరు రంగరామానుజయ్యగారు, బడికి రెండు మైళ్లు దూరంలోని ఒక కుగ్రామంలో ఆయన కాపురం. పంచపైన అరచొక్కా ఒకటి తొడుక్కుని, తువ్వాలు గుడ్డ భుంపైన వేసుకొని, ఆయన ఉదయం ఎనిమిదింటికల్లా బడికి వచ్చేసేవారు. వస్తూ వస్తూ దారిలో చెట్లో నుంచి రెండు గానుగ బరికలు తుంచి తెచ్చుకునే వారు. గూఢాచారుల మూలంగా అయ్యవారొక ఫర్లాంగు దూరంలో వుండగానే ఆయన ఆగమనం గురించి మాకు తెలిసిపోతుండేది. మరింత పకడ్బందీగా పాఠాలు వల్లించే కార్యక్రమం కొనసాగుతుండగా అయ్యవారు హర్యక్ష్యంలా బడిలో ప్రవేశించేవారు, ఆయన ఏనాడూ నోరు తెరిచి మారు పాఠాలు చెప్పిన పాపాన పోలేదు, 'ఒవ్వజెప్పినారా! రాసినారా! చూపించినారా!' అన్నపాడి మాటలతోనే మా చదువులు మాకొచ్చేస్తూవుండేవి. రాకపోతే ఏం జరుగుతుందో మాకు తెలుసు, గానుగ బరికలకు, చింత బర్రలకు పని కల్పించ గూడదు గదా! నయమున పాలున్ ద్రావరు, భయమున విషమైనగాని భక్షింతురుగా! నయమెంత దోసకారియో, బయమే జూదంగ వలము బాలురకెపుడున్' అన్నమాటకు పాటింపు వుండిన రోజులవి!

అన్నట్టు మానాన్న గారు గూడా ఒక బడిపంతులే! కానీ నా ప్రాథమిక విద్యాభ్యాసం ఆయన దగ్గర ప్రారంభంగాక పోవడానికి కారణాలు రెండు, మా నాన్న గారు చదువు చెప్పే బడి ఆవయసులో నేను వెళ్లడానికి సాధ్యమైనంత సమీపంగా లేకపోవడం ఒకటి. పోగా తండ్రిదగ్గర బిడ్డకు చనువే గానీ భయం వుండదన్న కారణం మరొకటి, ఈ కారణాల మూలంగా నాకు అక్షరభ్యాసం రంగరామానుజయ్యగారి చేతులపైనే జరిగింది. నామకరణంలా,

అన్న ప్రాశనంలా ఈ అక్షరాభ్యాసం గూడా చెప్పకోదగ్గ తతంగమే! ముందురోజు రాత్రే రంగరామానుజయ్యగారు మాయింటికొచ్చేవారు. తెల్లవారు జామునే ఇంటిల్లపాదీ తలంటు స్నానాలు ముగించాము, వినాయకుడి విగ్రహానికి, సరస్వతి పటానికి పూజలు జరిగాయి, అంచులు దిగజారేటట్టుగా ఇత్తడి పళ్లెంలో పోసిన బియ్యం పైన బంగారు ఉంగరంతో అయ్యవారు నాచేత ఓనమాలు రాయించారు. బడి పిల్లలకు పప్పు బెల్లాలు పంచడం జరిగింది. కొత్త పంచలతో, దక్షణ తాంబూలాదులతో మానాన్నగారు అయ్యవారిని సత్కరించారు, ' మీఅబ్బాయికి చదువురాకేమండీ! చూచి రమ్మంటే కాల్చుకరాడూ!' అని అయ్యవారు నన్ను దీవించారు,

అప్పట్లో అయ్యవార్ల మాటలు వేదాక్షరాలు, వాళ్లు అతిశయోక్తులు చెప్పినా సహజోక్తుల క్రిందనే లెక్క. అయినా నేను మా అయ్యవారి ఆకాంక్షను చుర్ దిగ జార్చలేదనే అనుకుంటాను, బడిలో చేరిన సాయంకాలానికే నేను ఓనమాలు రాసి మా అమ్మకు చూపించ గలిగాను. నెలరోజుల్లో గుణింతాల దాకా వచ్చేశాను. ఎటొచ్చీ ఒక్కటే కొరత. బడిలో చేరి ఏడాదికావస్తున్నా 'ఓ'కు ముందక్షరమేదో తెలియకపోయిందేనని!

ఒకనాటి సాయంకాలం మా అయ్యవారు బడిలోని పెద్ద కుర్రవాళ్లల్లో ఒక్కణ్ణి దగ్గరకు పిలిచి, జనాంతికంగా వాడికొక రహస్యాన్ని, ఉపదేశించారు, మరునాటి ఉదయం జల పుష్పాల తట్ట అరుగుపైన పెట్టి నెటాలంసాయిబు బడిలోకి దూరిన వ్యవధిలో ఆకుర్రవాడు తట్టలోని పడిని (పడి అంటే కొలపాత్ర) తీసి ఎక్కడో దాచి పెట్టేశాడు, సాయిబు పక్క వూరికి వెళ్లి ఎండు చేపలకు బదులుగా గింజలు కొలుచుకునే నిమిత్తం పడికోసం చూచుకున్నాడేమో, అది కనిపించక పోయేసరికి బెంబేలెత్తి పోయాడు. పరుగు పరుగునా రొప్పుకుంటూ, రొజుకుంటూ వచ్చి బడిలో వాలిపోయాడు.

"అయ్య గారూ! నాకు బుద్ధొచ్చింది. ఇంకెప్పుడూ అడగను. నా పడి నాకిప్పించు సామీ!" అంటూ ప్రాధేయపడ్డాడు.

" 'ఓ'కు ముందక్షరమేదో తెలిసిందా?" అన్నారు అయ్యవారు.

"తెలిసింది సామీ, తెలిసింది"అంటూ తన పొట్టవైపు చూపించాడు సాయిబు.

అవును మరి! మొట్ట మొదట తీరవలసిన భౌతికావసరాలు, మిగిలిన అవసరాల సంగతి తరువాతి మాట! అందువల్ల 'ఓ'కు ముందక్షరమేదని ఎవరైనా అడిగితే నేను 'ఆకలి' అని చెప్పడం నేర్చుకున్నాను, పొట్ట గడవడం కోసం ప్రకృతిలో పోరాడవలసిన వారిలో చాలా మంది పాలిటికి అక్షరాలు అందని నక్షత్రాలని గ్రహించాను. 'అక్షరంబువలయు కుక్షి జీవనులకు, అక్షరంబులోనే రక్షకంబు' అన్న కవిగారి మాటలతో నేనేకీభవించను, కుక్షిజీవనులకు మొట్ట మొదటి కావలసింది అన్నం! అక్షరాలూ, కళలూ, నాగరికతలు, సంస్కృతులూ మొదలైన వాటి ప్రసక్తి వచ్చేది ఆకలి తీరిన తర్వాత మాత్రమే!

డా॥ మధురాంతకం రాజారాం, దామల్‌చెరువు,
చిత్తూరు జిల్లా - 517 152

# తురగా జయశ్యామల కథ

# సంధ్యాసమయం

సాయంత్రం అయిదు గంటలు దాటింది.

నీరెండ నీడలు చాచుకుంటున్న వేళ చల్లని మలయమారుతమందకొడిగా అల్లుకుంటూంది నలుదిక్కులా

గూళ్ళకు చేరుకునే ముందు పక్షులు,ఎరుపు, పసుపు, నీలం బంగారు రంగులలొ మెరిసి పోతూన్న ఆకాశం క్రింద పల్టీలు కొడుతున్నాయి సంతోషంలో.

పశు గణాలు చేలలో మేసిన ఆహారాన్ని నెమర వేసుకుంటూ, నిండు గర్భవతుల్లా మెల్ల మెల్లగా గమ్యం వేపు సాగి పోతున్నాయి.

ఇంటి ముంగిట్లో పిల్లలు ఆడుకుంటున్నారు. వాళ్ళ అరుపులు, మాటలు ఆవీధి అంతా కలగాపులగంగా విన్పిస్తున్నాయి.

పగలంతా ఎండ వేడిమికి ఇళ్ళల్లో మగ్గిపోయి, చల్లబడగానే వీధిమందు చక్కగా తుడిచి, నీళ్ళు చల్లిన చల్లని ముంగిళ్ళల్లో కుర్చీలు వేసుకొని, అరుగులమీదకు చేరుతున్నారు ఆడంగులు, ముదుసలులు......పిల్లలు.

పావుగంట క్రితం స్కూలు నించి వచ్చిన పిల్లలు ఇద్దరికి టిఫినుపెట్టి, స్నానం చేయించి, ఒళ్ళంతా ఒత్తుగా పౌడరద్ది డ్రెస్‌చేసి, ఆడుకోడానికి వీధిలోకి పంపుతూ బయటకు వచ్చింది విమల.

"జాగ్రత్త నాన్నా! ఎవరితోనూ గొడవలు పెట్టుకోకండి. బట్టలు మాపుకోకండి, పెందరాళె యింటికి వచ్చేయండి, కొడుకు లిద్దరినీ ఆడుకోడానికి పంపుతూ రోజూ సాయంత్రం అలాగే చెబుతుంది విమల.

ఆటల కెళ్ళే హడావుడిలో తల్లి మాటలను 'అలాగే' అని తలూపుతూ ఎగురుకుంటూ వెళ్ళిపోతారు. కాని, వాళ్ళు ఆటలు ముగించి యింటికి వచ్చే సరికి ఏడుకు తక్కువ కాదు. శుభ్రంగా వుతికిన బట్టలేసుకెళ్ళినా, వచ్చే వేళకి వేసుకున్న దుస్తులు ఏ రంగులో ఉన్నాయో తెలీనంతగా దుమ్ము కొట్టుకుపోయి వుంటాయి. విమల మంచి మూడ్‌లో వుంటె, మామూలుగా వాళ్ళ దుస్తులు మార్చి, వేరేవి వేస్తుంది. లేకపోతే ఏచీకాకులోనో వుంటే బట్టలంతగా మాపు కొచ్చినందుకు ఇద్దర్నీ చెరి రెండూ బాది వదిలిపెడుతుంది.

పిల్లలు ఆడుకోడానికి వెళ్ళిపోయినా, విమల అలా గుమ్మంలో నిలబడి పక్కవాటా కేసిచేస్తోంది.

ఆపక్కవాటాలో కైలాసం దంపతులుంటున్నారు. ఉంటున్నారేమిటి? అసలు వాళ్ళు ఆ ఇంటి యజమానులే. వాళ్ళింట్లోనే విమలా వాళ్ళు అద్దెకుంటున్నారు.

సాయంత్రం రోజు అయిదు గంటలవడం తరువాయి. కైలాసంగారు చక్కగా కొంగ రెక్కలా తెల్లగా వున్న పంచ, లాల్చీ వేసుకొని, వీధి అరుగు పక్కగా వాలుకుర్చీలో కూర్చుని, సాయంత్రంలోని చల్లదనాన్ని, హాయిని అనుభవిస్తూ, గంటసేపు కష్టపడి జానెడు పొడవు చుట్టుకున్న లంక పొగాకు చుట్టని త్రాగుతూ....జీవితాన్ని ఎంతో ఎంజాయ్ చేస్తున్నట్లుగా కన్పిస్తారు.

కైలాసం గారు తహశీలు దారుగా పనిచేసి రిటైరయి పది సంవత్సరాలైంది. ఉద్యోగ కాలంలోనే ఈ యిల్లు కట్టారు. అన్ని అధునాతన సౌకర్యాలతోటి. ఆయనకు ఇద్దరు కొడుకులు....ఇద్దరు కూతుళ్ళు. రెండు చేతులా బాగా సంపాదించడంలో కూతుళ్ళను గొప్ప సంబంధాలే చేసారు, కట్నకానుకలు దండిగా యిచ్చి. ఒక కూతురు ఢిల్లీలోను...మరొక కూతురు రాంచీలోను వున్నారు. పెద్ద కొడుకు మిలటరీలో కమాండర్‌గా వున్నాడు. అతను డార్జిలింగ్‌లోనో ఎక్కడో వున్నాడు. రెండో అతను శ్రీహరి కోటలో వుంటున్నాడు సైంటిస్టుగా . కొడుకు లిద్దరికీ కూడ చెరొక యిల్లు కట్టించి వుంచారు.

కైలాసం గారి మీద ఆర్థికంగా ఆధారపడిన వాళ్ళు లేరు. అలాగే ఆయన ఎవరి మీద ఆధారపడి లేరు. రిటైరయిన దగ్గర నుంచి, జీవితాన్ని హాయిగా అనుభవిస్తున్నారాయన. ఆయన వయసు దాదాపు అరవై సంవత్సరాలున్నా, ఇంత వరకు ఏవిధమైన అనారోగ్యాలు ఆయనకు లేవు.

ఉదయం అరు గంటలు కాకుండా లేస్తారు. ఓ గ్లాసుడు పాలు తాగేసి 2 గంటల సేపు మార్నింగ్ వాకింగ్‌కి వెళ్ళి వస్తూంటారు. ఆయనకు పూజాపునస్కారాలున్నాయి. ఓ గంటసేపు జపతపాలు గావించుకొని, పది గంటలకంతా భోజనానికి. అక్కడ నుంచి కాసేపు న్యూస్ పేపర్లు తిరగేసి, పగటి నిద్రపోతారు. తిరిగి మూడు గంటలకు లేచి కాస్తంత ఫలహారం తిని, ఒక కప్పు టీ త్రాగి, రామాయణమో, భాగవతమో, భగవద్గీతో పెద్దగా పైకే చదువుతారు. ఆపురాణ కాలక్షేపానికి, ఇరుగు పొరుగు ఇళ్ళల్లో వున్న నలుగురయిదుగురు వృద్ధులు వస్తారు. అది అయిపోగానే, అరు బయటకొచ్చి కూర్చుంటారు..... చల్లగాలికి. రాత్రి బాగా పొద్దు పోయేవరకు.

ఆయన రోజువారీ కార్యక్రమంలో ఎక్కడా లోటుపాటులేకుండా చేసేది వసుంధరమ్మగారు. ఆవిడ కైలాసంగారు కూర్చున్న పక్కగానే అరుగుమీద కూర్చుని వున్నారు. పచ్చగా, నిండుగా వున్న భారీ విగ్రహం ఆవిడది. ముదురాకు పచ్చ గుంటూరు జరీనేత చీరలతో...పచ్చగా, విశాలంగావున్నా నుదుటి మీద కొట్టొచ్చేట్లు కన్పిస్తున్నా కాసంత ఎర్రని కుంకమ బొట్టు. సాయంత్రపు నీరెండలో తళతళ లాడుతున్న రవ్వల దుద్దులు, బేసరి, రెండు చేతుల నిండుగా గలగల లాడుతూ బంగారు గాజుల మధ్య, మట్టి గాజులు, ఎప్పుడూ పసుపు పూతతో పచ్చగా మెరిసే పాదాలు..... ఎవరికయినా సరే, ఆవిడను చూస్తే పవిత్రభావం

కలుగుతుంది.

రోజూ సాయంత్రం ఆదంపతులిద్దరూ అక్కడ ముంగిట్లో ఒకరు కుర్చీలోనూ... మరొకరు కూర్చుని కాసేపు మౌనంగా వచ్చేపోయేజనాన్ని చూస్తూను, మరికాసేపు ఏదోపిచ్చాపాటి మాట్లాడు కొంటూను, సాయింత్రాన్ని కరిగించేస్తారు.

వారిద్దరిని అలా చూస్తూంటే, ఏబాధలూ సమస్యలూ లేని వారిలాగా కన్పిస్తారు. ఆ ఇద్దరిని అలా ఈ యింట్లో అద్దెకు దిగిన మూడేళ్ళుగా చూస్తూంది విమల. వారినలా చూస్తూంటె ఆశ్చర్యంగా వుంటుంది విమలకి......రోజూ చూస్తున్నా.

ఈమాపెళ్ళిల్లో కైలాసం దంపతులు ఒకమాటా మాటా అనుకోవడం గాని, వాదించుకోవడం గాని వినలేదు, చూడలేదు విమల.

వసుంధరమ్మ గారికి దాదాపు యాభయిఅయిదు సంవత్సరాలపైనే వయసుంటుంది. ఆవయసులో కూడా ఆవిడ కైలాసంగారికి ఏ సమయంలో ఏంకావాలో, ఆవేళకు చక్కగా అమరుస్తారు. ఆయనను ఒంటరిగా ఇంట్లో విడిచి ఇరుగమ్మ, పొరుగమ్మల ఇళ్ళకు పెత్తనాలకు వెళ్ళగా ఎన్నడూ చూడలేదు విమల. ఎవరేనా పేరంటం పిలుస్తేమటుకు, పార్వతీ దేవిలా కళకళలాడుతూ పట్టుచీర కట్టుకొని, సిగనిండా పువ్వులు తురుముకొని తప్పకుండా వెళతారు.

పిల్లలందరూ తలోచోటా వున్నా, ఏ చీకుచెంతా లేకుండా, వృద్ధాప్యంలో కూడా ఆదంపతులిద్దరూ అంత అన్యోన్యంగా వుండడం...ఒకరిని విడిచి ఒకరిని వదలి వుండలేనట్లుగా ప్రవర్తించడం....ఏబాధలేనట్లు జీవితాన్ని అంత సంతోషంగా గడపడం ఎవరికయినా ఆశ్చర్యమేగాక, ఎంతో ముచ్చటగా కూడా అన్పిస్తూంది.

అదేంఖర్మమో! విమలకు, ఆమెభర్తకు రోజూ ఏదో ఒక విషయంలో వాదనవస్తూ ఉంటుంది. పిల్లల చదువుల విషయంలో...... వాళ్ళ ఖర్చుల విషయంలో.. బంధువుల రాకపోకల విషయంలో.. ఏదో ఒక విషయంలో ఇద్దరికీ ఎప్పుడూ అభిప్రాయ భేదాలు వస్తూనే వుంటాయి. అలా వాదించుకుంటూనే వుంటారు. ఒక్కోసారి అతి చిన్న విషయాల మీద పెద్ద యుద్ధం జరిగి, వారమేసి రోజులు ఇద్దరి మధ్య మాటలు కూడా వుండవు.

ఒక్కోసారి విమల కెంత బెంగగానో అన్పిస్తుంది. భార్యాభర్తల మధ్య వుండవలసిన అన్యోన్యత... అనురాగం... సామరస్యత తమ మధ్య లేదేమోనని. లేకపోతే, ఒకరిమీద ఒకరికి చీటికి, మాటికి ఎందుకంత కోపతాపాలు, గొడవలు వస్తాయి అనుకుంటుంది.

కైలాసం దంపతులను చూసాక ఒకటి రెండుసార్లు భర్తతో అంది కూడాను. 'చూడండి! అంత పెద్ద వయసులో కూడా వాళ్ళెంత అన్యోన్యంగా వున్నారు. మనమూ వున్నాము. ఎప్పుడూ వాదనలే మన మధ్య! అని.

'ఆవిడ భర్త మాటకెదురాడని మనిషయి వుండాలి. అందుకే ఏ గొడవలూ లేకుండా అన్యోన్యంగా వున్నారేమో!'' అన్నాడతను.

'అంటే ఏమిటర్థం? నేను మీ మాటను పట్టించుకోవడం లేదనేగా మీరంటున్నది. అందుకే గొడవలొస్తున్నాయంటారు! అంతేనా?'' అప్పటికప్పుడే విమలకు ఉక్రోషం పొంగుకు వచ్చేసింది.

''నేను అలా అన్నానా?''

"మరి ఏ ఉద్దేశంతో అన్నారామాట?" విమల రెట్టించింది.

"ఇదిగో... యిలాగే! అర్థం లేని విషయాల గురించి అనవసర వాదన పడడం... ఆవిడ్నే అడుగు ఓసారి... రహస్యమేమిటో చెబుతారేమో!"

విమలకు భర్త సలహా నచ్చింది. వసుంధరమ్మగారినే అడిగితే... ఏమన్నా అనుకుంటారేమో!

అయినా సమయం కోసం ఎదురు చూడసాగింది విమల.

ఆరోజు వసుంధరమ్మ గారితో తీరికగా బాతాఖానీ వేయాలని ముహూర్తం నిర్ణయించుకుంది విమల.

భర్త ఆఫీసుకు.... పిల్లలు స్కూలుకు వెళ్ళాక, మధ్యాహ్న భోజనం కావించి, తలుపులన్నీ దగ్గరకు వేసి, "ఏం చేస్తున్నారు పిన్నిగారూ!" అంటూ కైలాసం గారి యింట్లోకి నడిచింది.

'రామ్మా! ఇదిగో యిప్పుడే భోజనం అయింది. వంటిల్లు సర్ది వచ్చాను యిప్పుడే.'

'బాబాయిగారు ఏం చేస్తున్నారు?' అంది ముందు గదిలోకి తొంగి చూసి.

'లేరమ్మా! ఏదో అర్జంటు ఉత్తరం పోస్టు చేసిరావాలని, పోస్టాఫీసుకు వెళ్ళారు. కూర్చో' అని చెబుతూ ఆవిడ నేలమీద చాప పరిచి కూర్చున్నారు.

విమల కూడా ఆ చాప మీద ఓ పక్కగా కూర్చుంది.

"ఏమిటమ్మా, విమలా! భోజనం అయిందా?" సాధారణంగా ఆ సమయంలో ఎక్కువగా రాని విమల రాకలోని అంతరార్థం ఏమిటాని ఆలోచిస్తూ యథాలాపంగా అడిగారావిడ.

"అయింది పిన్నిగారూ... కాసేపు మీతో మాట్లాడి వెళదామని వచ్చాను!' అంది విమల.

"ఏమిటి!" అన్నట్లు చూశారావిడ.

"పిన్నిగారూ! మిమ్మల్ని ఓ విషయం అడగాలని చాలా రోజుల నుంచి అనుకుంటున్నాను. మీరేమీ అనుకోనంటే...!" అంటూ ఆగిపోయింది, ఆవిడ ముఖంలోకి చూస్తూ.

వసుంధరమ్మ గారు ఆశ్చర్యంగా చూశారు. ఏమిటమ్మా అది అడుగు.... అంత మొహమాటపడుతున్నావేంటి?

"ఏమీలేదు పిన్నిగారూ! నాదొక చిన్న సందేహం. మేము మీ యింట్లోకి వచ్చి మూడేళ్ళు దాటిపోతున్నాయి. రోజూ మిమ్మల్ని చూస్తూనే వున్నాను. మావారు, నేను వయసులో మీకంటే ఎంతో చిన్నవాళ్ళమే కదా! రోజూ మా మధ్య ఏదో ఒక చిన్న కీచులాట జరుగుతూనే వుంటుంది. ఎంత వద్దనుకున్నా ఏవో మనస్పర్థలు తప్పడం లేదు. ఎందుకిలా అవుతుందో నాకర్థం కావడం లేదు....!"

విమల మాటలు వింటూనే ఆవిడ నవ్వేశారు. "అలా చిటపటలు.. కీచులాటలు లేకుంటే అది సంసారమే కాదు తల్లీ. భార్యాభర్తల మధ్య అప్పుడప్పుడు అవి వున్నప్పుడే అందం. కాకపోతే శృతి మించకూడదు సుమా! అభిప్రాయ భేదాలు వచ్చినా, పంతాలు పట్టింపులు వచ్చినా తెగేదాకా తాడు లాగడం మంచిది కాదు. పట్టు విడుపులలోనే వుండాలి.

"అది కాదు పిన్నిగారూ! సంసారంలో సామరస్యం అంటారే! అదేమిటో బొత్తిగా లేదు

మా మధ్య. ఇలా అంటున్నానని మరోలా అనుకోకండి. ఇంత పెద్ద వయసులో కూడా మీరు.. బాబాయి గారు ఎంతో అన్యోన్యంగా వుంటారు...!'' విమల మాట పూర్తికాకుండానే ఈసారి పెద్దగా..

"చూడమ్మా! నీ సందేహం నాకర్థం అయింది. కానీ, నీకో సంగతి తెలీదు. ఇంత వయసు వచ్చాక చెప్పుకున్నా ఫరవాలేదులే. మేం వయసులో వుండగా, మీ బాబాయి గారికి, నాకూ ఒక్క క్షణం పడేది కాదంటే నమ్ముతావా నువ్వు? ఆయన తూరుపు.... నేను పడమర... ఆయన ఎడ్డెమంటే, నేను తెడ్డెం... సన్నని చినుకుల్లా మొదలయి, చిలికి చిలికి గాలివానయి, పెద్ద తుఫానులా మారి తర్వాత చల్లబడిపోయేవి మా మధ్య గొడవలు. ప్రతి చిన్న విషయానికి తగవులే. ఒక్క విషయంలో కూడా మా మధ్య సఖ్యత కుదిరేది కాదంటే నమ్ముతావా నువ్వు?"

ఆవిడ మాటలకు విస్మయంగా చూసింది విమల.

"నీకు ఆశ్చర్యంగానే వుంటుంది. నీకే కాదు. యిప్పుడు మమ్మల్ని చూసేవారెవరి కయినా అలాగే అన్పిస్తుంది. కాని అది నిజం. ఒక్కోసారి మా మధ్యగొడవలొచ్చాయంటే పక్షమేసి రోజులయినా మాట్లాడుకునే వాళ్లం కాదు, పంతాలకుపోయి, ఆ వయసు... ఆ వయసులోని పొగరు అలాంటిది. యిప్పుడు తలచుకుంటే సిగ్గు, నవ్వు వస్తాయి. మా మధ్య పిల్లలు రాయబారాలు నడపలేక నలిగి పోయేవాళ్ళు. అటువంటి వాళ్ళం ఇప్పుడిలా అన్యోన్యంగా వున్నామంటే అది వయసు తెచ్చిన మహాత్యం!"

"అదేమిటి పిన్నిగారూ!" అంది నీర్సంగా విమల. ఆవిడ చెప్పే విషయాలేమీ థ్రిల్లింగ్‌గా లేవు విమలకు.

"అవునమ్మా! అది నిజం. అసలు వైవాహిక జీవితంలో అంతరార్థం చాలా మందికి తెలియదు. సాధారణంగా పెళ్ళయిపోగానే భార్యాభర్తలిద్దరూ ఒకరినొకరు అర్థం చేసేసుకున్నామని, ఒకరి అభిప్రాయాలొకరు మన్నించుకుందామని అనుకున్నారు. కాని, అది నిజం కాదు. అందుకే ప్రతి · చిన్న విషయానికి చిటపటలు, వాదాలు వస్తూనే వుంటాయి. అలా మాకెప్పుడూ రావు అని ఎవరైనా అంటే, అది వట్టి మాటేగాని, నిజం కాదు. హిపోక్రసీ అన్నమాట. చిన్నో పెద్దో, ఎక్కువో, తక్కువో అభిప్రాయ భేదాలు లేని వాళ్ళు వుండరు.

"అసలు వేర్వేరు జాగాల్లో, కుటుంబాల్లో పుట్టి, వేరు వేరు వాతావరణంలో పెరిగి 'పెళ్ళి' అనే పేరులో, మూడుముళ్ళ బంధంతో ఇద్దరు వ్యక్తులు ఒక ఇంట్లో సంవత్సరాల తరబడి కలిసి వుండవలసి వచ్చినప్పుడు, అభిప్రాయాలు, అభిరుచులు కలవకపోవడమనేది సహజం.... దానికికొంత టైము పడుతుంది. అందుకే సర్దుకుపోవాలి అంటారు. ఒక యింట్లో కలసి కాపురం చేస్తున్నా, ఒకరిని ఒకరు అర్థం చేసుకోడానికి సంవత్సరాలే పడతాయి. పెళ్ళయినాక, రెండు మూడు సంవత్సరాలు సరదాగా గడిచినా, తర్వాత పిల్లలు... సమస్యలు... చిరాకులు.... పరాకులూ తప్పవు. బయటకు వెళ్లిన మగవాడు రోజంతా ఉద్యోగపు బాధ్యతలతో విసిగిపోయి, వున్నప్పుడు ఎవరిమీద చిరాకు పడతాడు? భార్యమీద. అలాగే రోజంతా యింట్లో చాకిరీతో, పిల్లల బాధ్యతలతో సపర్యలతో విసిగిపోయే భార్య ఎవరినంటుంది? తనవాడయిన భర్తనే అంటుంది. లేకపోతే, ఆ కోపం, చిరాకు పిల్లల మీద చూపిస్తుంది. అవునా?' అనడిగారావిడ.

విమల మౌనంగానే తలూగించింది. 'అవునన్నట్లుగా అది నిజమే కదా! భర్త మీద కోపం వచ్చినప్పుడల్లా పిల్లల వీపులు మ్రోగిపోతూ వుంటాయి. వాళ్ళ అందుబాటులో లేకపోతే వుండనే వున్నాయి, వంటింట్లో గిన్నెలు... చెంబులు... పళ్ళాలు .. గరిటెలు .

'వయసులో ఎప్పుడూ గొడవలొచ్చినా నువ్వు లేకపోయినా నేనుండగలను అని మగాడు, మీరు పోషించకపోయినా నేను బ్రతకగలను అని ఆడది అంటుంటారు. కాని, అసలు భార్యాభర్తల్లో ఒకరి అవసరం మరొకరికి, ఒకరితోడూ నీడా మరొకరికి, ఒకరి గురించి మరొకరికి అవగాహన... యివన్నీ వృధ్యాప్యం మీదపడ్డాకనే అవసరం అవుతాయి. ఇది నా అనుభవం మీద తెల్సుకున్న విషయం తల్లీ!' అంటూ ఆగారావిడ.

"అదేమిటి పిన్నిగారూ! అలా అంటారు?" అంది నెమ్మదిగా విమల.

అవునమ్మా! అది నిజం. ఎలాగంటే నేనుమొదటే చెప్పినట్లు పెళ్ళయి కొత్తమోజులో... ఏ రెండు మూడు సంవత్సరాలో బాగా గడిచిపోయినా, ఇది అందరికి వర్తించక పోవచ్చు. ఎన్నేళ్ళు వచ్చినా నిత్య నూతనంగా బ్రతికేవాళ్ళు వున్నారు. సమస్యలన్నవి అప్పుడేగా ప్రారంభమయ్యేది. పిల్లలు... వారిని పెంచి పెద్ద చేయడం, ఈతి బాధలు, చదువు సంధ్యలు, ఆర్థిక పరిస్థితులు, పెళ్ళిళ్ళు, పేరంటాలు... ఇవన్నీ అయి బాధ్యతలు నెరవేర్చుకుని తల తడిమి చూసుకుంటే... నెరిసిపోయి వుంటుంది. వృధ్యాప్యం మీదకు వస్తుంది. రెక్కలు వచ్చిన పక్షుల్లా పిల్లలంతా తలోపక్కకీ ఎగిరిపోతే, మళ్ళీ ఈ సంధ్యాసమయం లో ఒకరికొకకరు తోడూ, నీడ అయి మిగిలేది ఎవరు తల్లీ... భర్తకు భార్య... భార్యకు భర్త.

"వయసులో ఒంట్లో సత్తువ వున్నప్పుడు బాధ్యతల బరువుల్లో... చిరాకుల్లో ఒకరి అవసరం ఒకరికి అక్కర్లేదనుకున్నా, ఎవరు కాదన్నా ఎళ్ళాగోలాగ బ్రతకగలం అన్న ధీమా వున్నా, తప్పనిసరిగా ఒక యింట్లో కలిసి కాలం గడపవలసి వచ్చిందనుకున్నా అసలు భార్యాభర్తల మధ్య సామరస్యం అనేది... ఇదిగో.. ఇలా వృద్ధాప్యం మీద పడ్డాకనే వస్తుంది. ఒకరినొకరు అవగాహన చేసుకోవడం అంటే నిజంగా అప్పుడే మొదలవుతుంది. ఒకరి అండదండలు మరొకరికి, ఒకరి తోడు నీడ మరొకరికి, ఒకరి అనురాగం మరొకరికి నిజంగా కావల్సి వచ్చేది... అవసరమయేది.... ఈ వయసులోనే. మొదట జంటగా మొదలు పెడతాం ప్రయాణం. పిల్లలు... వారి బాధ్యతలు అన్నీ తీరాక తిరిగి చూసుకుంటే చివరి ప్రయాణంలో కూడా ఇద్దరమే మిగులుతాం...." ఆవిడ యింకా ఏదో చెబుతుండగానే -

"ఏమిటే! అమ్మాయిని కూర్చోపెట్టి పాఠాలు చెబుతున్నావ్?" అంటూ కైలాసం గారు లోపలికి వచ్చారు.

ఆయనను చూడగానే విమల లేచి నుంచుంది వినయంగా.

"ఏముంది! ఏమీ లేదు. ఏదో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నాం. మంచినీళ్ళు కావాలా?" అంటూ ఆవిడ లేచి వంటగదివేపు నడిచారు.

"మరల ఎప్పుడైనా వస్తాలెండి పిన్నిగారూ!" అంటూ వసుంధరమ్మగారికి విన్పించేలా చెప్పి, తన వాటాకేసి నడిచింది విమల.

శ్రీమతి తురగా జయశ్యామల, ఫ్లాట్ నెం. 708, ఆరాధన 'బి'
జి.డి. అంబేద్కర్ మార్గ్, దాదర్, బాంబే-14

# మంత్ర నగరి - మాయలేడీ

"నా మాట విను" అన్నాడు. ఇరవైనాలుగోసారి వివేక్ రేవంత్‌తో. రేవంత్ తల అడ్డంగా తిప్పాడు.

"నీ ఖర్మ! ఏడువ్! అరే - ఆ అమ్మాయి పేరు తెలీదు, వూరు తెలీదు; అసలటువంటమ్మాయి యీభూప్రపంచంలో వుందో లేదో తెలీదు - ఆ అమ్మాయిని ఒక్కసారి కల్లోనన్నా చూసేడవలేదు నువ్వు - నీ మనసులో వున్న ఊహాసుందరి బొమ్మంటూ ఓ బొమ్మ కాగితం మీద గీసి, అలాటి అమ్మాయి దొరికితేనే పెళ్లాడతానని పట్టు బట్టడానికి నువ్వేమైన పాటలీ పుత్రాన్ని పరిపాలించే రాజు కొడుకువా?!" అంటూ చీవాట్లు పెట్టాడు వివేక్.

రేవంత్ మాట్లాడలేదు. మొహందిగులుగా పెట్టుకుని కూర్చున్నాడు.

వివేక్‌కి జాలేసింది. దగ్గరగా వెళ్లి గడ్డం పుచ్చుకుని, "నా మాట కొంచెం వినరా' ' అన్నాడు యిరవైఅయిదోసారి.

"సారీరా", నోరు విప్పాడు రేవంత్, "నాకు పిచ్చనూ, వెర్రనూ - కావలిస్తే యింకేదైనా యింగ్లీషు జబ్బు పేరు పెట్టుకో - లేకపోతే వొళ్ళు పొగరనుకో - ఎందుకు ఆ అమ్మాయి నాకు కనిపిస్తుందని గట్టి నమ్మకం వుందిరా"

"కనిపించినా ఒకవేళ ఆ అమ్మాయి పెళ్లైపోయివుంటే?' రేవంత్ మాట్లాడలేదు.

"ఆ అమ్మాయికి నువ్వు నచ్చకపోతే?"మౌనం.

"ఇక చాలు! నావిపిచ్చి ఆలోచనలు అయితే అవునేమో నాకు తెలీదు కాని నీవి మాత్రం నెగెటివ్ ఆలోచనల్రా. రెంటిలో పిచ్చి ఆలోచనలే కాస్త బెటరు. వాటిలో 'హోప్' వుంటుంది. మానవప్రయత్నానికి ఆస్కారం వుంటుంది. కాని యీ నెగెటివ్ ఆలోచనలున్నాయే - అవి మనిషి సమస్యలనుంచి పారిపోయేందుకు తప్ప మరెందుకూ వుపయోగపడవ్'అన్నాడు రేవంత్ గుక్క తిప్పుకోకుండా.

"తల తిక్క లాజిక్‌లు చెప్పకు. నీకా అమ్మాయి కనిపించే అవకాశాలు బాగా తక్కువ అంటున్నాను"అన్నాడు వివేక్.

"బాగా తక్కువ - అంటే అసలు లేవని కాదుగదా. అదిచాలు థ్యాంక్స్" అన్నాడు రేవంత్.

"నీవొక తెలివైన మూర్ఖుడివి. మరియు అందమైన జిడ్డువి" అన్నాడు వివేక్ యింగ్లీషులో.

"మళ్లీథ్యాంక్స్" అన్నాడు రేవంత్ నవ్వి.

★ ✳ ★

మర్నాడు ఉదయం రేవంత్ మొహం చాటంత చేసుకుని వచ్చాడు.

వస్తూనే, "ఒరేయ్, నాకా అమ్మాయి కనబడిందిరా" అన్నాడు వివేక్ బోలేడు ఆశ్చర్యపడిపోయి,

"ఏవిటి? నిజమే?!" అన్నాడు.

"అవున్రా, కనిపించింది. ఏదో సిటీబస్సులో కనిపించింది"

"సిటీబస్సా? ఎన్నోనంబరు? ఏరూటు?" ఆత్రంగా అడిగాడు వివేక్.

"తెలీదు" అన్నాడు రేవంత్

"తెలీదా? అదేంటిరా? అప్పుడు నువ్వెక్కడున్నావ్?"

"అదీ తెలీదురా!"

"నువ్వెక్కడున్నావో నీకు తెలీకపోవడం ఏమిట్రా?"

"నిజం. నేనెక్కడున్నానో, అసలది ఏ వూరో, ఆ అమ్మాయి ఎక్కడికి వెడుతోందో ఏమీ తెలీదు కాని ఆ అమ్మాయిని మాత్రం చూశాను. తను ఏదో మాట్లాడింది. 'నా నివాసమ్ము తొలుత గంధర్వలోకము' అనో ఏదో అంది. నేను దగ్గరికి వెళ్ళబోయాను. నెక్స్ట్ ఆ అమ్మాయి ఏదో బస్సులో వుంది. నేను బస్సు ఎక్కలేదు. కాని ఆ అమ్మాయి ఎక్కడెక్కడికి వెడుతోందో నాకు తెలుస్తోంది. ఎలా అని అడక్కు. చివరికి ఆ అమ్మాయి ఓ యింట్లోకి వెళ్ళి తలుపేసుకోబోతోంది. నేనేదో మాట్లాడదామని నోరు తెరిచాను. ఇంతలో మెళకువ వచ్చేసింది" అన్నాడు.

వివేక్ దీర్ఘంగా నిట్టూర్చి "అయితే యిదంతా కలా? నువ్విహ బాగుపడవ్" అన్నాడు.

రేవంత్ దీనంగా, "అలా అనకురా, ప్లీజ్! నా కలలో కనిపించిన గుర్తుల్ని బట్టి ఆ అమ్మాయి ఎవరో, ఆమెది ఏ వూరో కొంచెం కూపీ లాగిపెట్టరా, పెర్రీమాసన్ పుస్తకాలు తెగ చదువుతావు గదా!" అన్నాడు.

వివేక్‌కి నిజంగానే భయం వేసింది. వీడికేమీ కాలేదు కదా!' అని దిగులూ వేసింది.

ఎలాంటివాడు ఎలా అయిపోయాడూ' అని.

"ప్లీజ్‌రా" అన్నాడు రేవంత్ మళ్ళీ

"సరే, నువ్వు చూసిందంతా వివరంగా చెప్పు" అన్నాడు వివేక్ విధి లేక.

"ఆ అమ్మాయి అందంగా నడుస్తూ రోడ్డు మీద వెడుతోంది. ఆమె అందాన్ని చూసి సిగ్గుపడుతున్నాయో అన్నట్లుగా పగలు పదిగంటలయినా ఆర్పెయ్యని వీధి దీపాలు వెలవెలబోతున్నాయి."

"ఆగు, ఆగు ప్రబంధ శైలి వద్దు. మామూలుగా చెప్పు"

"సరే, ఆమె అలానడిచి వెడుతోంది. ఇంతలో హఠాత్తుగా ఎవరో ఆమె చెయ్యి పట్టుకున్నారు."

"ఊ!"

"ఆమె వెనక్కి తిరిగి అతనివైపు కోపంగా చూసింది. అతను ఏమీ మాట్లాడకుండా వేలితో ఏదో చూపించాడు. ఆమె కొంచెం సిగ్గుపడిపోయి అతనికి 'సారీ', 'థాంక్యూ' రెండూ చెప్పి ముందుకు కదిలింది.

"తరువాత?"

"తరువాత ఆమె ఓ బస్సులో వుంది. ఓ వంద గజాలు వెళ్ళేసరికి రోడ్డుకి అడ్డంగా ఏదో వచ్చింది. అహఁ! అదక్కడే ముందునించీ వుంది. ఏవో యినుప స్తంభాలూ అవీ వున్నాయ్. డ్రైవర్ బస్సుని హఠాత్తుగా పక్కకి కోయడంతో అంతా ఒకళ్ళమీద ఒకళ్ళు పడ్డారు.'

"అడ్డు తగుల్తున్నాననుకోకు. దార్లో గోడల మీద రాతలూ అవీ ఏవీ లేవా? వుంటే ఏ భాషలో వున్నాయి?"

"ఏవో వున్నాయి. కొన్ని మాటలు తెలుగు మాటల్లా కనిపించినా ఆ భాష తెలుగులా అనిపించలేదు. అదేదో విచిత్రమైన భాషలా తోచింది."

"సరే, చెప్పు తరువాత?"

"బస్సు యింకొంచెం దూరం పోయాక రోడ్డు మధ్యలో రెండు చెత్త కుండీలు. రెంటి మధ్యా ఓ అయిదారడుగుల ఎడం వుంది. డ్రైవరు వాటి మధ్య నుంచి బస్సుని తీసికెళ్ళడానికి విఫల ప్రయత్నం చేసి మళ్ళీ అందరితో సర్కసు చేయించాడు."

"సరే, సరే బస్ స్టాపుల్లో ఏవైనా సైన్ బోర్డులు చూశావా? అవి ఏ భాషలో వున్నాయి?'

"ఆ అవకాశం నాకు కలగలేదురా. ఎందుకంటే బస్సు ఎక్కడా ఆగలేదు. బస్సు పోతూనే వుంది. బస్సులోంచి కర్మపరిపక్వమైన వాళ్ళు రాలి పడిపోతున్నారు. కర్మశేషం వున్నవాళ్లు ఎక్కుతున్నారు".

"ఊ!"

"తరువాత ఆమె ఏదో యింట్లోకి వెడుతుంటే చూశాను."

వివేక్ ఆత్రంగా యింటి నెంబరెంతో నోట్ చేసుకున్నావా?" అని అడిగాడు.

"లేదు. అ యింటి మీద నంబర్ లేదు గాని ఏదో పదో తరగతి లెక్కల పుస్తకంలోది ఓ లెక్క వుంది. అందులో ఒక్క వర్గ మూలం తప్ప అన్ని గుర్తులూ వున్నాయి. చాలా గమ్మత్తుగా యింకా కళ్ళముందు మెదుల్తోంది. ఆమె ఆ యింటి తలుపు తెరుచుకుని వెనక్కి తిరిగి చూసి నవ్వి వెళ్ళిపోయింది. ఆమె నవ్వింది నన్ను చూసేరా" అన్నాడు రేవంత్

కళ్ళనీళ్ళ పర్యంతం అవుతూ.

వివేక్ అదేం పట్టించుకోకుండా సీరియస్‌గా ఆలోచనలో మునిగిపోయాడు.

★ ★ ★

ఓ అరగంట అయ్యాక 'కనుగొంటిన్' అని అరిచాడు వివేక్.

"ఏంటి? ఏమన్నా ఐడియా వచ్చిందా?"

"ఓ! నాకు మొత్తం తెలిసిపోయింది."

"చెప్పు"

వివేక్ చెప్పుకుపోవడం మొదలుపెట్టాడు.

"నంబర్‌వన్ - ఎవరో అపరిచిత వ్యక్తి తన చేయి పట్టుకుంటే ఆ అమ్మాయి ఎందుకు పశ్చాత్తాపంతో 'థాంక్స్' చెప్పింది?"

"ఎందుకు?"

"ఎందుకంటే, అతనలా పట్టుకోకపోయి వుంటే ఆ అమ్మాయి మూతలేని 'మేన్ హోల్'లో పడిపోయి వుండేది కనుక."

"గుడ్ రీజనింగ్", మెచ్చుకున్నాడు రేవంత్.

"అలాగే రోడ్డుకి అడ్డంగా బస్సుకి అవరోధం కల్పించింది ఏవిటో కూడా వూహించాను.'

"ఏవిటి?"

"అదో ట్రాన్స్‌ఫార్మర్"

"ఏవిటి రోడ్డుకడ్డంగా ట్రాన్స్‌ఫార్మరా?" అని ఆశ్చర్యపోయాడు రేవంత్. వివేక్ అదేం వినిపించుకోకుండా.

"రోడ్డు మీద రెండు చెత్త కుండీలు ఉన్నాయన్నావు కదూ! వాటిల్లో ఏవైనా గుంజలు పాతి వాటికి క్లాత్ బ్యానర్ లాంటిది ఏమైనా కట్టారేమో గుర్తు చేసుకో."

"అవునవును. అలాంటిదేదో వున్నట్లే వుంది."

"గుడ్. ఐతే అదో రాజకీయ నాయకుడికి స్వాగతం పలికే క్లాత్ బ్యానర్"

"లాస్ట్ బట్ నాట్ ది లీస్ట్. ఆ అమ్మాయి లోపలికెళ్ళిన యింటి తలుపు మీద ఏదో చిత్రగణితం వుందన్నావు కదూ! అది కూడా మంచులా విడిపోయింది. అది ఆ యింటి నంబరే!"

రేవంత్ తల వూపుతూ, "అయితే యీ ఆధారాలతో అది ఏ వూరో పోల్చుకున్నావా?' ' అన్నాడు.

జ్ఞాని లాగా నవ్వాడు వివేక్.

"నేను పోల్చుకోవడం కాదు. నువ్వే పోల్చుకుంటావ్. విను. ఆరు ప్రశ్నలు. ఒకే జవాబు.

ఒకటి : ఏ వూళ్ళో ట్రాన్స్‌ఫార్మర్లు శివాలయంలో నంది విగ్రహాల్లా రోడ్డుకి అడ్డంగా కొలువుదీరి వుండును?

రెండు : ఏ వూళ్లో మ్యాన్‌హోల్స్ నిరాడంబరంగా కవర్లు లేకుండా వుండును?

మూడు : ఏ వూళ్ళో డోర్ నంబర్లను శ్రీనివాస రామానుజం వచ్చినా డీకోడ్ చేయలేడు? మరియు ఏ వూళ్ళో 247 వ యింటి పక్కన 379వ నంబరు యిల్లు వుండును?

నాలుగు : ఏ వూళ్ళో ఆ వూరి ప్రజలు వారి మాతృభాషని చిత్ర విచిత్రంగా రాస్తారు?

ఐదు : ఏ వూళ్ళో రోడ్డు మధ్యని చెత్తకుండీలు, వాటిని కలుపుతూ బ్యానర్లూ హఠాత్తుగా వెలిసి బద్ధకంగా అలాగే వుండిపోవును?

ఆరు : ఏ వూళ్ళో సిటీ బస్సుల ప్రగతి రథ చక్రం ఆగదు? బస్‌స్టాపుల్లో సైతం!

ఏ వూళ్ళో? ఏ వూళ్ళో? ఏ వూళ్ళో?"

అని ప్రేమనగర్‌లో ఏయన్నార్ లెవల్లో అని ఆగాడు వివేక్.

రేవంత్ మంత్రముగ్ధుడులా, "హైదరాబాద్" అన్నాడు.

"చూశావా, నీ చేతే చెప్పించాను" అన్నాడు వివేక్.

రేవంత్ హఠాత్తుగా తెలివిలోకొచ్చాడు.

"నువ్వెలాగైనా జీనియస్‌విరా" వివేక్‌కి ఓ కాంప్లిమెంట్ పారేశాడు. "అయితే మనం తంతే బూరెల గంపలో పడ్డాం అన్న మాట. ఆ అమ్మాయిది యీవూరే అయితే యిక మనకి కావలసింది ఏముంది? ఇంటి నంబరు కూడా నాకు గుర్తుంది. 2-2-659/A(2)/1/C-7 వెదుకుదాం పద" అన్నాడు.

"తంతే బూరెల గంపలో పడ్డం కాదు. పెనం మీద నుంచి పొయ్యిలో పడ్డాం అను. అయినా నీకిదేం పిచ్చిరా? కలలో ఏదో కనిపించ...."

"స్టాప్, స్టాప్, స్టాప్" అరిచాడు రేవంత్. నువ్వు నిజమైన స్నేహితుడివైతే సాయం చెయ్యి. లేకపోతే నామానాన నన్ను వదిలెయ్. అంతేగాని అడ్డు పుల్లలు వెయ్యకు."

తప్పనిసరై, రేవంత్‌తో బయలుదేరాడు వివేక్.

★ ★ ★

కథ యింతవరకూ చెప్పి ఆగాడు మణిసిద్ధుడు.

"తరువాతేం జరిగింది ఆచార్యా! వాళ్ళకి ఆ అమ్మాయి కనిపించిందా? రేవంత్ ఆమెని పెళ్ళి చేసుకున్నాడా?" అని అడిగాడు గోపన్న సస్పెన్స్ భరించలేక.

మణిసిద్ధుడు తను ఆల్‌రెడీ 'లాగ్‌యిన్' చేసిన రేవంత్ ఫైలు చూసి నిట్టూర్చాడు.

"ఏం చెప్పమంటావు గోపా! విపణి వీధిలో నీవు చూసిన యిద్దరు పిచ్చివాళ్ళూ వాళ్ళే నాయనా! ఇలా ప్రతి యింటి గడపా ఎక్కుతూ, దిగుతూ, వెర్రి చూపులు చూసుకుంటూ ఆరునెల్ల బట్టీ ఆ యింటి నెంబరు వెతుక్కుంటూ తిరుగుతున్నారు, పాపం!" అంటూ ముగించాడు మణిసిద్ధుడు, తరువాత మజిలీకి సరంజామా సర్దుకుంటూ.

ఎం.హెచ్.వి. సుబ్బారావు (నిశాపతి), బి.ఇ.
సూపరింటెండింగ్ యింజనీర్ (పంచాయతీరాజ్), మెదక్.

## టి. శ్రీవల్లీ రాధిక కథ

# పడికట్టు రాళ్ళు

రైలు వేగంగా పరుగెడుతోంది. మనోజ్ఞ హృదయం అంతకు మించిన వుద్వేగంతో వూగుతోంది.

"అబ్బో! హైదరాబాద్ ప్రయాణం అంటే ఎంత ఆనందమో చూడు."

"మరి! వెళ్తోంది ఎక్కడికనుకున్నావ్! ఆవిడగారి హీరో దగ్గరికి."

"అయితే మాత్రం! మనోజ్ఞ కూడా అచ్చం ఆడపిల్లలా సిగ్గుల మొగ్గ అయిపోతే ఎలా!"

.......

కొలీగ్స్ చేసిన అల్లరి గుర్తొచ్చి మనోజ్ఞ పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

"నిజమే. తనుకూడా యింత కదిలిపోతోందేమిటి! రవిని చూడపోతున్నాను అన్న చిన్న ఆలోచనకే యిలా తుళ్ళిపడుతోందేమిటి!?

సిగ్గుపడడం ... బుగ్గలు ఎఱ్రనవడం ... యిలాంటివి అసలు తనికి చేతకావు అనుకునేవారు అందరూ.

చిన్నప్పటినుంచీ అంతే. "ఆడపిల్లవు. ఒక మూలకూర్చో" అనే ఆంక్షలు తనమీద లేవు.

గోళీలు ఆడేది .. కబడ్డీ ఆడేది .. గాలిపటాలు ఎగరేసేది.

అక్క .. తను. అంతే. మగపిల్లాడికోసం అమ్మావాళ్ళు వెయిట్ చేయలేదు. ఇద్దరూ ఆడపిల్లలేనని వాళ్ళు ఎప్పుడూ బాధపడలేదు.

ఇంట్లో సరుకులు కావాలన్నా, కూరలు కావాలన్నా తనే తెచ్చిపెట్టేది. అక్క చదివినంత బాగా చదవకపోయినా ప్రతిపరీక్షా ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అయ్యేది.

గేమ్స్‌లో మాత్రం తనకి పోటీ ఎవరూ వుండేవారు కాదు, స్కూల్లో ... కాలేజ్‌లో కూడా.

గ్రాడ్యుయేషన్ అయిపోగానే ఢిల్లీలో వుద్యోగం వచ్చింది. చదువు, వుద్యోగం ... వెయిట్ లిఫ్టర్‌గా నేషనల్ లెవెల్లో గుర్తింపు....

తను సాధించిన విజయాలన్నీ మనోజ్ఞ మనస్సులో గిర్రున తిరిగాయి.

వెయిట్‌లిఫ్టింగ్‌లో యింట్రస్ట్ చూపించినపుడు చాలామంది నిరుత్సాహపరుస్తూ మాట్లాడారు. ఆడపిల్లలకి పనికివచ్చే ఫీల్డ్ కాదన్నారు. ఇపుడు వాళ్ళే నీరాజనాలు పడుతున్నారు.

అక్కమాత్రం మొదటినుంచీ తనని ఎంకరేజ్ చేసింది. అక్క ... తనలాగా కాదు అది. విజయసాధనకి తను శరీరాన్ని ఎలా ఉపయోగించుకుందో అది మేధస్సునలా వుపయోగించుకుంది.

దాన్నీ అంతే. ఆడపిల్లకి యింజనీరింగ్ ఎందుకు అన్నారు. అసలు ఏమిటో ఆ అర్థంలేనిమాట! మగపిల్లల్నీ, ఆడపిల్లల్నీ అందర్నీ బీట్‌చేసి అది కాలేజ్ ఫస్ట్ వస్తే ... "ఆడపిల్లకి యింజనీరింగ్ ఎందుకుట?" అట!

అసలు ఈ అనేవాళ్ళకి బుర్రలుంటాయో వుండవో!

అయితే నాన్నగారు అలాంటి మాటలేమీ పట్టించుకోలేదు.

అందుకే .... యిపుడు నెలకి ఇరవై వేలు జీతం .. కాదు .. దాని హోదా దానితోపాటు చదువుకున్న మగపిల్లలు ఎంతమంది సంపాదించారని!

రైలు ఆగుతూండడం గమనించి, కిటికీలోంనుంచి తొంగిచూసింది మనోజ్ఞ.

ప్లాట్‌ఫాం మీద నిల్చుని వుంది సంగీత. రైలుదిగి చుట్టూ చూస్తున్న మనోజ్ఞని దగ్గరకి తీసుకుని, రెండు బుగ్గలమీదా ముద్దు పెట్టుకుంది.

"రవి రాలేదులే. పద" అంది సూట్‌కేస్ అందుకుంటూ.

"నేను పట్టుకుంటానులే అక్కా" సంగీత చేయి తప్పిస్తూ అంది మనోజ్ఞ. ఆమె గొంతులో ఒక్కసారిగా నీరసం నిడింది.

"ఎప్పుడెప్పుడు చూస్తానా అన్న తపన తనకేగానీ అతనికేం లేదన్నమాట. ఛ. ఈ మగవాళ్ళింతే" విసుగ్గా అనుకుంది.

".... ఆఫీస్‌లో ఏదో అర్జంట్ మీటింగ్ వుందట. నువ్వు యింటికి వచ్చేసరికి ఫోన్ చేస్తానన్నాడు. వీలైతే రేపు ప్రొద్దున భోజనానికి వస్తానన్నాడు."

సంగీత మాటలు విని నవ్వింది మనోజ్ఞ. తన ఆశాభంగాన్ని కప్పిపుచ్చుకుంటూ "బావగారు ఎలా వున్నారక్కా!" అంది హుషారుగా.

కారు డోర్ తెరుస్తూ సంగీత నవ్వింది. "ఊ. ఇంతసేపటికి గుర్తొచ్చారన్నమాట

బావగారు'' అంది.

ఇంట్లోకి అడుగుపెడ్తూండగానే మాధవ్ ఎదురొచ్చాడు. రెండు చేతులూ సాచి మనోజ్ఞని దగ్గరికి తీసుకుంటూ "హలో ఛాంపియన్" అన్నాడు.

"మీరేమిటి బావగారూ! ఇలా బక్కచిక్కిపోయారు!" మనోజ్ఞ ఆటపట్టించింది.

"త్వరగా స్నానం చేసొస్తే భోజనానికి వెళ్దాం"

"ఎక్కడికి!"

"హోటల్‌కి డియర్. ఇవాళ మీ అక్కయ్యగారు లేట్‌గా వేంచేశారు కదా! ఇంట్లో వంటలేదు."

"ఓహో!" అంటూ లోపలికి పరుగెత్తింది మనోజ్ఞ. "ఒక్క నిమిషంలో వస్తాను."

ఆమెకి చాలా ఆనందంగా అనిపించింది ఆ యింటినీ, ఆ వాతావరణాన్నీ చూస్తే. భార్యాభర్తలిద్దరూ సమాన హోదాలో వుండి .. స్నేహితుల్లా ప్రవర్తిస్తుంటే ఎంత బాగుంటుంది!

కాలం చాలా మారింది.

'ఏమే! ఒసే' అన్న పిలుపులకీ, తలుపు చాటున నిల్చుని 'ఏమండీ!' అనడానికి రోజులు చెల్లిపోయాయి. స్త్రీలు అన్ని రంగాలలోనూ సమానత్వం సాధిస్తున్నారు."

సంతోషంగా అనుకుంది మనోజ్ఞ.

హోటల్‌కి వెళ్ళి కూర్చోగానే మళ్ళీ రవి గుర్తొచ్చాడు ఆమెకి. "కనీసం ఫోన్‌కూడా చేయలేదు. రైల్లో వున్నంతసేపు క్షణాలు లెక్కపెట్టుకుంది. దిగి రెండుగంటలు అయినా దర్శనం కాలేదు" ఆలోచనలు వరదలా చుట్టుకున్నాయి మనోజ్ఞని.

"... పాలక్ పనీర్ ... ఫ్రైడ్‌రైస్ .. " మాధవ్ ఆర్డర్ చేయడం లీలగా వినిపించింది.

టేబిల్ మీదికి వచ్చిన పదార్థాలని అన్యమనస్కంగా కెలుకుతూ వుండిపోయింది. ఒక్కటీ నోటికి రుచించటంలేదు.

"ఏమిటి? మీ యిద్దరూ అసలేమీ తినడంలేదు" అన్నాడు మాధవ్.

"ఆకలి వేయడంలేదు బావగారూ!" అంది మనోజ్ఞ.

"ఇంకానయం. అన్నీ వేస్ట్ చేసేస్తారా!" ప్లేట్ చేతిలోకి తీసుకుని వడ్డించబోయాడు మాధవ్.

"బాబోయ్. వద్దు. తినలేను." మనోజ్ఞ పెద్దగా అరిచేసింది. మాధవ్ వులిక్కిపడి వెనక్కి తగ్గాడు.

సంగీతవైపు తిరిగి "నువు తిను" అన్నాడు.

చేయి అడ్డం పెట్టింది సంగీత. "లేదు. తినలేను."

అతను వినిపించుకోలేదు. ఆమె ప్లేట్‌లోకి మూడు పరాటాలు వడ్డించేసి "తిను సమానత్వం సమానత్వం అంటావు కదా! మరి నేను తిన్నంత తిను నువ్వు కూడా" అన్నాడు.

మనోజ్ఞ నవ్వుతూ అక్కవైపు చూసింది.

సంగీత మొహం తెల్లగా పాలిపోయింది. "నిజంగా తినలేనండీ" అంది దాదాపు ఏడుపు గొంతుతో.

మనోజ్ఞ నివ్వెరపోయి చూసింది. "ఎందుకంత బాధపడుతోంది అక్క! తినలేకపోతే

వదిలేయచ్చుగా!" అనుకుంది.

కానీ రెండు నిమిషాల తర్వాత అర్థమయింది ఆమెకి సంగీత బాధ. పీకలమీద కూర్చున్నట్లుగా కూర్చుని మొత్తం తినేవరకూ వదిలిపెట్టలేదు మాధవ్.

చిన్నపిల్లలా బలవంతంగా నోటిలో కుక్కుకుంటున్న సంగీతని ఆశ్చర్యంగా చూస్తూండిపోయింది మనోజ్ఞ.

"అదీ ... వెరీగుడ్" అన్నాడు మాధవ్, సంగీత ప్లేట్ ఖాళీచేయగానే. ఆ మరుక్షణం ఫ్రైడ్రైస్ ప్లేట్ అందుకుని ఆమె ప్లేట్‌లోకి సరిగ్గా సగం వడ్డించాడు.

"మిగతా సగం నాకు" అన్నాడు నవ్వుతూ.

నోటికి చేయి అడ్డం పెట్టుకుని వాంతి అవకుండా కంట్రోల్ చేసుకుంటోంది సంగీత. ఆమె కళ్ళలో చిన్న నీటిపొర మెరిసినట్లుగా తోచింది మనోజ్ఞకి.

"టూమచ్" విసుగ్గా అన్నాడు మాధవ్. "మరీ చిన్నపిల్లలా బిహేవ్ చేస్తుంది మీ అక్క. ఇంత కష్టపడుతుంది కదా! సరిగా అన్నం తినకపోతే ఎలా!"

వాతావరణం ఒక్కసారిగా మారిపోవడంతో అయోమయంగా చూసింది మనోజ్ఞ.

ఆ తర్వాత ఎవరూ మాట్లాడలేదు. ఇంటికి రాగానే పెద్ద వాంతి చేసుకుంది సంగీత. ఆమె మొహం కడిగి, చేయిపట్టుకుని నడిపించుకువెళ్ళి పడుకోబెట్టింది మనోజ్ఞ.

మెడవరకూ దుప్పటికప్పి ప్రక్కనే కూర్చుంటూ "ఏమయిందక్కా!" అంది.

సంగీత నీరసంగా నవ్వింది. "ఏమిటో! కొంచెం అనుమానంగా వుంది. రేపు డాక్టర్ దగ్గరకి వెళ్ళాలి."

"హా!" ఆశ్చర్యానందాలతో పెద్దగా అరిచింది మనోజ్ఞ. "అందుకేనా బావగారు 'ఇంకా తిను. ఇంకా తిను' అంటూ ముద్దు చేస్తున్నారు!?"

సంగీత మొహం మ్లానమైంది. "ఊహు. అదేంకాదు. మనసు మారుమూలల్లో ... ఎక్కడో ... 'ఏమిటీ ఈ ఆడవాళ్ళ గొప్ప!' అన్న దుగ్ధ వుంటుందనుకుంటా. అది యిలాంటి సమయాల్లో బయటపడుతుంది."

"అంటే!"

"ఏమిటో మరి!" సంగీత పెదవి విరిచింది. "సమానత్వం అంటే అర్థంకాలేదు కాబోలు వాళ్ళకి. మనం మా యిష్టం వచ్చినది మా యిష్టం వచ్చినంత తింటాం అన్నాము కానీ, వాళ్ళకి యిష్టమయినది వాళ్ళు తిన్నంత తింటాం అనలేదు కదా!" గలగలా నవ్వింది.

ఆ నవ్వులో వినబడుతున్న అసంతృప్తిని మౌనంగా గమనించింది మనోజ్ఞ. కలలో నడుస్తున్నట్లుగా వచ్చి తన మంచంమీద పడుకుంది.

ఇలా నిద్రపట్టిందో లేదో "ఏయ్ మన! రవి ఫోన్ చేశాడు, లే" అంటూ లేపింది సంగీత.

పరుగెత్తుకుంటూ వెళ్ళి ఫోన్ అందుకుంది. ".. అర్ధరాత్రిపూటా ఫోన్ చేసేది!" బద్ధకంగా అడిగింది.

గలగలా నవ్వాడు రవి. "...పిచ్చిమొద్దూ! అర్ధరాత్రికాదు. తెల్లవారి చాలా సేపయింది. టైం ఆరున్నర. నువ్వు త్వరగా బయల్దేరి ఎనిమిది గంటలకల్లా మన సంకేత

స్థలానికి వస్తే .. ఇంక అప్పటినుంచీ ఈ దాసుడు నీ ఆధీనంలో వుంటాడు ... ఈరోజంతా.'

మనోజ్ఞకి హఠాత్తుగా తనకోపం గుర్తొచ్చింది. "నేనసలు నీతో మాట్లాడద్దనుకున్నాను'' అంది సీరియస్‌గా.

"మాట్లాడకు" ఫోన్ పెట్టేస్తూ అన్నాడు రవి. "వెంటనే బయల్దేరి రా'." ఆ మాటలతోపాటూ అలవాటుగా ఓ ముద్దుని ట్రాన్స్‌ఫర్ చేశాయి టెలిఫోన్ తీగలు.

సుడిగాలిలా లేచింది మనోజ్ఞ. అరగంటలో తయారయ్యి హాల్లోకి వచ్చింది.

"టిఫిన్ చేసివెళ్ళు" సంగీత బలవంతంగా టేబిల్ దగ్గర కూర్చోబెట్టింది.

"ఎలా వెళ్తావు? కారు బావగారు తీస్కెళ్ళారు."

"లూనా!"

"లూనా బాలేదు."

"బస్‌లో వెళ్తాలే" మాట పూర్తి చేయకముందే బయటకి నడిచింది. బస్‌స్టాండ్ వరకూ అదే వేగంతో పరుగెత్తింది. ఏంలాభం! అక్కడ ఆగి నిలబడాల్సి వచ్చింది.

అందరూ ఆఫీసులకి వెళ్ళే టైం కాబోలు. బస్‌స్టాండ్ క్రిక్కిరిసినట్లుగా వుంది.

తన పక్కనే పసిపిల్లని ఎత్తుకుని నిల్చున్న స్త్రీని చూసి పలకరింపుగా నవ్వింది మనోజ్ఞ. ఆమెతో మాటలు మొదలుపెట్టగానే బస్ వచ్చింది.

అంతే. అందర్నీ తోసుకుని, పిల్లతోపాటూ చాలావేగంగా ముందుకు వెళ్ళింది ఆమె.

అలవాటు లేకపోవడం వల్లనేమో! మనోజ్ఞ వెనకబడింది.

బస్ ఎక్కగానే ... ముందు సీట్లో కూర్చున్న ఆడవాళ్ళని "కొంచెం అడ్జస్టవుతారా!'' అని అడిగింది ఆమె.

"ఎందుకు! వెనక సీట్స్ వున్నాయి కదా!" అంటూ మనోజ్ఞ లోపలికి నడిచింది.

"ఇది లేడీస్ సీట్. లేస్తారా!" అంది అందులో కూర్చున్న మగవాళ్ళని వుద్దేశించి.

వాళ్ళు వినిపించనట్లుగా చూశారు ఒక్కక్షణం.

మనోజ్ఞ మళ్ళీ అడగడంతో అప్పుడు తలత్రిప్పారు. ఇంకో రెండు వరుసల తర్వాత రెండోవైపుకి వున్న సీట్ చూపిస్తూ "అక్కడ ఒక్కడే వున్నాడు. ఆయన్ని లేపండి" అన్నారు.

వాళ్ళమాట వింటూనే ఆ సీట్లో వున్నతను టకీమని లేచాడు. అదేదో విశ్వమంతా ఆమోదించిన న్యాయంలాగా.

మనోజ్ఞ ఆశ్చర్యంగా అటువైపు చూసింది. వెంటనే ఆమెకు కారణం అర్థమయింది.

అటువైపు విపరీతంగా ఎండపడ్తోంది. ఆ సీట్లో అతని ప్రక్కన కూర్చున్న చిన్నపాప ... స్కూల్‌డ్రస్‌లో వున్న దానిమొహం ఎర్రగా కందిపోయి వుంది.

"సో ... నిల్చోడానికి ... ఆ సీట్లో కూర్చోడానికీ పెద్దగా తేడాలేదన్నమాట. అందుకే అతను అలా చెంగున లేచి నిలబడ్డాడు.

లేకపోతే ... ఆ సీటుకూడా దీనిలాగా సౌఖ్యంగా వుండివుంటే ... తను మధ్యలో వున్నవాళ్ళందరినీ తోసుకుని ... కదిలేబస్‌లో వుయ్యాలలూగుతూ అక్కడిదాకా వెళ్ళాక ... "ముందుసీట్లో వాళ్ళని లేపకుండా వెనక్కివచ్చి అడుగుతారేంటండీ!" అనేవాడేమో!

"ముందుసీట్లోవాడు ముందు లేవాలా! ఒక్కడే కూర్చున్నవాడు లేవాలా! అన్న

మీమాంసతో తనను బస్‌లో అటూయిటూ త్రిప్పుతూ గమ్యస్థానం చేర్చేవారన్నమాట.''

మనోజ్ఞకి వళ్ళు మండిపోయింది. ఇదీ లేడీస్ సీటే. అదీ లేడీస్ సీటే. ఈ రెండింటిలో ఎక్కడయినా కూర్చోగలిగిన హక్కు తనకి వుంది. తను అడగగానే లేవవలసిన విధి వాళ్ళకి వుంది.

ఏ సీట్ అయినా అడిగేహక్కు తనకి వున్నపుడు ఆ ఛాయిస్‌ని వుపయోగించుకోవలసింది తనా! వాళ్ళా! ఒక్క అయిదు నిమిషాలు ఆసీట్లో కూర్చున్నా తలనొప్పి రావడం ఖాయం. ఇటువైపు ఖాళీలేకపోతే వేరే విషయం. వున్నప్పుడు తను అక్కడికి ఎందుకు వెళ్ళాలి!

"నేను ఇక్కడే కూర్చోవాలి. మీరు లేవండి'' స్పష్టంగా చెప్పింది మనోజ్ఞ.

వాళ్ళు వీసమెత్తుకూడా విలువ యివ్వలేదు ఆమె మాటకి.

"మేము లేవం. ఎవడితో చెప్పుకుంటావో చెప్పుకోపో'' అన్నారు.

వాళ్ళొక్కళ్ళే కాదు. బస్‌లో అందరూ ... కండక్టర్‌తో సహా మనోజ్ఞదే తప్పు అన్నట్లుగా చూశారు.

ఒక స్త్రీ అయివుండి ఆమె అంత పంతం పట్టడం వాళ్ళకి నచ్చలేదు. "ఖాళీగా వున్న సీట్లో నోరుమూసుకుని కూర్చోక మగవాళ్ళమీద అథారిటీ ఏమిటి?'' అన్న ఎక్స్‌ప్రెషన్ ప్రతి ఒక్కరి కళ్ళలోనూ కనబడింది.

అంతలో .. ముందుసీట్లో కూర్చున్న ఆవిడ తన స్టాప్ రావడంతో లేచి నిలబడింది.

అంతే. పదిమంది ముక్తకంఠంతో చెప్పారు. "అదిగో. ఆ సీటు ఖాళీ అయింది. కూర్చోండి.''

తప్పలేదు మనోజ్ఞకి. కూర్చుందికానీ ఆమె గుండెల్లో సన్నటి మంటలాగా అనిపించింది. తనలాంటి స్త్రీ కూడా వుపయోగించుకోలేని హక్కులు వుండి లాభమేముంది!

పసిపిల్లలతో ఎండలో మాడిపోతూ కూర్చున్న ఆడవాళ్ళని చూస్తే జాలేసింది మనోజ్ఞకి. ఒక్కరు కూడా యిటువైపు వున్న లేడీస్ సీట్‌ని అడిగే ప్రయత్నం చేయలేదు!

ఆమె బాధ గ్రహించినట్లుగా ప్రక్కన కూర్చున్న ఆవిడ నవ్వింది. "వాళ్ళు అంతేనండీ. ఇంకానయం. ఇవాళ అసలు ఏదో ఒక సీటు వుంది. అసలు సీటే లేకపోయినా మనం అడడగగానే వాళ్ళు లేవరు. ఆడవాళ్ళు వచ్చి 'లే!' అంటే లేవడానికి పౌరుషం అడ్డంరాదూ మరి! ఎందుకొచ్చిన బాధ అసలు లేడీస్ సీట్లో కూర్చోకుండా వుందాం అనుకోరు. కూర్చుంటారు. లేవమని అడిగితే రోషాలు పోతారు.''

సన్నటి గొంతుతో ఆవిడ చెప్తుంటే మనోజ్ఞ ఆశ్చర్యంగా వింది. ఆమెకి సంగీత గుర్తొచ్చింది.

"పరాయి మగవాళ్ళ పెత్తనాన్నే సహించక తప్పని పరిస్థితి సమాజంలో వున్నప్పుడు, భర్త అధికారాన్నీ, అహంకారాన్నీ భరించడం దోషం కాదేమో!''

వెనక కూర్చున్నవాళ్ళు యింకా సణుగుతూనే వున్నారు. "సమానత్వం సమానత్వం అంటారు. మళ్ళీ ప్రత్యేకహక్కులు కావాలి వీళ్ళకి కాసేపు బస్‌లో నిల్చోలేరు కానీ మగవాళ్ళతో సమానం అని ఏడుస్తారు.....''

నిట్టూర్పుని అణచుకుంటూ మనోజ్ఞ బస్ దిగింది.

"వీళ్ళతో సమానత్వం కోరుకునే దౌర్భాగ్యంలో వుందా తను! నిజంగా అందుకోసమే పోరాడుతోందా స్త్రీజాతి!!"

వదలిపోయిన మొహాన్నీ .. ఆలోచనలతో ముడుచుకున్న భృకుటినీ ఆశ్చర్యంగా చూశాడు రవి.

"ఏమయింది!" అన్నాడు చేయందుకుంటూ.

"ఏం లేదులే."

"అరే. చెప్పవోయ్" అతను రెట్టించాడు.

"ఏంలేదు" మరింత చిరాకుగా చెప్పింది మనోజ్ఞ. "అసలు మీ మగవాళ్ళని ఎలా సృష్టించాడో ఏమిటో దేవుడు!" ఉక్రోషంతో ఆమె పెదవులు వణికాయి.

రవి బిక్కమొహం పెట్టాడు. "నేనేం చేశాను!" అన్నాడు చిన్నపిల్లాడిలా పెదవులు ముడుస్తూ.

మనోజ్ఞ చికాకంతా ఒక్కసారిగా ఎగిరిపోయింది. ఫక్కున నవ్వేస్తూ, అతని భుజాన్ని తన తలతో చిన్నగా కొట్టింది.

రిలీఫ్‌గా చేతులు ఎగరేసి బైక్ స్టార్ట్ చేశాడు రవి.

"కాళ్ళు అటూ యిటూ వేసి కూర్చో" అన్నాడు దగ్గరగా వస్తున్న మనోజ్ఞతో.

"అబ్బ, యిలా కూర్చుంటానే బాబూ!" ప్రక్కనుంచి ఎక్కుతూ ఆమె సమాధానం చెప్పింది.

"నో. అలా కూర్చునేట్లయితేనే తీసుకెళ్తాను. నడుం చుట్టూ చేతులు వేసి గట్టిగా పట్టుకో" రవి మారాం చేశాడు.

చెప్పినట్లు వినక తప్పలేదు మనోజ్ఞకి.

గాలితో పోటీపడుతూ వెళ్తున్న బైక్‌మీద అతనివీపుకి మొహాన్ని ఆన్చి కళ్ళు మూసుకుంది.

తన తలమీది కాప్‌ని ఆమెతలమీదికి ట్రాన్స్‌ఫర్ చేస్తూ ... "ఏం ఆడవాళ్ళో ఏమిటో! అన్నిట్లో మగవాళ్ళతో సమానం అంటారుగా! మళ్ళీ యిలా కూర్చోమంటే సిగ్గుపడతారేం!' ' అన్నాడు.

ఛర్రున చూసింది మనోజ్ఞ ఆ మాటలకి. "నాకేం సిగ్గులేదు" అంది కొట్టినట్లుగా.

రవి పెద్దగా నవ్వాడు. "నాకు తెలుసు". అన్నాడు అల్లరిగా. "నీ సంగతి కాదులే నేనిప్పుడు చెప్పింది."

ఆమెకి కూడా నవ్వొచ్చింది. పిడికిలితో అతని వీపుమీద గట్టిగా కొడుతూ "పో. నేనసలు నీతో మాట్లాడను" అంది.

ఆ తర్వాత రెండుచేతులూ అతని నడుముచుట్టూ మరికాస్త బిగించి, మొహాన్ని అతని వీపులో దూర్చేసుకుని కళ్ళు మూసుకుంది.

అలా ఎంతదూరం ప్రయాణించినా తనివితీరదు ఆమెకి. బైక్ ఆగగానే అసంతృప్తిగా క్రిందికి దిగింది.

"ఎక్కడికొచ్చాం?"

"పద చెప్తాను." గేటు తీసుకుని లోపలికి నడిచాడు రవి.

చాలా పెద్ద కాంపౌండ్. చుట్టూ పెద్ద తోట. ఆ తోట మధ్యలో చిన్న యిల్లు. గేటు మెయిన్‌రోడ్ మీదికే వున్నా ..... ట్రాఫిక్ రొద యింటిదాకా రావడం లేదు. చాలా ప్రశాంతంగా నిర్మానుష్యంగా వుంది.

తోటలో పచ్చగడ్డిమీద కూర్చుంటూ చెప్పాడు రవి. "రా. కూర్చో."

"ఏమిటిది!" అంది మనోజ్ఞ ఆశ్చర్యంగా చూస్తూ.

"మా ఫ్రెండ్ యిల్లు యిది. ఎపుడూ ఖాళీగానే వుంటుంది. ఇవాళ నీతో గడపటానికి ఒక క్రొత్త ప్లేస్ కావాలనిపించింది. కీస్ తీసుకున్నాను. ఈ తోట ... ఈ యిల్లూ యిదంతా నాకు చాలా యిష్టం?" చుట్టూ చూస్తూ చెప్పాడు రవి.

"అవును. చాలా బాగుంది" అంది మనోజ్ఞ.

ఆమెకి కూడా చాలా నచ్చింది ఆ వాతావరణం.

తోటలో దూరంగా పనిచేసుకుంటున్న ముసలి నౌకరు తప్ప మరెవరూ లేరు అక్కడ.

పూలు .. మొక్కలూ .. రంగులూ .. పరిమళాలూ .. వసంతుడు తామిద్దరి కోసమే సృష్టించిన స్వర్గంలా వుంది.

గంట .. రెండు గంటలు .. మూడు .. నాలుగు గంటలు నిమిషాల్లో గడిచిపోయాయి.

తన వడిలో తలపెట్టుకుని, తన చేతులు రెండూ అతని చెంపలికి ఆనించుకుని కబుర్లు చెప్తున్న రవిని చూసి చిన్నగా నవ్వింది మనోజ్ఞ.

"ఏంటి! ఇంక మనం యిక్కడేనా యివాళ!" అంది.

రవి లేచి కూర్చున్నాడు. "అన్నం తిందామా!" అంటూ లోపలికి నడిచాడు.

నౌకరు భోజనం పెట్టడం .. వేడివేడిగా తినడం - అంతవరకూ బాగానే గడిచింది.

ఆ తర్వాత .... సీరియస్‌గా బెడ్‌రూంలోకి నడిచాడు రవి. తలుపులు చేరవేసి మనోజ్ఞని దగ్గరికి తీసుకున్నాడు.

"ఇదేమిటి!"

"భోజనం తర్వాత ప్రోగ్రామ్" గుసగుసగా చెప్పాడు.

"చాల్లే వూరుకో" ఒక్కచేత్తో అవతలికి తోసింది మనోజ్ఞ.

ఆ విసురుకి మంచంమీద వెల్లకిలా పడ్డాడు రవి. "మనూ ... ప్లీజ్" ఆమె చున్నీని చేత్తో లాగేస్తూ అర్థించాడు.

"అలాంటి పిచ్చి ఆలోచనలేం చేయకు. నాకు నచ్చదు. ఏమన్నా కబుర్లు చెప్పు" అతని ప్రక్కనే కూర్చుంటూ అంది మనోజ్ఞ.

"ఏం చెప్పను...." రవి బుంగమూతి పెట్టాడు. ఆమె నడుముమీద చూపుడువేలితో రాస్తూ.. "వీణ వాయించడం నేర్చుకున్నానీమధ్య. చూపించనా!" అన్నాడు.

"వద్దు" అతని చేయి తీసి ప్రక్కన పెట్టింది.

"పోనీ గిటార్!"

ఫక్కున నవ్వింది మనోజ్ఞ. అతని తలని రెండుచేతులతో వూపుతో "ఏంటి రవీ ఈ అల్లరి!" అంది.

"మనూ .. ప్లీజ్" మళ్ళీ బ్రతిమలాట మొదలుపెట్టాడు రవి. ".... ఎలాగూ వచ్చే నెలలో పెళ్ళి చేసుకోబోతున్నాం"

మొహం చిట్లించింది మనోజ్ఞ. "అదేమరి. ఎలాగూ పెళ్ళి చేసుకోబోతూ తొందరపడడం ఎందుకు?"

ఆమె అంత ఖచ్చితంగా చెప్పడంతో రవికి కోపం వచ్చింది.

తన కోరికలోని అన్యాయమూ ... ఆమె యిష్టాయిష్టాల ప్రమేయమూ ... - వీటిల్తో అతనికి నిమిత్తం లేదు.

"తను అంత ముద్దుగా .. అంత అందంగా బ్రతిమలాడుతున్నా ఆమె ఒప్పుకోవడం లేదు" అన్న ఒకే ఒక్క కారణంతో అతనికి కోపం వచ్చింది.

"ఛీ. నువ్వు కూడా యిలాగే మాట్లాడ్తావనుకోలేదు" అన్నాడు.

మనోజ్ఞ దెబ్బతిన్నట్లుగా చూసింది. "నేను కూడానా ... అంటే ...!" అంది.

తన ఆశాభంగాన్ని మనోజ్ఞ కళ్ళలోని బాధతో కాంపన్సేట్ చేసుకుంటూ రవి రిపీట్ చేశాడు. "ఎన్నో సాధించానంటావుగా! నేనూ మగాడితో సమానం అంటావుగా! నువ్వు కూడా యిలాంటి సెంటిమెంట్స్‌ని పట్టుకుని వేల్లాడుతావనుకోలేదు. మాటల్లోనే సమానత్వం ... ఆలోచనల్లో కాదు."

చాలా పరుషంగా దూసుకువచ్చిన ఆ మాటలకి మనోజ్ఞ బిత్తర పోయింది. గుండెల్లో దుఃఖం సుళ్ళు తిరిగింది. మరుక్షణం పెద్దపెట్టున నవ్వొచ్చింది.

"నిజమే. మీతో సమానంగా తిండి తినలేం. మీతో సమానంగా బస్‌లో నిల్చోలేం. మీతో సమానంగా సెంటిమెంట్స్ వదిలేసి అనుభూతులు లేని అనుభవాలని జీవితం పుస్తకంలోకి ఎక్కించలేం ... ఇంక అసలు ఎందుకు పనికొస్తాం మేము!" అంది.

ఆమె వాగ్ధాటికి రవి బిత్తరపోయాడు. "అదేమిటి!" అన్నాడు అయోమయంగా.

మనోజ్ఞ లేచి నిలబడింది. చున్నీ అందుకుని గుండెలమీద సర్దుకుంటూ చెప్పింది.

"చూడు రవీ! నీకొక వ్యక్తిత్వం వుంది. నాకూ ఒక వ్యక్తిత్వం వుంది. కానీ దురదృష్టవశాత్తూ .. నీ కోరిక తీరిస్తే .. నువ్వు అనుభవించిన వాడివి ... నేను అనుభవింపబడిన దాన్ని అన్న ఫీలింగ్ ... అది మనిద్దరిలోనూ వుంటుంది.

'ఇక అది సమానత్వమెలా అవుతుంది?' చిన్నగా నవ్వింది.

"ఆ ఫీలింగ్‌ని నువ్వు జయించినపుడు .. లేదు కనీసం నేను జయించినపుడు .. నాకేం అభ్యంతరం వుండదు. ప్రస్తుతానికి .." అతనికి అర్థం అయేలోపు పెదవులపై గాఢంగా ముద్దు పెట్టుకుంది.

" ... ప్రస్తుతానికి యింతవరకే జయించ గలిగాను. క్షమించు."

గాలి కెరటంలా ఆమె కదలి వెళ్ళిపోయింది.

అతను అమె వెనుక నిర్విణ్ణుడై నిలబడ్డాడు.

టి. శ్రీవల్లి రాధిక, ప్లాట్ నెం. 77, యాదిరెడ్డి తోట,
కమలానగర్, వనస్థలిపురం, హైద్రాబాద్ - 500 070.

# విలువలు

సాయంకాల సమయం. సుబ్బారావు పడక్కుర్చీలో కూర్చొని ఆలోచిస్తున్నాడు. కొడుకు వస్తే సమాధానం ఏమి చెప్పాలా అని. అసలు జరిగిందేమిటంటే - తనకు తెలిసిన వ్యక్తి రాజయ్య కొడుకు రవికి అత్యవసరం పదిరోజుల్లో ఇచ్చేస్తామని అంటే వెయ్యి రూపాయలు అప్పుగా ఇచ్చాడు. అదీ తను చేసిన తప్పు. ఎందుకంటే నెల దాటినా ఆ

డబ్బు తిరిగి చేతికి రాలేదు. మరికొంచెం సేపట్లో కొడుకు రాజేష్ కాలేజీనుంచి వస్తాడు. నిన్న చేసినట్టే ఈరోజు కూడా మళ్ళీ రభస చేస్తాడు.

అరగంట గడిచింది. ఇంతలో రాజేష్ రానే వచ్చాడు. వస్తూనే మొదలైంది సంభాషణ-

"ఏం డాడీ! ... రవి ఈరోజయినా డబ్బు ఇచ్చాడా?" అడి అడిగాడు రాజేష్.

"ఏం చేయాలిరా, అతను ఈవేళ దొరకనేలేదు .. రేపు ఎలాగైనా పట్టుకుంటాలే!' ' అన్నాడు సుబ్బారావు.

"మీకు ముందేచెప్పాను డాడీ, వాడికి ఇవ్వవద్దని ... తర్వాత అయినా రశీదు రాయించి తీసుకోమన్నాను మిమ్మల్ని" - చిరుకోపంతో అన్నాడు రాజేష్.

"ఆ అబ్బాయి మొఖం చూసేమిట్రా ఇచ్చింది? ... ఎప్పట్నుంచో తెలిసినవాడు వాళ్ళ నాన్న ... అతని మొఖం చూసి ఇచ్చాను. మరి అతనేమో రెళ్ళి ఇంకా రాలేదు."

"మనం ప్రోనోటు రాయించి తీసుకొంటే ఎవర్నీ అడగనవసరం లేదు. మనం చేసేది చేసుకోవచ్చు."

"అంటే .. మనిషి అవసరం మనిషికి ఎప్పుడూ ఉండదంటావా? .. మనిషి మనసున్న మనిషిగా కాక ఒక 'వస్తువు'గా మారి మరో వస్తువును మధ్యవర్తిగా పెట్టుకోవాలంటావురా?' ' - చిరాకు ఎక్కువైంది సుబ్బారావుకు.

"మనిషి - మనసు - వస్తువు - ఇవన్నీ ఏమిటి డాడీ? ... నీవి అన్నీ చాదస్తపు మాటలు.'

"చాదస్తం కాదురా అబ్బాయ్! మనిషన్న తర్వాత ఒకరిమీద ఒకరికి నమ్మకం ఉండాలిరా. నమ్మకం ఉండాలి ... అది లేకపోతే బ్రతకటం చాలా కష్టం ... కాకపోయినా ఇప్పుడేమయిపోయిందని?"

"మీరు మరీ వింతగా మాట్లాడుతున్నారు డాడీ! ... నమ్మకం, నిజాయితీ అని అంటున్నారు ... ఈరోజుల్లో ఎవరు పాటిస్తున్నారు అవన్నీ? ... అసలు ఇప్పుడు సైన్స్ ఎంత అభివృద్ధి చెందిందో ఒక్కసారి చూడండి ... టీవీలు - వీడియోలు - కంప్యూటర్లు - రాకెట్లు - మనం ఎంత ముందుకుపోతున్నామో చూడండి ... ఇదివరకు రేడియోలు మాత్రమే వుండేవి. ఇప్పుడు టెలివిజన్లొచ్చాయి. శాటిలైట్ ద్వారా ప్రపంచంలో ఎక్కడ ఏమి జరుగుతున్నా ప్రత్యక్షంగా చూడగల్గుతున్నాం - ఊరూరా స్టార్ టీవీలు ఎలా అల్లుకుపోయాయో చూడండి - ఇదివరకు స్కూలు, కాలేజీల్లో సర్టిఫికేట్లు చేత్తోరాసి సంవత్సరాల తర్వాత ఇచ్చేవారు. ఇప్పుడు హాల్‌టికెట్లతో సహా సర్టిఫికెట్లన్నీ కంప్యూటర్ల మీద క్షణాల్లో తయారయి వస్తున్నాయి ... మామూలు షాపులు మొదలుకొని ఫ్యాక్టరీల దాకా కంప్యూటర్ మీద పని నడుస్తోంది ... పట్నం నుంచి ఒక గ్రామానికి సమాచారం అందించాలంటే అప్పుడు రోజులు పట్టేవి. ఇప్పుడు ఊరూరా, అడుగడుక్కీ ఎస్.టి.డీ., ఐ.ఎస్.డీ. టెలిఫోన్లు ... కొద్ది నిముషాల్లోనే ప్రపంచంలో ఏ మారుమూల ప్రాంతంలో ఉన్నవాళ్ళతోనయినా మాట్లాడగల్గుతున్నాం ... అసలు ఇది కంప్యూటర్ యుగం డాడీ! ఇంకో విషయం చెప్పనా? ఎవరికైనా లంచం ఇచ్చి ఉద్యోగం సంపాదించాలంటే మధ్యవర్తి, ఉద్యోగార్థి ఇద్దరూ కలిసి 'ఆ సొమ్మును' జాయింట్ అకౌంట్‌లో వేసుకొంటున్నారు ... బజారులో ఏది కొన్నా దానికి రశీదు ఇస్తున్నారు

... ఇంకా ....'' అనర్గళంగా చెప్పుకుపోతున్నాడు రాజేష్.

సుబ్బారావుకి విసుగనిపించింది.

"చాలురా అబ్బాయ్! చాలు ... ఎక్కువ విషయాలే చెప్పావు ... రెండు మూడు రోజుల్లో ఆ డబ్బు ఎలా అయినా రాబట్టుకొస్తాను. నువ్వేమీ భయపడకు'' అన్నాడు ధీమాగా.

"భయమా? ... నాకు భయమేమిటి? ... ముందు రవిగాడు ఎక్కడున్నాడు పట్టుకొని వాడిచేత నోటు రాయించి తీసుకొస్తాను'' అన్నాడు రాజేష్ పట్టువదలని విక్రమార్కుడిలా.

"ఆఁ సర్లే! అలాగే చేద్దువుగాని ... వెళ్ళి కాఫీతాగు'' అన్నాడు సుబ్బారావు. అలా అనటంలో ఉద్ధరించావులే అన్న భావం కొంతలో కొంత వ్యక్తమయింది.

రాజేష్ బాత్‌రూం వెళ్ళి ముఖం, కాళ్ళు కడుక్కొని వచ్చి ఈజీ ఛైర్‌లో కూర్చున్నాడు. ఆరోజు జరుగుతున్న క్రికెట్ మ్యాచ్ గురించీ - ఇండియా స్కోరు గురించీ తమ్ముణ్ణి అడిగి తెలుసుకున్నాడు. టీవీ ఆన్ చేసి మ్యాచ్ చూడసాగాడు. ఇంతలో తల్లి కాఫీ తీసుకొచ్చి ఇచ్చింది. కాఫీ తాగుతూ, టీవీ చూస్తూ ఆరోజు దినపత్రిక పేజీలు తిరగేస్తూ కూర్చున్నాడు. ఇంతలో ఆ నెల ఇవ్వాల్సిన ఇంటి అద్దె సంగతి గుర్తువచ్చింది.

"ఇంటి వోనరు వద్దకెళ్ళి ఈనెల అద్దె పైసలు ఇచ్చివస్తాను'' అనిచెప్పి డబ్బు జేబులో పెట్టుకొని బయల్దేరాడు. రెండు సందులు దాటి ఒక అపార్ట్‌మెంట్ వద్దకెళ్ళాడు. కాలింగ్‌బెల్ నొక్కితే వెంటనే తలుపులు తెరుచుకున్నాయి ఎదురుగా కిరణ్.

"హలో, రాజేష్ గారు'' అన్నాడు అతను.

"హలో సార్!'' అంటూ లోపలికి అడుగుపెట్టాడు.

"ఏం సార్? బావున్నారా?'' - కుశల ప్రశ్న వేశాడు కిరణ్.

"ఫైన్ ... ఇప్పుడే వచ్చారా?'' - అడిగాడు రాజేష్.

"అవున్సార్! ఆఫీసునుంచి ఇప్పుడే వచ్చా ... కూర్చోండి'' అని కిరణ్ కుర్చీ చూపించాడు.

"ఈ నెల రెంట్ ... '' అంటే నోట్లకట్ట టేబిల్‌పై పెట్టి కుర్చీలో కూర్చున్నాడు.

"థాంక్యూ'' అని కిరణ్ అకట్ట తీసుకుని నోట్లు లెక్కపెట్టుకున్నాడు.

"ఓకే ... సరిపోయాయి.'' అనిచెప్పి, వాటిని తీసుకెళ్ళి గోద్రెజ్ బీరువాలో పెట్టివచ్చాడు. ఫ్రిజ్‌లోంచి గ్లాసుతో ఐస్‌వాటర్ తెచ్చి టీపాయ్‌మీద పెట్టాడు. గ్లాసు అందుకొని గటగట తాగేశాడు రాజేష్. ఇంతలో కిరణ్ రశీదు వ్రాసి తీసుకొచ్చాడు. సంతకంచేసి దానిని రాజేష్ చేతిలో పెట్టాడు.

"థాంక్యూ సార్'' - అనిచెప్పి ఇంటికి నడిచాడు రాజేష్.

రాజేష్ ఇంటికి వెళ్ళేటప్పటికి సుబ్బారావు ముందుగదిలో కూర్చుని వీధివైపే చూస్తున్నాడు. తనయుడు ఇప్పుడు మాటలు ఎలా చెబుతాడా, విందామా అన్న ఆసక్తిగా ఉంది అతనికి.

"రిసీట్ ఇదిగో డాడీ! ... మనం డబ్బులు ఇచ్చినట్టుగా రశీదు .. తర్వాత ఎప్పుడయినా మనం వాళ్ళకి డబ్బు ఇవ్వలేదని అనలేరు. అర్థమయిందా?'' అన్నాడు రాజేష్ ఉపదేశం బోధిస్తున్నట్టు—

"అర్థమయిందిరా ... నువ్వు చేసే పనులన్నీ అర్థమయినయ్ ... నీకో సంగతి తెల్సా? ... ఈ ఇంట్లో చాలాకాలం నుంచి మనం అద్దెకుంటున్నాం. కిరణ్ వాళ్ళ నాన్న బ్రతికున్న రోజుల్లో ఇలాంటి రశీదులూ గిసీదులూ - సంతకాలూ చట్టుబండలూ ఏమీ ఉండేవికావు ... కేవలం పరస్పర అవగాహన, నమ్మకంతో ఉండేవాళ్ళం ... అందుకే అద్దె డబ్బులు ఇవ్వటం ఆలస్యమైనా, ఇబ్బందివల్ల ఒక్కోసారి తక్కువ ఇచ్చినా లెక్కల్లో పైసా తేడా వచ్చేదికాదు. ఏమీ అనుకొనే వాళ్ళుంకాదు. ఇప్పుడు ఇంటిఅద్దె ప్రతి ఆర్నెల్లకీ, సంవత్సరానికీ పెంచుతున్నారు. 'ఇష్టమయితే ఉండండి లేదంటే ఖాళీచేసి పొండి' అని అంటున్నారు నిర్మొహమాటంగా. మరి అప్పుడు అద్దె పెంచాలంటే మన పరిస్థితిని చూసి, ఆలోచించి పెంచేవారు. మన కుటుంబం వాళ్ళ కుటుంబం బంధువుల్లా కలిసి ఉండేవాళ్ళం ... ఇది అర్థమయిందా నీకు?" - మాటల్ని తిప్పికొట్టేలా అన్నాడు సుబ్బారావు.

"మీరు భలే మాట్లాడుతారు డాడీ! ... నేనొకటి చెప్తే మీరొకటి అంటారు ... ఈ రశీదులకి చాలా వేల్యూ వుంటుంది డాడీ! ఇవే మనకి ఆధారం. రవికిచ్చిన వెయ్యి రూపాయాలు మనకు అంత ఈజీగా రావు ... మీరు చూస్తుండండి, రవి ఎక్కడున్నా సరే పట్టుకొని 'ప్రామిసరీనోటు' రాయించుకొని తీసుకొస్తాను" అన్నాడు ఖండితంగా.

ఇంక కొడుకుతో వాదించటం అనవసరమని భావించిన సుబ్బారావు ఊరుకున్నాడు. పొద్దుపోయింది. భోజనాలు చేసి పడుకున్నారు.

★ ★ ★

మర్నాడు ఉదయమే రాజేష్ టిఫిన్ చేసి బయల్దేరాడు. ముందుగా రవి ఇంటికి వెళ్ళాడు. ఇంట్లో రవిలేడు కాని, తల్లి ఉంది.

"రవి లేడాండి?" - అడిగాడు రాజేష్.

"లేడు బాబు ... ఎక్కడికో పనుందని వెళ్ళాడు" - సమాధాన మిచ్చింది ఆమె.

రాజేష్‌కి నిరాశ కలిగింది.

"రవి డాడీ కూడా లేరా?" అన్నాడు మళ్ళీ.

"లేరు ... మొన్న రెండురోజులక్రితం ఊరెళ్ళారు. ఇంకా రాలేదు. మలేరియా జ్వరంతో బాధపడ్తున్నారు. వద్దని చెప్పినా వినకుండా వెళ్ళారు. ఎలా ఉండో!" అంది ఆందోళనగా. ఆ మాటలు విన్న రాజేష్‌కి మీద పిడుగుపడినట్టనిపించింది. కొన్ని క్షణాలు అవాక్కయ్యాడు.

"మలేరియా జ్వరంతో వెళ్ళినవాడు ఇంకా రాలేదా? ... జరగరానిది ఏదయినా జరిగుంటే ...? ... తన డ .. బ్బు ..." - ఒక్కసారిగా భయం పుట్టుకొచ్చింది రాజేష్‌కి. 'ఇప్పుడిక ఒకటే మార్గం ... రవిగాణ్ణి పట్టుకోవాలి' అనుకున్నాడు మనసులో. నిట్టూర్చి, గంభీరంగా అక్కణ్ణుంచి కదిలాడు.

చౌరస్తాలో ఉన్న హోటల్ వద్దకి వెళ్ళాడు. లోపలికి వెళ్ళి చుట్టూరా కలియచూశాడు, ఆదుర్దాగా. ఎక్కడా అతని ముఖం కనపడలేదు. బయటికొచ్చి బస్‌స్టాప్ వేపు నడిచాడు. కొద్ది నిమిషాలు అక్కడే నిలబడ్డాడు. స్టూడెంట్స్ కాలేజిలకు వెళ్ళే సమయమది. రవి ఉమెన్స్ కాలేజీ వద్ద ఉండవచ్చని తోచింది. వెంటనే ఒక ఆటోని పిల్చి ఎక్కి కూర్చుని కాలేజీకి పోనిమ్మన్నాడు.

సందులూ గొందులూ, ట్రాఫిక్కూ అన్నీ దాటుకొని ఆటో ఉమెన్స్ కాలేజీకి చేరుకునేటప్పటికి గంట పట్టింది. ఆటోదిగి, కాలేజీ ఆవరణలోకి వెళ్ళాడు. రవి కనపడలేదు. రెండుకళ్ళని నాలుగు కళ్ళు చేసుకొని అంతా కలియచేసి, మరో గేటుగుండా బయటికి వచ్చాడు.

"అయిపోయింది. వీడుకూడా కనపడ్డంలేదు. ఇచ్చిన వెయ్యి రూపాయలు అంతే సంగతులు" - గొణుక్కున్నాడు. కొంతసేపు అక్కడే నిలబడిపోయాడు ఏమీ పాలుపోక.

ఎండ ఎక్కువగా ఉండటం వలన చమటలు పట్టి నీరసం వచ్చింది. దగ్గర్లో వున్న టీస్టాల్‌కి వెళ్ళి రెండు గ్లాసుల నీళ్ళు తాగాడు. టీకి ఆర్డరిచ్చి రోడ్డువేపు చూస్తూ కూర్చున్నాడు. టీ వచ్చింది. టీ చప్పరిస్తూ ఆలోచిస్తున్నాడు -

'మనిషికి కొన్ని చెడు అలవాట్లు ఉన్నా, కొన్ని విషయాల్లో ఒక పద్ధతిలో ఉన్న మనిషిలాగే కనపడతాడు రవి. ఈరోజు ఎలాగైనా వాణ్ణి పట్టుకొని ప్రోనోటు రాయించుకోవాలి' - అని దృఢంగా నిశ్చయించుకున్నాడు మనసులో.

రోడ్డుమీదకొచ్చి ఆషాపూ ఈషాపూ, హోటళ్ళూ, సినిమా హాళ్ళూ చూసుకొంటూ నెమ్మదిగా మళ్ళీ చౌరస్తాకి చేరుకున్నాడు. ఆత్రంగా హోటల్లోకి దూరాడు. అన్ని కుర్చీలు లెక్కపెట్టినట్టుగానే చూశాడు అంతా. ఎక్కడా రవి జాడలేదు సరికదా కనీసం తెలిసిన మొఖంకూడా కనపడలేదు రాజేష్‌కి.

"అయిపోయింది. ఈ ఆశకూడా తీరిపోయింది ... ఇంక డబ్బుల్ను వదులుకున్నట్టే! డాడీ తను చెప్పిన మాటవింటే కదా!" - తనలో తనే గొణుక్కున్నాడు. తిట్టుకున్నాడు. రవిని, అతని తండ్రిని కూడా తనకు ఇంగ్లీషులో తెలిసిన తిట్లన్నీ తిట్టాడు. కడుపులో ఆకలి కరకరమంటూంటే రెండు సమోసాలు కొనుక్కొని కసితీరా తిన్నాడు. నోటు కాగితాన్ని భద్రంగా జేబులోనే ఉంచుకొని, రిక్షా ఎక్కి తిరుగుముఖం పట్టాడు. ఉసూరుమంటే రాజేష్ ఇంటికి చేరేటప్పటికి సాయంకాలమయింది.

సుబ్బారావు ఆరుబయట కూర్చొని పేపరు చదువుతున్నాడు. తండ్రిని చూడగానే రాజేష్‌కి కోపం ఎక్కువయింది.

"నేను అన్నట్టుగానే అయింది ... మన డబ్బు పని అయిపోయింది! అది ఇంక రాదు. ఏమయిపోయాడో మలేరియా జ్వరంతో ఊరెళ్ళిన రవిడాడీ రాలేదు ... రవి అయితే అసలు దొరకనేలేదు ... నేను మీకు ముందే చెప్పాను" - అన్నాడు ఆవేశంగా.

దాంతో సుబ్బారావు ఆశ్చర్యంగా తలపైకెత్తి చూశాడు. "ఓహో! ... అలాగా" అన్నాడు రాజేష్‌వంక చూసి. ఇంతలో సైకిల్ చప్పుడయితే బయటకు చూశాడు రాజేష్.

"అరే! రవి వస్తున్నాడు" అన్నాడు ఆనందంతో.

"నువ్వు మా ఇంటికి వచ్చావట గదా! మా అమ్మ చెప్పింది" అంటూ రవి సైకిల్ స్టాండువేసి వచ్చాడు. రాజేష్‌కి ఎక్కడలేని సంతోషం వచ్చేసింది. "నీకోసం చాలా వెదికాను' ' అన్నాడు నవ్వుతూ అని, జేబులోంచి కాగితం తీసి, రవి చేతిలో పెట్టాడు. అతను కొన్ని క్షణాలపాటు దాన్ని తీక్షణంగా చూసి, పెన్నుతో రెండు గీతలు గీసేసి రాజేష్‌కిచ్చాడు

"ఇదిగోండి డాడీ!" - రాజేష్ ప్రోనోటును తండ్రి చేతుల్లో పెట్టి, తృప్తిగా ఊపిరి

పీల్చుకున్నాడు గొప్పకార్యం సాదించానన్న భావం కలిగింది అతనిలో.

ఉన్నట్లుండి సుబ్బారావు లోపలికెళ్ళి తిరిగొచ్చాడు అతని చేతిలో నోట్లకట్ట! రాజేష్ ఆశ్చర్యపోయాడు.

"మనం వాళ్ళకిచ్చిన వెయ్యిరూపాయాలు ఇవి! ... ఎవరిచ్చారనుకుంటున్నావ్? ... రవి తండ్రి రాజయ్య!!" అన్నాడు సుబ్బారావు, కొడుకు నుద్దేశించి.

రాజేష్ మరింత ఆశ్చర్యపోతుండగా, సుబ్బారావు మరల చెప్పటం ఆరంభించాడు - "మలేరియా జ్వరంతో ఊరెళ్ళిన రాజయ్య ఏమీ అయిపోలేదు ... మనకు ఇవ్వాల్సిన వెయ్యి రూపాయలకోసమే పక్కఊరు వెళ్ళాడు. అక్కడ పంటకు సంబంధించిన డబ్బు రావల్సి ఉందిట ... ఇక్కణ్ణుంచి వెళ్ళేటప్పటికే మలేరియా జ్వరమట. తీరా అక్కడికి వెళ్ళాక కావలసిన వ్యక్తి దొరకలేదుట. ఆరోజు, మళ్ళీ మర్నాడు, అక్కడే ఉండిపోవలసి వచ్చింది. ఆ రెండ్రోజుల్లో విపరీతమైన జ్వరంతో, తెల్లవార్లూ నిద్రలేకుండా బాధపడ్డాడట. మూడోరోజున అంటే ఈరోజు ఆ ఆసామి వచ్చాక, డబ్బు తీసుకుని మిట్టమధ్యాహ్నం బయల్దేరాడట ... బస్సుదిగి వాళ్ళింటికి కూడా వెళ్ళకుండా, డబ్బు పట్టుకొని నేరుగా మన ఇంటికే వచ్చాడు!'

ఊపిరి బిగపట్టుకొని వింటున్న రాజేష్ ఇంకా తేరుకోనేలేదు.

"... రాజయ్య నీరసంగా ఉంటే గదిలో ఫ్యానుకింద పడుకోబెట్టాను" - అని, లోపలకెళ్ళి రాజయ్యను రెక్కపట్టుకొని తీసుకొచ్చాడు సుబ్బారావు.

ఇప్పుడు రాజేష్ మరింత సంభ్రమాశ్చార్యాలలో మునిగిపోయాడు. అతనిలో ఉలుకూ లేదు పలుకూ లేదు. రవి అయితే చోద్యం చూస్తున్నట్టుగా ఉండిపోయాడు, అర్థంకాక.

"... నోటిమాట సరిగా ఉంటే ఈ నోట్లూ రశీదులతో పనిలేదురా! ... మనిషిమీద నమ్మకం, సాటి మనిషిలో నిజాయితీ, మాటమీద నిలకడ ఉన్నంతకాలం ఈ కాగితపు ముక్కల అవసరం ఉండదురా ... మనం వైజ్ఞానికంగా ఎంత అభివృద్ధి చెందినా నైతిక విలువలు తగ్గనంతకాలం మనిషి మనసున్న మనిషిగానే బ్రతుకుతాడు తప్ప ఓ కాగితపు ముక్కగానో, ఓ వస్తువుగానో, ఓ జంతువుగానో ఉండలేడు ... ఏమంటావ్?" అంటూ సూటిగా చూశాడు సుబ్బారావు రాజేష్ ముఖంలోకి.

తండ్రి మాటల్లో తనకు తెలియని ఏదో భావం, కొత్త అర్థం స్ఫురించినట్లుగా అనిపించింది రాజేష్‌కి.

"సారీ, డాడీ!" అన్నాడు అప్రయత్నంగా.

బి. వెంకట్రావు, 6-3-50/2,
ప్రేమ్‌నగర్, హైద్రాబాద్ - 500 004.

డా॥ ముక్తేవి భారతి కథ

# రెండగ్గిపుల్లలు

“ఆ తలలు అలా విరిగిపోతే నీతల ఎగిరిపోతుంది. అలా చూస్తావేమిటీ ..’

’ వీపుమీద దెబ్బపడింది. కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. పిలకజడ వెనక్కేసుకుని కాళ్ళు దగ్గరగా పెట్టుకుంది బంగారి.

“అలా కూచుంటే పని ఎప్పటికవుతుందీ ... ఒక్కటి, ఒక్కటి విరిగినా చెప్తా నీపని...’

’ విసురుగా ఆ చిన్నగదిలోంచి బయటకి వచ్చేసింది రాజేశ్వరమ్మ.

"ఇదిగోనమ్మా ...." కూల్‌డ్రింక్ అందించాడు డ్రైవర్ రంగయ్య. కూల్‌డ్రింక్ చల్లగానే వుంది. కానీ ఏదో గుండెల్లో మంట రాజేశ్వరమ్మని బాధిస్తోంది ... చిట్టితల్లి మనసులో మెదలుతోంది ... ఊతగావున్న కర్రజారి చిట్టితల్లి కిందపడ్డ దృశ్యం కళ్ళలో మెదలుతోంది .. కూల్‌డ్రింక్ కిందపెట్టి రాజేశ్వరమ్మ ఆ చిన్నగదిలోకి తొంగిచూసింది ... బంగారీ గలగలా నవ్వుతోంది ... బంగారి కళ్ళు నల్లగా మిలమిలా మెరుస్తున్నాయి. అది వేసుకున్న జాకెట్టు తన కూతురిదే .. అది వేసుకున్న పరికిణీ తన కూతురిదే ... ఎంత బాగా కుదిరాయో దీనికి - ఈ బంగారితండ్రి తన దగ్గర పనిచేసినవాడే - నల్లగా మొద్దులా వుంటాడు - బంగారీ నలుపే - అయితేనేం ఎంతో కళ వుంది ముఖంలో ... పదేళ్ళు నిండలేదు గానీ పన్నెండేళ్ళ పిల్లలా బొద్దుగా వుంటుంది - చిట్టితల్లి ఇదీ ఒకఈడువాళ్ళే - అయితేనేం - చిట్టితల్లి సన్నగా ఊపిరిలేనట్లే వుంటుంది - భగవంతుడు దానికాలికి అవిటితనం కూడా ఇచ్చాడు ఎందుకో!! - రాజేశ్వరమ్మ గొంతులోకి చల్లని డ్రింకు పోవటంలేదు .. సీసా పక్కన పెట్టింది .. ఆ చిన్న గదిలో బంగారీ విరగబడి నవ్వుతోంది. ఏదో చెప్తోంది అందరికీ - రాజేశ్వరమ్మ ఒళ్ళు భగ్గుమంది.... హాండ్‌బాగ్‌లోంచి చిన్న రుమాలు తీసి ముఖం తుడుచుకుంది.

గబగబా వెళ్ళి కారులో కూచుంది రాజేశ్వరమ్మ.

ఓ రెండుపుల్లలు విరిగితే ఏమయిందో, ఓ రెండు పుల్లలు ఎక్కువ పెడితే, అదీ పొరబాటున పెడితే, పెద్ద కొంపమునిగిపోయినట్లు గోలచేస్తుందేమిటీ - ఛీ, - బంగారివంచిన తల ఎత్తకుండా గబగబా అగ్గిపుల్లలు పెట్టెలో సర్దింది ... ముఖాన పడ్తున్న జుట్టు పక్కకి తోసుకుంది. ఉష్ - గాలిలేదు ... అబ్బా - చేయి పైకెత్తింది విదిలిస్తూ ... చేయి గోడకి తగిలింది. ఎర్రమట్టి గాజులు విరిగి నేలపైన పడ్డాయి ... రాజేశ్వరమ్మ మాటలు, బొంగురుగొంతు - చెవిలో మారుమ్రోగుతున్నాయి.

"ఈ అగ్గిపుల్లల తలలు సరిగ్గా పెట్టకపోతే, ఈ పుల్లల తలలు విరిగిపోతే మా తలలు విరిగిపోతాయా - ఇవి అసలు తలలా' - బంగారికి నవ్వు ఆగలేదు. మందు దట్టించిన అగ్గిపుల్లలకేసి చూసింది. ఈ రాజేశ్వరమ్మ ఏం చేస్తుందో ... కోపంగా రెండు పుల్లలు విరిచింది.

"దయ్యం పట్టిందా ...." గదమాయించింది పక్కనున్న రాములమ్మ.

"రెండు పుల్లలు విరిగాయని నావీపుమీద అంత దెబ్బకొడితే ఏంకాదా -- ఇవే తలలయితే, నాది వీపు కాదా - చూడు ... ఎంత దెబ్బో - వెనక్కి తిరిగింది బంగారి. రాములమ్మ మాట్లాడకుండా పని చేస్తోంది.

"నిన్ను కొడితేకదా నీకు తెలుస్తుంది ... అయినా నువ్వు చెప్పు - ఈ తలలు విరిగితే, నాతల ఎగురుతుందా' - బంగారి అగ్గిపుల్లలవంకే చూస్తోంది - 'మాట్లాడకు-' రాములమ్మ ముఖాన పట్టిన చెమట తుడుచుకుంది. బంగారి మూతితిప్పి అగ్గిపుల్లలన్నీ లెక్కపెట్టి పెట్టెలో పెడుతోంది. మధ్యమధ్య జెడకికట్టిన రిబ్బను విప్పి కట్టుకుంటూ.

ఎవరి చేతి సంచులు వాళ్ళు పట్టుకు అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ బయటకొచ్చారు. పంపుదగ్గర నీళ్ళు తాగి ముఖం కడుక్కుంది బంగారి. సాయంత్రమయేసరికి తోటకూర

కాడలో వాడిపోతుంది బంగారి. అక్కడ పనిచేసే అందరిలోకి చిన్నపిల్ల అదే.

చేతిసంచీ ఊగించుకుంటూ రోడ్డున నడుస్తోంది బంగారి. పొద్దున జరిగిన విషయం మళ్ళీ మమళ్ళీ గుర్తొస్తోంది. అమ్మగారు ఇలా చిన్న చిన్న పొరబాట్లకి అందరిముందు కొట్టడం, తిట్టడం ఇది మొదటిసారికాదు, - అయినా ఎప్పుడూ తననే ఎందుకు కొడుతుందీ, ఎందుకు తిడుతుందీ - తనంటే ఇష్టంలేదు అమ్మగారికి - ఆరోజు చిట్టితల్లి సంగీతం మేష్టారు వచ్చినప్పుడు తను గుమ్మంపక్కన నిలబడి పాట వింటుంటే అమ్మగారొచ్చి పొమ్మని తోసేయటం తనకి గుర్తులేదా - అమ్మగారికి ఎందుకు తనమీద కోపం - ఏమో!! - ఈపని అయ్యదే - అయ్యకి జబ్బుచేసి రెండునెలలుగా పనికి రాకపోతే, అమ్మగారిని బతిమాలితే ఈపనిలో తనని పెట్టింది -- అయ్య జబ్బు తగ్గి ఇంకో పది రోజుల్లో పనికిలో రాడా. తను ఈపని మానేయదా - అందుకేగా అమ్మగారు తిట్టినా, కొట్టినా పడివుంటోంది తను!! - బంగారీ గబగబా నడుస్తోంది -- అమ్మగారి కుంటిపిల్లను తను ఎప్పుడయినా ఎక్కిరించిందా - పాపం, ఆ అమ్మాయి అంటే తనకి ఎంతో జాలి పాపం, - అయినా అమ్మగారు!! - బంగారికి ఒక్కసారిగా అమ్మగారి మీద కోపం వచ్చింది ... బంగారి చేతిసంచి కిందపడిపోయింది - ఆనక ఆగిన కారు హారన్ చప్పుడికి ఉలిక్కిపడింది బంగారి.

"ఏమిటా ఖంగారు ... కారెక్కు" - రంగయ్య నవ్వుతున్నాడు.

"ఏమిటీ" - బంగారి చేతిసంచి దులుపుతో అంది.

"అమ్మగారు రమ్మంది".

"నన్నా"

"ఆ ... నిన్నే" - రంగయ్య కారు తలుపు తెరిచాడు.

పొద్దుటికోపం ఇంకా పోలేదా అమ్మగారికి అనిపించి భయమేసింది బంగారికి.

"అయ్యకి చెప్పి వస్తా"

"నీయిష్టం - అదే చెప్తా అమ్మగారికి. వెళ్ళు" రంగయ్య కారు తలుపు పట్టుకునే అన్నాడు.

"తలుపు తియ్యి" - బంగారి ఖంగారుగా కారులో ఎక్కి కూచుంది.

★ ★ ★

ఆ భవనంలో అడుగుపెడుతుంటేనే కాళ్ళు వణికాయి బంగారికి. గేటు లోపలే నిలబడింది భయంగా.

'వెళ్ళు' - రంగయ్య ముందుకు నడుస్తూ అన్నాడు.

'రా ... లోపలికి' రాజేశ్వరమ్మ తమలపాకులు నములుతోంది. బంగారు గోళ్ళు కొరుకుతూ గోడలవంక అటుఇటు చూస్తూ నిలబడింది.

"పొద్దున్న పనికి వచ్చావో లేదా - అంత నిద్రా నీకు? - రెండగ్గిపుల్లలు విరిగిపోతే ఏం నష్టమంటున్నావా ... పిట్టకొంచం కూత ఘనంలాగ నీకు ఐదేళ్ళు నిండలేదు కానీ పొగరుకేం తక్కువలేదు ..?"

రాజేశ్వరమ్మ బంగారివంక చూస్తోంది ... పెద్ద కళ్ళు, నవ్వుతుంటే ఎంతో కళగా వున్న ముఖం .. చెంగుచెంగున గంతులేస్తూ, గలగలా మాట్లాడుతూ వుండేది ఇదా!!

రాజేశ్వరమ్మ నోట్లో వున్న తమలపాకులు నమిలి తుప్పున ఉమ్మింది పక్కనే వున్న పూలకుండీలో.

బంగారికి నవ్వొచ్చింది ... అప్రయత్నంగా నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుంది.

"ఏమిటా నవ్వు ... నిన్నెందుకు పిలిచానో తెలుసా .. రేపు మీ అయ్యని కలవమని చెప్పు. తెలిసిందా ..." రాజేశ్వరమ్మ ఇంకా ఏదో అనబోయింది.

"మమ్మీ ... ఒక్కసారి లోపలికి రా..." - రాజేశ్వరమ్మ గబుక్కున లోపల కెళ్ళిపోయింది.

ఆ గదిలోవున్న గోడలవంక చూస్తోంది బంగారి .. పెద్ద పెయింటింగ్ వంక కన్నార్పకుండా చూసింది ... అందమైన సోఫాలవంక, ఎంతో అందమైన కర్టెన్ల వంక చూసింది బంగారి. అబ్బ, ఎంత పెద్ద ఇల్లో - బంగారికి వెంటనే నవ్వొచ్చింది - రెండగ్గిపుల్లలు విరిగితే ఈ అమ్మగారికో లెక్కా!! అంతలోనే కర్టెన్ కదలటం కనిపించింది బంగారికి.

"మీ అయ్య ఎందుకూ ... నీకే చేప్తా ... రేపటినుంచి పనిలోకి రావద్దు - తెలిసిందా...." రాజేశ్వరమ్మ బంగారివంకే చూస్తోంది.

కాళ్ళకింద నేల కదిలినట్లే అనిపించింది ఓ క్షణం ... నౌకరీ తీసేస్తే ఎలా ... తన తండ్రి జబ్బు ఇంకా ఎప్పటికి తగ్గుతుందో ... తగ్గకపోతే!? - బాబోయ్!!

బంగారి అమ్మగారి కాళ్ళు పట్టుకుంది గట్టిగా ...

"చాల్లే ... లే ... ఈ దొంగవేషాలు నాకు నచ్చవు - నేనంటే భయంలేదు - పైగా పనంటే నిర్లక్ష్యం - ఏదో మీ. అయ్యమీది జాలితో పనిలో పెట్టుకున్నా ... నెలరోజులయేసరికి నీకు ఒళ్ళు బలిసిపోయింది - వెళ్ళు - రేపటినుంచి రాకు -" రాజేశ్వరమ్మ పక్కకుండీలో తుప్పున ఉమ్మి సోఫాలోంచి లేచింది.

బంగారి ఆ గోడనానుకుని అలానే నుంచుంది కొద్దిసేపు. రాజేశ్వరమ్మ తన వీపుమీద కొట్టిన దెబ్బను జాకెట్టు వెనక్కి పోనిచ్చి చూసుకుంది బంగారి.

రెండగ్గిపుల్లలు ఎక్కువ పెడితే నీకింత కష్టమయితే, నా నౌకరీపోతే నాకెంత కష్టం - బంగారి కళ్లు తుడుచుకుంది ... ఇంటికెడితే అయ్య తంతాడు -

బంగారి కళ్ళు ఎర్రపడ్డాయి. రాజేశ్వరమ్మ బొంగురుగొంతు చెవిలో మారుమోగుతోంది.

"రాజేశ్వరమ్మా ... ఈ రెండగ్గిపుల్లలతోనే నిన్ను అంటించేస్తా ... నీ ఫ్యాక్టరీ తగులపెట్టేస్తా ... నిన్ను, నిన్ను ..." బంగారికి కోపంతో నోట్లోనుంచి వస్తున్న మాటలు ఆ చిన్నగొంతులోనే అడ్డంపడి అణగిపోయాయి!! - రంగయ్య గుమ్మంలో నిల్చుని నవ్వుతున్నాడు.

'ఛూ' - కసిగా దగ్గరలోవున్న పూలచెట్లు ఉమ్మి, గబగబా బయటికి నడిచింది బంగారి.

★ ★ ★

రెండువారాలు గడిచాయి ... నాలుగు వారాలు గడిచాయి. బంగారికి నౌకరీ దొరకలేదు. ఎంతమరిచిపోదామనుకున్నా రాజేశ్వరమ్మ మనసులోంచి పోవటంలేదు. ఆ చిన్నగదిలో తన పక్కన పనిచేసే రాములమ్మ ఈమధ్య ఎందుకో మరీమరీ గుర్తొస్తోంది బంగారికి. సినిమాలో చూసిన ఆడపిల్ల రౌడీలను తన్నింది, కొట్టింది .. తనకీ అలాంటివి వస్తే డొక్కలో ఒక్క తన్ను తన్నేది - నోట్లో గుద్దకుక్కి గొంతునొక్కి చంపిపారేసేది ఈ

రాజేశ్వరమ్మని ... కానీ తనకేమీరావుగా - నాలుగో తరగతి చదువుతుంటే మాన్పించాడు అయ్య - అరె - తను జీతం పైసలు తెచ్చుకోవద్దా! - అయినా పుణ్ణానికొచ్చాయా పైసలు!! - బంగారి చేతిసంచీ తీసుకుని, అందులో అగ్గిపెట్టె గలగలలాడుతుంటే, గబగబా ఆ మండుటెండలో బయలుదేరింది! ముఖాన చెమట తుడుచుకుంటూ గబగబా నడిచింది. రాజేశ్వరమ్మ పనిపట్టాలనే కోపంతో ఆ పసిమనసు పరుగులు తీస్తుంటే, ఆ పెద్ద భవనంలో అడుగుపెట్టింది బంగారి.

అంతా నిశ్శబ్దంగా వుంది ... రంగయ్య ఊళ్ళో లేడు ... చిట్టితల్లి లోపల గదిలో నిద్రపోతుందేమో! ఏమో! - రాజేశ్వరమ్మ పడగ్గది దగ్గర నిలిచింది బంగారి ... నెమ్మదిగా తొంగిచూసింది ... గాఢనిద్రలో వుంది రాజేశ్వరమ్మ ... బంగారి మనసులో ఆనందం నిండిపోయింది ... క్షణంలో బంగారి ముఖమంతా చెమటలు పోసాయి ... చేతిలో సంచీ కదులుతోంది ... ఒక్క అగ్గిపుల్ల గీసింది ... పుల్ల విరిగి కిందపడిపోయింది ... ఇంకోటి - బంగారి చేతులు వణుకుతున్నాయి ... సంచి కిందపడింది అగ్గిపుల్ల.

బంగారి ఖంగారుగా గదిదాటి బయటికి పరిగెత్తింది ... ఆగకుండా పరిగెత్తింది ... పరిగెత్తింది ... కాలికి రాయి తగిలి ముందుకి పడింది ... 'హమ్మయ్య' - బంగారి కళ్లు గట్టిగా మూసుకుంది ఓ క్షణం ... పెదాలపై చిన్ననవ్వు!! - బంగారీ గబగబా నడిచింది ... ముఖానపడ్డ జుట్టు చేత్తో తీసుకుంటూ ఇంట్లో అడుగుపెట్టింది బంగారి.

'పైసలిచ్చిందా' ముసలాడు మంచంమీద నుంచే అరిచాడు.

'లేదింకా -' బంగారీ లోపలికి పరిగెత్తింది.

* * *

వారం రోజులు గడిచాయి ... ఈమధ్య చాలా చిరాగ్గా వుంటుంది బంగారికి ... నిద్రపట్టడం లేదు - ఎవరిమీదో కోపం ... ఎవరూ ఏ విషయాలూ చెప్పరేం తనతో! అయినా ఇంట్లోకూచుంటే ఎలా తెలుస్తాయి కబుర్లు - బంగారీ జడ అల్లుకుని ఎర్రరిబ్బను పెట్టుకుంది - పూసల గొలుసు మెళ్ళో వేసుకుంది ... గుమ్మంలోవున్న ఎర్ర గన్నేరుపూవు కోసం జడలో పెట్టుకుంది ... చాలా ఉత్సాహంగా నడుస్తోంది బంగారి ...

బంగ్కారి ఫ్యాక్టరీ దగ్గరలోవున్న తురాయి చెట్టుకింద నిలబడింది ... ఒక్కొక్కళ్ళూ బయటకొస్తూ కనిపిస్తున్నారు ... 'ఇంకా రాదేం' - విసుగ్గా అటే చూస్తూ నించుంది బంగారి. నిముషాలు గంటల్లా అనిపిస్తున్నాయి.

'బాగున్నావా' - భుజంపై చేయిపడేసరికి ఉలికిపడింది బంగారి.

'రాములమ్మా ... అమ్మగారు బావున్నారా' - బంగారి ముఖమంతా కళ్ళు చేసుకుని రాములమ్మవైపు చూస్తోంది.

'మీ అయ్య బాగున్నాడే' - రాములమ్మ బంగారివంక చూస్తోంది

'అబ్బ - అమ్మగారి విషయం చెప్పు!'

"మీ అయ్య నౌకరీలో పైనెలలో చేరతాడటగా'

"ఏమో - అమ్మగారు" - బంగారీ కంగారు అర్థంకావటం లేదు.

"నీకూ తెలిసిందా బంగారీ.."

'ఏమిటీ' - పెద్దగా అంది బంగారీ.

"అదే - వారం రోజులనాడు అమ్మగారికి పెద్ద ప్రమాదం-" రాములమ్మ మాట పూర్తి లేదు.

"ఏమైందీ" - బంగారీ కళ్ళనిండా ఉత్సాహం - విజయపర్వం!

"అ - అదేరోజు అమ్మగారి చీర అంటుకుని పెద్ద మంటలు వచ్చాయి ... అమ్మగారు ..." రాములమ్మ బంగారివంక చూసింది చెప్తూ.

"చచ్చిపోయిందా...." తక్కున అనేసింది బంగారీ.

"చీ - పాడుమాటలు ... పనిమనిషి పరిగెత్తుకుంటూ వచ్చి మంటలు ఆర్పేసింది ... అమ్మగారు ఆరోజు కాటన్‌చీర కట్టుకున్నారు - అదే పాలిస్టరయితే -"

"హాయిగా చచ్చిపోయి వుండేది కదూ" - బంగారి గొంతునిండా ఓ క్షణం ఉత్సాహం!! రాములమ్మ విస్తుపోయి చూసింది బంగారివకం.

కానీ వెంటనే అర్థమయింది బంగారికి అమ్మగారు చచ్చిపోలేదని!! ...

రాములమ్మ ఏదో చెప్తోంది.

అయ్యగారు సిగరెట్లు కాలుస్తారట - సిగరెట్టు పీక గాలికి రగిలిందిట - అమ్మగారి చీరకొంగు నేలకి తాకుతుంటే అంటుకుందిట - "బంగారీ పెద్దాళ్ళ విషయాలు మనకి తెలియవే - అమ్మగార్ని ఆ దేవుడే కాపాడాడు -" రాములమ్మ మాటలు ఒక్కటికూడా వినపడటం లేదు బంగారికి.

బస్సు రావటంతో రాములమ్మ గబగబా బస్సెక్కింది. బంగారి కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరింది ... సందుచివర చెత్తకుండీ దగ్గర ఆగింది బంగారి .. సంచిలో అగ్గిపెట్టె గలగల లాడింది ... రెండగ్గిపుల్లలు తీసుకొచ్చి కసిగా అందులో విసిరింది ... భగ్గున మంట పైకి లేచింది ... బంగారి భయంగా పరిగెత్తి వచ్చేసింది ఇంటికి. "మరోసారి మండవా అగ్గిపుల్లలు" గట్టిగా పైకి అనేసింది చిన్న బంగారి.

"అమ్మగారు జీతం పైసలిచ్చిందా" - ముసలాడు మంచంలో వుండి బంగారివైపు చూసాడు.

"అమ్మగారు ఛస్తే కానీ పైసలు రావు" - బంగారీ అరిచింది ...

"తప్పమ్మా ... అమ్మగార్ని అలా అనకూడదు" - ముసలాడి మాటలు వినిపించలేదు బంగారికి.

సంచిలో అగ్గిపెట్టె గలగల లాడుతుంటే బంగారి ఆ సంచిని భద్రంగా కొయ్యపెట్టెలో దాచిపెట్టింది రహస్యంగా!!

డా॥ ముక్తేవి భారతి, 6-1-107/22,
పద్మారావు నగర్, సికింద్రాబాద్ - 25. ఫోన్ : 7616487

డా॥ వి.ఆర్. రాసాని కథ

# మొండోడు

అది వేసవికాలం!

ఉదయం తొమ్మిది గంటలు కావస్తోంది. అప్పటికీ సూర్యుడు లోకంపైన పగబట్టి, చంద్రనిప్పులు కురిపించడానికి సిద్ధమవుతున్నట్లు ఎండ తీవ్రత రానురాను ఎక్కువ కాసాగింది.

ఉత్తర దక్షిణంగా వ్యాపించివున్న ఆ పల్లె వీధిచివర, దక్షిణం వైపున ఓ పెద్ద రచ్చబండ, దానిమధ్యలో చల్లని నీడను కల్పిస్తూ ఓ పెద్ద రావిచెట్టు ...

ఆ రచ్చబండ మధ్యన వంటరిగా నిలబడి వున్న నోరూ వాయీలేని ఆ రావిచెట్టే, సుమారు మూడుతరాల నుంచీ ఆ గ్రామంలో జరిగిన అనేక విషయాలకు ప్రత్యక్ష సాక్షి.

ఆవేళ రచ్చబడం మీద, రావిచెట్టు నీడలో కొందరు ఏదో లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ కూర్చొని వున్నారు.

అక్కడే కొందరు చిన్నపిల్లలు కేరింతలు కొడుతూ, గంతులేస్తూ ఆడుకుంటున్నారు.

ఆ రచ్చబండ కవతల కొన్ని వరిగడ్డి వాములు, శనగతండు వాములు, సద్ద చొప్ప వాములు వేయబడివున్నాయి. వాటికవతల వానచినుకులేక ఎండిపోయిన పొలాలు ఎర్రటి దుమ్ముతో ఎడారిని గుర్తుకు తెస్తున్నాయి.

అక్కడ ... ఒక చెనిగతండు వామిలో తలదూర్చి, ఓ బుడుగు దూడ తన్మయత్వంతో 'తండు' మేస్తోంది.

అంతవరకూ ఇళ్ళవద్దనే వు గొడ్లను మేపుకురావడానికి వీధిగుండా వాటిని తోలుకొని రైతులు ఒక్కొక్కరే వెళుతున్నారు. కరువువల్ల సరయిన మేతలేక ఆ పశువులు బక్కచిక్కి, చర్మం కప్పుకున్న ఎముకల గూళ్ళలా కనిపిస్తున్నాయి.

ఆకాశం నుంచి హఠాత్తుగా ఊడిపడినట్టు, సరిగ్గా ఆ సమయంలోనే 'మొండోడు' ఊర్లోకి అడుగుపెట్టాడు.

పెరిగిన గడ్డం, సగం నెరిసిన జుట్టు, అదేవిధంగా కనిపిస్తున్న తెలుపు, నలుపు మీసాలు బాగా పెరిగి గుబురుగా కనిపిస్తున్నాయి. ముడతలు పడి బిగువు సడలిపోయివున్న చర్మం, పుర్రెలోకి లాక్కుపోయిన గుంటకళ్ళు, చప్పిదవడలు, అతని ముసలితనాన్ని పట్టిస్తున్నాయి.

తాయెత్తు వేలాడుతున్న ఒక నల్లదారం మెడలో కట్టుకున్నాడు. ఎడమచేతి మణికట్టుకు ఒక ఇనుప కంకణం, అదే చేతి రెట్టకు ఒక రాగి కడియం అలంకరించుకున్నాడు.

బాగా మురికిపట్టి, అక్కడక్కడే చిరిగిపోయి కనిపిస్తున్న ఓ పాత తుండుగుడ్డను తలకూ, అదే స్థితిలో వున్న ఓ పాత పంచెగుడ్డను మొలకూ చుట్టుకొని, ఈ దేశపు దారిద్ర్యానికి

ప్రతీకలా వున్నాడు మొండోడు.

ఆతని మొలకున్న అడ్డపంచె మోకాళ్ళ పైభాగానికి సరిపోయి వుంది. అదయినా జారిపోకుండా ఉండడానికన్నట్లు, రెండంగుళాల వెడల్పున్న ఓ పాతకాలం నాటి తోలు బెల్టును నడుముకు బిగించి కట్టుకున్నాడు.

ఒక దళసరి గుడ్డతో, జోలె ఆకారంలో కుట్టిన ఓ పాతసంచీ ఆతని సంకలో వ్రేలాడుతోంది.

అందులో .... ఏవో రెండు పాత్రలు, రెండు పాతబట్టలు వున్నాయి. ఇంకా చిన్న చిన్న బెలూన్‌లు వున్న ఓ అట్టపెట్ట, ఓ రేకుడబ్బా ...

ఆతను, వెంట్రుకలతో పేనిన పొడుగాటి నల్లదారం మెడకు చుట్టుకొని, పామును చుట్టుకొని, ప్రత్యక్షమైన పరమశివుడిలా కనిపిస్తున్నాడు.

అయినా మనిషి చాలా నీరసంగా కనిపిస్తున్నాడు!

అతని కుడిచేతి మణికట్టు ప్రాంతంలో, వదులుగా వున్న ఇనుప కడియాలు మూడు వ్రేలాడుతున్నాయి.

అదే చేతిలో, సగంవరకు విరిగిపోయివున్న ఓ పాత మచ్చుకత్తిముక్క కొసను పట్టుకొని, ఆ కడియాల్ని 'టక్కు టక్కు'మని లయబద్ధంగా కొడుతూ వెళ్ళి రచ్చబండపైన ఓ ప్రక్కన కూర్చున్నాడు.

అంతవరకూ రచ్చబండపైనున్న వాళ్ళు ఆతని రాకతో, ఆతనికేసి వింతగా చూస్తున్నారు.

అలా టక్కుటక్కు శబ్దం చేస్తూనే మరోచేత్తో, సంచీలోనుంచీ ఒక బెలూన్ తీసి, నోటితో ఊదిపట్టుకొని "రండి బాబూ! రండీ!" అంటూ అరవసాగాడు.

ఆతని చేతిలోని బెలూన్‌ను చూడగానే చిన్నపిల్లలంతా చుట్టూ మూగారు.

"యెంటికలు తేపాండి నాయనా! ఊపిరి బుడ్డలిస్తా! లేదా పది పైసలిచ్చి వాగ బుడ్డ (బెలూన్) తీసుకోండి!"

అని పెద్దగొంతుతో అరుస్తూ పిల్లల్ని అడగసాగాడు మొండోడు. ఆ కేకలు విని అక్కడికి చేరిన పిల్లలు, వచ్చినవారు వచ్చినట్లే వెంట్రుకలు తేవడానికి తిరిగి తమ తమ ఇళ్ళకు పరుగెత్తుతున్నారు.

అలా చూరుల్లోవున్న వెంట్రుకల్ని తెచ్చి మొండోనికిచ్చి పిల్లలు బెలూన్‌లు తెచ్చుకొని ఊదుకుంటున్నారు.

ఊపిరినిండిన వాటిని తమ అరచేతుల్తో రుద్దుతూ 'బుఁర్ బుఁర్' మని శబ్దం చేసుకుంటూ, ఎగురుతూ కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నారు.

ఇండ్లముందర, అరుగులపైన కూర్చొని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్న యువకులు వాళ్ళను చూస్తూ ఆనందిస్తున్నారు.

అక్కడ వీధిలో తిరుగుతున్న రైతులను "అయ్యా! నల్లదారం కొనుక్కోండి! మూర పావలా! అగ్గవసామే! కొల్లగ్గవ. కొనండి. మీ కోడెలకు, దూడలకు చుట్టుకొని సింగారించుకోండి సామే! మీరు పూరేళ్ళుపట్టే బోన్లకు చుట్టుకోండి" అంటూ వేడుకుంటున్నాడు మొండోడు.

"ఏమయ్యా! మొండాయనా! శానారోజులకు కనిపిస్తివే!" పగ్గాల్ని చేతబట్టుకొని

ఎద్దుల్ని తోలుకు వెళుతున్న ఓ ముసలాయన అడిగాడు.

"యేందో సామే! ఈపక్కగూడా కరువొచ్చేశా! తిండి దొరికేదే కష్టమైపాయ. అందుకని ఉత్తరాది పోయింటి."

"యెక్కడికి బొయినా అట్టేవుందిలే రైతుల సంగతి. వానలు పడలా, పంటలు పండలా ... ఇక్కడే తిండికి కష్టమైపోతావుందిలే!"

అని ముందుకు వెళ్ళిపోయాడు ఆ ముసలాయన.

"ఏమయ్యాయ్యోవ్? ఇంతకాలానికొస్తివి?"

మరోవ్యక్తి అదేవిధంగా పలుకరించాడు.

"యేం జేసేది సామే. కడుపాత్తరం పోయింటి".

అతనికీ అదే సమాధానం చెప్పాడు మొండోడు. అలా వచ్చీపోయే వాళ్ళతో మాట్లాడుతూనే, ఒకవైపు బెలూన్‌ల నిచ్చి, నల్లదారాని కవసరమైన వెంట్రుకల్ని సేకరిస్తూ, మరోవైపు పేనిన నల్లదారం రైతులకు అమ్ముకుంటూ చాలాసేపు అక్కడే వున్నాడతను.

అలా చూస్తూండగానే సూర్యుడు నడినెత్తి కొచ్చాడు. పనిచేసి అలసిపోయిన రైతులు ఎండకు తట్టుకోలేక చల్లదనం కోసం ఆరాటపడుతున్నారు.

ఇక మూడురోజులున్న శ్రీరామనవమి నాటికి వేయబోయే వీధినాటకం కోసం, పక్కనే ఒక యింట్లో కూర్చొని కొందరు ప్రాక్టీసు చేసుకుంటున్నారు.

"పరాబ్రహ్మ! పరాబ్రహ్మ! పరమేశ్వర ..." అని ఒక కళాకారుడు గొంతెత్తి పాడుతున్న దరువు శ్రావ్యంగా వినిపిస్తోంది.

ఆ సమయంలోనే అన్నం అడుక్కోవడానికి ఉపక్రమించాడు మొండోడు.

గత రెండు సంవత్సరాలుగా ఆ ప్రాంతంలో వానచినుకే లేకపోవడంతో, మొండోడికీ బతుకుతెరువు కష్టమైపోయింది. అందుకే ఉత్తరదేశం వలస వెళ్ళాడు. అక్కడా అదే స్థితి. కాబట్టి మొండోడు తిరిగి తన ప్రాంతానికి రాకతప్పలేదు.

ఒక్కోరోజు ఒక్కో ఊరు చొప్పున తిరుగుతూ అన్నం అడుక్కుంటున్నాడు. అయినా రెండురోజులుగా ఆతనికి కడుపునిండా అన్నం దొరకడం కష్టమైపోయింది.

ఆరోజు ఆ పల్లెకొచ్చాడు!

మొట్టమొదట ఒక యింటిముందు గొంతుక్కూర్చొని టక్కుటక్కు శబ్దం చేస్తూ "తల్లీ! అంత బువ్వ, కాసింత శారూ వుంటే యెయ్యి తల్లీ!" అంటూ తను మామూలుగా పాడే పాటనే పాడసాగాడు.

"వానలు కురవంగ - వంకలు దొల్లంగ
సెరువులు నిండంగ - పంటలు పండంగ
గెరిసెలు నిండంగా - గాదెలు నిండంగా ... తల్లీ!"

మధ్యమధ్యలో 'తుర్ర్రో' మని శబ్దం చేస్తూ అరిచాడు.

"య్యోవ్! తినేసినాం పోయిరా!"

లోపల్నుంచే సమాధానం ఇచ్చింది ఆ యింటి యిల్లాలు ముత్యాలు. అయినా మొండోడు కదల్లేదు.

"పొట్టనిండా బువ్వదిని రెండు దినాలయింది దరమతల్లీ! ఓ పిడస అన్నమేసి, అం-

శారుంటే పొయ్యి తల్లీ!'' అని

"వంకలు దొల్లంగ, సెరువులు నిండంగ ....'' అంటూ టక్కు టక్కు శబ్దం చేస్తూనే గొణుక్కోసాగాడు.

"అన్నం లేకపోతే పాయ ... అన్ని కూటినీళ్ళుంటే పొయ్యితల్లీ. మొండోడు వట్టిసేతుల్తో పోగూడదు ధరమతల్లీ!'' అని "పంటలు పండంగ - గరిసెలు నిండంగ ... గాదెలు నిండంగా'' ... అంటూ లయబద్ధంగా పాడసాగాడు.

మొండోడి పట్టుదల తెలిసి వుండడంతో ఇక లాభంలేదనుకొని ముత్యాలు చట్టిగోకుడు నీళ్ళు ఒకగ్లాసు తెచ్చింది. ఆమె చేతులవైపే చూస్తూన్నాడతను. ఆమె నిండు గర్భిణీ. ఆమె తెచ్చిన చద్దినీళ్ళను జోలెలోనున్న డబ్బాతీసి అందులో పోయించుకొని తాగాడు.

రెండురోజులుగా సరైన తిండిలేని ఆతనికి అదే పరమాన్నంగా అనిపించింది. కడుపు కాస్తా చల్లబడింది.

"అమ్మా తల్లీ ... వళ్ళు కప్పుకునేకి ఏదయినా మీరు కట్టేసి పారేసిన పాత వస్తరం ... ధరమ్మ చేయి తల్లి!'' ఎంతో వినయంగా చేతులు జోడించి అడిగాడు.

లోపలికి వెళ్ళి ఒక పాతపంచెగుడ్డ తెచ్చి యిచ్చింది ముత్యాలు.

"నీకు పండంటి మగబిడ్డ పుడతాడు. వంశోద్ధారకుడు పో తల్లీ!'' అని తన రెండు చేతులు ముందుకు చాచి దాన్ని చేతుల్లోకి తీసుకొని, కళ్ళకద్దుకొని, సంకలోవున్న జోలెలోకి దోపుకున్నాడు.

ఆ తర్వాత మరో ఇల్లు ... మరో ఇల్లు.

ఇలా ఇల్లిల్లు తిరిగాడు. కానీ ఆరోజు, ఎవరో వట్టు పెట్టుకున్నట్లు ఏ ఇంట్లోనూ ఆతనికింత అన్నంగానీ, చివరికి చద్దినీళ్ళు గానీ దొరకలేదు.

ముత్యాలు పోసిన చద్దినీళ్ళ ప్రభావంతో కొద్ది నిముషాలు ఊరుకున్నా ఆతని ఉదరకుహరంలో పేగుల గోడల్ని గీరుతున్న ఆకలి మృగం మాత్రం ఇంకా బాధించసాగింది.

ఆవేళ ఆకలి ఆతనితో యుద్ధమే ప్రకటించినట్టుంది. అందుకే నీరసం, నిస్త్రాణ ఆతన్ని ఆవహించసాగాయి.

వెంటనే నడివీధిలోవున్న బోరింగు దగ్గరకు వెళ్ళి కొన్నినీళ్ళు తాగి పొట్ట నింపుకున్నాడు.

దాంతో కడుపులో కాస్తా చల్లబడింది.

"పిడసన్నం కూడా దొరకలా ... రేతిరికయాని దొరుకుతుందో లేదో ...'' అనుకుంటూ వెళ్ళి రావిచెట్టు నీడలో, ఆ రచ్చబండపైనే ఒకచోట పడుకున్నాడు.

నీరసంతో ... అలా మగతగా కళ్ళు మూసుకున్నాడు.

ఇంతలో ఆఊర్లో మరో సంఘటన జరిగిపోయింది.

నిండు గర్భిణీ అయిన ముత్యాలుకు కాన్పు నొప్పులు ప్రారంభమయ్యాయి. తొలికాన్పు కావడంతో కష్టమైపోయింది.

మంత్రసాని గెల్లపల్లోళ్ళ యల్లమ్మ ఎంత ప్రయత్నించినా లాభంలేక పోయింది.

"అయ్యా! ఇంక నావళ్ళాకాదు. బిడ్డ అడ్డం తిరిగిపోయింది. బండి కట్టించండి. జాగు జేస్తే ... పెద్ద పేణానికే ముప్పు!'' అనేసింది ఎల్లమ్మ.

ఇక వాళ్ళకు బండి కట్టక తప్పలేదు.

ఆమెను బతికించుకోవడానికి ఊరు ఊరంతా ప్రయత్నం చేయసాగారు.

కొందరు యువకులు ఎడ్లబండిని వీధిలోకి లాక్కొచ్చారు. అంతలోపల మరొకరు ఎద్దుల్ని పట్టుకొచ్చి, కాడి పూన్చి, కాడిమాను వాటి అర్రులపైన పెట్టి పలుపులు బిగించారు.

ఇంతలో అక్కడ చేరిన ఆడవాళ్ళు ... బండిలో ఒక కట్ట వరిగడ్డి పరచి, దానిపైన ముత్యాలును పడుకోబెట్టారు.

"అమ్మా! నేను తట్టుకోలేను స్వామీ ..." అంటూ బండిలో మెలికలు తిరిగిపోసాగింది ముత్యాలు.

"ఓర్చుకో బిడ్డా! నీకేం భయంలేదు ... ఓర్చుకోమ్మా!" అంటూ ఆడవాళ్ళు ధైర్యం చెబుతున్నారు.

"ఒరేబ్బా! యట్టా పీలేరాసుపత్రికి బండి కట్నావు. బండిని రాళ్ళదారిగుండా తోలుకొనిపో ... ఆ కుదుపులకు కాన్పు అయిపోవచ్చు"

ఓ ముసలాయన సలహా యిచ్చాడు.

క్షణాల్లో ... అక్కడికి మూడుమైళ్ళ దూరంలో వుండే పీలేరుకు బండి బయలుదేరింది.

బండిరాళ్ళ దారిలో పరిగెడుతోంది. ఆ కుదుపులకు ముత్యాలు 'అమ్మో' అని కేకలేస్తోంది. అయినా ఎవ్వరూ వినిపించుకోలేదు. గుట్టలెంబడి, పుట్టలెంబడి బండి వేగంగా పరుగెడుతోంది. ఆ కుదుపులకు కాన్పు అయిపోతుందనే వాళ్ళ నమ్మకం. అయినా ఫలితం లేకపోయింది. ఆ కుదుపులతోనో, లేక కాన్పు కష్టమైపోవడంతోనే ఏమోగానీ, చివరికి ముత్యాలు సగందారిలోనే చివరి శ్వాస వదిలేసింది.

ఇంకేముంది? అదే బండిలో ఆమె శవాన్ని తిరిగి పల్లెకు తీసుకు వచ్చేశారు.

ఊర్లో పెద్ద తలకాయలనుకున్న వాళ్ళు శవాన్ని అలాగే పూడ్చకూడదని పేచీ పెట్టారు. మొండోన్ని రప్పించి తల్లిని, బిడ్డను వేరు చేయించి దహనం చేయండని మొండికేశారు. అలాగే పూడ్చేస్తే ఊరికి అరిష్టం అనీ గ్రామం గ్రామమే దూము (ప్లేగు) తగిలి ఊడ్చుకుపోతుందనీ అన్నారు.

ఇక చేసేదిలేక ఆమె తాలూకు మనుషులు మొండోనికోసం పుదిపట్ల బైలుకు మనిషిని పంపాలనుకున్నారు.

"పుదిపట్ల బైల్లో ప్రస్తుతం లేరయ్యా ... కరువుకు ఎక్కడో పోయినారంట" అని ఓ వ్యక్తి చెప్పాడు.

"అరరే ... ఇందాక మొండోడు మన ఊర్లోనే తిరగతావున్నాడు చూడండి" అన్నాడు యింకో వ్యక్తి.

దాంతో మొండోని కోసం వెదుకులాగ ప్రారంభమైంది.

★ ★ ★

అంతవరకూ ఆ రచ్చబండపైనే నిద్రపోతున్న మొండోనికిదేమీ తెలీదు

"య్యోవ్! ఏమ్యాయోవ్! లే.లే!" అని ఎవరో నిద్ర లేపేంతవరకు మొండోడు ఈలోకంలోనే లేడు.

"ఏం సామే ...?"

దిగ్గున మేలుకొని ప్రశ్నించాడు.

ముత్యాలు చావుగురించి చెప్పి, తల్లినీ బిడ్డను వేరుచేసే పనిని నిర్వహించమని వాళ్ళు మొండోన్ని అడిగారు.

ఇన్నిరోజులకు ఒక బేరం తగిలినందుకు లోపల్నే సంతోషించాడు మొండోడు.

శవాన్ని కోయడమంటే సామాన్య విషయం కాదు. మనిషికి ముందు గుండె ధైర్యం కావాలి. అంతకుమించి ఆ సమయంలో వచ్చే దుర్వాసనను తట్టుకోగల నిబ్బరం వుండాలి. అవన్నీ వుండాలంగే కడుపునిండా ఒండేమో కానీ ముందుగా మందుమాత్రం పడాలి అనుకున్నాడు. అందుకే అడిగాడు మొండోడు.

"నాకు ఒక సీసానిండా సారాయి కావాల సామే లేకుంటే నేనాపని చెయ్యలేను.'
'

"దాందేముందిలేవయ్యా! ఎట్లో వొగట్ల ఏర్పాటు చేస్తాంలే ... అంతకు మించి నీ ఋణం కూడా వుంచుకోంలే ..." అన్నారు వాళ్ళు.

సరేనన్నాడు మొండోడు.

★ ★ ★

ఆరోజు సాయంత్రం ... ముత్యాలు శవాన్ని, శవాలు పూడ్చే 'లచ్చన్న బావిగడ్డ'కు చేర్చారు.

అది ఆ ఊరికి దక్షిణాన వున్న పాడుబడిన ఓ పాతబావి గట్టు. అక్కడ ఏవేవో తుప్పచెట్లు, కానగచెట్లు, సీమరాల చెట్లు వున్నాయి.

ఆ ఊర్లో చచ్చిన వారిని సహజంగా అక్కడే పూడ్చుతుంటారు. అక్కడ అప్పటికే ఆమెకోసం ఆరడుగుల గుంత తవ్వారు.

ఊర్లోవాళ్ళు, ముత్యాలు బంధువులు అందరూ అక్కడికి చేరిపోయి విలపిస్తున్నారు. ఆమె భర్త ఘోష్ట చెప్పనలవి కాకుండా వుంది.

పాడెపై నుంచీ ముత్యాలు శవాన్ని ఉత్తర దక్షిణంగా గుంత పక్కన పడుకోబెట్టారు.

మొండోడు అప్పటికే పీకల్దాకా తాగేసి వున్నాడు. కడుపులో మందుపడేసరికి, అతన్ని అంతవరకూ వేధిస్తున్న ఆకలి బాధ కాస్తా తగ్గినట్లనిపించింది.

ఓ ముగ్గురు వ్యక్తులు తప్ప అందరూ దూరంగావెళ్ళి, కానగ చెట్ల నీడల్లో కూర్చొని ఆ తంతును చూడసాగారు.

గుంతపక్కన గట్టుమీద పిండాన్నం తెచ్చిన కొత్త చట్టి, ఓ చురకత్తి, ఓ నీటికుండ, ఏవో రెండు పాతచీరలు వున్నాయి.

ముందుగా మొండోడు తన మొలకున్న గోచీని బిగించి మొలలోతున్న గుంతలోకి దిగాడు.

ఆతనితోబాటు మరోవ్యక్తి గుంతలోకి దిగాడు.

"పీనిగిని అందివ్వండి సామీ!" అన్నాడు మొండోడు. పైనున్న వ్యక్తులిద్దరు శవాన్ని మెల్లగా ... పాడెపైనుంచీ ఎత్తి వాళ్ళ కందించారు.

మొండోడు, ఆతనితోబాగు గుంతలోవున్న వ్యక్తి ఆ శవాన్ని అందుకొని దక్షిణంవైపు తల, ఉత్తరంవైపు కాళ్ళు వుండేవిధంగా ... పడుకోబెట్టారు.

ఆ గుంతలో శవం మట్టసరిగా కుదురుకున్నాక "ఇంక నువ్వు పైకిపో సామే" అని

గుంతలో నిలబడివున్న వ్యక్తిని గట్టుపైకి పంపించేశాడు మొండోడు.

అంత శోక సన్నివేశంలోను చెట్లకిందవున్న జనాలు ఆ తంతును ఆసక్తిగాను, వింతగాను చూస్తున్నారు.

"సురకత్తిచ్చి, గుంత చుట్టు తెరపట్టండి సామే" అన్నాడు మొండోడు.

దాంతో ... గట్టునున్న చురకత్తిని ఆతని కందించి, గట్టుపైనున్న ముగ్గురూ అక్కడేవున్న పాతచీరల్ని తీసి గుంతచుట్టూ తెరలా పట్టారు.

అలా తెరపట్టి ఇతరులెవరూ ఆ తంతును చూడడానికి వీలుపడనట్టుగా జాగ్రత్త పడ్డారు.

కత్తి చేతబట్టుకునివున్న మొండోడు ఆ సమయంలో, యమలోకంలో పాపుల్ని హింసిచే యమకింకరుడిలా వున్నాడు.

ప్రేక్షకులకు, శవానికి మధ్య తెర అడ్డుగా వుంది!

మొండోడు గోచీని మరోసారి సర్దుకొని, తూర్పువైపు తిరిగి దండం పెట్టుకొని, వంగి ముత్యాలు శవాన్ని రెండుసార్లు కళ్ళకద్దుకొని "ఇందులో నా తప్పు ఏమీలేదు తల్లీ ... నా వృత్తి నేను చేస్తావుండా. మన్నించు మహాతల్లీ!" అని గొణుక్కుటూ, తన పనిలో తాను మునిగిపోయాడు.

మొదట శవంపైనున్న తెల్లగుడ్డను కోసి, తొలగించాడు. ఆ తర్వాత శవం కడుపును కోయసాగాడు.

అందరి హృదయాలు బరువుగా, దుఃఖాన్ని దిగమింగుతున్నాయి. అందరిలోను ఆవేళ శ్మశాన వైరాగ్యం చోటుచేసుకుంది.

"పీనిగిని, రెండూ రెండుగా కోస్తావుంటాడా?"

"అదేగదబ్బా చేస్తావుండాడు!"

"ఇబ్బుడు మొండోడు ఆపరేసన్ చేసే డాక్టరు మాదిరిగా ఉండాడబ్బా!"

"అంతేగదా! ఆసుపత్రిలో వోళ్ళు, మడుసుల్ని, గొర్రెను కోసినట్టు గదా కోసేస్తారు, లెక్కలేకుండా!"

"అది వోళ్ళ వృత్తి!"

"అంతేలే ... ఇది ఈళ్ళ వృర్తీ!"

ఇలా తలోరకంగా మాట్లాడుకుంటున్నారు చెట్లకింద జనం.

అలా ప్రారంభమైన వారి సంభాషణ మరోరకంగా మారింది.

"ఏమి జల్మమో, ఏం బిడ్డలో పాపలో, సచ్చిని మడిసిని ఇట్టా కండకండలుగా కోయకపోతే ఏమీ?"

"నిండుమనిషి గదా! అట్టాగే పూడ్చేస్తే ... యింగేమన్నా వుందా?"

"తల్లి సచ్చినా ఒగోసారి బిడ్డ బతికుండచ్చు గదా!"

"అవునబ్బా! పెద్దోళ్ళు యేదిజేసినా యోచ్చనలేకుండా జేయాలా"

"ఆc. అందుకే ఇట్ట పెట్నారు ఆశారం"

"ఏమోబ్బా! అంతా యిశిత్రంగా వుండేది!"

అక్కడ పెద్ద చర్చ సాగింది అందులో . గతంలో ఎప్పుడో గర్భిణీ స్త్రీని

పూడ్చకపోవడం వల్ల అనుభవించిన కష్టాలు కొందరు తాము అనుభవించినట్లే చెప్పుకున్నారు.

ఇంతలో ఆ ప్రాంతమంతా వున్నట్టుండి దుర్గంధం ... ఒక్కసారిగా ముక్కుపుటాల్ని బ్రద్దలు చేస్తూ వ్యాపించింది.

అది శవం కడుపునుంచీ వస్తున్న వాసన. భరింపరాని వాసన!

ఆ వాసనకు తెర పట్టుకున్నవాళ్ళకు డోకొచ్చినట్టయింది! మొండోడు మాత్రం తాగిన మైకంలో అదేదీ గమనించడం లేదు.

ఎట్టకేలకు ... శవం గర్భం నుంచీ ... మరణించిన శిశువును బయటకు తీశాడు మొండోడు.

తెర తొలగించబడింది!

"సూడండి బాబు ... అమ్మ కడుపులో ఆరంభమయ్యే నరజల్మ! బాగా సూడండి సామీ ... రెండూ రెండుగా చేసినా సూడండీ!"

శిశువు రెండు కాళ్ళు పట్టుకొని ఊపుతూ చూపించాడు మొండోడు.

ఆ శిశువు కళేబరం నుంచీ, గర్భకుహరంలో అంటుకొని వున్న ఉమ్మనీరు, చుక్కలు చుక్కలుగా కారుతూ, అసహ్యంగా కనిపిస్తోంది.

"సామే! నా సంచిలో ఒక పాత లుంగీ ఉంటుంది ఇయ్యండి సామీ!" అన్నాడు మొండోడు.

గట్టునున్న ఒకవ్యక్తి అతని జోలెలో పైనేవున్న లుంగీ గుడ్డ తీసి మొండోనికి అందేటట్లుగా గట్టుపైన పెట్టాడు.

"ఆఁ ... ఇంక రమ్మనండి సామీ అందర్నీ!" అని శిశువుని ఆ సంతలోనే తల్లి పాదాల చెంత వేసేశాడు మొండోడు.

ఆ తర్వాత గట్టుపైనున్న లుంగీని చేతిలోకి తీసుకొని "తల్లీ! ఇది నువ్విచ్చిన వస్తరపు గుడ్డేయమ్మా! నీ వళ్ళు పైనుండే కొత్తగుడ్డ తీసేసి పొట్టే కొసేసినా అమ్మా ... దానికి బదులుగా ఈ పాతగుడ్డ నీకు కప్పుతా వుండా తల్లీ ... నీకు తిరిగి ఇంతకంటే ఏమీ ఇచ్చుకోలేను తల్లీ ... దీన్ని నాకు దానంచేసి పుణ్యం కట్టుకొన్నావు. నువ్విచ్చిన ఈ గుడ్డే నువ్వు కప్పుకోని పున్నెలోకాలకు పోయమ్మా బంగారాతల్లీ!" అంటూ లుంగీని ముత్యాలు శవంపైన కప్పాడు.

మొండోడు ఎన్నో కష్టాలు, అవమానాలు భరించాడు. కానీ ఎప్పుడూ ఏడవలేదు. ఇలాంటివి గతంలో కూడా రెండు మూడుసార్లు చేశాడు. ఆ సమయంలో తాను చేస్తున్నది వృత్తిధర్మమే అనుకున్నాడు. కానీ ఏనాడు అతని కళ్ళు చెమర్చలేదు. అలాంటి మొండోడికి ఆవేళ అప్రయత్నంగానే కళ్ళు చెమర్చాయి.

"తలాంత మన్నెయ్యండి సామి. కడసారి యాత్ర. మనం బోయినప్పుడు మన్నేసే వాళ్ళుంటారో ఉండరో ... తలా పిడికెడు వాతమన్నేసి. పూడ్చేసి పున్నెం కట్టుకోని ఋణం తీర్చుకోండి సామీ" అంటూ గట్టు పైకొచ్చేశాడు మొండోడు.

అతను అలా పైకి రాగానే .. అందరూ అన్ని వాతబియ్యం చల్లి, దోసెళ్ళతో మట్టి వేయసాగారు.

క్షణాల్లో శవం మట్టిలో పూడుకుపోయింది.

అలా పూర్తిగా శవాన్ని మట్టితో పూడ్చేసిం తర్వాత ... ఉన్నట్టుండి మొండోడు వెళ్ళి, ఆ గుంతపైన కూర్చున్నాడు.

"ఏమ్మొండోడా ... గుంతపైన కూర్చుంటివీ?"

ఒకతను ప్రశ్నించాడు.

"నేను మొండోన్ని గద సామీ! నేనింత పనిజేసినా గదా! నాకు ఓ పంచెగుడ్లో లేదా వొగ చొక్కాగుడ్డో యియ్యల్ల. లేకుంటే నేను లెయ్యను" నిక్కచ్చిగా చెప్పాడు మొండోడు.

"వొరే మొండోడా. అడిగేదానిక్కూడా వొగ యిదం వుండాలరా. యింకా రెండ్రూపాయలెగస్ట్రాగా యిస్తారుగానీ లెయ్యి. అందరూ గుంతకు దండం పెట్టుకోని, నీళ్ళొదలాల!"

అన్నాడు ముత్యాలు బంధువైన ఒక వ్యక్తి.

"రెండ్రూపాయలంతా ఎంత సామే. వొగపూట సారాయిక్కూడా సాల్దు. నేనేమి కొత్తవడగలేదు. పొద్దన ఈయమ్మే ఓ పాత పంచ యిచ్చా. ఆ వస్త్రపు గుడ్డా యిబ్బుడు ఆ తల్లికే కప్పేసినా ... మీరు కట్టిపారేసిందివ్వమంటాండా అంతే!"

అని మొండికేసుకున్నాడు.

"సామే ... మిమ్మల్నే నమ్ముకొని బదికేటోళ్ళం. మీరియ్యాల యేం తినాల. కట్టుకోవాల. ఏదో మాకడుపాత్రం. దినొమ్ము అడగలా గదా! మీ బిడ్డెకు, మీకూ కీడు లేకుండా జేసినా. సల్లని తల్లి. నేరుగా సొర్గానికి పోతాది. పున్నాత్ముురాలు. మొండోని మాట తప్పదు సామే?" తలగుడ్డ విదిలించి భుజాన వేసుకుంటూ తిరిగి అన్నాడు.

"వొరే సామీ ... మొండోని కష్టం ఉంచుకోవద్దండి. అది ఋణం. ఏదో వొగటి యిచ్చి పంపించండి."

ఆ గుంపులోనుంచీ ఓ పెద్దాయన అన్నాడు.

"అంతే సామే. లేకుంటే ... ఈ గుంతపైనే ... నన్ను పూడిసేసిపోండి. అయమ్మతోపాటు నేను దేవలోకమెళ్ళిపోతా!"

నిష్ఠూరంగా అన్నాడు మొండోడు.

ఇక చేసేదిలేక సరేనాన్నరు ముత్యాలు తాలూకు మనుషులు.

★ ★ ★

అలా ముత్యాలు మట్టిలో కప్పేసి ఇంటికి తిరిగివచ్చిన అందరితోబాటు మొండోడు తిరిగి పల్లెకొచ్చాడు.

ముత్యాలు చావుతో ఆరోజు ఆ పల్లెలో ఆ సాయంత్రం చాలామంది అన్నం వండుకోనేలేదు.

మొండోనికి అప్పటికి సారామత్తు పూర్తిగా దిగిపోయింది. ఆకలిబాధ రెట్టింపయింది. ఆ ఆకలికి తట్టుకోలేక పోతున్నాడు. ఎవర్నడగాలన్నా, చావు కారణంగా వండుకున్నారో లేదోనని అనుమానం! ఏం చేయాలి? ఎవర్నడగాలి? అనుకుంటూ వీధిలోకి నడిచాడు.

★ ★ ★

అది రాత్రి ఎనిమిది గంటల సమయం!

అప్పటికే కొందరు నిద్రకుపక్రమిస్తున్నారు.

ఆ సమయంలోనే రాశింటి నరసిమ్ములు, తన యింటి ముందరున్న అరుగుమీద కూర్చుని మిత్రులతో ఏదో లోకాభిరామాయణం మాట్లాడుకుంటున్నాడు.

నరపిమ్ములు పరమ పిసినారి. పిల్లికి భిక్షం పెట్టేవాడు కాదు. అతను మొండోడి కంటే మొండోడు. అతని భార్య అతనికి తగిందే. 'అదిగో విసరు అంటే ఇదుగో చద్దినీళ్ళు' అనేరకం. 'గంతకు తగిన బొంత'. తినో తినకో భూమి పుట్రా బాగానే సంపాయించాడు నరిసిమ్ములు.

అతనికి ఒక కూతురు, కొడుకు.

కూతురికి పెళ్ళి చేసేశాడు. ఆమెకు ఐదేళ్ళ పాప కూడా. ముసలి వయసులో పొద్దుపోక ఆ పాపను ఇటీవలే ఇంటికి తెచ్చుకొని పెంచుకుంటున్నాడు.

కొడుకుపేరు ముద్దప్ప. ఇంకా పెళ్ళి కాలేదు.

ఆవేళ నరసిమ్ములు అరుగుపైనే కూర్చొని ఇంట్లో వున్న భార్యకు సూచనలిస్తున్నాడు.

"ఏమ్మామా? నీ కొడుకేడబోయినాడు?" ప్రశ్నించాడు పక్కింటి పరంధామయ్య.

"సెరువుకింద మడికి నీళ్ళిడను బొయినాడు. పొగులంతా కరెంటు కట్టు! యేం జేసేది? ఒకటే యాతనై పూడిసింది బిడ్డెకు. ఈ ముండకరెంటు రాత్తిర్లో ఎప్పుడొస్తుందో, ఎప్పుడు పోతుందో తెలీకుండా వుంది. ఇప్పటికిప్పుడు రెండుసార్లు పోయేసి వచ్చా! 'వాన రాకటా ప్రాణం పోకటా ఎవురూ చెప్పలేనట్టే', యిప్పుడు ఈ కర్రెంటు రాకటా పోకటా ఎవురూ సెప్పలేరు గదా! కానుకోనుండి మిషనొదలాల!"

కరెంటుకోత మూలంగా రైతులు పడుతున్న అవస్థను ఏకరువు పెట్టాడు నరిసిమ్ములు.

ఇతంలో అతని భార్య ఆదెమ్మ "యామయ్యా! యిట్టాగ మాటిను? మనవరాలు తిని పానుకునింది. వొపినంత అన్నం మిగిలిపాయ. ఇంకా సట్లు కడగేది అట్ల వుండిపాయ. నీకు పడకేడేసేది సెప్పు" అని గుమ్మంలోకి వచ్చి చెప్పింది.

"నేను చెబితే యింటివా? మీరు శానా దూరమే. మీవాళ్ళకు ఈ సావుకబురు తెలిసి వచ్చేగుందికి తెల్లారిపోతుంది. వాళ్ళు వచ్చినాక వండీచ్చులేయే అంటే యింటివా? మావాళ్ళు మావాళ్ళు అని తవ్వెడు బియ్యం వేసి, రాగి పిండేసి కెలికేస్తివి. తీరా వాళ్ళు రాలా! యెంత నష్టమైపాయనో సూడు. అన్నీ నష్టం పనులే నువ్వు సేసేది?"

మిగిలిపోయిన అన్నాన్ని తలచుకొని, తన బాధను వ్యక్తం చేశాడు నరసిమ్ములు.

"వస్తారనుకుంటే రాలా! దానికి నేనేం సేసేది?"

తన నిస్సహాయతను వ్యక్తం చేసింది ఆదెమ్మ.

"నాలుగు ముద్దలన్నం ఉండాది. ఉన్నే సెడిపోదులే. దాంట్లోకి నూరిన శెనిగ్గింజల సెట్నీ గూడా ఏమీ సెడదుగానీ, రేపు తినొచ్చులే. అట్టే పెట్టు."

మిగిలిన అన్నాన్ని వృథా చేయకుండా, దాన్ని రేపటికి ఎలా సర్దుకోవాలో చెప్పాడు నరిసిమ్ములు.

"ఆ పని ఎప్పుడో చేసినాలే. మిగిలిందే సంగటి సట్లోయేసి, ఉట్టిమింద పెట్నాలే. సెట్నీగూడ గిన్నెలో ఏసి మూతపెట్టి ఆ సట్టి మిందనే పెట్నా. కిందుంటే పిల్లులు తినేస్తాయి గదా! సరే నీ పడకేడ సెప్పు!"

"సుట్టింటి ముందరెయ్. పానుకుంటాగానీ."

ఇలా జరుగుతున్న వారి సంభవాషణ అప్పుడే అన్నం అడుక్కోవడానికి ఆ యింటి ముందరికొచ్చిన మొండోడి చెవిలో పడనే పడింది.

ఇంకేముంది?

టిక్కు టిక్కు శబ్దం చేసుకుంటూ అక్కడే కూర్చున్నాడు.

"అమ్మా ధరమతల్లీ! ఓ పిడస కబళమెయ్యి తల్లీ! వానలు కురవంగ. వంకలు దొల్లంగ ..." అని గొంతుక్కూర్చొని ఆతనికి తెలిసిన ఆ ఒక్కపాటనే పాడసాగాడు.

"ఇక్కడేం లేదు పాయ్‌రాయ్యోవ్!" అన్నాడు నరసిమ్ములు.

"నేను మొండోన్ని సామే. ఎన్నో యేండ్ల తర్వాత ఈ గడ్డ పైకొచ్చినా. నీ యింటి ముందర కూకున్నా. మిమ్మల్నే ఆశించి బతికేటోళ్ళం. మీరింత పెట్టాల. మా పొట్ట నిండాల. తల్లీ!" అని అరచి "వానలు కురవంగ, వంకలు దొల్లంగ ..." అంటూ స్వరం తగ్గించి అదే పాటను పాడసాగాడు.

ఊళ్ళో సావుబడే. మేం వండుకోలా. పొద్దనన్నమే తలాంత తినేసినాం. పెద్దాయన సెప్పినాడు గదా. ఇంకా ఏమి. పాయ్‌రా పో."

పుగురును చూచినట్టు చూసి, లోపల్నుంచే సమాధానం చెప్పింది ఆదెమ్మ.

"నాకు తెలుసు తల్లీ! ఉట్టి మిందున్న సంగటెయ్యి తల్లీ!"

తిరిగి స్వరం పెంచి గట్టిగా అరిచాడు మొండోడు.

"ఉట్టి మీదున్న సంగటి గురించి మొండోడికెలా తెలిసింది? మొండోనికి మాయలు, మంత్రాలేమైనా వచ్చునా ఏమీ?" అని అటు ఆదెమ్మ, ఇటు నరిసిమ్ములు కూడా క్షణంపాటు కంగు తిన్నారు.

కానీ ఇంట్లో సంగటివున్న రహస్యం ఆతనికి తెలిసిపోయినందుకు, లేదంటే మొండికేసుకొని అడుగుతున్నందుకు నరిసిమ్ములుకు కోపం ముంచుకొచ్చింది.

"య్యోవ్! లేదు పొమ్మంటే .... యింకా మొండికేసుకుంటావేందీ!" వచ్చిన కోపాన్ని అణుచుకుంటూ అన్నాడు.

"యేంది సామీ. ఇంట్లో ధరమతల్లి యేస్తుందిలే. అమ్మా! అన్నపూర్ణేశ్వరీ, ధరమతల్లీ! ఒక్క పిడస కబళమెయ్యి అంత సట్నీ యెయ్యి" అంటూ అరచి 'పంటలు పండంగా, గరిసెలు నిండంగా' అని గొణుక్కోసాగాడు.

ఇంట్లోపని చేసుకుంటున్న ఆదెమ్మకు అతని అరుపు టక్కు టక్కు శబ్దం కర్ణకఠోరంగా వినిపించి చిర్రెత్తి పోయింది.

విసవిస వెలుపలికి వచ్చి "మొండిముండాకొడకా! లేదంటే మొండికేసుకుంటావే. సిగ్గులే నీకు? బందోడా!" అని కొట్లాడుతున్నట్టుగా అంది.

దాంటో మొండోడిలోను పట్టుదల పెరిగింది.

"అవును తల్లీ. నేను మొండి ముండాకొడుకునే. సూడు నా మొండితనం" అని చేతనున్న మొండికత్తితో ఎడమచేతి మణికట్టుపైన గాయం చేసుకున్నాడు. ఆ గాయం నుంచీ వచ్చిన రక్తాన్ని, ఆ కత్తితో చేయిమీద రుద్ది, టిక్కు టిక్కు శబ్దం చేస్తూ ... "వానలు కురవంగ, వంకలు దొల్లంగ..." అంటూ యింకా గట్టిగా పాడసాగాడు.

ఆతని చేతిపైనున్న రక్తం వాసనకు అంత చీకట్లోనూ ఈగలు ముసరడం, ఇంటి ముందరున్న కరెంటు లైటు వెలుగులో స్పష్టంగా కనిపిస్తోంది.

ఆ దృశ్యం చూసేసరికి జుగప్స కలిగి "వొరే నరిసిమ్ములూ! మొండి బండోడితో వాదులెందుకు గానీ ఏదో అంతేసి పంపించండ్రా, మిగిలి మిగిల్చి, పోయేటప్పుడు ఎవ్వరూ ఏమి మూటగట్టుకోని పోయేదిలేదు గానీ, ఇప్పుడు సూడు. అంత బతుకు బతికీ ఆ ముత్యాలు సచ్చిన సావుజూడు. ఆ యమ్మయే మెత్తకపాయ!" అని ప్రక్కనేవున్న ఒక ముసలాయనన్నాడు.

దాంతో కాస్తా మెత్తబడిన నరిసిమ్ములు "వసే ఆదే! వాడింకపోడు గానీ ... అంతేసి పంపించమ్మీ!" అని భార్యకు పురమాయించాడు.

మొండోన్ని మనసులోనే తిట్టుకుంటూ లోపలికి వెళ్ళింది ఆదెమ్మ.

లోపలికి వెలుతున్న ఆమెను చూసిన మొండోడు, మొండిపట్టులో తానే విజయం సాధించినట్టు ... "పంటలు పండంగా గాదెలు నిండంగా ..." అంటూ పాడుతున్న పాటను ఇంకా గట్టిగా స్వరం పెంచి పాడాడు.

ఇంతలో లోపలికి వెళ్ళిన ఆదెమ్మ ... మొండిముండా కొడుకు. పెట్టిందాకా వదలడు. మొండిబండోడు ..." అని గొణుక్కుంటూ వచ్చి "బోకి పట్రా! అరిసింది సాలుగానీ?" అని ముఖం గాటుపెట్టుకున్నట్లు చిట్లించి కోడిగుడ్డంత అన్నం చేతపట్టుకొని మాట్లాడింది.

ఆమె చేతిలోని అన్నం చూసి మండిపోయాడు మొండోడు. కానీ మొండికేసుకోవడం తప్ప ఎదురుతిరిగి కొట్లాడ్డం ఆతనికి చేతకాదు. కాబట్టే "శానా తెచ్చినావు తల్లీ! నేను మొండోన్ననుకుంటే నాకంటే యింకా జగమొండిగా వుండావమ్మా తల్లీ నువ్వు. నీ ముద్ద చూస్తానే కడుపు నిండిపోయింది గానీ, నీ ముద్ద నువ్వే తిను తల్లీ!" అని విసురుగా లేచి, జోలె సంకకు తగిలించుకుని గబగబ, అక్కడినుంచీ వగర్చుకుంటూ మరో యింటిముందుకు వెళ్ళిపోయాడు.

ఊర్లో చావు కారణంగా ఆరోజు మొండోడికి పట్టెడన్నం దొరకడమే కష్టమైపోయింది.

కడుపులో క్షుద్బాధ భరించరాని స్థితికి చేరింది.

మళ్ళీ బోరింగు దగ్గరకు వెళ్ళి, ఒక చేత్తో బోరింగ్ హ్యాండిల్‌ను కొట్టి, మరో చేత్తో కడుపునిండా నీళ్ళు తాగాడు.

ఆ తర్వాత నీరసంగా అలానేవెళ్ళి ఆ రచ్చబండ మీదనే పడుకున్నాడు. అరుగుపైన వున్న నరసిమ్ములు, ఆతని మిత్రులు ఆతన్నే చూస్తూ వుండిపోయారు.

* * *

చుట్టింటికీ, బండల మిద్దెకూ మధ్యలోనున్న సందులో ... ఒక నులక మంచమ్మీద గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు నరసిమ్ములు.

అందరూ ఎప్పుడో తమ ఇళ్ళల్లో హాయిగా నిద్రపోతున్నారు. ఆ చీకట్లో వీధి నిర్మానుష్యంగా వుంది!

అది అర్ధరాత్రి దాటిన సమయం!

ఎక్కడా ఏ అలికిడీ లేదు.

మడికి నీళ్ళు పారగట్టి అప్పుడు యింటికి వచ్చిన నరిసిమ్ములు కొడుకు ముద్దప్ప,

ఆ సందులోనే మరో మంచంపైన పడుకొని నిద్రకుప్రకమిస్తున్నాడు.

పూరి గుడిసెలో, కిరసనాయలు దీపం సన్నగా వెలుగుతోంది. ఆ వెలుగులో, అవ్వ వడిలో ఆదమరచి నిద్రపోతున్న పాప, పాపను డొక్కకు హత్తుకొని నిశ్చింతగా నిద్రపోతున్న ఆదెమ్మ స్పష్టంగా కనిపిస్తున్నారు.

ఆ యింట్లో ... దక్షిణం వైపున మూడు వరుసల్లో, ఒక దానిపైన ఒకటిగా పెట్టివున్న దొంగి కుండలున్నాయి. వాటికి పైగా ... కప్పులో అడ్డంగా అమర్చిన అడ్డకొయ్యకు కట్టిన మూడు ఉట్లు నల్లగా పొగచూరి, చెట్టుకొమ్మలకు చివర తలకిందులుగా వ్రేలాడుతున్న గబ్బిలాల్లా కనిపిస్తున్నాయి.

అందులో చివరి ఉట్టి, గోడకు దగ్గరగా ఉంది. గోడకు, కప్పుకు మధ్యనున్న మైరెడు సందులో నుంచీ వీస్తున్న గాలి స్వేచ్ఛగా గుడిసెలోకి ప్రవేశిస్తూ, ఎదురింటి వాళ్ళను ఇంకా జోకొడుతున్నట్లుంది.

ఆ యింట్లో చీమ చిటుక్కుమన్నా వినిపించేటంత నిశ్శబ్దం! కానీ ఉన్నట్టుండి ... ఉట్టిపైనున్న పాత్ర 'టప్' మని శబ్దం చేస్తూ కిందపడింది. ఆ శబ్దానికి ఆదెమ్మ వడిలోని పాప ఉలిక్కిపడి కెవ్వుమంది.

ఆదెమ్మ మేల్కొంది!

"పాడు పిల్లి. యామారితే సాలు. అన్నమంతా మెక్కిపోతుంది. దొంగ నా బట్ట పిల్లి. ఢ్యాయ్! నీ యబ్బడాలా! గబ్బుముండా! పో!" అని కేకేసింది. ఆ కేకకు ఇంటి ముందరున్న నరసిమ్ములు, ఆతని కొడుకు మేల్కొన్నారు.

"ఓ యమ్మీ ఆదే! యేందే లోపల?" పలుకరించాడు నరసిమ్ములు.

"పిల్లొచ్చినట్టుందయ్యా గండుబిల్లి!" లోపల్నుంచే బదులిచ్చింది ఆదెమ్మ.

ఇంతలో ఓ చేయి, ఇంటి చూరుకింద గోడమీదుగా అంతర్ధానమై పోవడం ఆ బుడ్డీ వెలుగులో ఆమెకు స్పష్టంగానే కనిపించింది.

అంతే! "వారే! దొంగ! దొంగరా! యింటెనక పొంచుండాడు చూడంప్రా తంప్రీ!' ' అని గట్టిగా అరవడం ప్రారంభించింది ఆదెమ్మ.

ఆ అరుపులకు భయపడి మేలుకున్న పాప బిత్తరపోయి ఏడవసాగింది. ఆ అరుపులు విని లేచి కూర్చునే లోపలే ఓ ఆకారం ఇంటి వెనక పొలాల్లోకి పరుగెత్తి వెలుతుండడం ముద్దప్ప కంటపడింది. దాంతో అతనూ "దొంగ! దొంగ! పట్టుకోండి" అంటూ లేచి అరుచుకుంటూ ఆ ఆకారాన్ని వెంబడించాడు.

తనకెవరూ కనిపించకపోయినా తల్లీ కొడుకులు దొంగ, దొంగ అని అరవడంతో బెదిరిపోయిన నరసిమ్ములూ 'దొంగా, దొంగా' అంటూ ముద్దప్పను అనుసరించాడు.

ఆ తంప్రీ కొడుకుల అరుపులతో చుట్టుపక్కల ఇళ్ళల్లో నిద్రిస్తున్న వాళ్ళూ మేల్కొన్నారు. ఉన్నపళాన టార్చిలైట్లు, లాంతర్లు, కట్టెలు, ఈటెలు వంటివి, చేతికి దొరికినవి దొరికినట్లే పట్టుకొని పరుగెత్తుకుంటూ వీధిలోకి వచ్చేశారు.

వారిలో కొందరు యువకులు ఆ అరుపులు వినవిచ్చిన వైపుకు దూసుకుపోయారు.

ముద్దప్ప ఎంత వెంబడించినా దొంగ దొరకలేదు. ఇంటివెనక చేలల్లో నుంచీ పరుగెత్తిన దొంగ దొరకలేదు. ఇంటివెనక చేలల్లో నుంచీ పరుగెత్తిన దొంగ, అలాగే దక్షిణంగా

పరుగెత్తి రచ్చబండ కవతల వున్న గడ్డి వాముల్లోకి జొరబడి, కనిపించకుండా పోయాడు. అప్పటికే అక్కడికి చేరుకున్న కొందరు "ఎక్కడ పోయడా దొంగ?" అని అడిగారు. "మా యింట్లో జొరబడి, నేను చూస్తుండంగానే ఈ మబ్బుల్లో కలిసి పాయ" అంటూ ఆయాసంతో రొప్పుతూ గడ్డివాముల్ని చూపించాడు ముద్దప్ప.

"అయితే ఈడనే యాడనో దాక్కొనుంటాడు సూడండ్రా!"

ఆ గుంపులోనుంచీ ఓ వ్యక్తి అన్నాడు.

దాంతో, కొందరు ఆ చుట్టుపక్కల వెదకసాగారు.

ఇంతలో సరిసిమ్ములు రచ్చబండ దాటుకొని, ఆ పక్కనే వున్న గడ్డివాముల సందుల్లో వెదకసాగాడు.

అలా వెదుకుతూ వెదుకుతూ ఒకచోట అతని చూపు ఆగిపోయింది.

అక్కడ ... ఓ మానవాకారం ఒక గడ్డివామెకు ఆనుకుని వదిగి కూర్చుకున్నట్టు మసకగా కనిపిస్తోంది.

అంతే!

"ఇడుగో దొంగ! వొరే! దొంగ యీడుండాడు రండ్రోయ్!" అని గొంతు చించుకుని ఒక్కసారిగా అరిచాడు.

ఆతని మాటలు విన్న ఆ చుట్టుపక్కలవాళ్ళంతా అమాంతం ఆ గడ్డివామెను చుట్టుముట్టారు.

దాంతోబాటు ఆ గుంపులోనుంచీ రెండు మూడు టార్చిలైట్లు ఒక్కసారిగా గడ్డివామెపైన ... కాంతిని విరజిమ్మాయి. ఆ వెలుగులో ...

ఒక వ్యక్తి వదిగి కూర్చొని ఏదో ఆత్రంగా నోట్లో కుక్కుకుంటున్నాడు.

"వొరే! మొండోడురా!"

ఆ వ్యక్తిని గుర్తుపట్టిన ఓ వ్యక్తి అన్నాడు.

"వొరేయ్! మొండి నాకొడకా! యెవురింట్లో జొరబడినావురా?" అన్నాడు ఆవేశంగా అవ్యక్తి.

"మాయింట్లో జొరబడింది వీడుగానే వుండాడు"

అప్పుడే అక్కడికి వచ్చిన ముద్దప్ప అన్నాడు.

"అయితే! యెయ్యండ్రా నా కొడుకుని!"

ఆ గుంపులోనుంచీ ముందుకు వచ్చి అన్నాడో వ్యక్తి. అంతే! అందరూ కోపంగా ఆతని మీదపడి వెనకాముందూ ఆలోచించకుండా తలా ఓ దెబ్బ వేసేశారు.

అంతా కన్నుమూసి తెరిచేలోపల జరిగిపోయింది.

"అయ్యా! ఆగండి సామే ఆగండీ!"

మొండోడు గింజుకుంటున్నా వినలేదు. అందినవారు అందినట్లే కొట్టసాగారు.

"సచ్చాండ్రో సామే. ఆగండీ!"

ఒక్క గావుకేక పెట్టాడు మొండోడు.

దాంతో అందరూ అలాగే ఆగిపోయారు.

అప్పటికే ఆతని ఒంటినిండా దెబ్బలు తగిలాయి. దెబ్బలు తగిలినచోట నల్లగా

చర్మం కందిపోయినట్లు ఆ ప్రాంతంలో రక్తం కమ్ముకొస్తోంది.

అయినా ... అతను అంతవరకూ తింటున్న ఆహారం ... ఆ దెబ్బలకు మింగుడు పడక ఎక్కిళ్ళు పడుతున్నాడు.

"నిజమే ... నేను ... దొంగతనం ... జేసినా ... అదీ నా జీవితంలో మొదటిసారిగా ... దొంగతనం ... జేసినా! చివరిసారి కూడా ... ఇదే కావచ్చునేమొ! ... నేను దొంగనే ... నన్ను సంపేయండి ... పరవాలేదు. కానీ అయ్యా! సంపేముందు ... కాసిన్ని మంచినీళ్ళిచ్చి ... సంపేయండి ... తినె అన్నమూ ... గొంతు పట్టుకునింది ..." వస్తున్న ఎక్కిళ్ళమధ్య అన్నాడు మొండోడు.

"సామే ... దేవరా! నేను దొంగతనం చేసింది దీ అన్నమే సామే! మీ డబ్బులూ దస్కమూ కాదు ... ఆత్రంగా తినేసినా ... గొంతు పట్టుకునింది!"

ఒకచేత్తో గొంతు నలుపుకుంటూ తిరిగి అన్నాడు మొండోడు.

అంతవరకూ ప్రజలు ఆతన్ని కొట్టినందువల్లా, ఆతని చేతిలోవున్న అన్నపు చట్టి పగిలిపోయి, అందులోని అన్నం, ఆ చట్టి పెంకులు నేలమీదపడి చిందరవందరగా కనిపిస్తున్నాయి.

"అన్నం దొంగతనం చేసినావా?"

అక్కడే వున్న గుంపులోనుంచీ ఒక యువతి ఆశ్చర్యంగా అంది.

"అవును తల్లీ! అన్నమే! 'కోటిద్దెలు కూటి కొరకే' గదా సామే. నేనూ అందుకోసమే సేసినా. యేం జేసేదీ! అన్నం దిని రెండు దినాలైపాయ. మధ్యలో ... ఊర్లో సావొగటి!'
'

"అయ్యా! సామే! తల్లే! మిమ్మల్నాసించే గదా నేనొచ్చింది. వొగ తల్లయినా అంత కడేసిందా నాయనా? లేదే?" అంటూ అందంరివైపు చూశాడు.

అందరూ ఆతని మాటలు వింటూ అలాగే నిలబడి వున్నారు. ఆతని మాటలు నిప్పులమీద నీళ్ళలా అందరి ఆవేశాన్ని చల్లార్చుతున్నాయి.

అప్పుడే ... అందరినీ తోసుకుంటూ మనవరాల్ని సంకన పెట్టుకొని ముందుకు వచ్చి నిలబడింది ఆదెమ్మ.

"అమ్మీ! తల్లీ! నీ అన్నమేయమ్మా! దొంగతనం జేసినా! సట్లో నాలుగు ముద్దలన్నం బెట్టుకోని, కొసిరి కొసిరి, గువ్వ గుడ్డంత పెట్నావు గదా మహాతల్లీ! దాంతో నా ఆకలి తీరుతుందా! అందరికీ జానెడు పొట్టయితే మాలాంటి కూటికి లేనోళ్ళకు మాత్రం మూరెడు పొట్టుంటుంది. అందుకే నీ అన్నం దొంగతనం జేసినా! కానీ తల్లీ! నువ్వు తీసుకచ్చిన ఆ గువ్వగుడ్డంత అన్నమే. అదీ వట్టి అన్నమే మింగినా అంతే! గొంతు పట్టేసింది. కనీసం కాసిన్ని నీళ్ళయినా యియ్యి తల్లీ ..."

అతి దీనంగా అడిగాడు.

అయినా ఎవ్వరూ ఆ ప్రదేశం నుంచీ కదలిపోలేదు. కానీ ఆతని మాటలు యింకా వినలేక అవమానంతో అక్కడి నుంచీ మనుషుల్ని తోసుకుంటూ దారి చేసుకుని వెళ్ళిపోయింది ఆదెమ్మ.

అందరి ఆవేశాలు పూర్తిగా చల్లబడ్డాయి.

అందరి హృదయాలలోను మొండోడిపైన జాలి, దయ చోటు చేసుకోసాగాయి.

ఎన్నో ఏళ్ళనుంచీ ఆతని హృదయంలో దాగివున్న బాధంతా ఒక్కసారిగా ఆవేళ కట్టలు తెంచుకున్నట్లయింది. అందుకే ఇంకా చెప్పుకుపోతున్నాడు.

"తల్లీ! అయ్యా! తరతరాల నించీ మిమ్మల్నే ఆశించి బతికేటోళ్ళం. ఎన్నో ఏళ్ళ తర్వాత మీ యిండ్ల ముందరికొస్తే ... వొగ పున్నేత్తురాలయినా "ఇద్దోరా మొండోడా! తినుపో!' ' అని కాసింత సట్టిగోకిన పిసురయినా పెట్టిందా? పోనీ అన్ని సద్దినీళ్ళయినా పోసిందా? ఏమి బుడమో ఏమొ సచ్చిపోయింతల్లి వొగ గలాసు సద్ది పోసిందంతే. అది యాడికవుతుంది?''

"సామే! నేనుగాదు సామే దొంగని. ఇంట్లో అన్నం పెట్టుకోని లేదనే మీరేసామే నిజమైన దొంగలు!''

ఆతనన్న ఒక్కొక్కమాటా ఒక్కో బాణంలా, అందరి హృదయాలోను తాకుతోంది.

అందరూ పశ్చాత్తాపంతో తలలు దించేసుకున్నారు.

ఆ మాటతో నరిసిమ్ములకు తల తీసేసినట్టయింది. పశ్చాత్తాపంతోను, అవమానంతోను ఆతని హృదయం బాధగా మూలిగింది.

మొండోని శరీరంలో ... నీరసం - నిస్త్రాణ పెల్లుబికాయి.

మనిషినే కాదు. ప్రపంచంలోని ప్రతి ప్రాణినీ, అనాదినుంచీ పీడిస్తున్న ఏకైక బాధ ఆకలి!

ఈ ఆకలే మనిషిని ... ఎంత నీచానికైనా దిగజారిస్తుంది. ఆ ఆకలి బాధే ఆవేళ మొండోన్ని వదలలేదు.

అది మొండోన్ని మించిన జగమొండిగా వుంది.

నిజానికి అసలు సిసలయిన మొండోడు ఆకలే!

ఎన్నో రోజుల నుంచీ అవిరామంగా జగమొండయిన ఆకలితో సాగిస్తున్న పోరాటంలో మొండోడు ఆవేళ పూర్తిగా ఓడిపోయాడు.

ఆతనికి మైకం కమ్ముకొచ్చింది!

కళ్ళు బైర్లు కమ్మసాగాయి!! .

మొండోనికోసం ... చెంబు నిండా మంచినీళ్ళు తీసుకుని, అందరినీ తోసుకుంటూ అక్కడికి వచ్చింది ఆదెమ్మ.

సరిగ్గా అప్పుడే ... మొండోడు స్పృహ తప్పాడు.

డా॥ వి.ఆర్. రాసాని, తెలుగు లెక్చరర్,
11-191/1, ఎస్.వి. నగర్, తిరుపతి - 2

## డా॥ మధురాంతకం నరేంద్ర కథ

# కుంభమేళా

చాలా భయంకరమైన జంతువు. వందలవేలకాళ్లూ, చేతులూ వున్నాయిదానికి. శూలాల్లా పెరిగిన గోళ్లతో, మొరటుగా, బలిష్ఠంగా వున్న చేతుల్ని ముందుకు చాస్తూ, పెద్ద స్థంభాల్లాంటి పాదాల్ని వడివడిగా సారిస్తూ, విరుచుకు పడుతోంది అది. అలల నోళ్లు తెరుచుకుని ముంచుకొచ్చే తుఫానునాటి సముద్రంలా బీభత్సంగా వుందది. నా చేతిలో వున్నది చిన్న కత్తి మాత్రమే! అయినా భయపడకుండా పోరాటం సాగిస్తున్నాను. వ్రేటువ్రేటుకూ దాని చేతులూ కాళ్లూ కుప్ప తెప్పలుగా తెగిపడుతున్నాయి. కానీ యేంలాభం? వొక్క అంగంతెగి నప్పుడల్లా రెండు మూడు అంగాలు మొలుచుకొస్తున్నాయి. నన్నమాంతంగా మింగేయడం కోసమన్నట్టుగా లోయల్లాంటి నోళ్లు తెరుచుకుని పైపైకి రాసాగింది. భీకరంగా అరవసాగింది. దాని శబ్దం అంతకంతకూ పెరగసాగింది. కర్ణభేరుల్ని పగలగొట్టేటంత శబ్దం........

వులిక్కిపడి మేలుకున్నాను.

కాస్సేపు ప్రపంచమంతా అలుక్కుపోయినట్టుగా, అయోమయంగా కనిపించింది. వాస్తవలోకంలోకి రావటానికి అయిదారు నిముషాలు పట్టింది.

టూరిస్టు బస్సెక్కడో ఆగిపోయి వుందన్న విషయం అర్థమయింది నాకు. బస్సులో ప్రయాణీకులెవరూ లేరు. డ్రైవరు సీటుగూడా ఖాళీగావుంది. జీరో బల్బు కాంతిలో, ఖాళీ సీట్ల బస్సులో నేనొక్కడినే ఠీవిగా కూర్చొనివున్నాను, అనిర్మానుష్య రాజ్యానికి యెదురులేని రారాజులా!

యింకా తెల్లవారినట్టు లేదు. బయటంతా చీకటిగానేవుంది. కానీ నింగినుంచీ నేలవరకు పొడవాటి నక్షత్రాల తెరల్ని వేలాడదీసినట్లుగా దీపాలు తోరణాలు కనిపిస్తున్నాయి. ఛాలీ చాలని ఆదీపాల కాంతిలో రకరకాల జనాలు వడివడిగా అటూయిటూ తిరుగుతున్నారు. నా నిద్రని భగ్నం చేసిన శబ్దం అటనుంచే వస్తోందన్న విషయం బోధపడటానికి కాస్సేపు పట్టింది.

యీ మనుషుల పుట్టలోని బస్సును దించేసిన బస్సుడ్రైవరు యేమయినట్టు? ఆగిపోయిన బస్సులోంచీ యాత్రికులందరూ యెక్కడికెళ్ళినట్టు? అయినా యీ సంగతులన్నీ నా కెందుకు? యిలాంటి అనవసర కుతూహలాలు నాకులేవు.

జేబులోంచీ సేనాకత్తిని తీసి, మీటనొక్కి, కత్తికొసని యెదుటి సీటుకమ్మీ సందులోకి జొనిపాను. బొద్దింక దానిపై కొచ్చింది. మెల్లగా బయటికి లాగాను దాన్ని. కాళ్లు తసతసలాడిస్తూ, కళ్లు ముందుకూ వెనక్కూ వూగిస్తోందది. వేలితో దాని రెక్కలపైన నిమిరాను. అది కత్తి వాదరపై నుంచీ వొరిగింది. సంచీలోంచీ రెండు ఫలహారపు ముక్కలు తీసి, సీటు చివర్లో వేసి, దాని పక్కనే బొద్దింకను వదిలాను. అది బుద్ధిగా భోంచేయసాగింది.

యీ ప్రయాణం ప్రారంభించిన మొదటి రోజునే యీ బొద్దింకనా స్నేహాన్ని

సంపాదించుకొంది. అప్పటి నుంచీ అప్పుడప్పుడూ దానితో యిలా ఆడుకుంటూనే వున్నాను నేను. గడచిన అజ్ఞాతకాండలో యిలా చాలా జంతువులతో చాలా రకాల కాలక్షేపాలు చేశాన్లే నేను! అయినా మాటాడుకోవాలంటే మనుషులే కావాలన్న రూలెక్కడుంది? జంతువులతో, క్రిములతో, కీటకాలతో మాట్లాడితే తప్పేముంది? ఆ మాటకొస్తే మనిషి తనతో తానే మాటాడుకోవచ్చు. యిప్పుడు నేను చేస్తున్న పని అదేగదా! నేనసలు మాట్లాడననీ, మితభాషిననీ అందరూ అనుకొంటూవుంటారు. కానీ, పెదవుల్ని కదిలించకుండా యెదుటి వాడికి వినిపించకుండా, నాలో నేనే మాట్లాడుకుంటూ వుంటానన్న విషయం యెందరికి తెలుసు? అవసరమయినప్పుడు నన్నే నేను యిద్దరిగా విభజించుకుని, కబుర్లు గూడా చెప్పుకుంటూవున్నాను. అందరిలా జీవించడానికి నేనేమైనా సామాన్యుడినా? ఈ యిలాతలంపైన నాలాంటి జీవి మరొకటుండగూడదు. అనితర సాధ్యంగా జీవించడమేగదా నా ప్రత్యేకత!

గత సంవత్సరం జనవరినెలనుంచీ అక్టోబరు వరకూ గడచినకాలానికి అజ్ఞాతకాంత అనిపేరు పెట్టాను. అపదినెలల పర్యంతమూ నేనే 'మానిసి'లో వుండిపోయాను. 'మానిసి' - అది నేనున్నయింటి పేరు. పెద్దకాంపౌండు లోపల వొక పడకగదున్న యిల్లు. అదే వూళ్లోవుందో, యేవీధిలో వుందో చెప్పాల్సిన అవసరం లేదు. బయటి ప్రపంచంతో సంబంధాలు లేకుండా చేసిపారేసినప్పుడు అదేవూళ్లోవుంటేనేం? ఆపది నెలలూ నేను యిల్లుదాటి వరండాలోకి సైతంరాలేదు. పొద్దునా, సాయంత్రమూ, ఓపనికుర్రా డొచ్చి కావల్సిన సామాన్లు తెచ్చిపెట్టి వెళ్లేవాడు. అంతే! మరో మనిషి పొలకువ సైతం వుండేది గాదు. ఎవరో యెక్కడో, ఏదో చేస్తే దాంతో ప్రంచమంతా మునిగిపోయినట్టుగా కలవరపడే పత్రికలంటే నాకు గిట్టదు. రేడియో టీ.వీలు మాయింట్లో వుండవు. ఆరోజుల్లో యథేచ్ఛగా నేనెన్ని పరిశోధనలు చేశానని? మనుషులు కాళ్ళతోనే యెందుకు నడవాలి? చేతులతోనే యెందుకు తినాలి? రోజుకు మూడుపూటలూ యెందుకు భోంచేయాలి? పగల్లో భోంచేయడం మానేసి రాత్రుల్లో తింటే శరీరం వొద్దంటుందా? బాత్రూంలో పడుకుని బెడ్రూంలో స్నానం చేస్తే యెలా వుంటుంది? అసలు స్నానం అన్నది శరీరానికంత అవసరమా? తలుపులూ కిటికీలూమూసేసి, పగల్ని సైతం రాత్రిగా మార్చేసి, యిక్కడికిక్కడే వొక అంటార్టికా తయారు చేసుకుంటే యెలావుంటుంది? భోజనం మానేసి విటమిన్ టాబ్లెట్లతో కడుపునింపుకుంటే తప్పేముంది?

వున్నట్టుండి కుడినుదుటిపైన నరమొకటి లాగసాగింది. పెట్టె తెరిచి, ఓ మాత్రను పైకి తీసి, గుక్కెడు నీళ్లతో బాటు దాన్ని శరీరంలోకి తరలించాను. యెడమ తొడదగ్గర కండరం టకటకలాడసాగింది. మరో మాత్రను మింగాను. లాభంలేదు. రెండు మూడు అడుగులు సారించక తప్పదు.

వొళ్లు విరుచుకుంటూ బస్సులోంచీ కిందికి దిగాను, బస్సు ముందుపెద్దగోతం పట్టా పరుచుకుని, రకరకాల నట్లూ బోల్టులతో డ్రైవరు కాలక్షేపం చేస్తున్నాడు. నా అడుగుల చప్పుడు వినబడగానే తలపైకెత్తి చూసి "మధుసూదన్ సారా?....." అంటూ పలకరించాడు.

"మధుసూదన్‌గాదు. మధు శోదన్.... అదీనా పేరు" విసుగ్గా అడ్డు తగిలాను నేను.

"అదే అదే..... రెండూ వొకడే గదా!..." అంటూ అతను తనపని తాను చేసుకుపోసాగాడు.

ఈ సాధారణమైన మనుషులతో వచ్చిన చిక్కేయిదే! మట్టికీ బంగారానికీ, రాయికీ

రత్నానికీ, నింగికీ నేలకూ, తేడా యేమిటో వీళ్లు తచ్చినా తెలుసుకోలేరు. యీ భూప్రపంచంలో మధుసూధన్ అనే పేరున్న వాళ్లు కొన్ని వేలమందయినా వుంటారు. కానీ మధుశోధన్ వొక్కడే! యెస్సెస్సీ పాసయి, కాలేజీలోకి చేరుతూనే నేను చేసిన మొదటి పనేమిటి? హైదరాబాదుకు తిరిగీ తిరిగీ, మధుసూదన్ అనే పాతపేరు మార్చుకుని, గెజిట్‌లో మధుశోధన్ అనే నా కొత్తపేరు ప్రింటుచేయించుకుని, ఆ తర్వాత వూపిరి పీల్చుకున్నాను. యేమయితేనేం? కష్టానికి తగ్గ ప్రతిఫలం దొరికింది. యీ అవనీతలంపైనున్న వొకేవొక యేకైక మధుశోధన్ నేనే!

డ్రైవరు పెదవినదోలా పంటితో నొక్కిపట్టి, బోల్టు బిగించుతూ "యింజన్ పాడయింది పాసింజెర్లంతా జాతర్లోకి దూరేసినారు. యీ పొద్దతా జాతరంటే యీ పక్కనంతా పెద్ద వేడుక.... తనివి తీరా తిరగేసిరండి..."అన్నాడు.

దూరంగా యేదో దేవాలయపు గర్భ గుడిచుట్టూ దీపాల తోరణాలు వేలాడుతున్నాయి. గుడికవతలి వైపున కాలువో, నదో, యేదో ప్రవహిస్తున్నట్టుంది. దీపాల కాంతులు దానిలో ప్రతి ఫలిస్తున్నాయి. చీకటి వెలుతుర్లు ఢీకొట్టుకోగా, ట్రాఫిక్ జామయినట్టు యెటు చూసినతా వొకటే అలజడి... తుఫానూ భూకంపమూ, ప్రళయమూ, అన్నీవొకేసారి సంభవించినట్టున్న జన ఘోష.

విసుగ్గా "యీరి పేరు యెంతసేపు తడ్తుంది?" అని అడిగాను డ్రైవర్ని క్లీనర్ని పక్క లైనుకు పంపించినాను.... మీరు జాతరలో జల్సా చేసుకోండిసార్! రిపేరు పని పూర్తయినా బస్సుకదలదు. పాసింజెర్లు సాయింత్రం దాకా యీ పక్కకు తొంగి చూడమని చేప్పేసినారు. యెప్పుడో పన్నెండేళ్ల కొకసారి వచ్చే విశేషం! సాయింత్రం గుడిలో పూజయినాకే బస్సు కదిలేది!' ' అన్నాడతను. పైపెచ్చు పరమానందంగా పెద్ద స్క్రూ డ్రైవరుతో బోల్టునొకదాన్ని చావగొడుతూ విశ్వఘోషకు తనవంతు శబ్దాన్ని సైతం సరపరా చేయసాగాడు.

అయస్కాంతాన్ని అంటిపెట్టుకున్న యినుపరజనులా, నది చుట్టూ గుమిగూడిన జన సమూహాలు..... దూరంగా నడవసాగాను. వొకటి.... రెండు.... మూడు..... నా అడుగుల్ని నేనే లెక్కబెట్టు కుంటూ నడవసాగాను. వొంటరిగా నడుస్తున్నప్పుడు నేనిలాగే అడుగులు లెక్కబెట్టుకుంటూ వుంటాను. కాలేజీలో చేరిన తర్వాత హాస్టలులో వున్నప్పుడు నేను తరచుగా వాకింగ్ కెళ్లేవాణ్ణి. అసలు హాస్టల్లో మన వ్యవహారమే వేరు! అందరూ నిద్రపోతున్న సమయాల్లో మేలుకునే వాణ్ణి. అందరూ మేలుకునే సమయాల్లో నిద్రపోయే వాణ్ణి. వుదయం పదింటికి, అందరూ కాలేజీకెళ్లి పోయిన తర్వాత నిద్రలేచేవాణ్ణి. యేవేవో వన్య మృగాలు జలకాలాడి పోయినట్టుగా బాత్రూంలన్నీ అతలాకుతలంగా వుండేవప్పటికి. అయితే మాత్రమేమిటి? అన్ని బాత్రూంలూ ఖాళీయేగదా! యిష్ట మొచ్చినచోట, యిష్టమొచ్చినంతసేపు స్నానం చేసేవాణ్ణి. ఆవేళప్పుడు మెస్ లెప్పుడూ ఖాళీయే! నాకోసం ప్రత్యేకంగా టిఫెన్ తీసిపెట్టే సదుపాయం వుండనే వుండేది. పదో, పరకో మనదిగాదు పొమ్మనుకుంటే యిలాంటి ప్రత్యేకమైన పరిగణనలకు తక్కువేముంటుంది? అటెండెన్సులన్నీ ఫార్సులై పోయాక, రెండు దమ్మిడీలు యెక్కువగా పారేస్తే కాండొనేషన్లొచ్చాక, తరగతి గదిలో యెవడఘోరిస్తారు? సాధారణ మానవ మాత్రుడే అయిన లెక్చరరొకడు తానేమో పేద్ద సర్వజ్ఞుణ్ణని ఫోజు పెట్టుకోని, వుపన్యాసం దంచుతోంటే, వినయంగా వినడమెవడి తరం?అందుకే లైబ్రరీ కెళ్లేవాణ్ణి. అందరూ గుమికూడే జర్నల్సు సెక్షను వైపుకు చూపుల్నయినా తిప్పేవాణ్ణిగాదు. స్టాక్ యేరియాలో కూర్చుని, యింత

వరకూ మానవ మాత్రుడి హస్త స్పర్శకైనా నోచుకోని నాపుస్తకమేదో కనిపెట్టి దానితో సంప్రదింపులు సాగించే వాణ్ణి. మధ్యాహ్నం భోజన మయ్యాక మళ్లీ నిద్ర. సాయంత్రాల్లో, స్టూడెంట్లందరూ నగర సందర్శనంచేస్తున్న సమయాల్లో, హాస్టలనే యేకాంత హర్మ్యాన్ని మకుటంలేని మహరాజులా పరిపాలించేవాణ్ణి! రాత్రి భోజనం ముగిశాక, అందరూ గదుల్లోదూరి చదువు సంధ్యలూ,చతుర్ముఖ పారయణాలూ, కబుర్ల దూమాలూ రగిలిస్తున్న వేళల్లో, వొక్కడ్నే నగరసంచారం చేసేవాణ్ణి! రాత్రి పదిగంటలు దాటిన తర్వాత నగరాల రోడ్లెంత విశాలంగా తయారౌతయో యెందరికి తెలుసు? పగలంతా జనాల పాదముద్రల్ని మోసీమోసీ అలసి పోయిన వీధులు అర్ధరాత్రి దాటిన తర్వాత యెంతగా మారిపోతాయని! రాత్రంతా మేలుకునే టీ హోటళ్లలో దొరికే తినుబండారాల రుచి మామూలు హోటళ్లలో దొరుకుతుందా? దూరాన్ని సిగరెట్లతోనూ, కాలాన్ని టీలతోనూ, అర్ధరాత్రి పర్యటనల్ని పోలీసులూ వాచ్ మేన్లతో జరిగిన రగడల్తోనూ లెక్కగట్టడం నాలా మరెవరికి తెలుసో చెప్పండి చూద్దాం!

పెద్దలారీలో పట్టగలిగే జనాన్నంతా తనలోనే యిరికించుకుని చిన్న జీబొకటి కారుబారు చేస్తూ యెదురొచ్చింది. ఆ చీకట్లో అది నాపైకెక్కడ వురికేస్తుందోనన్న భయంతో యెగిరి గంతేశాను. జీబులోని జనమంతా పెద్ద తమాషా యేదో జరిగినట్టుగా వెకిలినవ్వుల గులకరాళ్లు విసిరారు. కోపంతో నా వొళ్లుమండి పోయింది. రోడ్డుపైన్నుంచీ దిగి, నదినీళ్లకు అంచులా వ్యాపించివున్న యిసుక మేటల గుండా నడవసాగాను. అక్కడసైతం అక్కడక్కడా వొకరిద్దరు మనుషులు కనిపిస్తూనే వున్నారు, ధాన్యంలోని రాళ్లలా.

నేను కాలేజిలో చదివే రోజుల్లో నిర్మానుష్యమైన పర్వతసానువుల్లోకి వాక్ వెళ్లేవాణ్ణి. యూనివర్సిటీకి వుత్తరంగా పెద్ద కొండల సముదాయముంది. టిఫిన్ తిన్నాక, లంచ్ పాకెట్టు చేతబట్టుకుని అడివిలోకి వెళ్తే యిక తిరిగిరావడం సాయంకాలానికే నన్నమాట! వొకోసారి హవర్సైకిల్పైన గ్రామసీమలకు వెళ్లే మట్టి బాటల గుండా అలా అలా తిరిగి వచ్చేవాణ్ణి. కానీ వొకటే యిబ్బంది. అప్పుడప్పుడూ మురికి బట్టల కూలీ మనుషులూ, మట్టి ముఖాల రైతులూ యెదురుపడి నాతో మాట్లాడ్డానికి ప్రయత్నించేవాళ్లు. కొందరైతే పెద్ద కలెక్టరుద్యోగాలు చేస్తున్న వాళ్లకిమల్లే "టయమెంతయింది అయిలూ?" అని వాకబు చేసేవాళ్లు.

కుడి కణత దగ్గరినరం లాగసాగింది. యెడమ తొడ అదరసాగింది. విసుగ్గా వొక యిసుక మేటపైన కూలబడ్డాను. దూరంగా ఆకాశమనే నల్లటి పాఛిలోకి యెవరో పెద్దరాయిని విసిరేసినట్టున్నారు; యేవేవో రంగులు పైకి బుసలు గొట్టుకుంటూ వస్తున్నాయి. దిగాలు పడ్డ ముసలి వాడెవరో అసురుసురని తడుస్తున్నట్టుగా, రెండు మూడు గజాల దూరంలో నది గుణ గుణా ప్రవహిస్తోంది. ఫర్లాంగుదూరంలో తిరనాళ జనాలు పిచ్చాసుపత్రి రోగుల్లా అక్కడే చక్రాలు గొడుతున్నారు.

ఆ హాహాకారాలకు దూరంగా కూర్చున్నది నేనొక్కడినే! వొక్కడినే! నిజం! గొప్పవాళ్లెప్పుడూ వొక్కడిగానే వుంటారు. యీలోకానికంతా వొక్కడే సూర్యుడు. వొక్కడే చంద్రుడు. అలాగే యీ లోకానికంతా వొక్కడే మధుశోధన్. యీ ప్రత్యేకత కోసం యెన్ని జాగ్రత్తలు తీసుకున్నానో తెలుసామీకు? నేను తొడుక్కున్న చొక్కాడిజైను మరొకడి కుండగూడదు. అందుకోసం పనిగట్టుకుని మద్రాసుకు, అవసరమైతే బెంగుళూరుకు వెళ్ళడానికి గూడా నేను తటపటాయించలేదు. రాయకపోయినా పర్వాలేదుగానీ, వేరొకడు వాడేరకం పేనాని నాజేబులోకి

రానివ్వలేదు. ఓ షాపులో స్పెషల్‌గా కనిపిస్తోంటే పెద్ద పైపొకటి తెచ్చుకుని స్మోక్ చేయడం ప్రాక్టీసు చేశాను కొన్నాళ్లు. ముంచుకొచ్చే దగ్గుతెరల్ని భరించలేక తర్వాత మానేశాన్లెండి! అది వేరేసంగతి! మద్రాసు బర్మా బజార్లో చిత్రమైన టోపీ వొకటి కనిపిస్తే కొనుక్కొచ్చానొకసారి. దాన్నేసుకుని కాంపస్‌లో తిరుగుతూంటే అందరూ నన్ను యెగబడి చూసేవాళ్లు. వోరోజు కోతొకటి పైనబడి టోపీకోసం కలబడింది నాతో. వుపయోగానికి వీల్లేకుండా టోపీ చిరిగి పోయింది. ముఖంపైన కంటికి రెండంగుళాల దూరంలో పెద్దగాయమైంది. మాక్లాస్మేట్లు బలవంతంగా హెల్త్‌సెంటర్లో చేర్పించారు. అయినా, అదృష్టవంతు డెప్పుడూ తంతే గారెల బుట్టలోనే పడతాడు. నాముఖంలో కుడికంటికి దగ్గర, నల్లటి పెద్దమచ్చ స్థిరంగా నిలిచిపోయింది. అలాంటి మచ్చ కాంపస్‌లో మరెవరికీ లేదు.

వొక మగాడూ, వొక ఆడదీ చేతులు కూర్చుకుని, వొకరి మీద నొకరు వాలిపోతున్నట్టుగా నడుస్తూవచ్చి, నేనో యిసుక మేటపైన కనిపించడంతో, కిసుక్కుమని అదోలా నవ్వుకుంటూ ముందుకు సాగిపోయారు. వాళ్లకేంవిచిత్రం కనిపించిందని ఆనవ్వు? అసలీ మనుషులెందుకు నవ్వుతారు? వీళ్ల యేడ్పులెంత అర్థవంతమైనవో, వీళ్ల నవ్వులంత అర్థహీనమైనవిగా కనిపిస్తాయి నాకు. వొంటరిగా వున్నప్పుడు గుంభనగా, రింగ్ మాస్టరులా హుందాగావుండే మనిషి, మరొక సాటిమనిషి తోడు దొరకగానే నవ్వుతూ, పేలుతూ, బఫూన్‌లా ప్రవర్తిస్తాడెందుకు? అందుకే పిచ్చి గుంటల్లవాళ్లలా మనుషులంతా గుంపులు గుంపులుగా గుమికూడి, జంతువుల్లా విచ్చలవిడిగా తిరగడం నాకు నచ్చదు. అసలు నేను యూనివర్సిటీలో చదువుకునేరోజుల్లో స్టూడెంట్లందరూ వెలోకంపార్టీలూ, ఫేర్వెల్‌డేలూ, యూనివర్సిరీలూ, మీటింగులూ, సభలూ, సంతర్పణలూ అని గింజుకు చచ్చేవాళ్లు. వొసారి వాళ్లకు తగినశాంతి చేశాను. పేరేదైతేనేంలే, యేదో డిపార్టుమెంటు ఫంక్షను దానికో బోడి గెస్టుకూడా! మాక్లాసులోని స్టూడెంట్లంతా దయ్యం పూనినవాళ్లలా వొళ్లు మరిచిపోయి పనిచేస్తున్నారు. ఫంక్షన్ సాయంత్రం నాలుగున్నరకు. సరిగ్గా మూడుగంటలకు వాళ్లకోటెలిగ్రాం అందింది. మద్రాసులోని యేదో లాడ్జినుంచీ వచ్చిందది. "మధుశోధన్ అనేవ్యక్తి అక్కడి గదిలో ఆత్మహత్య చేసుకొన్నాడు. స్నేహితులకో వుత్తరం గూడా రాసి పెట్టాడు. వెంటనే రండి' - అదీ వార్త. ఆ వుత్తరంలో యెవరి పేరుందో యేమోనని కంగారు పడుతూ స్టూడెంట్లు చాలా మంది మద్రాసుకు వేంచేశారు. రెండురోజులు తిరిగిన తర్వాత, ఆపేరున్న లాడ్జీయేదీ మద్రాసులో లేదన్న కొత్త నగ్నసత్యాన్ని తెలుసుకుని వాళ్లు తిరిగొచ్చారు. నేను నాగదిలో ముసుగుతన్ని పడుకునివున్నాను. రెండుమూడు రోజుల వరకూ యెవరూనాతో మాట్లాడలేదు. తీరావొకతను ధైర్యంచేసి పలకరించినప్పుడు 'నేనలా వొసారి మావూరి కెళ్లొచ్చాను. టెలిగ్రాం యెవరిచ్చారో నాకేంతెలుసు?' అని కసురుకున్నాను. అలా చెప్పకుండా నా అంతటి వాణ్ణి నేను యిక్కడ చదువుతుండడమే గొప్ప! అది మరిచిపోయి మీరంతా ఫంక్షను ఫంక్షనంటూ వొళ్లుమరిచిపోతే నాకొళ్లు మండిపోదా చెప్పండి? అని స్పష్టంగా నీలదీస్తారా యెవరైనా యీ మామూలు మనుషులును?

దూరంగా రోడ్డుపైన యెద్దుల బండొకటి కందెనలేని చక్రాలతో డబడబలాడుతూ కదులుతోంది. బండి కింద వేలాడుతున్న లాంతరు దీపం దిగాలు పడ్డ బిక్షగాడి చూపులా మినుకు మినుకు మంటోంది. బండినిండా బస్తాల్లా క్రిక్కిరసిన జనాల్లోంచీ యెవరో వొక పల్లెటూరిపిల్ల కూనిరాగం పాడుతోంది. మిగిలిన వాళ్లందరూ కోరస్ అందుకుంటున్నారు. శబ్ద

సముద్రంలోకి కలవబోతున్న చిన్న శబ్ద నీరవంలా బండి ముందుకు దొర్లుకుపోతోంది!

అంతే! సామాన్యుల సంగతి అంతే! రొటీన్‌లైఫ్‌లో, గానుగెద్దుల బతుకులా, అరిగిన విలువలతో, నడచి నడచీ బండ బారిన దారిలో సాగిపోతూనే వుంటారు. కానీ బతుకొకోసారి యెంతటి వాడినైనా మచ్చికచేసుకుని స్వారీ చేయడానికి ప్రయత్నిస్తూనే వుంటుంది. గుప్పెడు జీతంరాళ్లకోసం సాదాసీదా గుమాస్తాగా రెండేళ్లు బండిని లాగినప్పుడు కాలమెంత మెల్లగా దొర్లిందని? నిముషాల్ని సంవత్సరాలుగా, దినాల్ని యుగాలుగా సాగదీసిన గడ్డురోజులని. యేప్రత్యేకతాలేని మనుషుల మధ్య, వాళ్లతో సమానంగా ఫైళ్లల్లోతలదూర్చి పనిచేయ వలసి వచ్చినప్పుడు యెంత చిత్రహింసకు గురయ్యానో అదినాకే తెలుసు! యెవరితోనూ మాట్లాడకుండా నాపనేదో నేను చేసుకుపోయేవాణ్ణి. నావొంటరి గదిలోకి యెవర్నీ రానిచ్చేవాణ్ణిగాదు. నాగది దాటి బయటికెళ్లే వాణ్ణిగాదు. యేరకమైన వైచిత్రీలేని సాధారణమైన మామూలు అమ్మాయిని పెళ్లిచేసుకొమ్మంటూ కొందరు రాయబారాలు మోసుకొచ్చారు. నేను వాళ్ల ముఖమైనా చూడలేదు.

కుడి చెంపపైన నరం వుబుకుతోంది. యెడమ తొడ దగ్గర రోమాలు నిక్కబొడుచుకుంటున్నాయి. చేయి జేబులోకి వెళ్లింది. జేబులో మాత్రలు లేవు. వెంటనే రెండు మాత్రలు మింగకపోతే చిరాకు పెరుగుతుంది. పైకిలేచి యినుకబస్తాల్ని కట్టుకున్నట్టు బరువుగా తయారైన పాదాల్ని బలవంతంగా కదుపుతూ బస్సు ఆగినవైపుకు తిరిగి, నడవసాగాను.

వొకటి...రెండు...మూడు....పది అడుగులు నడిచేసరికి వోపిక సన్నగిల్లింది. యెక్కడినుంచో, తూర్పు ఆకాశపు అంచుల్లోంచీ, జలజలపారుతున్న నదిమీదగా, వొక చల్లని ప్రాభాత వాయువు ముఖాన్ని సోకింది. కొద్దిగా హాయిగా తోచింది. అక్కడే యిసుకపైన కూర్చున్నాను.

చీకటి పలచ బారుతోంది. ఆకాశంపైన నీలిరంగు పరచుకుంటోంది. దూరంగా తిరనాళ దగ్గర రకరకాల గుడారాలూ, అటూయిటూ తిరుగుతున్న మనుషులూ సరిగా ఫోకస్ చేయని లెన్స్‌లోంచీ కనిపించే దృశ్యంలా అలుక్కుపోయినట్టుగా స్పష్టాస్పష్టంగా కనిపిస్తున్నారు. దూరంగా పడమటివైపునుంచీ, నదీ తీరంపక్కనే రెండు దీపాలు పరతెంచి వస్తున్నాయి.

అదే తూర్పుదిక్కు! అదే సూర్యుడు! మరోదినం మామూలుగా తెల్లవారబోతోంది. కానీ అప్పుడప్పుడూ యిలాంటి మామూలు రోజే వోప్రత్యేకమైన దినంగా తయారౌతుంది. మామూలు గుమాస్తాగా గదికీ ఆఫీసుకూ మధ్య గింగిరాలు తిరుగుతున్నప్పుడు, హఠాత్తుగా ఆరోజు నన్ను పలకరించింది. అసలా రోజు దాదాపు వారం దినాలుగా నా వెనకే తిరుగుతున్నట్టు నేను గుర్తించనైనా లేదు.

"నా పేరు మీరువినే వుంటారు...... సినిమాలు డైరెక్టుచేస్తూ వుంటాను" అంటూ పరిచయం చేసుకున్నాడతను. నేను ఆహ్వానించకపోయినా అతను చొరవగా కుర్చీలాక్కుని నాముందు కూర్చున్నాడు. మెల్లగా మొదలుపెట్టాడు - "యిప్పుడో సినిమా తీయబోతున్నాను. అందులో వోపాత్ర వుంది. వొంటరితనాన్ని ప్రేమించే వ్యక్తి అతను. యెవరితోనూ మాట్టాడడు. నవ్వంటే తెలియదతనికి, అప్పుడప్పుడూ వున్మాదానికి గురౌతూవుంటాడు. దాదాపు హీరోతో సమానమైన పాత్ర. కొత్తవ్యక్తయితే బావుంటుందని నాఅభిప్రాయం. మీ ఆఫీసు మేనేజరు నాకు ఫ్రెండు. వోసారి కబుర్లలో యీ పాత్ర సంగతి దొర్లింది. మిమ్మల్నోసారి చూడమన్నాడతను.

మీరు గమనిస్తున్నారోలేదో, వారం రోజులుగా నేను మీ నీడలా మీ వెన్నంటే వుంటూ పరీక్షించి చూశాను. మీరు నాకు నచ్చారు. మీకు మరేమీ అభ్యంతరం లేకపోతే.....'

యెవరికీ నప్పని అపురూపమైన పాత్రయినప్పుడు నేనెందుకొప్పు కోను! చిత్రంలో నేనేమీ పెద్దగా నటించ వలసిరాలేదు. డైరక్టరు చెప్పినట్టల్లా కదిలాను. మాట్లాడాను. అంతే! సినిమా రిలీజయింది. మధుశోధన్ పెద్దనటుడిగా అమాంతంగా ప్రసిద్ధుడై పోయాడు.

దూరం నుంచీ రెండు దీపాలుగా కనిపించిన వెలుతురు బాగా దగ్గరికి వచ్చింది. వున్నదీపాలు రెండే అయినా జనం మాత్రం యాభై అరవైమందికి పైగా వున్నారు. ఆదీపాల్లో వొకటి కమ్మీని గుడ్డ చుట్టిన కాగడా. యింకొకటి పొడవాటి దీపపు సెమ్మలా కనిపిస్తున్న గరడసెమ్మం. నాకు యిరవై అడుగుల దూరంలో ఆకాగడాని నేలలోకి నాటి, గరడసెమ్మాన్ని నిలబెట్టి, అందరూ చుట్టూ కూర్చుని సేద తీరసాగారు. వాళ్ల మాటలేవీ వినాలన్న కుతూహలం లేదునాకు. యీజనమొక మంద. వీళ్ల మాటలు నీటి మూటలు.... ఆవిషయం వుద్యోగానికి రాజీనామాయిచ్చిన రెండునెలల కంతా స్పష్టంగా బోధపడిందినాకు. అంత పెద్ద పాపులారిటీ వచ్చాక యింకా చిన్నా చితకా వుద్యోగ మెవరైనా చేస్తారా? చేస్తే యేంబావుంటుంది? పైగా అంత ప్రసిద్ధుణ్ణయి పోయాక యిక వేషాలు వొకదాన్నొకటి తరముకుంటూ వెతుక్కొనిరావూ? అందుకే రాజీనామా యిచ్చాను. కానీ యిదొక వింతప్రపంచమని ఆ తర్వాతే తెలిసి వచ్చింది. యెన్ని రోజులైనా రెండో ఆఫరు చిత్ర పరిశ్రమ నుంచీ రానేలేదు. నా అంతకు నేనే వెళ్లి వేరొకడి కాళ్ళావేళ్ళా పడ్డమన్నది యీ జన్మలో జరగని పని. అటు సినిమాలోకమూ, యిటు నేనూ పంతంబట్టుకుని కూర్చున్నాము. వుద్యోగాన్నెలాగూ వదిలేశాను. బ్యాంకులో వున్న డబ్బును ఖర్చుపెట్టుకుంటూ అజ్ఞాతకాండ ప్రారంభించేశాను. ప్రపంచంతో సంబంధం లేకుండా జీవించడమనే కళను ప్రాక్టీసు చేయడం మొదలుపెట్టేశాను....

"రంగ రారా, పండరినాథ రారా!
పండరి భక్తుల మొరాలకించి వేగరారా!"

కీచు కంఠమొకటి నా ఆలోచనల తెరని కత్తిలాచింపేసింది. తిరిగి చూశాను.

అంత వరకూ గుంపులు గుంపులుగా గుమికూడి యేదో గూగుపుఠాణీ చేసిన జనమంతా వొక్క సారిగా పైకిలేచి నిల్చున్నారు. అందరికీ నాయకుడిలా కనిపిస్తున్న వ్యక్తి దీపపు స్థంభంలోకి నూనె పోసి, దీపాన్ని యెగదోసి, జెండా వొకటి చేతబట్టుకుని ముందుకొచ్చి నిలుచున్నాడు. మిగిలిన వాళ్ళందరూ అలాంటి జెండాలే చేతికెత్తుకుని దీపం చుట్టూ వలయాకారంగా నిలబడ్డారు. రెండుమూడుసార్లు అటూయిటూ అడుగులు కదిపిన తర్వాత "రంగ రారా; పండరినాథ రారా!" అంటూ అందరూ బృందగానం ప్రారంభించారు. దీపం చుట్టూ, వలయాకారంగా కదంతొక్కుతూ, నాట్యం సాగిస్తూ వాళ్లక్కడికక్కడే వొక శబ్దచక్రాన్ని తయారు చేయసాగారు.

నేనేమిటి? వీళ్ల పొలకువకు జడిసి దూరంగా వెళ్లిపోవడమేమిటి? యెంతటి అలజడినైనా యెదిరించి తట్టుకోవడం నాచేతనౌతుంది. వీళ్లగొడవని నాచెవుల దరిదాపులకైనా రానివ్వకుండా అరికడుతూ, అచోటే కూర్చుని నాలో నేనుమాట్లాడుకోవడం కొనసాగిస్తాను. నేను పట్టుపట్టితే సాధించలేని దేముందీలోకంలో? చిత్ర పరిశ్రమంతటిదే తనంతట తాను లొంగి రెండోపాత్రతో తలుపుతట్టింది. యీ చిన్న భజనబృంద మొకలెక్కా నాముందు?

నేను ధరించిన రెండోపాత్ర యెలాంటిది? సామాన్యమైనదిగాదు. విలన్ పాత్ర. అసలీ సినిమాలో హీరో పాత్రకు పెద్దగా ప్రాధాన్యతేలేదు. నాదే పెద్దరోలు అందులో విలన్ యెప్పుడూ వొక కొత్తరకం ఆట ఆడుతూవుంటాడు. రష్యన్ ర్యూలట్ అనిదాని పేరు. పిస్తోలులో ఆరుబులెట్లు పడతాయి గదా! లోపల వొకే వొక బులెట్ పెట్టి మిగిలిన అయిదూ ఖాళీగా వుంచేసి, మజిల్‌ను వేగంగా తిప్పేస్తాడు. యిప్పుడెక్కడ బుల్లెట్ వుందో, యెక్కడ లేదో యెవరికీ తెలియదు. పిస్తోలు కొసని తన మెదడుపైన పెట్టుకుని వ్రేలిని ట్రిగ్గర్‌పైన పెడతాడు. ట్రిగ్గర్ నొక్కితే యేమవుతుందో తనకే తెలియదు. సస్పెన్స్.చూసీ చూసీ, కళ్లు మూసుకుని, రెండు మూడు నిముషాల సేపు సస్పెన్సు భరించాక ట్రిగ్గర్ నొక్కుతాడు. బుల్లెట్ ప్రేలదు చివరిదాకా! యీ ఆటంటే ఆవిలన్‌కెంతో ప్రాణం. నాకూ ఆగేమ్ భలేనచ్చింది. కానీ వొక్కటే లోటు సినిమా గదా, డమ్మీ బులెట్లే వాడతారు. నిజం బుల్లెట్లు వాడితేగానీ అసలైన థ్రిల్ దొరకదు గదా! యెప్పటికైనా వొ నిజం తుపాకీని సంపాదించి, నిజంగానే ఆడిచూడాలి....

కీచు కంఠంవాడు నాయకత్వాన్ని మరొక కంచుకంఠంవాడికి అంట గట్టినట్టున్నాడు. "రంగూజండాల భజన, రమ్మమైన రంగనిభజన..." అంటూ వాడిపాట, దూరంగా జాతర నుంచీ వస్తున్న వుదయరాగంలో వాళ్లు స్పష్టంగా కనబడుతున్నారు. పదిహేనేళ్ల నుంచీ, అరవై వరకూ, రకరకాల వయస్సున్న మగవాళ్ల సముదాయమది. కొందరికి పెద్ద పెద్ద గడ్డాలు గూడా వున్నాయి. కొందిరి జుట్టు జులపాల్లా వేలాడుతోంది. తెల్లటి బవిరి గడ్డాలతో, బట్ట తలల ముసలాళ్లు కొందరు కుర్రాళ్లలా గెంతుతున్నారు. అందరూ యెర్రదుస్తుల్ని కట్టుకున్నారు. కాళ్లకు గజ్జెలు గూడా వున్నాయి. తెల్లవారీ తెల్లవారక ముందే, తమపద ఘట్టనలతో నేలని తట్టి లేపుతూ, వాళ్లా గరడసెమ్మం చుట్టూ ధూళిమేఘాల సమావేశాల్ని తయారు చేస్తున్నారు. "రంగూ జండాల భజన, రమ్మమైన రంగని భజన" వున్నట్టుండి వున్మాదం ఆవహించినట్టుగా పాటా, పాటతో బాటూ వాళ్ల ఆటా వేగాన్ని పుంజుకొంది. ముందుకు మూడడుగులు గెంతి, తిరిగి వెనక్కు నాలుగడుగులు దుమికి వాళ్లు అక్కడొక శబ్దసుడిగుండాన్ని సృష్టించసాగారు. రెండు మూడడుగుల దూరంలో నేనొక్కణ్నున్నానన్న స్పృహైనా లేకుండా వాళ్లు కదం తొక్కసాగారు.

అదంతా భక్తేనా? యేమో! నామట్టుకునాకు భయమే భక్తని నమ్మకం. లేకపోతే యిన్నాళ్లూ లేని భక్తి రెండో సినిమా రిలీజయ్యేముందు ముంచుకొస్తుందా? చూశారా, నేనెంత నిజాయితీ పరుణ్నో! వున్న విషయం దాచుకోకుండా చెప్పేస్తున్నాను.... రెండో సినిమా ఫెయిలయితే నా భవిష్యత్తేమిటి? మనుష్యుల్నెలాగూనమ్మలేం. ఆ చిత్ర దర్శకుడోసారి యెర్ర దుస్తుల్ని తొడుక్కొని, మెడనిండా రుద్రాక్షలు వేసుకుని, గడ్డం పెంచుకుని కనిపించాడు. దీక్షలో వుంటే కోర్కెలు తీరుతాయని తీర్మానంచేశాడు. సినిమా పూర్తవుతూనే యీ దీక్ష సంగతేమిటో తేల్చుకుందామని నేనూ దీక్షలోకి దిగేశాను. క్షేత్రదర్శనానికి ప్రత్యేకంగా కారులో వెళ్లంటే బావుండేది. కానీ వొక్కసారిగా అంత డబ్బు ఖర్చుపెట్టే స్థితిలో లేను. టూరిస్టు బస్సే గతయింది యీ అణాకానీ మనుషుల్ని నమ్మితే యిలాగే జరుగుతుంది దీక్షేమో ముగిసింది. తిరుగుప్రయాణంలో యీ బస్సక్కడ కాళ్లపైకెత్తేసింది.

నాకుడికంటిపైన నరంజివ్వున వణుకుతోంది. యెడమ తొడ దగ్గర కండరం కప్పపిల్లలా దబదబలాడుతోంది. లేవాలి, యికపైకిలేవాలి. తప్పదు... లేవాలి... మనస్సు నుంచీ

అందుతున్న సంకేతాల్ని శరీరం చాలా ఆలస్యంగా గ్రహిస్తోంది. చివరికెలాగో నిల్చున్నాను. వెనక్కినడవాలి.... నడువు.. అదీ....కాళ్లు కదిలించాలి.. సంకేతాలు అందుతూనేవున్నాయి.... యింతలో... యేంజరుగుతోందో తెలుసుకునేలోగా యేదో జరిగిపోయింది.... వొకటి... రెండు.. మూడు.. నాలుగని లెక్కించక మునుపే నేనక్కడ లేను. యెక్కడున్నాను?... రాతిముక్కను విసిరినప్పుడు చెరువులో విస్తృతమౌతూ వ్యాపించే జలచక్రంలా భజన బృందం పెద్దదవుతూ వచ్చి నన్నమాంతంగా ముంచిపారేసింది. ఆ చిరు చీకట్లో వాళ్లు నన్నూ తమలో వొకణ్ణిగా అనుకున్నట్టున్నారు. యిటోచేయి, అటోచేయి నన్ను వొడిసిపట్టుకున్నారు. అరిచాను. వదిలి పెట్టమని పెనుగులాడాను. వాళ్లపాటనే జలపాతంలో నాకేక ఆత్మహత్యచేసుకొంది. ఓచేత్తో జెండాపట్టుకుని, వేరొక చేత్తో పక్కవ్యక్తి భుజాన్ని వొడెసి పట్టుకుని వాళ్లు అవ్యతనాట్యం మొదలుపెట్టారు. యెంతసేపని యెదురీదగలను? శరీరంలో త్రాణలేదు. రాత్రి తిన్న మూడు ముద్దలూ యెప్పుడో జీర్ణమైపోయాయి, గుప్పెడు గుప్పెడుగా తిన్న మల్టీవిటమిన్ మాత్రలు పలాయనం చిత్తగించాయి. నా అస్థిత్వం వాళ్ల నాట్య చక్రంలో పూర్తిగా లయించుకుపోయింది. అయిదారు నిముషాల తర్వాత, తెల్లవారు జామున వచ్చేకలలా స్పష్టంగా జరుగుతున్నదేమిటో స్ఫురించింది. వాళ్ల ఆట పాటలతో శృతికలిపేశాను.

కాలమెంతసేపు గడిచిందో తెలియదు. ఆడి ఆడి అలసిపోయిన తర్వాత, తరువాతి పదం అందుకునే లోపు విశ్రాంతికోసం కొంతసేపు భజన ఆగింది. అందరూ నవ్వుతూ రొప్పుతున్నారు. నేనూ వాళ్లతో బాటూ యిసుకపైనే కుప్పలా కూలిపోయాను. వగర్చే పోపిక గూడాలేదు. కొలిమితిత్తిలా యెదరొమ్ము యెగిరెగిరి పడుతోంది. గరుడసెమ్మంలోని దీపంపైకి గూడా వొక తెమ్మెర సోకినట్టుంది.

తూర్పున యెర్రటి సూర్యబింబం నీలి ఆకాశపు చివర్లోకొచ్చి బిడియంగా నిలబడివుంది. నదిపైన పాతకాలపు పుట్టిపైన చిన్నగుంపొకటి జాతరవైపుకు తరలిపోతోంది.

"మందేవూరు?'తిరిగి చూశాను.

చామన ఛాయముఖం.... పొడవాటి గడ్డం.....నల్లటి గడ్డం మధ్యలో తెల్లటి వెంట్రుకల చారొకటి.....సమాధానం చెప్పాను.

"చాలా దూరమేనే!......భలే అడుగేసినావే! ప్రాక్టీసుందా?"

నేను అడుగేయడమెక్కడ? నా అస్థిత్వం వాళ్లనాట్య చక్రపు తావిడికి మాయమైపోయిం దంతే! నన్ను కదిపిందీ, నడిపిందీ, ఆడించిందీ అంతా అదేగదా!

"నేను కొంచేపు ఆకాలవ మరవదగ్గరికి పొయినాను. మావోళ్లు చీకట్లో నన్నే నువ్వనుకున్నట్టున్నారు చూసినావా, నా గడ్డం గూడా నీకు మాదిరేవుంది ."

గరుడసెమ్మంలో నూనెపోసి, వత్తియెగదోసి, వొవ్యక్తి జెండాకర్రపైకెత్తి పట్టుకుంటూ "యీదేకదా. యిదేగదా, మన పండరిక్షేత్రంబిదేగదా!" అంటూ మరో సంకీర్తన మొదలు పెట్టాడు. యెక్కడి వాళ్లలాగే పైకిలేచి వృత్తంగా నిలబడి సకవరంకలిపారు నలుపు తెలుపు గడ్డమతను బలవంతంగా నా చేయిపట్టుకుని పైకిలేపాడు. అటువైపు చేతిని మరొకడు పట్టుకున్నాడు. నాకూ యీ సారి మొరాయించాలనిపించలేదు. మళ్లీ భజన ప్రారంభమైంది.

"యిదేగదా, యిదేగదా, మన పండరిక్షేత్రమిదేగదా!"

యెక్కడో కొండల్లో బండరాళ్ల కింద బిందువులుగా పుట్టి, వూటగామారి, జలగా కదిలి,

తనలాంటి పాయలతో ముడిబెట్టుకుంటూ సెలయేరుగాసాగి, నదుల్లో కలిసి, చివరికి సముద్రంలోకి దూకే జలరాశిలా, యెవడో వొక బవిరి గడ్డపు ముసలాయన పెదవుల్లోంచీ జారిన శబ్దం, మిగిలిన భజన బృందపు స్వరాలతో కలిసి, వాళ్లపాదాల మంజీరాల గలగలతో పెనవేసుకుని, అదొక హేళగా కదులుతున్న నాట్య భఃగిమల రవళులతో తలబడి, చివరికి చిత్రమైన రసార్ణవంలో లయించుకపోతోంది. తెల్లటి పట్టకంలోంచీ దూసుకెళ్లే వొంటరి కిరణం రంగు రంగులుగా విప్పారినట్టుగా, మ్యూజికల్ ఫౌంటెన్‌లో రంగులూ, నీటిబడగలూ, కాంతి పూసలూ అల్లుకుపోయినట్టుగా, భజన సాగింది.

యెంతసేపలా సాగిందో నాకు తెలియదు. పెద్ద పళ్లచక్రం దగ్గరికెళ్లి దానిలో అమిరిపోయే చిన్న పళ్లచక్రంలా భజన బృందం యెప్పుడో జాతర దగ్గరికి చేరిపోయింది. ఆడీ ఆడీ, పాడీ పాడీ, అలసీ సొలసీ జన సమూహాల మధ్య యిసుకమేటలపైన వొరిగిపోయిన తర్వాత, చుట్టూ కలయజూశాను.

రకరకాల దుస్తుల్లో రకరకాల జనం... బారులు బారులుగా వివిధ రకాల డేరాల్లో అంగళ్లు.... ప్రతి అంగడి చుట్టూ జనం..... గాజులు, దండలు, పాత్రలు, బొమ్మలు, బట్టలు, తినుబండారాలు..... చాలారకాల వస్తువుల అమ్మకం జోరుగా సాగుతోంది. వెలిసిన బట్టల వాళ్లూ, కాకిరంగు దుస్తుల వాళ్లూ, అద్దాలు కుట్టిన పావడలు కట్టుకున్న వాళ్లూ, పాదాలకూ చేతులకూ పెద్దపెద్ద కడియాలు ధరించిన వాళ్లూ, నలిగిన నవకాల్తో తలపాగాలు చుట్టుకున్న వాళ్లూ, వొంటినిండా రంగురంగుల పూసలదండల్ని మోస్తున్న వాళ్లూ... ఆగుంపు యేరోజు కారోజు కోతలుచేసి పొట్టనింపుకునే కోత జనాలైవుంటారు. బహాశా యీ గుంపు కొండకోనల్లో బతికే ఆటవిక సమూహలైవుండొచ్చు. వొకవేళ యీ సమూహం మెట్ట భూముల్లో చాలీ చాలనీ పంటల్ని పండించే మామూలు రైతులై వుండొచ్చు. యిటువైపు వెళ్తున్న యీ గుంపు వైనాన్ని గమనిస్తే, వాళ్లు వూళ్లకు దూరంగా బతుకుతూ పంట పొలాల్లో కాయకష్టం చేసే దిన కూలీలేమోననిపిస్తోంది. వెలిసిన బట్టలు.... కొన్ని చిక్కిన శరీరాలు..... అక్కడక్కడా చెదురు మదురుగా వయస్సులో తమస్సుతో వున్న దేహాలు...వొకటే చెమటవాసన.... వొకటే సందడి... కోలాహలం... వేడుక.... వినోదం.....కేరింతలు..... త్రుళ్లింతలు....పకపకలు.... అన్ని ముఖాల్లోనూ యేదో వుత్తేజం తొణికిసలాడుతోంది. ప్రతిముఖమూ వొక గరుడసెమ్మంలా వెలుగుతోంది.

"బారెడు పొద్దెక్కింది,... ఆకలిగా లేదా!"

తెలుపూనలుపు గడ్డంవాడు అడుగుతున్నాడు.

నాకూ కడుపులో యేదోలావుంది. ఆకలేనా?

అతను సమాధానంకోసం యెదురు చూడకుండా చేయిపట్టుకుని, నదిగట్టుకు లాక్కెళ్లాడు. దోసిళ్లతో నీళ్లు ముంచుకుని, నీళ్లతోనే ముఖప్రక్షాళనం గావించాడు. నదినీళ్లు వెచ్చగా తీయగావున్నాయి. రెండు మూడు సార్లు నీళ్లు ముఖంపైన చల్లితే ప్రాణంలేచి వచ్చినట్టయింది మళ్లీ అతను నాచేయిపట్టుకుని ఓగుడారంలోకి లాకెళ్లాడు. వుడుము పట్టంటే యేమిటో అతడు పట్టుకున్నప్పుడు తెలిసొచ్చింది. కానీ వద్దనడానికెందుకో మనసొప్ప లేదు. గుడారంలో రాళ్లపొయ్యిపైన పెద్ద సత్తుడేగ్సాలో యిడ్లీలు వుడుకుతున్నాయి. వేరే పొయ్యిపైన నల్లటి యినప బాణలిలో వడలువేగుతున్నాయి. చుట్టూజనం నేలపైన సదికాళ్లపైన కూర్చుని మద్దాకు విస్తళ్లలో నాస్టాలు తింటున్నారు. గరుడసెమ్మమంత పొడవున్న

కుర్రాడొకడు విస్తరాకు నిండా వేడి వేడి యిడ్లీలూ, వడలూ తెచ్చిపెట్టాడు.

"అన్ని వద్దు....తినలేను...."అంటూ గింజుకున్నాను.

"తిను.....తినలేకపోతే వొదిలేయ్'అంటూ అతను నిముషంలో తన ఆకు ఖాళీ చేసేశాడు. "త్వరగా ముగించు.....పొద్దంతా తినేదానికే సరిపెట్టేట్టుండావు..." అని బిగ్గరగా నవ్వసాగాడు నా ఆకు ఖాళీ అయ్యేసరికి పెద్ద గాజుగ్లాసు నిండా టీ వచ్చింది.

"నీడబ్బులు నీవీ, నా రూకలునావీ....అదీరూలు..."అంటూ గడ్డంవాడు తన బిల్లు తానే యిచ్చాడు.

యిద్దరమూ బయటికొచ్చాము. గట్లువొరుసుకుని ప్రవహించే జలరాశిలా, రెండు గుడారాల వరసల మధ్య జనప్రవాహం వురకలు వేస్తోంది. కరాళదెయ్యం మేదో నాట్యం చేస్తున్నట్టు ప్రక్కగుడారంలోంచీ పెద్దగా కర్ణకఠోరమైన చప్పుడు వెలువడుతోంది.

"చూద్దామా, పడదామా వొక పట్టు..." అని పెద్దగా నవ్వుతూ అతను ఆ పెద్ద డేరాలోకి లాక్కెళ్ళాడు నన్ను.

నేలలోకి పాతిన గుంజల పైన చెక్కలు పరచి వలయాకారంలో తయారు చేసిన బెంచీలు... వాటి ముందు యింకాస్త యెత్తుగా అవేరకం బెంచీలు... చిన్న బెంచీలపైన బారులు తీరిన మనుషులు. ప్రతి వ్యక్తి ముందూ పెద్ద బెంచీపైన చదరంగపు బల్లల్లా కనిపిస్తున్న చతురస్రాల గళ్ళు... గళ్ళల్లో వేర్వేరు అంకెలు... మధ్యలో యెత్తయిన వేదికపైన కూర్చున్న వ్యక్తి చిన్న రకం రొటేటింగ్ పాన్‌లోంచీ నెంబర్లున్న రేకుల్ని తీసి, బిగ్గరగా అంకెలు అరుస్తున్నాడు.

"ఆ పక్క రెండు సీట్లుండాయి పద..." అంటూ అతను లాక్కెళ్ళి నన్నూ వో బోర్డు ముందు కుదేశాడు.

"నాకీ ఆటరాదు..." అన్నాను బిడియంగా.

అటువైపు వరస చివర్లోంచి యెవరో "ప్రైజ్" అని అరుస్తున్నారు.

"ఆ గల్లా పిల్లోడు యీసారొచ్చినప్పుడు నీ బోర్డు దుడ్డు కట్టేయ్..." అని ఆజ్ఞాపించాడు గడ్డం వాడు. చాలని దానికి "రెండుసార్లు వోడిపోతే, మూడోసారి అదే వస్తుంది. చింతపిచ్చలాట ఆడేది కూడా బమ్మాండమా?" అని కిళారించాడు.

మొదటి మూడు ఆటలూ వోడిపోక తప్పలేదు. కానీ నెంబర్లు అరుస్తున్నప్పుడు గళ్ళల్లో చింతగింజల్ని పేర్చడం మాత్రం నేర్చుకున్నాను. నాలుగోసారి నా బోర్డులో, వరుస నెంబర్లన్నీ వచ్చేశాయి. తప్పో వప్పో తెలియకపోవడంతో, జంకుతూనే "ప్ర...యి...జ్..." అని కేకేశాను. గడ్డంవాడు నావైపు యెగాదిగా చూసి, బోర్డును పరికించి "యేమోననుకుంటిని? భలే పనోడే నువ్వు..." అని యెగిరి గంతేశాడు

గల్లా కుర్రాడు గుప్పెడు నోట్లు తెచ్చి నాముందు పోసి "యెంచుకొన్నోవ్ మల్లంక తక్కువుందనేవు.." అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

మరో ఆట... యింకో ఆట. పాపం, గడ్డం వాడు ప్రతిసారీ వోడిపోతూనే వున్నాడు. "నీ బోర్డుకు కూడా నేను దుడ్డు కడతానీసారి పోనీ..." మాటల్ని కూడబలుక్కుంటూ అడిగాను

అతనో పెద్ద నవ్వు నవ్వి "వోడిపోతా వుండాననా? యిట్లాంటి బుడ్డ బెదిరింపులకంతా బెదిరే వాణ్ణి గాదు. మనది చిట్లంపల్లి నెత్తురు. గెలిచేదాంకా దీన్ని వొదిలి పెట్టేది లేదు

బాంచెత్...'' అని మీసం మెలేశాడు.

యెన్ని ఆటలు గడచాయో లెక్కపెట్టగలిగే తీరిక లేదు. గుడారంలో కొన్ని బోర్డులు ఖాళీ అవుతూనే వున్నాయి కొత్తవాళ్ళు వచ్చి ఆడుతూనే వున్నారు అందమైన ఆడపిల్ల గాజుల శబ్దంలా నెంబర్ల డ్రమ్ములోంచీ చప్పుడు మోగుతూనే వుంది. బయటి కోలాహలం మ్రోతెత్తి పోతోంది. పాపం, గడ్డం వాడి జేబులో డబ్బు తరిగిపోతూనే వుంది. యీలోగా నేను రెండోసారి గూడా గెలిచాను. పాపం, వాడొక్కసారైన గెలిస్తే బావుణ్ణు. వాడి సంగతేమో గానీ, నాకే చెప్పలేనంత టెన్షన్‌గా వుంది. డ్రమ్ము వాడు నెంబరు అరిచినప్పుడల్లా నేను పక్క బోర్డులుకేసే చూడసాగాను. చాలాసేపటి తర్వాత, మూగవాడికున్నట్టుండి గొంతుకొచ్చినట్టుగా, గడ్డం వాడు "ప్రయిజ్..'' అని అరిచాడు. వెంటనే నేనూ ప్రతిధ్వనిలా "అవునవును... యీసారి ప్రయిజ్ నీదే!'' అని గొంతు చించుకున్నాను. గల్లా కుర్రాడిచ్చిన డబ్బుల్ని జేబులో కుక్కుకుని "యిక పోదామా!'' అని అట్టహాసంగా నవ్వుతూ గుడారం బయటికి నడిచాడు గడ్డం వాడు.

సూర్యుడు నడినెత్తిపైకొచ్చేశాడు. భగభగమండుతున్న యెండలో, రేగుతున్న దుమ్ములో, అన్ని వైపుల నుంచీ క్రమ్ముకుంటున్న చెమట వాసన్ల మధ్యలో, మనుషులు హడావుడిగా తిరుగుతూనే వున్నారు. వో నడిప్రాయపు స్త్రీ వో కూడలి మధ్యలో యెండల్తోనే మండుతున్నట్లున్న పొయ్యిపైన, జానెడు పొడవున్న మిరపకాయ బజ్జీల్ని కాలుస్తోంది. గడ్డంవాడు "యెవరు యెక్కువసార్లు గెలిచినారో వాళ్ళు పార్టీ యియ్యాల్సిందే!'' అన్నాడు.

రెండు మిరపకాయ బజ్జీలు నమిలేసరికి కారం నషాలానికంటి కళ్ళల్లోంచి నీళ్లు తన్నుకొచ్చాయి. నోరు మండిపోయింది. ఆ ప్రక్కనే రంగు నీళ్ళ షర్బత్తంగడి సిద్ధంగా వుంది. రెండు గ్లాసులు తాగాక కానీ నోరార లేదు.

"బేల్‌పూరీకి తావుందా సామీ కడుపులో'' అవతలి అద్దాల తోపుడు బండి దగ్గరి నుంచీ చాలెంజి లాంటి ఆహ్వానం అందింది.

"వేస్కో రెండు ప్లేట్లు...'''' గడ్డంవాడు బెదిరేట్టులేడు.

"యీదాణా బీణా వొక పక్కకు కూడా చాలదు. చిన్నగా ముగించు. ఆ పక్క సాయిబుల వోటల్లో కుష్కా వుడకతా వుంటుంది మనకోసరం'' అన్నాడతను.

"యింకా తిండా? నావల్ల కాదు'' గునిశాన్నేను.

"తిను తిను.. యెట్లకాదో చూద్దాం...'' అన్నాడతను. అనడమే కాదు, అన్నంతపనీ చేశాడు. మసాలా వాసనలు ముక్కుపుటాల్ని వూపి పారేస్తున్న వో గుడారంలో యిరవై ముప్పయి మంది సహయాత్రికుల మధ్యలో పాత సిల్వర్ పాత్రల్లో వడ్డించిన కుష్కానీ పులుసునీ వద్దనగలిగే వాడెవ్వడు?

బరువెక్కిన కడుపులతో భుక్తాయాసంతో బయటపడ్డాం. ఘాటైన కిళ్ళీలు రెండు కొని, వొకటి నాకిచ్చాడు గడ్డం వాడు. తాంబూలం నములుతూ ముందుకు కదిలాం

మరో కూడలిలో జనం చుట్టూ నిలబడి చూస్తూ వుండగా మధ్యలో దొమ్మరాట సాగుతోంది జనాల తలలపైన్నుంచీ, భుజాల సందుల్లోంచీ, శరీరాల మధ్య నలిగిపోతూ ఆటవైపుకు చూశాం. తీగపైన నడుస్తూ దొమ్మరిపిల్ల... కింద చిన్న తీగ చట్రంలోంచీ దూరుతూ వో యువకుడూ... పాత రాతి కాలం నాటిదేమో ననిపిస్తున్న చర్మ వాయిద్యాన్ని

బాదుతూ వో పదేళ్ళ కుఱ్ఱాడూ.. హుషారెత్తించడం కోసం చప్పట్లు చరుస్తూ చుట్టూ జనమూ... రెండు వేళ్ళూ పెదవుల మధ్య పెట్టి గడ్డం వాడు పెద్దగా యీళ వేశాడు. నేనూ యీల వేయడానికి ప్రయత్నించాను. యెన్ని రకాలుగా ప్రయత్నించినా శబ్దం పుట్టలేదు. విసుగొచ్చి ముఖం ముడుచుకున్నాను.

దొమ్మరాట దగ్గరనుంచి వెనుదిరిగి మరోవైపుకు నడుస్తుండగా "పట్టుకో... పట్టుకో' అంటూ కేకలు వినిపించాయి. కంగారుపడుతూ వెనుదిరిగి చూశామో లేదో, పెద్దగా గగ్గోలు చేస్తూ పోట్ల గిత్తొకటి మావైపుకు దుముకుతూ కనిపించింది. "తప్పుకో తప్పుకో..." అంటూ గడ్డం వాడు నన్ను పక్కకు తోశాడు. యేంజరుగుతుందో తెలిసేలోగా చేతికేదో అందింది. దాన్నలా పట్టుకునే దూరంగా యెగిరి పడ్డాను. దుమ్ము రేపుకుంటూ వెళ్తున్న యెద్దు వెనకే కుఱ్ఱాళ్ళ గుంపొకటి హాహాకారాలు చేస్తూ పరిగెట్టుకెళ్ళిపోయింది.

రెండు మూడు నిమిషాల తర్వాత "నాకు ముందే తెలుసు. నువ్వు చిన్నా పన్నా మనిషివి కాదు. యింతమంది చూస్తా వుండంగానే యెద్దు కొమ్ములకు గట్టిన సప్పరం తన్ను కొచ్చేసినావే! చూడు చూడు. దాంట్లో యెంత దుడ్డు కట్టినారో... అదింక నీదే!...' ' అంటూ గడ్డం వాడు నన్ను లేపి నిల్చోబెట్టాడు. శరీరానికంటిన దుమ్ము దులుపుకుంటూ బిక్కమొహం పెట్టాను.

"నా కాళ్ళల్లో చక్రాలుండాయనీ, వడ్డారం మనిషిననీ మా భజ.న సంఘమోళ్ళెవరూ నాతో రాను జంకతారు. నిన్ను చూసినప్పుడే కనిపెట్టేసినాన్లే, నాకంటే రెండాకులెక్కువగా తినే రకం నువ్వని..." అతను మళ్ళీ నన్ను ముందుకు లాక్కెళ్ళాడు.

డేరాల అంగళ్ళు పలచబడ్డాక, జనాల పొలకువ తగ్గినచోట, నది గట్టు దగ్గర, అయిదారు మంది మనుషులు వొంటి నిండా మట్టి పూసుకుని, యెండలోనే యిసుక తిన్నెలపైన పడుకుని కనిపించారు.

"మట్టే గదా అనుకోవద్దు.... చానా రోగాలకు అదే పెద్ద మందంట! ఆ పట్టేయించుకోవాలంటే ఆ పెద్ద తెల్లగడ్డ మాయనకు యెంత దుడ్డడిగితే అంతియ్యాల్సిందే! నీకిష్టంగా వుంటే మల్లంక మట్టిలో దొర్లదాం గానీ ముంద నీళ్ళల్లో దుముకులాడుదాం రా!' ' అంటూ యెగిరి నీళ్ళల్లోకి గెంతాడతను.

నేను కాస్సేపు గట్టునే యిసుక పైన పడుకున్నాను. నీళ్ళ పైనుంచీ వీస్తున్న వేడి గాలి కూడా బాగానే వుంది. అటువైపున మట్టి రాసుకుని పడుకున్న మనుషులు చందనం పులుముకున్నామనుకుంటున్నారేమో; గలగలా నవ్వుకుంటున్నారు. నది నీళ్ళల్లో యీతలాడుతున్న కుఱ్ఱాళ్ళ గుంపు కేరింతలు కొడుతోంది. నెమ్మదిగా కాళ్ళు మాత్రం నీళ్ళలోకి దించాను పారుతున్న నీటిలో పాదాలు మోపిన దగ్గర యిసుక తరిలిపోతూ చక్కలి గింతలు పెడుతోంది గడ్డం వాడు నీళ్ళలోంచే చేయి చాపి నా కాళ్ళు పట్టి లాగేశాడు. అమాంతంగా తూలి నీళ్ళలో పడ్డాను. ముక్కుల్లోకీ, చెవుల్లోకీ, నోట్లోకీ నీళ్ళు దూరేశాయి. వూపిరి తిరగలేదు కాస్సేపు. "పెద్ద కోనేరో బాయిలోకి దూకేసినట్లుగా గాబర గీబర మంటావేంది? లేచి నిలబడి చూడు. తొడలోతు కూడా లేదిక్కడ. కొంచేపు కాళ్ళూ చేతులూ ఆడించు. యీతదే వస్తింది.." అని కసురుకున్నాడతను.

పది పదిహేను నిముషాలు తర్వాత నీళ్ళంటే భయం పోయింది. చేతులతో

నీళ్ళగరగొడుతూ, కాళ్ళు పైకి తేలేస్తుంటే భలే సుఖంగా తోచింది

వొడ్డుపైన మరో శబ్ద వీచిక సుళ్ళు తిరుగడం మొదలు పెట్టాక గానీ చాలా సేపయిన సంగతి స్ఫురించలేదు నాకు.

అంతవరకూ యీతలాడిన కుర్రాళ్ళందరూ రెండు జట్లుగా విడిపోయి యిసుకలో కబడీ ఆడడం మొదలు పెట్టినారు. ఆశ్చర్యం, గడ్డం వాడు కూడా వో జట్టులో చేరిపోయి కదం తొక్కుతున్నాడు.

గుక్కెడు నీళ్ళు మరోసారి తనివి తీరా తాగి నది బయటికొచ్చాను. బట్టలన్నీ తడిసిపోయి వున్నాయి. జేబులోని పర్సులోకి గూడా నీళ్ళు దిగాయి. నోట్లు కూడా తడిసిపోయాయి.

"భలే దుడ్డు జూసినావు గానీ రా! రెండు ఆటలాడదాం!" అన్న గడ్డం వాడి కేక వినిపించింది. "నేనీ పక్క... నువ్వా పక్క... యిక కానీ చూద్దాం... రేయ్ పిల్ల కాయలూ! యిప్పుడెవర్రా కూత కుయ్యాల్సింది?" తానే ఆటగాడూ, రెఫరీ రెండూ అయినట్లుగా గడ్డం వాడు ద్విపాత్రాభినయం మొదలుపెట్టాడు. కుర్రాళ్ళయినా వొక్కొక్కడూ నా అంతున్నాడు. వాళ్ళతో నెగ్గకపోతే నా మానం పోదూ!

నాలుగైదు ఆటలు గడిచాయి. వోసారి అవుటయినప్పుడు పక్కకొచ్చి కూర్చున్నాను. నదిలోపల పుట్టి పైన యాత్రికుల గుంపొకటి పెద్దగా పాడుతూ వెళ్తోంది. దూరంగా గుడి దగ్గర నుంచీ వాయిద్యాల ఘోష మిన్ను ముడుతోంది. సూర్యుడెప్పుడో పడమటి ప్రాంతాలకు చేరువైపోయాడు. లేలేత యెరుపు కిరణాలు సోకుతుంటే నది జాతరలో పాల్గొనే నిశ్శబ్ద యాత్రికుడిలా గుణగుణా సాగిపోతోంది.

కాస్సేపు గడచిపోయింది. మరో ఆట ప్రారంభించే ముందు పిల్లలు పిలుస్తారేమోనని యెదురు చూశాను. యెంతకూ పిలుపు రాలేదు. విసుగ్గా వెనుదిరిగి చూశాను. పిల్లలు ఆడుకుంటూనే వున్నారు. కానీ... కానీ... గడ్డం వాడు యేడీ?... యెక్కడతను? కనిపించడేం? యేమయ్యాడతను? కంగారు పడుతూ వో దూకు దుమికి "గెడ్డం వాడెక్కడ?" అని అడిగానో కుర్రాణ్ణి.

"యెప్పుడో వెళ్ళిపోయాడు గదా!" అదేదో మామూలు విషయమైనట్లుగా చెప్పేసి వాడు మళ్ళీ ఆటలోకి దూరేశాడు.

చుట్టూ రెండు మూడుసార్లు తిరిగాను. అతనెక్కడ కనిపించలేదు. మట్టి స్నానం చేస్తున్న వాళ్ళ షిఫ్టు మారినట్టుంది. కొందరు సన్‌బాత్ చేస్తుండగా మరికొందరు జలస్నానం చేస్తున్నారు. జనసముదాయం లోకి జొరబడ్డాను. యెటు చూసినా జనమే! రకరకాల వయస్సుల వాళ్ళు... రకరకాల రంగుల వాళ్ళు... రకరకాల దుస్తుల వాళ్ళు... రకరకాల ప్రాంతాల వాళ్ళు... రకరకాల గడ్డాల వాళ్ళు... కండెచుట్టూ తిరిగే దారంలా ఆ జాతర సముదాయాన్నంతా రకరకాలుగా చుట్టేశాను. కానీ గడ్డం వాడు, ఆ నలుపూ తెలుపూ గడ్డం వాడు, కనిపించలేదు. నలుగుర్నైదుగుర్ని వాకబు చేసి చూశాను.

"పేరేమి?... వూరేది?... యెంత వయసు?"

అన్నీ పిచ్చి ప్రశ్నలే అడిగారు వాళ్ళు.. వాళ్ళనడిగి లాభమేముంది? నల్లటి గడ్డం... మధ్యలో, సరిగ్గా మధ్యలో తెల్ల పాయొకటి చివరి దాకా... అతను.. అతనే . యెక్కడండీ

అతను?

రెండు డేరాల మధ్యలో చిన్న పీట వేసుకొని వో మంగలి వాడు గడ్డాలు గీస్తూ కనిపించాడు.

"చూడూ! నలుపూ తెలుపూ గడ్డం వాడు. నల్లటి గడ్డానికిసరిగ్గా మధ్యలో తెల్లటి పాయొకటి.. అతన్ని చూశావా నువ్వు! చెప్పు త్వరగా!" అని వేగిరపరచానతణ్ణి.

అతను కత్తిని పక్కన పెట్టి నాకేసి పరకాయించి చూశాడు "యిప్పుడు చూస్తానే వుండాను గదా! కావాల్లంటే నువ్వు చూడు.." అని అతను చిన్న అద్దం నా చేతికిచ్చాడు. నిజమే! దీక్షలో పెరిగిన నా పొడవాటి గడ్డంలో మధ్యగా తెల్లటి పాయొకటి వుంది. యిద్దరు తెలుపూ నలుపూ గడ్డం వాళ్ళుంటే అతడినెలా కనిపెట్టడం?

"గడ్డం పని చేసుకుంటావా సామీ! చణంలో పౌడర్రాసినంత మెత్తంగా షేవింగ్ చేసేస్తాను" అన్నాడు మంగలివాడు.

మారు మాటాడకుండా అతడి ముందు కూర్చున్నాను. పని ముగించాక మళ్ళీ అద్దం నా చేతికిచ్చాడతను. నున్నటి గడ్డం జనాలు లేని నేలలా బోసిగా కనిపించింది. జేబులోంచీ నోటొకటి తీసి, అతడి సరంజామా పైన పెట్టి పైకి లేచాను.

యిప్పుడిక్కడ వొక్కడే నలుపూ తెలుపూ గడ్డం వాడున్నాడు. యింకెక్కడికి తప్పించుకు పోగలడు వాడు? రెండు మూడు కూడళ్ళ దగ్గర వాకబు చేశాడు. యింతలో యెవడో వో అబ్బాయి గబగబా వచ్చి నా చేయి పట్టుకుని ఆపాడు.

"అవును... మీరే! నిజ్జంగా మీరేనా? ఆ వేషంలో దంచేసినారు సార్!"

యింకో కుర్రాడు నన్నమాంతంగా కౌగలించుకున్నాడు. "మీరోల్ అదిరింది సార్! సూపర్ హిట్... అంతా మీ వల్లనే!" అంటున్నాడతను.

చూస్తూ వుండగానే నా చుట్టూ జనం గుమికూడిపోయారు. మాట్లాడనివ్వలేదు. కదలనివ్వలేదు. వూపిరి పీల్చుకోనివ్వలేదు.. నారెండో చిత్రం నేను యాత్రలో వున్నప్పుడెప్పుడో, రెండు మూడు వారాల క్రితం విడుదలైనట్టుంది. నాకెప్పుడో తెలుసు అది పెద్ద హిట్టవుతుందని. గడ్డం గీసుకుని రావడంతో నా అసలు స్వరూపం బయటపడినట్టుంది. అందరూ గుర్తు పట్టేశారు.

"సార్! ఆటోగ్రాఫ్" కుర్రాడొకడు సంతకం కోసం యాభై రూపాయల కాగితాన్ని నా ముందుకు చాపుతున్నాడు. "యిది మీ గుర్తుగా నేనుంచుకుంటాను..." నా రుమాలు వొకతను లాక్కుంటున్నాడు.

వాళ్ళ వరస చూడబోతే నన్ను యేకీలుకాకీలు వూడలాగి జ్ఞాపక చిహ్నంగా దాచుకునేలా వున్నారు. "తప్పుకోండి, తప్పుకోండి" అని వాళ్ళని బ్రతిమలాడాను. చివరికి వున్నాదిలా పరిగెత్త సాగాను జనం నావెంట పరిగెత్త సాగారు. యెదురుగా మా బస్సు కనిపించింది.

బస్సులోకి పరుగు పరుగునా యెగబ్రాకి, నా సీట్లోకెళ్ళి కూర్చున్నాను యాత్రీకులందరూ తమ తమ సీట్లలో కూర్చుని వున్నారు

కాస్సేపటి తర్వాత నన్ను గుర్తుపట్టిన డ్రైవరు "బతికించినావు సామీ! గంట సేపట్నుంచీ నీకోసరమే యెదురు చూస్తూ వుండాము యేమయిపోయినావు?" అని

విసుక్కుంటూ యింజను స్టార్టు చేశాడు.

"జాతరలో యేం చేసినావు మహానుభావా! జనమెందుకు నీ వెంట పరిగెత్తుకొస్తున్నారు?' ' అంటూ పక్కసీటు పాసింజెరు యెకసెక్కాలు పోయాడు

జనం కిటికీ కవతలి నుంచీ చేతులు చాపి నా చేతిని నలిపేయసాగారు. బస్సు వేగం పుంచుకున్నాక గానీ వూపిరి తిరగలేదు నాకు.

బస్సు గుండ్రంగా వో మలుపు తిరిగి, మళ్ళీ జాతర వైపుకు పరుగు తీసింది. జాతర చక్రాన్ని రెండుగా విభజిస్తున్నట్టున్న మట్టి రోడ్డుపైన వేగంగా దౌడు తీయసాగింది. ఆశ్చర్యం... జనాల మధ్యలో నలుపూ, తెలుపూ గడ్డం వాడు కనిపించాడు "వాడే! అదిగో అక్కడ...' ' అని బిగ్గరగా అరిచాను. ప్రయాణీకులంతా ఉలిక్కిపడి నాకేసి వింతగా చూడసాగారు.

"యిడుగో, యిక్కడ కూడా వీడే!" అని మళ్ళీ అరిచాను యీసారి ప్రయాణీకులు వులికి పడలేదు. నాకేసి చూస్తూ అదోలా నవ్వసాగారు.

ఆశ్చర్యం, అద్భుతం. వొక్కడు కాదు. అక్కడక్కడా, ప్రతి గుంపులోనూ వొక్కడుగా, ప్రతి యిద్దరిలోనూ వొక్కడుగా, గడ్డం వాడు కనిపించసాగాడు. బస్సాగలేదు. గడ్డం వాడి వీడ్కోలు గీతంలా జాతర నాదం అంతకంతకూ దూరమైపోసాగింది. బాగా దూరానికి వెళ్ళిపోయిన తర్వాత పరకాయించి చూస్తే జాతర సముదాయమంతా కలిసి గడ్డం వాడి ముఖంలా చిత్రంగా గోచరించసాగింది.

నా సీటు కెదురుగా సూట్‌కేసు పైన మందుల డబ్బా కనిపించింది. ఆరోజు వుదయం నుంచీ మాత్రలేవీ మింగలేదన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. చాలా రోజుల తర్వాత కడుపు నిండా తిన్నానన్న విషయం గుర్తుకొచ్చింది. దాదాపు వో పగలంతా నా కణత నరం మెలి తిరగలేదు. తొడ కండరం సుడి తిప్పలేదు. తెలుపూ నలుపూ గడ్డం వాడిపైన కృతజ్ఞత పెల్లుబుకుతోంది. కానీ యేడీ అతను? యే గుంపులో, యే వేడుకలో, యే సంరంభంలో వున్నాడు వాడు? యెన్ని చోట్లయినా, యెంత కాలమయినా వెతకాలనే వుంది. కానీ యీ పాపులారిటీ ముంచుకొచ్చాక నా వెతుకులాట నన్ను వెతుక్కోనిస్తారా యీ జనాలు? యే ప్రత్యేకతా లేని సాధారణమైన వ్యక్తిగా, మామూలు మానవుడిగా, జనంతో కలిసి పదిమందిలో వొకడుగా, సముదాయంలో వొక భాగంగా, వొళ్ళు మరచి గుంపులో కలిసిపోతూ నా మిత్రుడైన నలుపూ తెలుపు గడ్డం వాడిని అన్వేషించి పట్టుకో గలిగేదెప్పుడు? అది సాధ్యమేనా యికపైన? దాహం తీర్చుకోడానికి మామూలు నీళ్ళు గ్లాసెడు చాలు. పెద్ద సముద్రంలో ప్రయాణం చేస్తున్నా, మంచినీళ్ళు కరువైతే బతకడమెలా? నీడల్లో, చీకట్లో, వొంటరితనంలో, నీళ్ళలో, యెండలో, మట్టిలో గడపడమెలాగో తెలుసు నాకు. జనస్నానపు రుచి యిప్పుడిప్పుడే తెలిసింది. కానీ...

సూట్‌కేస్ పైని మందుల డబ్బా వెక్కిరిస్తుంది నన్ను..

నా రెండో సినిమా పాత్రకు యిష్టమైన పిస్తోలు ఆట వూరిస్తోంది..

నాకు నిజంగా .... నిజ్జంగా... భయమేస్తోంది.

డా॥ మధురాంతకం నరేంద్ర, లెక్చరర్,
ఇంగ్లీష్ డిపార్ట్‌మెంట్, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి-517 502

## ఆడెపు లక్ష్మీపతి కథ

# అన్యాపదేశమ్

మండల్ కమిషన్ నివేదికను అప్పటి కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన దరిమిలా చెలరేగిన దాని అనుకూల, వ్యతిరేక ఉద్యమాలు ఆరేళ్ల క్రితం ప్రతిభ అనే నైరూప్య పదార్థం మీద తీవ్రమైన చర్చనీ, నిశితమైన వాదోపవాదాల్నీ రేకెత్తించాయి. రిజర్వేషన్ విధానం హేతువిరుద్ధమనీ, అది ప్రతిభావంతుల పాలిట పిడుగుపాటువంటిదనీ, కాగా దానివల్ల కార్యనిర్వాహక శ్రేణుల్లో, ఉన్నత పదవుల్లో బుద్ధికుశలత లోపించిన వాళ్ల సంఖ్య హెచ్చి దేశాభివృద్ధి కుంటుపడుతుందనీ ఒక వర్గం పండితులు ఆక్రోశం, ఆగ్రహం వెలగ్రక్కితే; ప్రతిభ అనేది బ్రహ్మ పదార్థమేమీ కాదనీ, సమాన అవకాశాలు, సరియైన వాతావరణం కల్పిస్తే అందరిలోనూ ప్రజ్ఞాపాటవాలు వికసిస్తాయనీ, శతాబ్దాలుగా ఎదుగుదల తిరస్కరించబడ్డ అణగారిన ప్రజానీకానికి రిజర్వేషన్ల కల్పన అనేది నిజంగా సామాజిక న్యాయం చేకూర్చె ఉత్తమ విధానమనీ మరో వర్గం మేధావులు హర్షం వ్యక్తం చేశారు. ఈ తరహాధోరణులు, ప్రతిభకు సంబంధించి అభిప్రాయ విభేదాలు మన దేశానికే పరిమితంకావు - ఎంతో అభివృద్ధిచెందిన అమెరికాలోనూ ఇవి బలంగా వీస్తూ వివాదాల్ని రేపుతున్నాయి. తెల్ల.జాతి వాళ్ళతో పోలిస్తే నల్లజాతి వారిలో బుద్ధికుశలత తక్కువేననీ సిద్ధాంతీకరిస్తూ రూబెన్ అనే శ్వేతజాతి మేధావి అక్కడ 'బెల్‌కర్వ్ థియరీ' పేర్న ఓ ఉద్గ్రంథం రాసిపారేశాడు!

సరే - ఇదంతా చరిత్రకూ, మన చుట్టూ జరుగుతున్న పరిణామాలకూ సంబంధించిన ముచ్చట. ఇంతకీ నేను సీరియస్‌గా చెప్పొచ్చేదేమిటంటే ఈ ప్రతిభ అనే జటిల సంగతి నాలుగు రోజుల్నించి నా మెదడును కుమ్మరి పురుగులా తొలిచేస్తోంది. మనసు లగ్నం చేయలేక, నిన్న మొదలు పెట్టిన వ్యాసాన్ని ఈ రోజు కూడా పూర్తి చేయలేనేమోననిపిస్తుంది

వేడివేడి కాఫీ కప్పు నాకెదురుగా టేబిల్ మీద పెట్టి నా శ్రీమతి అంది; "త్వరగా ఆ రచనా వ్యాసంగం పూర్తికానిచ్చి స్కూలుకు బయలుదేరండి. పొద్దున కూడా బాబుగాడిది వొకటేగోల. ఈ పూట మీరు స్కూలుకు వెళ్ళి మేష్టారుతో మాట్లాడి వాడి మార్కుల సంగతి తేల్చుకోకపోతే రేపట్నుంచి స్కూలుకే వెళ్ళడంట..... అర్థమైందా?"

రెండు గుక్కల్లో కాఫీ తాగేసి తలూపాను. "పదకొండు గంటలకు కదా. ఇంకా గంట సమయముంది."

రాయడం కొనసాగించి రెండోపేజీనింపాను ఆఖరి పేరాలో కుప్పలు తెప్పలుగా కొట్టివేతలు! పెన్నుకు క్యాప్ బిగించి కింద పడేసి, కుర్చీలో రిలాక్సింగ్‌గా కెనక్కి వాలాను.

ఆలోచించాను - నా మానసిక గజిబిజికి కారణం మా అబ్బాయికి వచ్చిన తక్కువ మార్కులు కాదు; వాడు - ఆ వాడి చూపుల కుర్రవాడూ, వాడి రచనలోని పదును!

పది రోజుల క్రితం డొక్కుసైకిలు తొక్కుకుంటూ ఓ యువకుడు నాదగ్గరికి వచ్చాడు నీలంరంగు జీన్‌ప్యాంటు, వదులైన పొడుగు చేతుల తెల్ల చొక్కా తొడుక్కున్న ఆ పాతికేళ్ల యువకుడు సన్నగా, రివటలా ఉన్నాడు. తన పేరు చెప్పి, ఓ స్థానిక బుడ్డ పత్రికలో రిపోర్టరుగా పనిచేస్తున్నట్టు పరిచయం చేసుకున్నాడు.

"నేను మీ అభిమానిని సార్. ఏ పత్రికలో వచ్చినా మీ రచనలన్నింటినీ చదువు తున్నాను....' చెప్పాడు.

"సంతోషం. రా. కూర్చో. ఏమన్నా పనిమీద వొచ్చవా?' అడిగాను.

"మీతో మాట్లాడి మీ సలహా తీసుకుందామని వచ్చాను. కథలు రాయడానికి కావాల్సిన అర్హతలేమిటి?"

"రాయాలనుకునేవాడికి ముఖ్యంగా అనుభవం, అధ్యయనం, ఊహాశక్తి వుండాలి. మొదట అపారమైన జీవితానుభవం గడించి వుండాలి. సమకాలీన కాల్పనిక సాహిత్యం విస్తారంగా చదవాలి. స్వ,పరజీవితానుభవాల్ని నిశితంగా పరిశీలించి, మన చుట్టూ సమాజంలో జరిగే ఘటనల్ని కొత్త కోణంలోంచి వీక్షించి, వాటికి తన ఊహాశక్తిజోడించి అక్షర రూపమివ్వగలగాలి...." గతంలో కొత్త రచయితల కొరకు నేను రూపొందించిన పాఠ్యాంశంలోని ఒక పేరాను ఆశువుగా చెప్పాను.

"నేను ఎంతో శ్రమించి కొన్ని కథలు రాశాను. అవి అచ్చుకు నోచుకోవడంలేదు. కొన్ని కథలు పంపిన వెంటనే తిరుగు టపాలో వచ్చేశాయి. మరికొన్ని అయిపూ అజాలేకుండా పోయినయ్."

తనదంటూ ఓ నిర్దిష్టమైన శైలీ, అసాధారణ శిల్పవిన్యాస ప్రజ్ఞ లేదా ఎవరైనా లబ్ధప్రతిష్టుల చేయూత ఉంటేగానీ ప్రవేశం లభించని రీతిలో పోటీమయమైపోయిన నేటి సాహితీరంగంలోకి దూకాలని ఉబలాట పడుతూన్న ఆ అర్భకుడి అజ్ఞానానికిక నాకు నవ్వు వచ్చింది. "చెప్పాను కదా - జీవితానుభవం, అధ్యయనం తప్పని సరి అని. అంశం పాతదే అయినా వినూత్న తరహాలో దాన్ని ప్రెజెంటు చేయగల నేర్పు ఉంటే తప్ప ఈ రోజుల్లో రచయిత కాలేడు. "

కొన్ని క్షణాలు కళ్ళు మూసుకుని మళ్ళాతెరచి చెప్పడానికి ఉపక్రమించాడా యువకుడు. "జీవితాన్నీ, సమాజాన్నీ చదివాననే అనుకుంటున్నాను. ఎనిమిదేళ్ళ వయసులో ఉన్నప్పుడు నాగపూర్‌లో మా లోహపని వృత్తివాళ్ల కుటుంబాల్లో దాయాదులతో తగాదాలు, రక్తపాతం కళ్ళజూశాను. పాత తరం ఉమ్మడి కుటుంబం అలా విచ్ఛిన్నమై పోవడంతో కుటుంబం ఆంధ్రకు వలస వచ్చి నాన్న స్పిన్నింగ్ మిల్లులో జాబర్‌గా పనిచేసినంత కాలం స్థిరమైన జీవితం. మిల్లు మూత పడ్డాక వీధుల్లో పడి ఆకలి దప్పులతో అలమటించాము. మందు కాదు కదా, గుక్కెడు గంజినీళ్ళు కూడా కరువై నాన్న దిక్కులేని చావు చచ్చాడు. అక్క ఎవడి తోనే లేచిపోయింది. అమ్మ నన్ను వదిలేసి మరు మనువుతో ఎటో కనపడకుండా వెళ్ళిపోయింది. పసితనం పీడని పద్నాలుగేళ్ళ ప్రాయంలో రైల్వే ప్లాట్‌ఫారమ్ మీద పరాన్న భుక్కుగా బతికాను. తర్వాత క్వారీలో చేరి నాలుగేళ్లు రాళ్లు కొట్టాను ఆ తర్వాత రెండేళ్లు వ్యాగన్లలోంచి బొగ్గు చోరీ చేసి అమ్ముకునే పని చేపట్టాను. ఆ వృత్తిలో ఉండగా పట్టుబడి సంవత్సరం జైలు శిక్ష అనుభవించాను విడుదలయ్యాక పేపర్ బాయ్‌గా స్థిరపడ్డాను మా

ఏజంటు సహకారంతో చదువుకుని డిగ్రీ పాసయ్యాను నా ఆశయం రచయిత కావాలని! చేతికందిన ప్రతి పుస్తకాన్నీ, పేపర్నీ ఆఖరుకు తోచకపోతే - మిరపకాల బజ్జీల పొట్లాం మీది మేటర్నీ చదివాను. మీరచనలన్నింటినీ దాదాపు అవుపోశన పట్టేశాను.

చెబుతున్నప్పుడు ఆ యువకుడి చామన ఛాయకోల ముఖంలోని తెల్లటి కళ్ళలో నల్లటి కనుపాపలు చిత్రంగా కదిలాయి. చెప్పేది సూటిగా ముక్తసరిగా వుంది. ముఖంలో నిర్భీతికత, చూపుల్లో - జీవితంలో దేన్నయినా అలవోకగా ఎదుర్కొంటాననే ఆత్మవిశ్వాసం ప్రస్ఫుటమవుతున్నాయి. జాక్ లండన్ కథ ' ది మెక్సికన్'లొని ఫిలిప్ రివేదా; స్టీవ్ బెక్ నవల' ఇన్ డూబియస్ బాటిల్‌లోని మాక్ పాత్రలకు రూపం ఊహించుకుంటే వాళ్ళు ఇతడిలాగే ఉంటారేమోననిపించింది. ఏకలవ్య శిష్యరికం నెరపుతూ అతడు నా రచనల్ని అపురూపంగా భావిస్తున్నందులకు నాకు కించిత్ గర్వం కలిగింది. శతాధికంగా రచనలు చేసి, కల్లోల ప్రాంతపు కడగండ్ల జీవితాల గురించి సాధికారంగా రాస్తున్న రచయితగా నా పేరు చలామణీ అవుతోంది! (ఆ పేరు రావడానికి నేను సల్పిన కృషి, అంతకుమించి - సాహితీ దిగ్గంతుల దృష్టిలో పడేందుగ్గాను నేను చేసిన పైరవీలు, ఏదో రకంగా నా రచనలు ప్రస్తావించబడడం కోసం నేను విమర్శకుల్ని పట్టిన నానా రకాల కాకాలు ఇప్పుడు అప్రస్తుతం.)

" పచ్చి అనుభవం సరిపోదు. పరిపక్వత రానీయాలి. వ్యక్తిగత అనుభవశకలాన్ని అవ్యక్తిగతం చేసి, అది విశ్వజనీన సత్యంగా పాఠకుడికి స్ఫురించేటట్టు రచనని తీర్చి దిద్దాలి. మొట్టమొదట నువు ప్రక్రియా రచనకు సంబంధించిన ప్రాథమిక సూత్రాలు బాగా ఆకళింపు చేసుకోవాలి. సంబంధిత పుస్తకాలు చదవాలి. ఉబలాట పడి రాసిందల్లా ఫిక్షను కాజాలదు...' ' సలహా యిచ్చి ఇక వెళ్ళిపొమ్మన్నట్టుగా చూశాను.

ఒక్క క్షణం నా వేపు చూసి సాలోచనగా తల పంకించాడు. వెంట తెచ్చిన చిన్న పాలిథీను క్యారీ బ్యాగులోంచి ఓ కాగితాల కట్ట బయటికి తీశాడు. ఆ రాత ప్రతుల్ని టేబిల్ మీద పెట్టి, "సార్, ఇవీ నేను రాసిన కథలు. మొత్తం ఎనిమిది. దయ చేసి వీటిని చదివి మీ అభిప్రాయం చెప్పండి. నేనుఫిక్షన్ రైటర్‌గా పనికొస్తానా లేదా అన్నది తేల్చి చెప్పండి. మీరు చాలా బిజీ అని నాకు తెలుసు. మీ సమయం మీరు తీసుకోండి. నేను అప్పుడప్పుడు మిమ్మల్ని కలుస్తూంటాను," అని లేచి నిలబడ్డాడు. నా సమాధానం కోసం ఎదురు చూడకుండా గబగబా బయటికి నడిచి సైకిలెక్కి రివ్వుమని వెళ్ళిపోయాడు.

నా వృత్తి, ప్రవృత్తి వ్యాపకాల్లో పడి అతడి గురించి మరిచేపోయాను. వారం రోజుల పోయాక, ఓనాడు వంట్లో అస్వస్థతగా ఉన్నట్టనిపించి ఆఫీసుకి సెలవు పెట్టి ఇంటి పట్టునే ఉండిపోయాను. కేబుల్ టీవీ వైర్లు మరమ్మతులో ఉండటం వల్ల మరో కాలక్షేపంతోచక పనికొచ్చే ఆర్టికల్ కోసం ఇంగ్లీషు దిన పత్రికలు వెదుకుతున్నప్పుడు, రబ్బర్ బ్యాండ్ వేసి వున్న సదరు రాతప్రతులు నా చేతికి అందాయి. ఇంటి వెనక జామ చెట్టు కింద పడక కుర్చీలో కూర్చుని ఆ కథల్ని చదవడాని కుపక్రమించి, ఏక బిగిన ఎనిమిది కథలూ పూర్తి చేశాను. నా బుర్ర తిరిగి పోయింది!

కల్లోల ప్రాంతపు జీవన సంఘర్షణనీ, సామాజిక విలువల విధ్వంసాన్నీ నేనొక్కడినే ప్రతిభావంతంగా అక్షరీకరిస్తున్నానన్న నా అహంభావం ఒక్కసారిగా పటాపంచలయింది నావి రొడ్డకొట్టుడు రచనలనీ, అవి మూసలో పోసి తీసిన ముతక బోలు పాత్రలేననీ నాకర్థమయిందప్పుడే. తద్విరుద్ధంగా కొత్తపాళీ నుండి వెలువడ్డ ఆకథలు చాలాకాలం. గుర్తుండే కళాకృతులు అనదగ్గవి! వాటిల్లో - జైలు ఆవరణలోని మనుషుల రెజిమెంటల్ ప్రవర్తన

ఇతి వృత్తంగా గల ఒక కథ ఫ్రాంజ్‌కాఫ్కా ప్రసిద్ధ కథ 'ఇన్ ది పీనల్ కాలనీ'ని గుర్తుకు తెచ్చేలా వుంది. వెంటాడుతున్న పోలీసులు బారినుండి తప్పించుకు పారిపోతున్న దొంగ చివరికి ఒక అపరిచితుడి ఇంట్లో తలదాచుకోవడం, ఆ యింటి యజమాని హెడ్‌కానిస్టేబుల్ అయివుండీ ఒకానొక అవ్యక్తమర్మిక కారణం మూలంగా దొంగను కాపాడ్డం అనేది వస్తువుగా ఉన్న మరోకథలో నేర ప్రవృత్తి మూలాల్నీ, మానవ విలువల విజయాన్ని ఆవిష్కరించిన తీరు జోసెఫ్ కాన్‌రాడ్ పెద్దకథ 'ది సీక్రెట్ షేరర్'లోని శిల్పంతో పోల్చదగ్గ స్థాయిలోవుంది. అలా ఆ కథలు దేనికదే విశిష్టమైనవిగా ఉన్నాయి. అవి చదవడం పూర్తిచేయగానే నాకు లాటిన్ అమెరికన్ రచయితలు - మార్క్వెజ్, బోర్హెస్, కోర్టజార్, కార్పెంటియర్ తదితరులు, వాళ్ళు ప్రయోగించిన మార్మిక వాస్తవిక వాద, అధివాస్తవిక వాద, అధికాల్పనిక వాద ధోరణులు స్ఫురణ కొచ్చాయి. కుర్రవాడు కాపీ చేయలేదు; వాడిమీద ఎవరి ప్రభామూలేదు; నిస్సందేహంగా ఆ ఆణిముత్యాలు స్వీయ రచనలు అని బల్లగుద్ది చెప్పగలను.

యువకుడు సరిగ్గా ఎనిమిదో రోజున - మళ్ళీ ఆదివారం నాడు వచ్చాడు. నాకు నమస్కరించి కూర్చున్నాడు. అదేవాలకం - ముఖంలో నిర్భీతి, చూపులో ఆత్మవిశ్వాసం. నా అభిప్రాయం వెంటనే బయటపెట్టదల్చుకోలేదు. నిముషంపాటు ఆలోచించాను.

డి. హెచ్. లారెన్స్ తన మొదటి కథ "ది ఓడర్ ఆఫ్ క్రిసెంతమమ్స్"ని 'ఇంగ్లీష్ రివ్యూ' మాగజైన్ ఎడిటర్ మడాక్స్ ఫోర్డుకు చూపించినప్పుడు వెంటనే ఆ పెద్దమనిషి ఆ కథకుడిలోని జీనియస్‌ని గుర్తించి, 'ఇది సరే. ఇంకా రాయి. రాసి నాదగ్గరికి తీసుకొస్తూండు' అని అన్నాడట. ఆర్. కె. నారాయణ్ మొట్టమొదటి నవల "స్వామీ అండ్ ఫ్రెండ్స్" పలు ప్రచురణ కర్తల చేతా తిరస్కరించబడగా, నిరాశ చెందిన రచయిత లండన్‌లోనితన మిత్రునికి లేఖరాస్తూ 'ఆ నవల ప్రతికి ఒక రాయి కట్టి థేమ్స్ నదిలో వదిలెయ్యి' అని సూచించినప్పుడు ఆ మిత్రుడు ఆఖరి ప్రయత్నంగా మెరుపు ఆలోచనతో ఆ నవలని తనకు పరిచితుడైన ప్రఖ్యాత నవలాకారుడు గ్రాహమ్ గ్రీన్ దగ్గరికి తీసికెళ్ళి చూపితే, గ్రీన్ దాన్ని ఎంతగానో మెచ్చుకుని హేమిష్ - హామిల్టన్ అనే ప్రచురణ కర్తకు సిఫార్సు చేశాడట. జేమ్స్ జాయిస్ చైతన్య స్రవంతి శిల్పాన్ని పరాకాష్టకు తీసుకువెళ్ళి రాసిన 'ఫెలికన్స్ వేక్' నవలని ప్రచురించడానికి ఆక్స్ ఫర్డ్ యునివర్సిటీ ప్రెస్ వాళ్ళు మొదట్లో 'ఇది నవలయేనా?' అంటూ నొసలు చిట్లించారట. అలా ప్రపంచంలో ప్రసిద్ధుల మొదటి కృతులు వెలుగు చూసేందుకు పురిటిపాట్లు పడ్డా, అవి వెలుగు చూశాకేమయ్యిందన్నది సాహితీ చరిత్ర!

కొత్త తరంగాలకు ఆహ్వానం పలికే మడాక్స్ పోర్డులు నేటి తెలుగు పత్రికా రంగంలో బహుశా లేరు. పోనీ సాహితీ రాజ్యంలో ప్రజాస్వామ్య సూత్రాల్ని పాటించే గ్రాహమ్ గ్రీన్‌లు ఉన్నారా? ఉన్నారు - అని రుజువు చేసే అవకాశం నాకు ఉంది. పేరున్న రచయిత నేడు ఏ చెత్తయినా రాసి అచ్చువేయించుకోగలడు, అస్మదీయుల చెత్తనూ అమాయకపాఠకుల చేత మోయించగలడు. ( తనకన్నా పైకి ఎదిగేలా ఉన్నాడనుకున్న వాడ్ని అధఃపాతాళానికి తొక్కివేయనూగలడు. ఇది సినీరంగం నుండి అరువు తెచ్చుకున్న పాడుబుద్ధి!) ఈ కుర్రవాడు మట్టిలో మాణిక్యం నేను గ్రాహమ్ గ్రీన్ లా వ్యవహరిస్తే వీడి ఆణిముత్యాలు ప్రదర్శన కొస్తాయి ఏం చెయ్యాలి? ఆలోచిస్తూనేపోయాను - నీరు పోసి నిలబెడితే ఈ మొక్క రేపు పెరిగి పెద్దదయి,వటవృక్షమై నా కీర్తికి అడ్డు వస్తే....? నా అంతరాళంలోని భయమో, స్వార్థమో, అనుమానమో - ఏదో స్పష్టంగా చెప్పలేను - తల ఎత్తి నిలిచింది. ( 'కళారంగం ఏ ఒక్కడి గుత్త సొమ్మూకాదు. అలా అయిన్నాడు అది మురిక్కాలువ అవుతుంది. ఏమిటి నీ దుర్బుద్ధి? అని నాలోని కళాకారుడు ప్రశ్నించాడు. నువు కాసేపు మాట్లాడకు అంతే -

అంటూ అతడి నోరు నొక్కేశాను.

పెదవి విరుస్తూ యువకుడి ముఖంలోకి చూసి అన్నాను. "చాలా పేలవంగా ఉన్నాయి రచనలు. పరిణతి బొత్తిగా లోపించింది. ఇవి కథలు అనడానికి ఏ అర్హతా కనబడ్డంలేదు."

"నిజంగా.... అన్నీ చదివరా? వొక్కటి కూడా పనికిరాదా?" స్థిరమైన స్వరంతో సూటిగా చూస్తూ ప్రశ్నించాడు. చెక్కు చెదరని ఆశావాదం!

ఏదో నా గొంతుకు అడ్డం పడి నేను ఇస్తున్న తీర్పు గతి మారింది. "ఇంకో మూడు కథలు చదవాల్సి వుంది. అవయినా పనికి వస్తాయేమో చూస్తాను తర్వాత కలువు.

అతడు తలవూపి వెళ్ళబోతోంటే ఆపాను. " ఒక్క నిముషం ఆగు నిరాశ పడకు. మార్గదర్శక సూత్రాలు లోతుగా తెలుసుకునేందుకు ఇదిగో ఈ ఇంగ్లీషు పుస్తకం చదువు తెలుగులో ఈ సబ్జక్టు మీద పరామర్శ గ్రంధాలు, ప్రామాణిక రచనలు తక్కువ. దీన్ని జీర్ణం చేసుకునే ప్రయత్నం చెయ్యి," అంటూ కరీంహెస్ రాసిన 'ఎన్హాన్సింగ్ రైటింగ్ త్రో ఇమేజరీ' ఇచ్చి పంపాను.

పిల్లి అంటె ఏమిటి అని అడిగినవాడికి మార్జాలం అని చెప్పాను! ఆ పుస్తకం చదివి అర్థం చేసుకోవడం అంత సులభం కాదని నాకు తెలుసు అర్థం చేసుకోగలిగినా అతడు నేర్చుకోవాల్సింది ఏముంది? చెరువులో దూకి చక్కగా ఈదుతున్నవాడికి ప్లవన సూత్రాలు బోధించడమెందుకు? (దగా. మోసం.) ప్రివిలేజ్డ్ సాహిత్యకారుల దర్బారులో - నువు నా వీపు గోకు. నేను నీ వీపు గోకుతా - అన్నదే దీక్షా వాక్యం కదూ? ఎక్కడో కోస్తా ఆంధ్రాలో,మరెక్కడో రాయలసీమలో నీ స్నేహితులు రాసిన వాట్ని అత్యుత్తమ మైనవిగా సమీక్షిస్తావు. ప్రత్యుపకారంగా వాళ్ళు నిన్ను - నీ ప్రాంతం నుండి తీక్షణంగా కలం ఝుళిపిస్తున్న ఏకైక వీర రచయితవని కీర్తిస్తారు. మిదంతా హిపోక్రసీ. జీవితంలో ఎన్నడూ పోలీసు ఠానాలో అడుగు పెట్టని వాడు సైతం నిర్బంధం మీద క్రూరంగా రాస్తాడు.మరెవడో గడప దాటకుండానే ఎ్కడో జరిగిన ఎన్‌కౌంటర్ మీద ఎలిజీ రాస్తాడు - దోపిడీ గురించి రిక్వియం ఆలా పిస్తాడు. సరే - ఇదంతా నీ దర్బారు జీవుల లక్షణం. కానీ కష్టాల నిప్పుల్లో వేగిన ఆ కుర్రవాడు సృజనాత్మక శక్తికి అన్యాయం తల పెట్టకు.. సౌరభాలు వెదజల్లనున్న ఆ పూమొగ్గను చిదిమి వేయకు సుమా 'అంటూ నాలోని కళాకారుడు మళ్ళా శివాలెత్తాడు.' నువుదద్దమ్మవు. నీకేమీ తెలీదు అట్టె పిచ్చి పిచ్చిగా ప్రేలకు. అని గద్దించి వాడి నోరు కుట్టేశాను.

"ఏమిటండీ - రాతా లేదు, పూతాలేదు. ఎవరినో కోపగించుకుంటున్నారు? నన్నేనా...' ' చేతిలో కూరగరిటె, ముఖంలో ప్రశ్నార్థక చిహ్నం - నాశ్రీమతి ఎదురుగా నిలబడింది.

"నిన్ను కాదులే - ఏదో సందర్భం గుర్తుకు వచ్చి...."

"కథలాగా లేదే! అదేదో నిన్నటి నుండీ రాస్తున్నారు. రెండు పేజీలు దాటలేదు ఆఫీసు ఎగ్గొట్టి ఇంట్లో కూర్చుంది ఊహల్లో విహరించడానికా?"

"కథ కాదు వ్యాసం రాజధానిలో జరగబోయే సదస్సులో చదివేందుకు ప్రసంగ వ్యాసం."

"ఈ నడుమ మీరు టూర్లు తిరగడం ఎక్కువయింది, కథవ్రాయడం తక్కువయింది. ఏ పని చేసినా గిట్టుబాటుగా ఉండాలని లక్షసార్లు చెప్పాను మీకు. సరి సరి - లేవండి - బాబుగాడి గురించి స్కూలుకు..."శ్రీమతి స్వరం కొద్దిగా హెచ్చింది.

నా శ్రీమతికి నేను రాసినవి ఫెయిర్ చెయ్యడం చేతకాదు కానీ, కాగితాలు సర్దడం,కార్బన్లు అమర్చడం మాత్రం రంచనుగా చేస్తుంది కృషి అనే సూత్రానికి పేరూ, పైసా అనే రెండు పుస్తెలు ఉండాలన్న లౌకిక సత్యం నాకు పదే పదే గుర్తు చేస్తుంటుంది.

కలం కాగితం మీద పెట్టి మళ్ళా రాతకొనసాగించాను సాహిత్యంలో ఇటీవల వచ్చిన మార్పులు, కథ, నవల - ఈ ప్రక్రియల్లోని శిల్ప వైవిధ్యాలు, నాకు నచ్చిన - నా దృష్టికి వచ్చిన నా మిత్రుల మంచి రచనలు పేర్కొంటూ, ఈ అంశాల్ని విశ్లేషిస్తూ బరబరా గీకి వ్యాసాన్ని మరో పేజీ లాగాను. నేను రాస్తున్నాది నాకే సంతృప్తికరంగా తోచడం లేదు. నాలోని రెండు పార్శ్వాలకు సమన్వయం కుదరడం లేదు. కలం, కాగితాలు పక్కన పడేసి, దుస్తులు వేసుకొని స్కూలుకు బయల్దేరాను.

మా అబ్బాయి చదువు ఈ మధ్య కొద్దిగా వెనక పట్టు పడుతున్నదన్నది నాకు ఆందోళన కలిగిస్తున్న విషయం. అర్ధ సంవత్సరం పరీక్షల ఫలితాలు చూసి శ్రీమతి దాదాపు బెంగ పెట్టుకున్నది. ట్యూషన్లకు వెళతాడు, రోజూ బాగానే చదువుతాడు అయినా అరవైశాతం లోపు మార్కులేమిటీ అని వాపోయింది. బాబు స్నేహితులు మాయింటికి వచ్చినప్పుడు వాళ్ళ హెచ్చు మార్కుల సంఖ్యతో వాడి సంఖ్య పోల్చుకుని నిట్టూర్చింది. వాళ్ళు ప్రాసంగికంగా 'మీ బాబు మాకంటె తెలివైనవాడు. వాడి జ్ఞాపక శక్తి మెచ్చుకో తగ్గది ఆంటీ 'అన్నప్పుడు - తెలివి తేటలు నిక్షిప్తంగా ఉన్నాయంటె ఏమిటరా ప్రయోజనం? అవి మార్కుల్లో పండాలి కదా? - అని ఈవిడ వ్యాఖ్యానిస్తుంది.

నాకు కోపం కూడా తెప్పించిన మా వాడి వైఫల్యమేమిటంటే -ట్యూషను మాత్రమే కాక నేను రెండురోజులు ప్రత్యేకంగా పరీక్షల ముందు వాడికి లెక్కల్లో సైన్సులో తర్ఫీదు ఇచ్చాను. ఐనా ఆ సబ్జక్టుల్లో గరిష్ఠంగా యాభై ఎనిమిది మార్కులు మించలేదు. ఇదే విషయమై వాడిని మొన్న నిలదీశాను........ అసలు ఈ ఏడవ తరగతి గట్టెక్కుతావా లేదా? ఏమిటీ నీ ఉద్దేశ్యం? నీ మార్కులూ, నీ వ్యవహారం నాకేమీ అర్థం కావడంలేదు.

"బాగానే రాశాను. అయినా మార్కులు వేయలేదు.. అని వాడి సమాధానం!

"మరి మిగతా వాళ్ళకి, నీ స్నేహితులకి డెబ్బయ్‌లు ఎనభైలు ఎలా వచ్చాయి?'

"రాయక పోయినా కొందరికి టీచర్లు ఎక్కువ మార్కులు ఇస్తారు.'

"ఓహో - నువుబాగా రాసినా మార్కులు తక్కువ పడ్డాయంటావు....'

"ఔను. మీరు ఊరికే మార్కులు, మార్కులు అని కేకలేస్తున్నారు. నా జవాబు పత్రాలు, వాటిని దిద్దిన తీరు గమనించారా? లెక్కల్లో నాకు నిజంగా అంత తక్కువ మార్కులు రావాల్సిందేనా?" అంటూ నా ఎదురుగా నిలబడకుండా లోపలి గదిలోకి వెళ్ళిపోయాడు. వాడి మాటల్లోని మొండితనం, తీరులోని నిర్లక్ష్య ధోరణి నేనంతకు ముందు ఎన్నడూ ఎరగను!

స్కూలు ఆవరణలో అడుగు పెట్టి, ఆఫీషు గది ముందలి బంట్రోతుతో 'హెడ్ మాస్టార్ని కలవాల్సి వుందని కబురు పంపాను. మరో పావుగంట సేపు కాచుకూర్చున్నాక లోపలికి ప్రవేశం లభించింది. నుదుట విశాలమైన విభూది నామాలు, ఖాదీశిల్కు చొక్కా ఆహార్యంలో ఉన్న హెచ్చెమ్‌ను విష్ చేసి, అతని సైగతో ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాను. ఏమిటో చెప్పండి అంటూ కళ్ళతోటే ప్రశ్నించాడాయన.

"మా అబ్బాయి చదువు సంధ్యల తీరుతెన్నుల గూర్చి వివరాలు తెలుసుకుందామని వచ్చాను "అన్నాను నేను.

"ప్రతీసారి పరీక్షలయిన తర్వాత పేపర్లూ,రిపోర్టులూ పంపిస్తున్నాంకదా? వాట్ని బట్టి

తెలుసుకోవాలి..'' భృకుటి ముడిచాడు హెచ్చెమ్.

"అది తెలుసు. పిల్లవాడి చదువు వెనుక చాటుతనానికి ఇతర కారణాలు ఏమైనా ఉంటాయా అన్నది పిల్లల మనస్తత్వ శాస్త్రం చదివి వున్న మీలాంటి పెద్దలతో పది నిమిషాలు చర్చించాలనుకుంటున్నాను.''

మా బాబు పేరు, క్లాసు, సెక్షన్ అడిగి సంబంధిత క్లాసు టీచర్ని పిలిపించాడు. ఆవిడ అందించిన ఫైలూ, ప్రోగ్రెస్ రిపోర్టు ఒక్క నిముషం పరిశీలించిన అనంతరం ఆయన ఇలా తేల్చి చెప్పాడు. మీ వాడు ప్రతిభావంతుడయిన విద్యార్థికాడు. గత సంవత్సరం ఆరో తరగతిలో కూడా చెప్పుకోదగ్గ మార్కులు రాలేదు. మీరు ఎప్పటికప్పుడు శ్రద్ధ తీసుకుంటూ వుండాలి...''

"ఔను. అబ్బాయి జస్ట్ ఎబోవ్ ఎవరేజ్. క్లాసులో పాఠం చెబుతున్నపుడు అటెన్షన్ చూపెడుతున్నట్టుగా కనపడడు. నోట్సు రాసుకుంటాడు కాని ఎక్జామ్స్‌లో ఆన్సర్ యాజిటీజ్‌గా రిప్రొడ్యూస్ చెయ్యడు - అదర్ థింగ్స్ జోడించి రాస్తాడు.'' హెచ్చెమ్ ప్రతిపాదనను బల పరుస్తున్నట్టుగా అంది క్లాస్ టీచర్.

ప్రతిభావంతులు, ప్రతిభావంతులు కానివారు అనే ఈ అదృశ్య, అనధికార వర్గీకరణ జడ సిద్ధాంతపు వెలుగులో విద్యార్థుల జవాబు పత్రాలను దిద్దే విధానంలోని సంబద్ధత ఎవరైనా ఊహించుకోవచ్చు. ఈ అసంబద్ధత పిల్లల సమగ్ర వికాసానికి ఎలా అవరోధమవుతుందో ఆ పండితుడికి కొంచెం వివరంగానే చెప్పడానికి నిర్ణయించుకున్నాను. కానీ ఆ అవకాశం పోయింది. నేను నోరు తెరిచే లోపున తెలుగు మేష్టారు హెచ్చెమ్ గదిలోకి ప్రవేశించి నాకు సగౌరవంగా నమస్కరించి హెచ్చెమ్ వేపు తిరిగి "సార్! ఈయన ప్రసిద్ధ రచయిత శ్రీ....డిసెంబరులో ఈయనకి రాష్ట్రస్థాయి అవార్డు వచ్చింది,'' అని పరిచయం చేశాడు.

ఆ పెద్దమనిషి ముఖంలో కవళికలు మారినై; ప్రసన్నత చోటు చేసుకుంది. కరచాలనానికి చేయి చాపుతూ 'మిమ్మల్ని కల్సుకున్నందుకు సంతోషం. మీ అబ్బాయినీ చూడాలనుంది- అని బంట్రోతుని పిలిచి,రెండు కప్పుల టీ, తీసుకుని మా అబ్బాయినీ తోడ్కొని రమ్మన్నాడు.

"బాబుని పిలిపించాల్సిన అవసరం ఏముందిలెండి! ఒక విన్నపం - వాడి లెక్కల పరీక్ష జవాబు పత్రం తెప్పించండి. ఒక్క నిముషం పరిశీలించాలి'' అన్నాను.

ఆయన "ఓ యస్,'' అంటూ క్లాసు టీచర్ వేపు చూశాడు. ఆమె అవతలి గదిలోకి వెళ్ళి, రెండు నిమిషాల తర్వాత వచ్చి పేపర్ నా చేతికందించింది. ఆమూలాగ్రం పరిశీలించాను దాన్ని. బాబు కొన్ని లెక్కలు అసంపూర్తిగా వదిలేశాడు. మరి కొన్ని తప్పులు చేశాడు. ఒక బీజగణితం లెక్క - బహుపదుల గుణకారం - కు జవాబు లో గుర్తు ఒకచోట మైనస్ బదులు ప్లస్ వేశాడు. అయిదు మార్కుల ఆ లెక్కకు రెండు మార్కులు వేయబడ్డాయి. మరో లెక్క క్షేత్ర గణితంది. ఒక వృత్తాకారపు అట్టముక్కలోంచి ఏడు సెంటిమీటర్ల వెడల్పుతో బయటి నుండి రింగు కత్తిరించబడింది - రింగు వైశాల్యం ఇవ్వబడింది; మొత్తం అట్టముక్క వైశాల్యంలో రింగు వైశాల్యం శాతమెంత అన్నది సమస్య. ఆ మాదిరి లెక్కలు నేను చక్కగా వివరించి వుండటం వల్ల బాబు ఆ లెక్క చేస్తూ అన్ని స్టెప్పులూ సవ్యంగా చేసి చివర్న జవాబుని - రెండంకెల్లో రావాల్సిన దానిని - ఒక్క అంకె వేసి ఆపేశాడు. పది మార్కుల ఆ లెక్కకు మూడు మార్కులు ఇవ్వబడ్డాయి.

హెచ్చెమ్‌కి ఆ లెక్కలు చూపెట్టి, " వీటికి మరిన్ని ఎక్కువ మార్కులు ఇచ్చే అవకాశం

ఉండెనా లేదా అన్నది మీ విజ్ఞతకే వదిలేస్తున్నాను.'' అన్నాను.

ఆయన చూసి, సాలోచనగా తల పంకించి, ఒక నోట్ రాసి పేపర్‌కి జతచేసి ట్రేలో వేశాడు.

నేను ఇక బయటికి వచ్చేందుకు సిద్ధమయి కుర్చీలోంచి లేస్తూ అన్నాను; వర్గీకరణ ఒక మేరకు మంచిదే? ప్రతిభావంతుడు అన్న కితాబు కుర్రాడికి టానిక్ లాగా పనిచేసి ఇతోధికంగా కృషి చేసి ఆ కితాబుని ఎల్లప్పుడూ సార్థకం చేసుకోవాలన్న స్ఫూర్తినిస్తుంది. అయితే ఇదే వర్గీకరణ 'ప్రతిభావంతుడు కానివాడు అనబడే కుర్రవాడి మీద నెగిటివ్ ప్రభావం చూపుతుంది. వాడిని ఆత్మన్యూనతాభావంతో ముంచి వాడి సృజనాత్మకతను దెబ్బతీస్తుంది. ఆ ప్రమాదం జరగకుండా మీరు జాగ్రత్తలు తీసుకోవాలి.''

నేను ఇంటికి వచ్చేసరికి 'యువరచయిత ' నా కోసం నిరీక్షిస్తూ కొబ్బరి చెట్టుకింద సిమెంటు బెంచీ మీద కూర్చుని వున్నాడు. లోపలికి రా అబ్బాయీ అంటూ సాదరంగా ఆహ్వానించాను.

నా వద్దనుండి తీసికెళ్ళిన ఇంగ్లీషు పుస్తకాన్ని బల్లమీద పెట్టి అన్నాడు. "పుస్తకం చదివాను. బాగుంది. అయితే నాకనిపించింది - పదచిత్రాలు ఉపయోగించడంలో పాశ్చాత్య రచయితల కంటే మన ప్రాచీన కవులు ఏమీ తీసిపోలేదు అని. ఉదాహరణకి ఈ ప్రాచీన శ్లోకం పరిశీలిద్దాం., సుపార్ణా ఏత ఆ సతే మధ్యా ఆరోధనే దివాతో సేధంలి పాథో వృకమ్ తారంతెమ్ యహ్వాతీరవో విత్తమ్ మే అస్య రోదసి, అందాల రెక్కల పక్షులు ఆకాశ కుహరంలో విహరిస్తూన్నాయి; ఈ తీరం వైపుకు ఈదుకు వస్తున్న తోడేలు రాకని అవి అడ్డగిస్తున్నాయి నా క్షోభ పై వాడికే ఎరుక, ఇందులో అందాల రెక్కల పక్షులు అనేది ఆనందాన్ని వ్యక్తం చేసే భావచిత్రం అయితే వృకం అనేది క్రూరమైన ఆలోచనకు ప్రతీక కదా....''

ఆపమన్నట్టుగా సైగ చేశాను. ఋగ్వేదంలోని సంస్కృత శ్లోకాన్ని ఉటంకిస్తున్నాడు, అతడు, శత్రు రాజు ఆధీనంలో, కారాగారంలో మ్రగ్గుతున్న పురుకుత్సుడు తన భార్య పర పురుషుని సంపర్కం ద్వారా స్వదేశంలో రాజ్యానికి వారసుడ్ని కన్నదన్న వార్త విన్నప్పుడు అతడిలో చెలరేగిన భావ సంఘర్షణను వ్యక్తీకరిస్తున్నదా శ్లోకం.

కుర్రవాడు అసాధ్యుడు. నాలోని కళాకారుడూ, వ్యాపార రచయితా ఘర్షించుకోవడం పసిగట్టి నట్టున్నాడు. వీడు నిజంగా ఫిలిఫ్ రివేరా. డానీలు వీడి ముందు చిత్తుకావాల్సిందే. అయితే నేను డానీలా రింగులో ఉండదలుచుకోలేదు. ఫిలఫ్ రివేరా సత్తువ ఎరిగిన రిఫరీ బల్‌లా వ్యవహరించ దల్చుకున్నాను.

లెటర్ హెడ్ మీద కలం పెట్టి, నాకు బాగా పరిచయమున్న పత్రికా సంపాదకుడికి యువ రచయితని పరిచయం చేస్తూ లేఖ రాయనారంభించాను.

ఆడెపు లక్ష్మీపతి, క్వార్టర్ నెంబర్ - బి 139,
ఫెర్టిలైజర్ సిటి - 505 210

**రావూరి కాంతమ్మ స్మారక**
**కథా అవార్డు (రూ॥ 1,116) పొందిన**
**ఉష కథ**



# మరో భేతాళకథ

పట్టువదలని విక్రమార్కుడు మళ్లీ చెట్టెక్కి, శవాన్ని భుజాన వేసుకుని దీక్షా కంకణ బద్ధుడై నడుస్తున్నాడు.

అమావాస్య నిశిరాత్రి,

నక్షత్రాలు నక్కల కళ్లలా మెరుస్తున్నాయి.

శవాన్ని భుజాన వేసుకొని నడుస్తూండటం, శవంలో ప్రవేశించిన భేతాళుడు విక్రమార్కుడు మాట్లాడక తప్పని పరిస్థితి కల్పించటం, మౌనంగా పయనం సాగాలన్న నియమభంగంకాగానే భేతాళుడు శవంతో సహామాయమై మళ్లీ చెట్టెక్కెయ్యటం అనంతకాలంగా జరుగుతూనేవుంది!

"అసలు ఎందుకు నేనీ శవాన్ని మోస్తున్నాను? ఈ శవయాత్రల నుండి నాకు విముక్తి ఎప్పుడు?" మౌనంగా మూలిగింది విక్రమార్కుడి మనస్సు. నియమభంగం కాకుండా పయనిద్దామంటే..... తన తెలివి తేటలకీ, పట్టుదలకీ, న్యాయనిర్ణయదక్షతకీ అవమానం! తనకి నిజంగా జవాబు తెలియని ప్రశ్న ఉంటుందనుకోవటమే యాంటీ - సెంటిమెంట్ అర్థంకాని తికమక విక్రమార్కుడి మనసుని కల్లోల పెడుతుంది.

అతడు వేగంగా నడుస్తున్నాడు. స్పృహకతీతంగా జరగవలసిన శ్వాసక్రియ అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తోంది.

"మానవదేహం బరువు - జీవించి ఉన్నప్పటి కంటే మరణించాక పెరుగుతుందికాబోలు!' ' ముఖానస్రవిస్తూన్న స్వేదధారల్ని తుడుచుకుంటూ అనుకున్నాడు విక్రమార్కుడు.

అప్పటికి కొన్నిక్షణాల ముందే శవంలో ప్రవేశించిన భేతాళుడు "రాజా! నీ సందేహం నాకు తెలియదనుకున్నావా? ఒంటరి తనం మనసుకి భారం ఒంటరి శ్రమ శరీరానికి భారం అంతే! ఆడుతూ పాడుతూ పనిచేస్తుంటే అలుపూసొలుపూ ఉండవని ఓ కవి అన్నాడట! అందుకే - నీకు బడలిక తెలియకుండా ఉండటానికి ఓ కథ చెబుతా, విను! నా మిగతా నిబంధనలన్నీ షరామామూలే!" అన్నాడు విలాసంగా నవ్వుతూ.

మౌనంగా తలవూపాడు విక్రమార్కుడు.

భేతాళుడు కథ చెప్పటం ప్రారంభించాడు.

అది ----

ఓవైపు ఆకాశాన్ని మోస్తూన్న హిమవన్నగమూ, మిగతా మూడువైపులా సాగరాల రక్షణ పర్యవేక్షణలో నున్న భరతఖండం!

కాలవాహినిలో అనేక ఆటుపోట్లకు గురై - ప్రస్తుతం ప్రజాస్వామ్య పర్వంలో పయనిస్తూన్న భరతదేశం!

'ఎడ్గార్‌స్నో' పరిభాషలో చైనా పైపుట్టిన అరుణతార ఎర్రని కిరణాలు హిమాలయ పర్వత శీతల శ్రేణుల్నీ - కాళీ హిల్స్‌నీ తాకి, పశ్చిమ బెంగాల్‌లో పరావర్తనం చెందిన దరిమిలా - ఆ వెలుగు ఆంధ్రరాష్ట్రంలోని ఈశాన్యజిల్లాల్లో ప్రతిఫలించి రెండు దశాబ్దాలు దాటిన నేపథ్యంలో --

అరవై తెలుగు సంవత్సరాలూ 'రక్తాక్షులే' అయి, కాలాన్ని నెత్తుటి ఇంధనంతో నడిపిస్తున్న వర్తమానంలో ---

హింసకూ, ప్రతిహింసకూ తేడా తెలియని గందరగోళంలో మైదానాల్లో రాజనాలు పండిస్తున్న గోదారితల్లి తూర్పు కనుముల దట్టమైన కీకారణ్యాల్లో విప్లవాల్ని పండిస్తోంది!

ఆ గోదావరి..... యిప్పుడు ఎర్రగా ప్రవహిస్తోంది- పెచ్చరిల్లుతున్న హింసకు నిరసనగా ప్రకృతి చేస్తున్న నెత్తుటి ఊరేగింపులా! ఆ 'అరుణిమ' రక్తానిదని ఏ ఎన్‌కౌంటర్ దేహిన్నడిగినా చెప్తుంది: ఆ 'ఎరుపు' నెత్తురుదని మందుపాతరల ప్రేలుడులో మరణించిన ఏ 'యూనిఫాం' నడిగినా చెప్తుంది.

వీళ్ళంతా ఎవరు?

విప్లవాల సారధులా?

పాలక వర్గాల సేవకులా?

ఎవరైతేనేం? సామాన్యులు.

ఉదయం పదిగంటలైంది నీలినింగినంటుతోన్న అడవి తల్లి హరితశిరోజాల్లోంచీ కిరణాల కళ్లతో అప్పుడప్పుడూ తొంగి చూస్తున్నాడు సూర్యుడు.

టాపులేని జీపు నడుపుతున్న సూర్యం, ప్రకృతి సౌందర్యాన్ని తనివితీరా ఆస్వాదిస్తూ,

అనుభూతిని గుండెల్లో పదిల పరుచుకుంటున్నాడు. అడివంతా పచ్చగా - ఆకుపచ్చ చీర కట్టుకున్న అమ్మలా ఉందతనికి. సూర్యంలో భావుకత పాలెక్కువ. అతని మదిలోని భావుకత కాగితంపై అక్షర చిత్రాలుగా రూపొందటం కాలేజీ మేగజైన్స్‌తోనే విరామచిహ్నానికి తలొగ్గినా, మనసు లోలోపల మాత్రం పున్నమినాటి కడలి తరంగాల్లా ఎగిసిపడుతూనే వుంది.

'వృక్షాలు పుడమితల్లి నాసికలు!' రియోడిజనిరోలో జరిగిన ధరిత్రి సదస్సు సూర్యంలో దిద్దుకున్న భావరూపమది. ఇప్పుడూ అలాగే అనిపిస్తోంది. కలప వ్యాపారం చేసుకుంటున్న ప్రభుత్వాలకు గానీ, అక్రమంగా అడవుల్ని ఆరగించేస్తోన్న ఫారెస్టు కంట్రాక్టర్లుకుగానీ - ఇలాంటి సున్నిత భావాల్ని స్పందింపజేయగల హృదయమే ఉంటే ధరిత్రీ సదస్సుల అవసరమే లేదేమో!

రోడ్లు లేని అడవుల్లోకూడా ఎంతో చాకచక్యంగా జీప్ నడపటం సూర్యానికి రెండు సంవత్సరాలుగా అలవాటైంది. మరో రెండుమూడు కిలోమీటర్లు వెళితే - కంకర రోడ్డు రూపంలో కృత్రిమ నాగరికత ప్రారంభమౌవుతుంది.

ఒకసారి విప్లవ కారుల్ని గుండెల్లో దాచుకుని, వాళ్ల ఆలనాపాలనా చూసిన అడవే.... ఇంకోసారి పోలీసులకింత నీడనిచ్చి సేద తీర్చింది. విప్లవ కారులూ, గిరిజనులూ తల్లిలా ప్రేమించి కొలుచుకునే అడవే - పోలీసులకి మాత్రం పోస్ట్ మార్టం కోసం ఎదురు చూస్తున్న మృత దేహంలా కనిపిస్తోంది; అంతేకాదు - గుండెలో వణుకు పుట్టించే భయం కలిగిస్తుంది. పిరికితనం వాళ్ల వృత్తి ధర్మంకాదు. ఆ పరిస్థితుల్లో ఎవరున్నా అంతేనేమో! ఏ చెట్టు వెనుక 'ఏకె - ఫార్టీ సెవెన్' పొంచివుందో..... ఏపుట్ట 'గుప్పిట్లో నిప్పులా' గుండెల్లో మందుపాతరని దాచుకుందో అనూహ్యం. భయం ఉన్నచోట భావుకత చస్తుంది! బహుశా సూర్యం తప్ప - అడివినింతగా 'ఆనందించగిలిగిన' పోలీసులెవరూ ఉండరేమో!

అయితే - ఇప్పుడు సూర్యం తన భావుకతని మరెవ్వరితోనూ పంచుకోగల అవకాశం లేదు. అలాగని అతను వంటరిగా లేడు.జీపులో మరో పదిమంది ఉన్నా.... ఎవ్వరికీ తెలుగు తెలియదు. తన భావాలని వాళ్లు ఆస్వాదించగల భాషలో చెప్పగల పాండిత్యం వారి మాతృభాషలో సూర్యానికీ లేదు. వాళ్లు - రాష్ట్ర ప్రభుత్వ విజ్ఞప్తి మేరకు కేంద్రం పంపిన సరిహద్దు భద్రతాదళ సైనికులు. అడవిని ప్రతి అంగుళమూ గాలించి విప్లవ కారుల్ని పట్టుకోవాల్సిన కర్తవ్యమే వారినందర్నీ ఒకే జీపులోకి చేర్చింది.

విప్లవకారులు ప్రజావ్యతిరేకులా? నిజంగా - నిర్మూలించ బడవలసిన వారా? వారి మార్గంలో వారనుకుంటున్న లక్ష్యం సాధించటంలో సాధ్యాసాధ్యాలెంత? వారాశిస్తున్న వ్యవస్థ వస్తుందా? వస్తే, గిస్తే.... తూర్పుయూరప్ దేశాల, సోవియట్ పరిణామాల వెలుగులో.... ఎంతకాలం నిలుస్తుంది? - అనే ప్రశ్నలు ఎన్నో సార్లు సూర్యాన్ని తూనీగల్లా చుట్టుముట్టాయి. ఇంత విశాలమైన దేశంలో.... ఓ జిల్లా మారుమూల ప్రాంతంలో మొదలై.... రెండు దశాబ్దాల అనంతరం కూడా రెండు, మూడు జిల్లాలకు మాత్రమే పరిమితమై.... భారత దేశమంటే అంతేనా?

అని కనీసంగానైనా ప్రశ్నించుకోకుండా..... కొందరు త్వరపడినంత మాత్రాన'పిందె' పండుకాదన్న ప్రకృతి సత్యాన్ని విస్మరించి, ప్రాణాల్ని సైతం తృణప్రాయంగా పణంపెడుతున్న

విప్లవ కారులంటే సూర్యానికెంతో సానుభూతి. 'ఖాకీడ్రస్' వేసుకున్న ప్రతి వ్యక్తిలోనూ కసాయివాడిని చూసేకళ్లకు - సూర్యంలాంటి వారిని చూడగల హృదయమున్న కళ్లు లేక పోవచ్చునేమో!

అలాగే.... వారిపోరాటం వెనుకనున్న సిద్ధాంతం తప్పో, ఒప్పోగానీ.... అది ఏలక్ష్యమూలేని రక్తదాహ పోరాటమా? ఆర్థిక అంశాలకు అతీతమైన ఆరాటమా? - అని ఆలోచించకుండా - 'ఎన్‌కౌంటర్' అన్న ఏకపద సూత్రాన్నే పదునైన ఆయుధంగా వాడుతూన్న ప్రభుత్వ వైఖరిపట్ల సూర్యానికి తీవ్రమైన అసంతృప్తి, ఆమాట కొస్తే.... వారిపోరాటానికి కారణాలేమిటో తెలిసికూడా, ఆ పరిస్థితుల్ని తొలగించమని ప్రభుత్వంపై ఒత్తిడి తేకుండా - విప్లవ కారుల్నే శాశ్వతంగా తొలగించెయ్యమని కసిగా అంటూ - తమకి అధికారం అందినచోట్ల దీక్షతో ఆపని చేసేస్తూన్న పక్షాలంటే సూర్యానికి ఒళ్లు మండిపోతుంది; అభ్యుదయానికంటుకున్న రాజకీయ దుర్గంధం అసహ్యం కలిగిస్తోంది.

'యూనిఫాం' అతని అభిప్రాయాల్నీ, ఆలోచనల్నీ, అసంతృప్తినీ, సానుభూతినీ, అసహ్యాన్ని.... అన్నిటినీ నొక్కేస్తుంది. అతను యూనిఫాంలోకి వెళ్లగానే - అన్ని భావాలనూ అధిగమించి ప్రభుత్వ ఆదేశాల ప్రకారం నడచుకునే పోలీసవుతాడు.

జీప్ ముందుకు సాగుతోంది.

సన్నగా చినుకులు మొదలయ్యాయి. వానగాలికీ, చినుకుల పలకరింపుకీ చెట్లు ఆనందంతో పులకరిస్తున్నాయి. వర్షాన్ని -

'అవనిపై దోపిడీలు,
అబలలపై అత్యాచారాలు
చూడలేక రోదించే
ఆకాశపు కన్నీళ్లు!' గా అభివర్ణిస్తూ సూర్యం హృదయంలో ఓ భావవీచిక పల్లవించింది.

చిటపట చినుకులకి పులకరించిన నేల వర్షాన్ని ఆహ్వానిస్తూ మట్టి వాసన వెదజల్లుతోంది. ఆవాసనతో అతని ఇరవైఏళ్ల జీవితం ముడిపడివుంది. ప్రత్తిపంట తండ్రిని బలి తీసుకోవటంతో - పొలంతో అతని బంధం శాశ్వతంగా తెగిపోయింది. గతం కళ్లముందు మెదలటంతో చిప్పిల్లిన అశ్రువులు వర్షంతో కలిసిపోయాయి.

వర్షాకాలంలో సెలయేళ్లు ప్రవహించే ఆ ప్రదేశంతో జీపుకుదుపులు ఎక్కువకావటంలో వేగం బాగా తగ్గింది. టైర్లు నున్నటిరాళ్ల మీద పట్టుదొరకక జారుతున్నాయి.

హఠాత్తుగా 'ఢాం!'అన్న శబ్దం!

వర్షానికి గూళ్లలోనూ, చెట్టు కొమ్మల్లోనూ తలదాచుకున్న పక్షులు కలవరపడుతూ ఒక్కసారిగా అరవసాగాయి. ఆకలవరం అడవంతా ప్రతిధ్వనిస్తోంది.

జీప్‌లోని పోలీసుల 'గుండెల్లో పిడుగు' పడిన భావన! కర్తవ్యనిర్వహణ, ప్రాణభయమూ అందర్నీ ఏకకాలంలో అప్రమత్తం చేసింది. 'లోడెడ్‌గన్స్' పొజిషన్ తీసుకున్నాయి. వారి చూపుడు వ్రేళ్లు ట్రిగ్గర్ నొక్కేందుకు సిద్ధంగా ఉన్నాయి. చీమ చిట్టుక్కుమన్నా వినటానికి చెవులు సంసిద్ధమయ్యాయి. కళ్లు దట్టంగా ఉన్న అవలివైపుని పసికట్టే వ్యర్థ ప్రయత్నం చేస్తూన్నాయి! వారి ముఖాల్లో ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కొనే సంసిద్ధత ద్యోతకమవుతోంది.

'ఫికర్‌మత్ భాయియోం! టైర్ బరస్ట్ హుయీ!, అంటూ సూర్యం జీపుదిగాడు. సరిహద్దు భద్రతాదళ సైనికుల్లో ఓ మహాప్రళయం రెప్పపాటులో నిరపాయకరంగా తేలిపోయిన రిలీఫ్! పదినిమిషాల్లో టైరు మార్చాడు సూర్యం.

జీపు కదిలింది. అరకిలో మీటరు తరువాత - కంకరు రోడ్డెక్కి వేగంగా పరుగెడుతోంది.

అంతలో.... ఓ భయంకరమైన విస్ఫోటం!

జీపు తునాతునకలైంది! పదకొండు మృతదేహాలు ఏది ఎవరిదో గుర్తించటానికి కూడా వీల్లేనంతగా ఛిన్నాభిన్నమై మాంసఖండాలు వెదజల్లినట్లుందా ప్రదేశం కొద్దిసేపటిక్రితం సూర్యాన్ని పులకరింప జేసిన మట్టివాసన అదృశ్యమై సగంకాలిన మాంసం వాసన వ్యాపిస్తోంది!

ఆసాయంత్రం రేడియో, టీవీల వార్తల సమయంలో కొన్ని సెకండ్ల కాలాన్ని ఈ దారుణ సంఘటన కరిగించింది. ఆ మరునాటి దినపత్రికలు కలర్ ఫోటోలతో వార్తని ప్రచురించాయి. విన్న చెవులూ, చూసిన కళ్లూ, చదివిన మెదళ్లూ 'అలాగా!' అనుకుంటూ పేజీతిప్పాయి. హోం మంత్రి ఎప్పటి లాగానే 'కాలరా చేస్తాం' అన్న హెచ్చరికతో పాటు, విప్లవ కారుల్ని 'జన జీవన స్రవంతి'లోకి రమ్మని ఆహ్వానోపదేశం కూడా చేశారు. ఆమర్నాటికవన్నీ నిన్నటి..... పాత వార్తలై పోయాయి. దోపిడి నిత్యకృత్యమైన చోట... సహనం కూడా సాయుధమవుతుంది; మృత్యువు దినచర్య అయినచోట.... స్పందన కూడా స్తబ్దతకు గురవుతుంది.

అక్కడ --

అడవిలో నేలకు తిలకందిద్దిన విస్ఫోటం.... వందకిలోమీటర్ల దూరంలో ఉన్న ఓ 'సీత'నుదుటికుంకుమని శాశ్వతంగా చెరిపివేసింది. సూర్యం మృత దేహంగా చెప్పబడిన మాంసఖండాలకి పోలీసు గౌరవంతో అంత్యక్రియలు జరిగాయి. అయినా, ఆసీత కన్నీటి వరద ఆగలేదు. జిల్లా యస్.పి.స్వయంగా వచ్చి ఓదార్చినా ఆగుండెకోత తీరలేదు. ఎక్కడ బాధ ఉన్నా, ఎక్కడ ఆర్తనాదం వినిపించినా, మరెక్కడ కన్నీరు పొంగినా తలుపు తట్టే హక్కుల సంఘాల చేతులు... పోలీసు భార్య కనుకనేమో... సీత కన్నీరు తుడిచేందుకు రాలేదు!

ఇరవై రోజులు గడిచాయి.

కరుగుతున్న కాలపులేపనంతో ఆమె కన్నీటి గ్రంథులు వాడిపోయాయి. కనిపించని దేవుడిని ప్రార్థించినట్లే - అన్నలకి ఉత్తరం వ్రాయటం మొదలు పెట్టింది - సీత!

అన్నలూ!

ఇది నేనెంతో కాలంగా వ్రాయాలనుకుంటున్న ఉత్తరం. మరి.... ఇన్నాళ్లూ ఎందుకు వ్రాయలేదని మీరు అనవచ్చు. 'తనదాకావస్తేనే....' అంటారే - ఆపరిస్థితి ఎంత బాధాకరమో స్వయంగా అనుభవిస్తుంటే...... యిక ఆలస్యం చేయకూడదని వ్రాస్తున్నాను. ఈ ఉత్తరాన్ని చివరంటా చెబుతారో - మీ మార్గానికి చెప్పండి! మీ తుపాకులకు చెప్పండి! మీ మందు పాతర్లకి చెప్పండి! బూడిదలో కలిసిపోతున్న మీ పన్నిటి త్యాగాలకు చెప్పండి!

ఇరవైరోజులక్రితం - దుర్గాపూర్ అడవుల్లో మీకు విజయ గర్వం కలిగించిన మందుపాతర ప్రేలుడులో మరణించిన సూర్యం భార్యని నేను. నాటి మృత్యు ధ్వానం మీ

చెవుల్లో ఆనంద తరంగాలు సృష్టిస్తూ యింకా ప్రతిధ్వనిస్తూనే ఉండి వుంటుంది గనుక మర్చిపోయి ఉంటారనుకోను.

"మాలోని వాడివే - మావాడివేనీవు

పొట్టకూటికి నీవు - పోలీసువైనావు!"అని మీ కవే అన్నట్లు.. నాభర్త ఎన్‌కౌంటర్లు చేసే సరదా తీర్చుకోటానికో, రక్తదాహంతోనో 'పోలీసు' కాలేదు! కేవలం పొట్టకూటి కోసమే. తల్లి, చెల్లెలు, భార్యాబిడ్డల పొట్టకూటి కోసమే పోలీసైనాడు.

ఆ ఉద్యోగం కొనుక్కోటానికి చేసిన ముప్పైఅయిదువేల రూపాయల అప్పులో అసలు తాలూకు ఇంకా మిగిలిఉన్న పాతికవేల రూపాయల అప్పు నాభర్త మరణంలానే నన్ను భయపెడుతోంది. ముసలిఅత్త, పసిపిల్లల బాధ్యతతోపాటు, పెళ్లికెదిగిన ఆడబిడ్డతో సహా నాకు నాకుటుంబ భవిష్యత్తు హఠాత్తుగా అంధకారమయం కావటానికి కారణం ఏదేవుడి శాపమూ కాదు. నా నుదుటి మీద మీరు ఉక్కుతూటాలతో వ్రాసిన నెత్తుటిరాత!

సాధ్యమో? అసాధ్యమో?...... ఒకనాడు ఓ మహత్తర లక్ష్యంతో మొదలైన మీ విప్లవం భూస్వాముల హత్యలతో, ధనికుల రక్తంతో ఆదిపర్వాన్ని అరుణాక్షరాలతో లిఖించుకుంది. ఆ భూస్వాములూ, అలాంటి యితరులూ....ఫారెస్టు కాంట్రాక్టర్లు, సారా కాంట్రాక్టర్లు అయి, మీ బడ్జెట్లకు రెవిన్యూ సమకూర్చే వారుగా పరిణామం చెందాక మీలోనూ పరివర్తన వచ్చింది

తరువాత.....మీ విప్లవానికి ఆర్.టి.సి. బస్సులూ, ప్రభుత్వ కార్యాలయాలూ, రైలింజన్లు, మైక్రోస్టేషన్లు, రైల్వేస్టేషన్లు బలవుతూ వచ్చాయి. ఇవన్నీ ప్రజాధనమేనన్న స్పృహ కలిగిందో!లేక బస్సు, రైలు ఛార్జీలు పెంచటానికి ప్రభుత్వం మీ దహన కార్యక్రమాల్ని సాకుగా చూపుతోందని గ్రహించారో... తగల బెట్టడం ఆపేశారు.

కిడ్నాపుల పర్వ రచన ప్రారంభించారు. కిడ్నాపులకు గురైన సామాన్యులకు రక్త స్నానాలూ, అసామాన్యులకు మర్యాదపూర్వక సురక్షత వీడ్కోలూయిచ్చి.... ఆపర్వాన్ని రక్తపాత, పక్షపాతమయంగా చిత్రించుకున్నారు. కోడివేపుడు కావాలనీ, పాటేలు పలావు కావాలనీ అడిగే తరహాలో - కోళ్లనీ కుకల్నీ బలిస్తూ, సింహాలు, పులుల జోలికి పోని సురక్షత నీతినే అవలంబిస్తూ వచ్చారు. అయినా - విప్లవం 'మీ'గాంనే ఉండిపోయింది.

విప్లవానికి ఉత్ప్రేరకంగా ప్రజా ఉద్యమాల్ని నిర్మించాల్సిన అవసరంకన్నా - విప్లవమంటే సంచలనం సృష్టించటమేనన్న దురవగాహనా పథంలో పయనిస్తున్న మీకు కిడ్నాపులు. పాతబడిపోయాయి. యిప్పుడు పోలీసులు మీ లక్ష్యం అయినారు. ఈ ప్రభుత్వ రథానికి చక్రాలు పోలీసులే అంటూ వారిని 'టార్గెట్' చెయ్యటాన్ని సమర్థించు కుంటున్నారు.

అన్నలూ! మీరంటున్న మీ ప్రభుత్వమే వస్తే...దానికి పోలీసుల అవసరం ఉండదంటారా? సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు ప్రభుత్వం ఉన్నప్పుడూ, చైనాలోనూ పోలీసు వ్యవస్థని రద్దు చేశారా? చెప్పండి. కోపగించకుండా ఒక్క మాటవినండి. ఈ ప్రభుత్వ రథాలకు ఇంధనం - మీరు. ఏ ప్రజల కోసం యివన్నీ చేస్తున్నామనుకుంటున్నారో - ఆప్రజలు కడుతున్న పన్నులు కారా? అది ఏ రథమైనా- ఇంధనమూ చక్రాలూ కీనస అవసరాలు. టైర్లని పంచర్ చేసే, పెట్రోల్ టాంకుల్ని బద్దలు కొట్టి మీరనుకుంటున్న సమాజాన్ని స్థాపించగలమను కుంటున్నారేమో! రథం యొక్క గమనాన్ని నిర్దేశించే 'స్టీరింగ్' ఎవరి చేతుల్లో ఉంటే - రథం వాడికంట్రోల్లో ఉంటుంది ఇవన్నీ సంయమనంతో ఆలోచిస్తే మీవిచక్షణకి అందని

విషయాలు కాదు.

ప్రపంచంమొత్తంలో..... విప్లవించిన ఏదేశ విప్లవక్రమంలోనూ కనిపించని విపరీత ధోరణులు మీ పథంలో చోటు చేసుకుంటున్నాయి. అగందరగోళాన్ని ఒడిదుడుకులుగా చెప్పుకుంటూ సక్రమమార్గాన్వేషణ కోసం ఎప్పటికప్పుడు మార్క్స్, లెనిన్, మావోల్ని సంప్రదిస్తూనే ఉన్నారు. వారి ప్రవచనాలకు - అంధులు ఐరావతాన్ని దర్శించినట్లు - ఎవరికితోచిన భాష్యం వాళ్లు చెప్పుకుంటూ - ఒకర్నొకరు 'నయానయా' రివిజనిస్టులుగా అభివర్ణించుకుంటూ ముక్కలు, చెక్కలు అవుతూ - కుందేటి కాళ్ల లెక్కను తేల్చటంలో మల్లగుల్లాలు పడుతున్నారు, జుట్టు పీక్కుంటున్నారు. చివరకు మీలో మీరు చంపుకుచావటమే వర్గ పోరాటమన్న అధమస్థాయికి విప్లవోన్నతిని దిగజార్చారు.

అన్నలూ! ప్రపంచంలోని విప్లవాలన్నీ ప్రజల భాగస్వామ్యంతోనే జరిగాయి. అలాంటి విప్లవాలే విజయవంతమయ్యాయి. అన్నలూ! మరోసారి ప్రపంచ విప్లవాల చరిత్రలు చదవండి! మీ మార్గాన్ని నిర్దుష్టంగా నిర్ణయించ వలసిన ఎంతో మేదస్సు మీ వ్యర్థత్యాగాలతో యిప్పటికే మట్టి పాలైంది. పట్ట పగలు వెలిగే కొవ్వొత్తి త్యాగం ఎవరి కోసం? ఆలోచించండి!

ఈ లోపం - దారీ, తెన్నూలేని విప్లవాలు చేస్తూ - నాలాంటి విధవల్నీ, నా బిడ్డల వంటి అనాథల్ని సృష్టించటం ఆపండి! మా ఆకలికి అన్నం పెట్టకపోతేపోయారు... మా దాహానికి కన్నీరు యివ్వకండి.

ప్రియమైన అన్నలూ! ప్రభుత్వం యిచ్చే పరిహారం, పెన్షన్‌లతో నా బ్రతుకు సాఫీగా బ్రతికెయ్యవచ్చు నంటారేమో!.... అన్నలూ, ఆడబ్బంతా మీకే యిచ్చేస్తాను.... నాభర్తని తిరిగి బ్రతికించి యిస్తారా; నాబిడ్డలకి 'నాన్న' అనే అనే రెండక్షరాలు శాశ్వతంగా మర్చిపోవల్సినవిగా, ఎప్పటికీ స్పర్శానుభూతికి అందని అదృశ్య పదార్థంగా మార్చిన మీ చర్య ఫలితాన్ని ఏ పెన్షన్‌లు నింపగలవు? ఏ గ్రాట్యుటీలు ఆ లోటుని భర్తీ చేయగలవు?

అన్నలూ, నాకు తెలుసు మృత్యువు అనివార్యమని! ప్రజలకు అకాలమృత్యువుని ప్రసాదించే వ్యవస్థ ఏకాలంలోనూ నిలవలేదు; ఏదేశంలోనూ చిరస్థాయి కాలేదు. బిర్లా.... టాటాల బిడ్డలకి పోలీసు ఉద్యోగం చేసే అవసరంలేదనీ.... ఈ ఉద్యోగంలోకి వచ్చే వారంతా అతి సామాన్యకుటుంబీకులనీ మీకు తెలియదా? అలాంటి పొట్టకూటి కూలి మనుషులకి... మీ వ్యవస్థ ఆవిష్కరణ కోసం అకాలమృత్యువుని ప్రసాదిస్తున్నారు. మీ చర్యల ద్వారా ఏ ప్రజల్ని నమ్మించగలమని? ఏప్రజల సానుభూతి పొందగలమని? ఏప్రజల సహకారం ఆశించి? ఏప్రజల గుండెల్లో మీకు స్మారక మందిరాలు నిర్మింపబడాలని?

ఆలోచించండన్నలూ; పోయినదాని విలువ పోగొట్టుకున్న వాళ్లకి మాత్రమే తెలుస్తుంది. నా భర్త విలువ నాకు ఓజీవిత కాలపు దుఃఖం. పక్షవాతంతో మంచంలో ఉన్ననా అత్త - తిరిగి మాట్లాడగలననీ, నడవగలననీ పెట్టుకున్న ఆశల సజీవదహనం! అన్న తన పెళ్లి చేస్తాడనీ....తన రేపటి జీవితాన్ని అందంగా ఊహించుకున్న ఓ అమ్మాయి కరిగిన కన్నీటి స్వప్నం. పసితనంలో ఉన్న నాబిడ్డల కూలిపోయిన భవితవ్యం!

తొంభై కోట్ల జనాభా ఉన్న దేశంలో నాభర్త మరణం చారిత్రక అంశంకాకపోవచ్చు. స్మారకస్థూపాలకు అర్హమయ్యేటంత గొప్పది కాకపోవచ్చు. కానీ - ఆయన తప్ప వేరేదిక్కు లేని ఓ అయిదు ప్రాణాలకు అది.... నిత్యమరణం!

అన్నలూ! మీ చేతులతో పోగొట్టిన నా పసుపు, కుంకుమల్ని ఎలాగూ తిరిగివ్వలేరు. కనీసం యికనైనా -

అబలల్ని విధవల్ని చెయ్యకండి!

పసిపిల్లల్ని అనాధల్ని చెయ్యకండి!

నేను ఏ 'యిజమూ' చదవలేదు, ఈ సమాజంలో ఆడది ఒంటరిగా బ్రతకటం దుర్భరమన్న నిజం తప్ప. నాబాధతో మిమ్మల్ని నొప్పిస్తే మన్నించండి!

ఇట్లు,
వైధవ్యాన్ని ఆడపడుచు కట్నంగా పొందిన
మీ చెల్లెలు,
సీత.

★ ★ ★

భేతాళుడు కథ చెప్పటం ఆపాడు. అర్థమైన గొంతు సవరించుకొని, "" విక్రమార్కా! సూర్యం తల్లి పక్షవాతంనయమైందా? చెల్లిపెళ్లి జరిగిందా? ప్రభుత్వం సూర్యం భార్యకు ఆడపోలీసు ఉద్యోగం యిచ్చిందా? అతని పిల్లల భవిష్యత్తు ఏమైంది? ఈ ప్రశ్నలకి జవాబు తెలిసీ చెప్పకపోయావో నీతల వెయ్యి వ్రక్కలవుతుంది. భళ్లున ఓ నవ్వు రువ్వుతూ అడిగాడు భేతాళుడు.

తనవంటి మేధావిని ఎల్. కె. జి. ప్రశ్నలడిగినందుకు విక్కమార్కుడికీ ఒళ్ళు మండింది. కోపంగా "భేతాళా! నువ్వడిగిన ప్రశ్నలేవీ ఈ కథనించీ పుట్టవు. ఈ కథవిన్న తరువాత వచ్చే ఒకే ఒక్క ప్రశ్న - "సీత ఉత్తరం చదివి అన్నలు ఆగ్రహించారా? అనుగ్రహించారా?" అని, అన్నాడు.

వెంటనే భేతాళుడు - "ఎలాగూ నీకు మౌన భంగమైంది గనుక నానిబంధనలేవి వర్తించవు గానీ.... అదే నాప్రశ్ననుకుని నీ జవాబు చెప్పు!" అన్నాడు చిన్నబుచ్చుకుంటూ.

విక్కమార్కుడు - భేతాళా! విప్లవం విజయవంతంకావాలంటే - కావలసింది 'సంచలనం' కాదు, సంయమనం! సీత ఉత్తరం చదివాక అన్నలు ఆ ఆలోచన చేసితీరాలి. అలా ఆలోచించలేదనుకో - అప్పుడు 'ప్రజ' కల్కి అవతారమెత్తటమే మిగిలిన ఏకైక మార్గం! అన్నాడు, తనకి అన్నల మీదకంటే. ప్రజల మీదే ఎక్కువ నమ్మకముందన్నంత ధీమాగా!

విక్రమార్కుడి సమాధానంతో సంతృప్తి పడిన భేతాళుడు శవంతోసహా మాయమై ఎప్పటిలా చెట్టెక్క కుండా - ఎన్నికల సీజన్ కనుక భాగ్యనగరం వైపు గగన మార్గంలో తేలిపోయాడు, - అక్కడ జరుగుతున్న 'రాజకీయ డ్రామాలో విక్రమార్కుడి కోసం మరో క్రొత్త కథ దొరక్కపోతుందా!' అన్న ఆశతో...

ఉష (డా॥ సి.హెచ్. శాంతి కుమార్)
అరుణా హోమియో హాస్పిటల్, లాయర్‌పేట్, ఒంగోలు-523 002

బొంగు వేణుగోపాలరావు కథ

# కేబుల్ టీ.వి.

"మీరు నాకేం చెప్పొద్దు. కేబుల్ కనెక్షన్ పెట్టిస్తారాలేదా"? అని సీరియస్‌గా అడిగింది పార్వతి.

"ప్రతి దానికి అలా ఆవేశ పడుకు పార్వతీ! కేబుల్ కనెక్షన్ ఊరికే ఇస్తారనుకున్నావా! నెలకు వందరూపాయలు కట్టాలి" అన్నాడు పరమేశ్వర్రావు.

"అబ్బా!మీ పీనాసితనంతో చస్తున్నాను. బోడి వంద ముఖ్యమా, పరువు ముఖ్యమా?'

"ఇప్పుడు నీ పరువుకేం లోటొచ్చింది. మన ఫ్లాట్స్‌లో ఉన్న వారందరి కంటే ముందు టి.వి. కొన్నది మనమే కదా"?

"గుజ్జం ఉంటేసరా? కళ్లెమవసరం లేదా? మన గొప్ప ఏముంది. ఇప్పుడందరూ టివిలు కొన్నారుగా?"

"ఆహా! ఏమి ఉపమానం... టివికి కేబుల్ కనెక్షన్ గుజ్జానికి కళ్లెంలాంటిదన్నమాట.'

"విషయానికి రండి. టాపిక్ మార్చొద్దు."

"తర్వాత కనెక్షన్ తీసేయమన్నా, టి.వి అమ్మేయమన్నా నేనొప్పుకోను."

"బాగుందండీ మీ వరస. మొగుడు లేక మొఱ్రోమంటే ముండబ్రతుకే ముచ్చటగా వుందన్నట్టుంది. అలాంటి ప్రశ్న జీవితంలో తలెత్తదు. సరేనా!" సంతోషంగా చెప్పింది.

తప్పని సరైకేబుల్ కనెక్షన్ ఇప్పించాడు పరమేశ్వర్రావ్.

మొదటి రోజు ఇరుగు పొరుగు వాళ్లని పిలిచి పసుపు బొట్టు, అగరొత్తులు పెట్టి ప్రారంభోత్సవం ఘనంగా జరిపించింది. ఆరోజు వచ్చిన సనిమా బాగోగుల్ని, కేబుల్ కనెక్షన్ పెట్టించుకొన్న పార్వతి గొప్పతనాన్ని పొగిడి మరీ వెళ్లిపోయారు అమ్మలక్కలు.

"కొత్తగా టీ.వి. కొన్నట్టు ఈ హంగామాదేనికట"అని మనసులో అనుకున్నారు గాని బయటకెవరూ అనలేదు.

★ ★ ★

"ఈటివిలో మంచి సినిమా వస్తున్నట్టుంది పెట్టు" అన్నాడు పరమేశ్వర్రావు.

ఆమె అమాంతం లేచి, తలుపు దబాల్న వేసింది. ఆ శబ్దానికి అదిరి పడ్డాడు. రంధ్రాల్లో గుడ్డ పీలికలు పెట్టింది

"ఏదో పులి చొరబడుతున్నట్టు ఏమిటా హడావిడి?"

"పులి చొరబడినాఫర్లేదు. అది టి.వి.ని తినలేదు సినిమా చూడదు."

"ఓహో! అదాసంగతి! వాళ్ళు రోజూ వచ్చి ఇల్లంతా తొక్కి చెత్తగాచేసి వెళుతుంటే కడగడానికి కష్టంగా వుందికదా!'అన్నాడు అసలు సంగతి అర్ధమైనట్టు.

"బిందెడు నీళ్లకోసం కాదు. వందరూపాయలు పెట్టి మనం కనెక్షన్ పెట్టిస్తే; వాళ్ళు రోజూ వచ్చి తేరగా చూసిపోతున్నారు."

"ఇదేమన్నా సనిమాహాలా? డబ్బులివ్వడానికి?!"

"వాళ్లనీ కనెక్షన్ పెట్టించు కోమనండి! నేనేమన్నా వద్దన్నానా?"

ఆరోజు నుండి తలుపులు బిగించుకొని టి.వి చూస్తున్నారు. కొద్ది రోజుల వరకు తలుపు దగ్గర శబ్దం చేసినట్టు, ఎవరో చూస్తున్నట్టు అనిపించేది. అలా అనిపించడం పార్వతికి ఎంతో ఆనందాన్ని కలిగించేది.

ఆ ఆనందం కూడ మూన్నాళ్ల ముచ్చటే అయింది. ఎవరూ ఆ ఇంటి వేపు కన్నెత్తి చూడటంలేదు. ఎవరి ఇళ్లలో వాళ్లే వున్నారు. అనుమానం వచ్చి ప్రక్కింటి పిన్నిగారింటికి వెళ్లింది.

ఆ ఇంటి వాళ్లంతా కేబుల్ సినిమా చూస్తున్నారు. గుండెనొప్పి వచ్చినట్టు గిలగిల్లాడి పోయింది పార్వతి. గబగబా ఇంటికొచ్చి తన టి.వి. ఆపుజేసింది.

ఆ బిల్డింగ్‌లో వున్న టి.వి.లన్నీ దారం తెగిన గాలి పటాల్లా తయారయ్యాయి. బొమ్మ అస్పష్టమైంది. అప్పటికి వస్తున్న సినిమాలోని హీరో హీరోయిన్‌లు తుఫాను గాలికి వూగిపోయే కొబ్బరి చెట్లుల్లా వూగిపోతున్నారు. ముఖాలు అస్పష్టమైనాయి. కేబుల్‌వాడు పొరబాటున బ్లూ ఫిల్మ్ వేశాడేమోనని భయపడ్డారు.

ఆ గందరగోళం చూశాక పార్వతి హాయిగా ఊపిరి పీల్చుకుంది. కేజి బంగారం దొరికినంత సంబర పడిపోయింది.

"ఏవిటే మంచి సినిమా మధ్యలో ఆపేస్తున్నావ్? ఎప్పటి నుంచో చూద్దామనుకుంటున్నా వీలుపడలేదు. ఏదో కేబుల్ వాడిపుణ్యాన చూస్తా వుంటే ఏమిటి గొడవ....?"

"ఆ సినిమా ఏంబాగా లేదు...."

"నిన్నెవరు చూడమన్నారు? నువ్వు వంటపని చూసుకో!"

"మీతోబాటు బిల్డింగులో అందరూ చూస్తున్నారుగా?"

"ఓహో అదానీబాధ! వాళ్లెవరో చూస్తున్నారని మనం చూడటం మానేస్తామా!"

"ఒక పూట సినిమా చూడకపోతే ప్రాణం పోతుందా?"

"నీకేమన్నా పిచ్చెక్కిందా! టి.వి. కొనేవరకు ఊపిరితోడేశావ్. ఆతర్వాత కేబుల్ కనెక్షన్ పెట్టించమని పీక మీదకూర్చొన్నావు. ఇప్పుడేమో పూర్తిగా బంద్ చేసి కూర్చోమంటున్నావు. అంతా నీఇష్టమేనా? ముందు టి.వి. ఆన్‌చెయ్?!" అని గద్దించాడు.

"ఆడపుట్టుక పుట్టేకంటే అడవిలో మానై పుట్టడం మేలు. కనీసం టి.వి. విషయంలో నైనా నాకు స్వేచ్ఛలేదు. ఎందుకీ బ్రతుకు? ఇంతకన్నా ఏ బావిలోనో దూకి చావడంమేలు.' ' అంటూ ఆరున్నొక్కరాగం అందుకుంది.

"పార్వతి ఏడవొద్దు. ఇంత రాత్రి ఏడిస్తే నిన్ను నేను చావబాదాననుకొని ఎవరైనా పోలీసు రిపోర్టు ఇవ్వొచ్చు. వరకట్నం కేసు బనాయించి బొక్కలో తొయ్యొచ్చు. అసలే నెలాఖరు. పురుగుల కోసం బల్లులు చూసినట్టు కేసులు కోసం పోలీసోళ్ళు చూస్తుంటారు.'' అని బ్రతిమాలాడు.

ఆవిధంగా ఆరోజు గడచిపోయింది.

తను'టి.వి. ఆఫ్ చేసినప్పటికి, అందరికి కేబుల్ సినిమా స్పష్టంగా వస్తుందన్న సత్యాన్ని మూడు రోజుల తరువాత గ్రహించింది పార్వతి.

అందరికి అంత స్పష్టంగా కనబడడానికి గల కారణాలను అన్వేషించింది. కేబుల్ వైరుమీద ఒక పిన్నుగుచ్చ బడివుంది. ఆపిన్ను తనగుండెల్లో గుచ్చుకున్నట్టుగా ఫీలైందామె.

చటుక్కున పీకేసింది. అన్ని టి.వి.లు అల్లాడిపోయాయి.

"'ఇలాంటి పనులు చేయక పోతే ఓవంద ఇచ్చి కనెక్షన్ పెట్టించుకోవచ్చుగా! దిక్కుమాలిన సంత." అని పేరుపెట్టకుండా అందర్నీ చీదరించుకుంది.

ఈసంగతి తెలిశాక అందరూ ఆమెమీద కసిపెంచుకున్నారు. అందరూ ఒకటై అవకాశం కోసం ఎదురు చూశారు. కుళాయి నీరుపట్టుకునే దగ్గర గొడవ పెట్టుకున్నారు. తలోదెబ్బవేశారు. జుట్టుపీకేరు. బట్టలు చించారు.

వళ్లు హూనమై మాంసపు ముద్దలా మంచం మీద పడివుంది. "ఏమైందే?" అని ఆత్రంగా అడిగేడు పరమేశ్వర్రావ్.

"నీళ్ళ దగ్గర గొడవ అయింది. అంతా కలిసినన్ను కొట్టారు. నేనూ వాళ్లని కొట్టాను' మూలుగుతూ చెప్పింది.

"ఇలాంటి గొడవలుంటాయని నాకు ముందే తెల్సు. అందుకే కేబుల్ కనెక్షన్ వద్దన్నాను. వింటేగా... అనుభవించు...."

"అవకాశం వచ్చింది. ఇక మీ ఇష్టం వచ్చినట్టు అనండి. మీ బుద్ధి నాకు తెలీంది కాదుగదా!"

"సరే అవన్నీ ఇప్పుడెందుకుగాని డాక్టరు దగ్గరకెళ్లాంపద!"

"అమ్మో! వద్దండి. ఇంజక్షన్ అంటేనాకు చచ్చేటంత భయం!"

"నేనున్నాగా నీకేం పర్లేదు." అంటూ దగ్గర్లోవున్న డాక్టరు దగ్గరికి తీసుకెళ్లాడు.

డాక్టరు దెబ్బలు తగిలిన చోటల్లా పరీక్షించాడు.

"చేయి విరిగినట్లుంది. వీపు స్పీడుబ్రేకర్లున్న రోడ్డులా తయారైంది. ఇంత గట్టి దెబ్బలు ఎలా తగిలాయ్" అన్నాడు డాక్టరు.

"కేబుల్" అన్నాడు అతను ఇంకెటో చూస్తూ.

తల తడిమి చూసాడు డాక్టరు.

"తలనిండా ఉసిరికాయంత బొప్పిలు కట్టాయ్. ముళ్ళులా వున్నాయ్. అసలు కారణమేంటి?" అన్నాడు డాక్టరు మళ్ళీ.

"కేబుల్" అన్నాడు పరమేశ్వర్రావ్.

"మెడ మీద కూడ భాగా దెబ్బలు తగిలాయ్. క్రింద మీద చూడకుండా కొట్టారు.

అసలు - ఇంత గొడవెందుకు జరిగింది?" అన్నాడు డాక్టరు మళ్ళీ.

"కేబుల్" అన్నాడు.

డాక్టరుకి పిచ్చెక్కింది. "ఊఁ..." అంటూ జుత్తు పీక్కోడానికి రెండు చేతులు పైకెత్తాడు. బట్ట తలకావడం వలన అవకాశం లేకపోయింది. "ప్రతి మాటకి కేబుల్..కేబుల్ అని ప్రాణం తీస్తున్నారు. ఈకేబులేంటయ్యాబాబు??" అని విసుగ్గా అడిగాడు డాక్టరు.

"కేబుల్ కనెక్షన్"అన్నాడు.

"కేబుల్ వాళ్లెందుకు కొడతారయ్యా. అట్లైతే ఈపాటికి మా ఆవిడ స్వర్గంలో వుండేది.' 'అన్నాడు డాక్టరు.

"వాళ్లు కాదండి..... ఇరుగు పొరుగువాళ్లు ....కుళాయి నీళ్లు పట్టుకోవడం దగ్గర గొడవొచ్చి..."అని నసిగాడు.

"అర్థమైంది. పూర్తి ఆరోగ్యం చేకూర్చే బాధ్యతనాది. మీరేం బెంగపడొద్దు" అన్నాడు డాక్టరు.

మూడురోజులు పూర్తిగా బెడ్‌రెస్ట్ తీసుకోవాలనీ చెప్పాడు. మందులు ఇంజెక్షన్‌లు చాలా వాడవలసి వచ్చింది.

త్వరలో రాబోయే మార్పు నూహించుకొని టి.వి. కొనేవాళ్లను వెతుక్కున్నాడు. ఆ వచ్చే డబ్బు మొత్తాన్ని నెలకి నూటికి పదిరూపాయల వడ్డీకి ఫైనాన్స్ వాళ్లకి ఇచ్చేటందుకు ఒప్పందం కుదుర్చుకున్నాడు.

నాలుగు రోజులు తర్వాత -

"ఏమండీ! మీర్కుకోపగించుకోనంటే ఒకమాట..." అని నసిగింది పార్వతి.

ఆ మాటేమిటో తనకి ముందే తెలుసు గనుక"ఫర్లేదు చెప్పు. "అన్నాడు లోలోపల ఉప్పొంగుతున్న ఆనందాన్ని అణచుకొంటూ.

"టి.వి. అమ్మేయండి" అన్నది పార్వతి.

"నీమాట ఎప్పుడు కాదన్నాను గనక" అన్నాడు.

"తర్వాత మాట మార్చరుగదా!" అంది అనుమానంగా

"చస్తే మార్చను. దేవుని సాక్షి" అన్నాడు.

"ఆ డబ్బుతో పట్టుచీరకొనండి మరి." అన్నది పార్వతి. పరమేశ్వర్రావ్ కళ్లు తిరిగి క్రిందపడ్డాడు.

బొంగు వేణుగోపాలరావు, ఎల్.ఐ.జి. 22-1/4 ఫ్లాట్స్,
కె.పి.హెచ్.బి. కాలనీ, హైద్రాబద్ - 72

## అంబడిపూడి మురళీకృష్ణ కథ

# అమ్మదనం

అబ్బ 'నిరీక్షణ' ఎంత నరకమో!

క్షణాలు లెక్కించుకుంటూ కూర్చుంటే ఏ గడియారం ముల్లైనా సగటు భారతీయ రైల్లాగే నడుస్తుంది. శ్రీశ్రీశ్రీ వేణుగోపాలకృష్ణ గారు, అదే మా శ్రీవారు ఉదయం హడావిడిగా టిఫిన్ చేస్తూ -

''ఇదిగో సాయంత్రం నాలుగున్నర కల్లా నా చేతివేళ్ళు మనింటి కాలింగ్ బెల్లుపై సరిగమలు పలికించక పోతే .... అంతఒట్టు'' అనేసి కడిగీ కడగని ఆచేతిని నా కొంగుకు

తుడిచేసి, చిలిపి పనులు మొదలెట్టగానే, నేనెత్తి నొక్కటిచ్చే సరికి బ్రీఫ్‌కేసు పట్టుకుని ఆఫీసుకి పరుగోపరుగు.

నాకేమో క్షణక్షణానికి చూపు గడియారంకేసే పోతున్నది.

మా పెళ్ళయి ఇవ్వాల్టికి సరిగ్గా సంవత్సరం. కాకతాళీయంగా జరిగినా, కలలాంటి ఆ మధురమైన శుభఘడియలు నా జీవితంలో నిజమైన తీరు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా మనసు దూదిపంజలా గాలిలో తేలుతుంది. కల ఎలాంటిదైనా, స్వప్నావస్థనుండి మనిషి జాగృతం కాగానే కల చెదిరిపోవటం సహజం. అలాంటిది నా జీవితంలో ఆ కల చెదిరిపోలేదు.

ఏనాడు ఏతల్లి బొడ్డుపేగు తెంచుకుని ఈ నేలమీద పడ్డానో ఆనాటినుండి తెగిన గాలిపటమైన నా బ్రతుకులో.....

అనంతమైన గాలి ప్రవాహంలో జారిపడ్డ పక్షి ఈకలాగా గమ్యం తెలియని ఈ 'జాజి' బ్రతుకులో....

పుట్టినప్పటి నుండే మోడువారి అగమ్యగోచరమైన నాయీ వెదురు బ్రతుకును సరిగమలతో సరిచేసి, తీయని గమకాలతో శృతిచేసి నా జీవితానికో అర్థాన్నిచ్చిన నా'దైవం' నా 'వేణుకు' సాయంత్రం ఓ కమ్మని కబురందివ్వాలి.

మరో ఏడునెలల్లో......................

ఈ ఊహే ఇంత తియ్యగా ఉంది. వేణుకు చెప్పాలంటే, కనీసం మాటలైనా సరిగా వస్తాయో? రావో? మాటలురాని నా మౌనాన్ని, వేణు ఎలా రిసీవ్ చేసుకుంటాడో ఏమో?,

"సినిమాకి వెళదాం"అన్నాడుకదా! తనురాగానే సినిమా విషయం వాయిదావేసి, ఎంచక్కా సరదాగా ఏడిపించాలి కాసేపు,

ఈ విషయాన్ని వెంటనే చెప్పకూడదు.

మరిచెప్పకుంటే ఊరుకుంటాడా? ఊహౌ....రకరకాల ఫీట్లు చేస్తాడు, చేయిస్తాడు కూడా! చక్కిలింగింతలు పెడతాడా.

చక్కలిగిలి! అమ్మో!.... చక్కిలిగిలిపెడితే...ఊహౌ!!

ఇంకా సరిగ్గా రూపుకూడా దిద్దుకోని నా బాబు ఆనవ్వుతో గుక్కతిప్పుకోగలడా? వద్దు. ఈగోలంతా లేకుండా 'వేణు'రాగానే చెప్పేయాలి.

చెప్పేయగానే..... ..

ఈ ఊహకే తన చెక్కిళ్ళు కెంపులవుతున్నాయని చెబుతున్నది ఎదురుగా ఉన్న అందం. సిగ్గుతో తలవొంచుకుని ఏదో ఆలోచిస్తూన్నంతలో........

'మల్లెపూలమ్మా మల్లెపూలు' అన్నకేకతో సమ్మిశ్రితమైన సైకిల్‌బెల్ నన్నీలోకానికి మోసుకొచ్చింది బయటికెళ్ళి, రెండు మూరలు పూలుకొని, డబ్బులు తెచ్చి ఇవ్వటం కోసం ఛెంగున వెనక్కితిరిగి, వాకిట్లోని రెండుమెట్లూ ఒకేసారి ఎక్కేసాక గుర్తుకొచ్చింది. నేనసలే వట్టిమనిషిని కాదన్న సంగతి. ఇకముందు ఇలా పరుగులెత్తకూడదు అనుకుంటూ, మెల్లగా లోపలకెళ్ళి డబ్బులు తీసుకోచ్చేలోగా మల్లెపూలబ్బాయి నాలుగు సార్లు బెల్లుకొట్టాడు త్వరగా రండి అన్నట్లు. నాకు కించిత్తు కోపం వచ్చింది.

"వస్తూన్నానుండవయ్యా! చంటిబాబుకి ఇబ్బంది కలక్కుండా రావద్దూ"అనేసాను.

"బంధువులు ఎవరైనా వచ్చారా అమ్మా!" నవ్వుతూ అడిగేశాడు, బహుశా మరోరెండు మూడు మూరలు ఎక్కువగా కొంటానని కాబోలు.

అతనికి ఏమి చెప్పాలో అర్థంకాక, ఓ నవ్వు నవ్వేసరికి, ఆనవ్వు ఆపూలబ్బాయికి అర్థంకాక తలగోక్కుంటూ సైకిలెక్కేసాడు.

నా చూపు మళ్ళీ గడియారంపై పడింది. టైము అయిదుదాటింది. ఈయనింకా రాలేదు. పెందలాడే వస్తానన్న మనిషి, ఏమి రాచకార్యాలు వెలగబుడతున్నాడో ఏమో? అరె! ఇంటిదగ్గర ఓ పిచ్చిది బిక్కు బిక్కుమంటూ ఎదురు చూస్తూంటుంది, త్వరగా వెళదాం! అన్న ఆలోచనే రాదు కాబోలు ఈయనగారికి.

ఆశగా ఎదురు చూస్తూ కూర్చున్న నాలో 'ప్రేమ' స్థానంలో చిరుకోపం చోటు చేసుకుంటున్నది. ప్రేమతో కొన్నపూలు కూడా పెట్టుకోబుద్ధి కాలేదు.

నిరీక్షణ అన్నది ఎంత నరకమో!

చూడరా కన్నయ్యా! మీ నాన్నకు నామీద కొంచెంకూడా ప్రేమలేదు, అనుకుంటూనే ఏదో అలికిడి అనిపించి వీధిగుమ్మం దగ్గరకెళితే ఏమీలేదు. అలాగే కొద్దిసేపు ఎదురు చూస్తూ నుంచుండే సరికి, పోకిరీవెధవొకడు అటూఇటూ నాలుగుసార్లు తిరిగాడు. ధైర్యంచేసి వాడికి వినపడేటట్లుగానే గట్టిగా తిట్టేసి, అసలీ గొడవంత ఎందుకని తలంచి, సహనం నశించి తలుపుమూసి వెనక్కి తిరగానో లేదో కాలింగ్ బెల్ మ్రోగింది. అదే స్పీడులో వెనక్కితిరిగి తలుపుతీస్తున్న నామనసు తలపుల్లో రకరకాల రంగురంగుల ఆలోచనలు. ఆతృతతో తలుపుతీసిన నాకు ఓ అపరిచిత మొహం కనబడగానే ఓ అడుగు వెనక్కేసి....

"ఎవరు కావాలి?" అన్నాను.

"జాజి గారంటె మీరేనా?

"అవును. ఏం?"

"మిసెస్ వేణుగోపాలకృష్ణ?"

"అవును, మావారే. ఏమైంది."

తాను మోసుకొచ్చిన వార్త ఎలా చెప్పాలా అన్న సందిగ్ధావస్థనుండి మాటపైకి రావటం లేదు అన్నట్లుంది అతని మొహం.

అర్థమైంది, నా వేణూకేదో కాకూడనిదే జరిగినట్లుంది.

న్నో..........వేయిగొంతుకలతో దిక్కులు పిక్కటిల్లేలా ఒక్కసారి అరిచాను. లేదు. అరిచాననుకున్నాను. కానీ అదే నిజమై ఆశబ్దబేరి బయటకు పొక్కినట్లయితే ఆ పిడుగుపాటుకు ఈ ప్రపంచం తట్టుకోలేదని కాబోలు, పరమశివుడి కంఠంలో గరళంలా గొంతులోనే నిలిచిపోయింది.... నిశ్శబ్దంగా!

★ ★ ★

తానొకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తుందని, తను అనుకున్నదేమిటి? జరిగిందేమిటి? ఇంతలా ఆడుకోవాలా విధి తనతో, కసితీరా వెక్కిరిస్తున్నట్లు ఏమిటి దారుణం?

పురిటిలోనే సర్వం కోల్పోయిన నన్ను ఇంతకాలం బ్రతకించటం దేనికి? జీవితంలోని మాధుర్యం, ఇంత తియ్యగా ఉంటుందని రుచి చూపించి, ఒక్కసారిగా, తలపుల్లోకూడా

భరించలేని వైధవ్యాన్ని ఆవిధాత నానుదుట ఎలా వ్రాయగలిగాడు?

జీవితాన మరిచిపోలేని రోజు, మరపుకురాని రోజు అయిన పెళ్ళిరోజు నాడే....ప్చ్!

"వేణూ, నీకో తియ్యని బహుమతిని మరికొద్దిమాసాల్లో ఇస్తున్నా"నన్న వార్తను నన్ను చెప్పనివ్వకుండానే, నన్ను ఒంటరిదాన్ని చేసాడు ఆ భగవంతుడు.

పండుతున్న కడుపు చూసుకుని పరవశంతో తృప్తిపడనా! లేక నా జీవితేశ్వరుడే నన్ను వదిలివెళ్ళాక ఇంకా పండిరాలిపోని జీవితాన్ని చూసుకుని కుళ్ళికుళ్ళి ఏడ్వనా?

ఎంత ప్రయత్నించినా ఆగని నా కన్నీటి ప్రవాహానికి అడ్డుకట్ట వెయ్యటం మరెవరితరమూ కాదేమో! సర్వం కోల్పోయిన తనకు నేనున్నానులే అన్న ఓదార్పు గానీ, ఒక తియ్యటి పలకరింపుగాని లేక, అన్నపానీయాలు రుచించక, నాకు తెలియకుండానే మగతనిద్రలోకి జారి అంతలోనే ఒక్కసారి ఉలిక్కిపడిలేచాను.

కళకళలాడుతూ వెలగాల్సిన నా ఇంటిదీపం ఎప్పుడోకొండెక్కింది. మసకబారిన తన జీవితంలాగే మసకమసగ్గా, స్పష్టంగా ఏదీ కానరాకున్నా - ఎవరో తనను పిలిచినట్లనిపించి, చూట్టూరా కలియచుశా! ఎవరూ కనిపించక అసహనంగా అటూఇటూకదిలే ప్రయత్నంచేసా!

కానీ.....ఆ కదలిక మునుపులా లేదు.

రోజురోజుకి తనలో చాలా మార్పులు వస్తున్నాయి. అయినా ఆమార్పుల్ని శ్రద్ధగా గమనించే ఉత్సాహమేదీ తనలో ఉండటంలేదు. నెలలు నిండుతున్నా పట్టించుకున్నవారు ఎవరూ లేరు. తిన్నరోజు తినడం, లేనిరోజు పడుకోడం, 'వేణు' ఆఫీసువాళ్ళు, అప్పుడు ఇవ్వాల్సిన వేవో యిచ్చి చేతులు దులుపుకున్నారు తప్ప, మళ్ళీ కనబడలా! అయినా నా దురదృష్టానికి వాళ్ళేం చేస్తారు?

ఎందుకో ఈ మధ్య అస్సలు లేవలేకపోతున్నాను. ఏమిటో తెలియని బాధ? ఫలానా అని స్పష్టమైన అవగాహనలేక ఎలాగోలా ఓపిక తెచ్చుకొని కలిశాను.

"నీకోసం కాకపోయినా నీ బిడ్డకోసం బ్రతకా"లంది" డాక్టర్. నాకథంతా విన్నాక, నాతో పూర్వపరిచయంలేకున్నా ఓ కుటుంబ సభ్యురాలిలా రకరకాల సూచనలు, సలహాలు ఇచ్చింది.

నిజమే! తను ఇంతకాలం బ్రతికున్నది తనకోసం కాదుకదా! క్షణంలా గడిచిపోయిన ఏడాది అనుభవాలను నెమరవేసుకుంటూ, తనలో పెరుగుతున్న 'వేణు' ప్రతిర్పూపాన్నయినా జాగ్రత్తగా కాపాడుకోవాలనే కదా! అవును! జాగ్రత్తగా కాపాడుకోవాలి.

నిస్తేజ్యంగా, నిర్దాణంగా పడివున్న నన్ను నిద్రలేపింది నా చిన్నారి. బాబో, పాపో? ఎవరైతేనేం? తన కడుపు తీపి, తమకలలపంట, తన బ్రతుక్కో అర్ధాన్నివ్వబోతున్న నా చిన్నారి.

నా చిన్నారికి ఎవరి పోలికలొస్తాయో?

నాపిచ్చిగానీ, ఏమిటీ ప్రశ్న?, నా వేణూ ప్రతిరూపానికి వంకలుంటాయా?

'వేణూ' నాకు దూరమై ఇంతకాలమైనా, ప్రతిక్షణం నాజ్ఞాపకాల్లో నా ఊహల్లో,నా ఊపిరినిండా తానై ఉన్నాడు. ఎస్! నాతోనే ఉన్నాడు.

"వేణూ" పెదవి దాటని పిలుపైనా, పలికేందుకు వేణూ ఎదురుగా లేకున్నా, ఇప్పుడు నేను, స్వప్నలోకాల్లో నా వేణుతో మాట్లాడుతున్న ఆనందాన్ని అనుభవించ గలుగుతున్నాను.

"ఇటుచూడు వేణూ మన చిన్నారి అల్లరి" అంటూ ఫిర్యాదు చేస్తూనే, తప్పరాకన్నా అంటూ చేత్తో ఉదర భాగాన స్పృశించాను. ఆ స్పర్శ ఎంత మధురంగా ఉందో! నా చిన్నారి, నా బిడ్డ, నారక్తమాంసాలు పంచుకుని పుట్టబోతున్న తన సర్వస్వం. వేణూ తనకు మిగిల్చిపోయిన తీయని బహుమతి. రేపోమాపో పురుడు పోసుకుని తన చిన్నారిని చేతుల్లోకి తీసుకుని, తనివితీరా హత్తుకోవాలి. మధురమైన ఈ ఊహలకి ఉత్తేజితనై నవ్వుకున్నా!

ఆనవ్వు......చిన్నపాటి చిరునవ్వే? అయినా అందులో కమ్మని తృప్తిఉంది. ఆతృప్తితోడే తనొక నిర్ణయానికొచ్చింది. నర్సింగ్‌హోంలో ఎడ్మిట్ అయ్యేందుకు లేచి మెల్లగా బయల్దేరాను.

నిరీక్షణ అన్నది ఎంత నరకమో!

నిన్నఅనంగా రావాల్సిన పురుడు, మరో రెండుపూటలు దాటినా ఆసూచనలేమీ కనబడటంలేదు. నొప్పులొస్తున్నాయి, ఆగిపోతున్నాయి. నొప్పులొచ్చేటప్పుడు ఆ బాధని భరించలేక ఈ ప్రాణంపోతే బావుణ్ణు అనిపిస్తున్నది. ఇంకా కాస్సు ఆలస్యమైతే ప్రమాదమనిపించి కాబోలు, పెయిన్స్ రావటానికి ఇంజక్షన్ ఇప్పించింది డాక్టర్.

★ ★ ★

'జాజి' ఎంత అందమైన పేరు. ఇది నాకెవరూ పెట్టిందికాదు. చిన్నతనంలో సన్నగా ఉన్నానని, అందరూ నన్ను అలాగే పిలిచేవారు. అదేస్థిరపడింది. వేణుకి కూడా ఆపేరే ఇష్టం. ఎంత తియ్యగా పిలిచేవాడు. అవునూ! తనిప్పుడు ఎక్కడుంది? ఆసుపత్రిలో కదా; మరి స్పృహలోకి వచ్చిఎంతసేపయ్యింది. ఏమో! మూతపడ్డ కనురెప్పల్ని తెరవటానికి ప్రయత్నిస్తూ - తాను అంతకుమునుపు అనుభవించిన వ్యధతాలూకు సంఘటనలన్నీ ఒకదానివెంట ఒకటి వరుసగా గుర్తుకొచ్చి - గంపెడంత ఆశతో ఆశగా బోసినవ్వుల చిన్నబాబు ఉండాల్సినస్థానంలో బోసిపోయిన పొత్తిళ్ళు చూసి నిశ్చేష్టురాలైంది. ఇంకా కాస్సు క్షాలేదేమో అనుకొని ఉదర భాగాన్ని తడిమిచూశా! బాండేడో, నడుంకట్టో గట్టిగా తగిలింది చేతికి, సన్నగా నొప్పి.

తాను ఏ క్షణాలకోసమయితే ఇంతకాలం క్షణమొక యుగంలా గడిపిందో, ఆసమయం ఆసన్నమైన క్షణంలో క్షణంకూడా నన్ను ప్రశాంతంగా నిలువనీయక ఏమిటి దారుణం? ఏమైందసలు? నాబాబు ఏడి? నా కలలపంట ఏడి? జీవితమంతా ప్రశ్నార్థకాలేనా? జవాబులేని జీవితమేనా? అణుమాత్రపు వత్తిడినైనా తట్టుకోలేని సున్నితమైన ఈ 'జాజి' మనసు అణువణువును కక్షగట్టినట్లు కుళ్ళబొడుస్తున్న ఆస్వామి కుళ్ళుబుద్ధినా తానింతకాలం నమ్మింది. న్నో! నా స్వామే నన్నుకాదని పోయాక నాకే స్వామిలేడు. మరి! మరినా జీవితపు డైరీలో మలి వాక్యాలు వ్రాసుకోవటమేనా? కాదు. నేను అనుభవించాలనుకున్న మాతృత్వపు మధురక్షణాల సుమధుర ఘడియల్ని శాశ్వతం చేసుకుంటాను. అవును! శాశ్వతం చేసుకుంటాను.

★ ★ ★

అనాథబాలల ఆశ్రమం. ఎంతోమంది పిల్లలు. రంగురంగుల సీతాకోకచిలుకల్లా ఆటపాటల్తో హాయిగా తిరుగాడుతున్న ఆ పిల్లలందర్నీ చూసే సరికి తన మనసు అలవికాని ఆనందంతో మురిసిపోతున్నది. ఆచిన్నారుల్ని చూస్తూ మెల్లగా నాలుగు అడుగులు ముందుకేశా!

ఓ మూల, చెట్టుక్రింద అరుగుపై గువ్వపిట్టలా వదిగి కూర్చున్నాడు ఒకబాబు,

నోట్లోబొటనవేలు. ఆర్తిగా తననే చూస్తున్న ఆబాబు, నేనూ ఆ చిన్నారి కళ్ళలోకి చూసే సరికి చూపుమరల్చుకున్నాడు. ముద్దులు మూట గట్టినట్లున్న బాబు దగ్గరకెళ్ళి, చేతులు చాచి "ఇలారా!" అని పిలిచాను. బాబు కళ్ళల్లో గమ్మత్తయిన మెఱుపు, ఆవెంటనే నిండుకుండలయ్యాయి కళ్ళు.నేనే దగ్గరగా వెళ్ళి పక్కన కూర్చుని వళ్లోకి తీసుకున్నా!

అప్పటిదాకా బెరుగ్గా ఉన్న బాబు పెనుగాలిలా నన్ను చుట్టేసుకున్నాడు.

తను ఏమాత్రం అలక్ష్యంగా ఉన్నా తనకా చల్లని ఒడి దూరమవుతుం - దేమోనన్న భావనతో కాబోలు.

అవును! తనకు కావలసింది అదే!!

ప్రేమగా పలకరించి ఎన్నో ప్రశ్నలేశా! అన్నింటికీ అమాయకపు కళ్ళే అందమైన సమాధానాలయ్యాయి.

బాబుని కూడా తీసుకుని, ఆశ్రమ మేనేజర్‌ని కలిసా! నీ గురించి సవివరంగా చెప్పుకుని, బాబు వివరాలు సేకరించాను.

తన కన్నబిడ్డలా, కంటికిరెప్పలా కాపాడుకుంటూ పెంచుకోవటానికి ఆ బాబుని తనతో పంపమని ప్రాధేయపడ్డా.

ఆశ్రమ నియమనిబంధనల ప్రకారం సవాలక్ష ప్రశ్నలడిగి, సంతృప్తిపడి ఫార్మాలిటీస్ అన్నీ పూర్తయ్యాక, బాబుని తనతో పంపటానికి ఒప్పుకున్నాడు మేనేజర్. ధన్యవాదాలు తెలుపుకుని బాబుతో ఇంటికి బయలుదేరా!

ఆటోలో బాబుతో వెళుతున్న తన ఆలోచనలు అంతకన్నా వేగంగా పరిగెడుతున్నాయి. వేణూ జ్ఞాపకం వచ్చాడు.

"వేణూ!ఇదిగో ఈ బాబుని మన బాబుని చేసుకున్నా!

మమ్మల్ని మనసారాదీవించు అని ప్రార్థించా!

అంతకుముందే ఆనందంతో నిండిన నాకళ్ళ నుండి ఓ వెచ్చటి కన్నీటి చుక్క వడిలో కూర్చున్న బాబు చేతిపైపడి పైకి చూసాడు.

తన చిట్టి చేతుల్తో నా కళ్ళుతుడిచి 'అమ్మా' అంటూ మరింత దగ్గరగా హత్తుకున్నాడు నా గుండెల్ని,

'అమ్మః ఓహ్! ఎంత మధురమైందీ పిలుపు, ఎంత కమ్మగా ఉంది! అమ్మ - చాలు. ఇదే, ఇదే తనకు కావలసిన 'అమ్మదనం'.

అంబడిపూడి మురళీకృష్ణ, ఎ.ఐ.జి. 173,
భరత్‌నగర్, హైద్రాబాద్ - 18

## ఎ. జయలక్ష్మిరాజు కథ

# కరివేప

"అదేమిటే అమ్మాయ్! కరివేపచెట్టునిలా ఎండబెట్టేస్తున్నావు! ఇంట్లోనీళ్లవసతి ఉందికదా! కాస్త పాదుచేసి నీళ్లు పోస్తే, చిగురించి చారుల్లో, కూరల్లో పనికిరాదూ!" దీర్ఘాలుతీస్తూ అంది పక్కింటి పిన్నిగారు తాయరుతో!

"ఆ! ఏం కరివేపలెద్దురూ! కష్టపడి పాదుచేసి నీళ్లుపోసి, పెంచి, పెద్దచేస్తామా? చారుల్లో, కూరల్లో ఇదిలేనిది పని జరగదంటూ వేస్తామా? ఇంతాచేసి తినేటపుడు తీసేయక మానంకదా! ఎంగిలికంచం చుట్టూ ఓడిపోయిన సైనికుల్లా, పదవిపోయిన మాజీల్లా, దీనంగా మొహాలేసుకుని అలా పడుంటే "అయ్యో! పాపం! అనేవారు లేరుకదా! ఈ మాత్రందానికి వేయటమెందుకు? తీసిపారేయట మెందుకు? కరివేప ఉసురు నేను పోసుకోలేను బాబూ! అంది తాయరు!

"అమ్మో! మీ ఆయన నీక్కూడా కథలు రాయటం నేర్పించాడా? కొంపదీసి! నిక్షేపంలాంటి కరివేపను కథా వస్తువుగా తీసుకుని, నలగ్గొట్టేస్తున్నావు కదే!"

అంతదాకా గదిలో కూర్చుని రాసుకుంటున్న శ్రీనాథరావుకు భార్యకరివేపాకు మీద నిరసన తెలయచేస్తూ మాట్లాడిన మాటలు చెవుల్లో దూరి ఆలోచింపచేశాయి! ఆవిడ కరివేప లేకుండా వంటచెయ్యలేదేమో! కాకపోతే చెట్టంత మొగుడు కరివేపలా మిగిలిపోతున్నాడన్నదే ఆవిడ బెంగ! మిగిలి పోవటం అంటే ఏమునీశ్వరుడో, కమండలంలోని నీళ్లుచల్లి "అలాకరివేపచెట్టువై పడిఉందువుగాక!" అని శాపగ్రస్తుణ్ణి చేయటమూ కాదు! ఆమె భర్తనందరూ, సమయం పట్టేపుడు సహాయంపొంది, పనయిపోగానే కూరల్లో కరివేపలా తేలిగ్గా తీసిపారేసి మాట్లాడుతున్నారన్నదే ఆమెబెంగ! మంగతాయరు మధ్య తరగతి కుటుంబంలో పుట్టి, గుమాస్తాగిరి వెలగబెడుతున్న శ్రీనాథరావుకు ఇల్లాలయింది! ఆమె భర్తను గురించి లేటెస్ట్ సినిమాలో ఈస్ట్‌మన్‌కలర్ లాంటి కలలు చాలా కనింది! కానీ ఆమె కల ఒక్కటంటే ఒక్కటి పలించలేదు! ఆమె అభిరుచులకు తగ్గట్టు అతను ఏనాడు నడుచుకునేవాడుకాదు!

శ్రీనాథరావు మంచి స్ఫురద్రూపి! బుద్ధిమంతుడు! భార్యంతేప్రేమ కలిగి గౌరవించే మనస్తత్వం కలవాడు! అన్నింటినీ మించి పరోపకార బుద్ధి అమితంగా కల్గిన వాడు! కానీ అతనికి సంబంధించిన విషయాల్లో మాత్రం మంచి వ్యక్తిత్వం కొన్నినిర్దుష్టమైన అభిప్రాయాలు కలిగి ఉన్నవాడవటంతో, భార్యకతను మొండివాడుగానూ, మూర్ఖుడిలాగానూ కనిపిస్తూ ఆమెకతను అన్ని విషయాల్లోనూ కొరకరాని కొయ్యగా తయారయ్యాడు! శ్రీనాథరావు కథలూ కవితలూరాస్తుంటాడు! కొన్ని అచ్చయ్యాయికూడా! ఎవరైనా మీకు కథలు రాయటం ఎలావచ్చింది? ఎప్పట్నించిరాస్తున్నారు? అని ప్రశ్నిస్తే, దూరదర్శన్ వారు తనకో ఇంటర్వ్యూ ప్రత్యక్ష ప్రసారం చేస్తున్నంత ఆనందపడిపోయి " మానాన్నగారు నాకు శ్రీనాథకవి పేరు పెట్టారు కనుకనే, ఆపేరు సార్థకం చేయటం కోసమే రాస్తున్నానంటూ మొదలుపెట్టి, వినేవారికి కథలంటే వెగటు పుట్టి శూన్యంలోకి చేసేదాకా లెక్చరిచ్చి అలావదిలేస్తాడు!"రచయిత అన్నవాడు స్టయిల్‌గా పదిమాటలకు ఒకమాట మాట్లాడుతూ, అందరిని బయపెట్టేట్టు, డిగ్నిఫైడ్‌గా ఉండాలికానీ, డబ్బాలో రాళ్లుపోసి మోగించినట్లు, వసపిట్టలా వాగకూడదు"! అంటూ విసుక్కునేది తాయారు!"అందరి విషయం ఏమోకానీ నేను మాత్రం ఎంత ఎక్కువ మాట్లాడితే అంత ఎక్కువ రాయగలను నీకు తెలీదులే! నువ్వూరుకో!" అనేవాడు, వళ్లుమండిపోయేది తయారుకు! జనాల్ని చంపటానికి కథలు రాస్తేరాశారు! అంతమాత్రాన అర్ధశేరు ఆముదం ముఖం మీదికి ఓడేలా తలకురాసుకుని బైపాస్ రోడ్డంతపాడవుమధ్య పాపిడి తీసి తలదువ్వుకుని, పావుశేరు కుంకుమ బొట్టు ముక్కునిండా పెట్టుకుని ఖద్దరు లాల్చీ, పైజామాతో, చేతికి పాతకాలం గడియారంతో, భుజాన వేలాడే సంచితో, కాళ్లకు పాతకాలపు చెప్పులతో ఆవేషమేమిటి? అందరిలా ప్యాంటూ షర్టూ వేసుకుని ఫ్యాషన్‌గా ఉండలేరూ?"అనేది తయారు!

మన పూర్వీకుల కాలంలో, కవులిలాంటి వేషధారణతోనే జీవితాలను వెళ్లబుచ్చారు తాయారూ! వారి అడుగుజాడల్లోనే నడవాలనుకున్నాను. నన్ను మార్చటానికి ప్రయత్నించకు", అన్నాడు శ్రీనాథరావు! "ఇంకానయం! యోగివేమన కూడా కవే ఆయన వేషధారణ

ననుకరిస్తారన్నారుకాదు! చచ్చిఊరుకుందును! అంది ఉక్రోషంగా! "ఆరునెలలు కలిసి ఉంటే వారు వీరవుతాలట! చూశావా! నీక్కూడా కవిత్వం వంటబడుతోంది! మెల్లగా రాయటం మొదలు పెట్టరాదు!" చిద్విలాసంగా నవ్వుతూ, భార్య బుగ్గన చిటికేసి బయటకెళ్లిపోయేవాడు! "ఛీ!ఛీ! మరీ ఇంతకోపం, రోషంలేని భర్త దొరికాడేంటి తనకు! ఒక్కటంటే ఒక్కమాట వినడు కదా! ఇలాంటి భర్త పగవారిక్కూడా వద్దు!"అనుకునేది తాయారు!

అతని అలవాట్లను, మనస్తత్వాన్ని భగీరథ ప్రయత్నాలెన్ని చేసినా, మార్చలేక ఎప్పటికప్పుడు రాజీపడి పోసాగింది! అతని వల్ల తనకు, తనవల్ల అతనికి భాద కలిగినా, సంతోషం కలిగినా, భార్యాభర్తలుగా తప్పదు కాబట్టి, నాలుగ్గోడల మధ్యనే రాజీ పడిపోయి సర్దుకుపోవటమే పరమావధిగా బ్రతికేస్తున్నారు! అంత వరకూ పరవాలేదనుకుంటే, శ్రీనాధరావు మితిమీరిన మంచితనాన్ని ఇతరులు సమయానికి వాడుకుని పనయిపోగానే తృణీకార బావంతో, తేలిగ్గా తీసివేయటం, ఆమె భరించలేకపోతోంది! బయట వారినేం చేయ్యలేక, భర్త మీదకోపం తారాస్థాయికి చేరుకుని, ఆకోపానికి, వంటింట్లో గిన్నెలు, కంచాలు బలి అయిపోతున్నాయి!

ఆ మధ్య శ్రీనాధరావు ఎదురింట్లో ఉన్న ఓ అమ్మాయి వయసు ముదిరిపోయికొంత, కట్నం పేచీకొంత.....కుజదోషం అంటూ కొంత.... అన్నీ తోడయి వచ్చిన సంబంధాలన్ని వెనక్కి వెళ్లిపొసాగాయి! "మీ ఎరికలో సంబంధం ఉంటే చూసిపుణ్యం కట్టుకోండి!" అంటూ అమ్మాయి తల్లి శ్రీపాదరావు దంపతులనుకోరింది!

"మా పెళ్ళయి అయిదేళ్లుదాట లేదు! పెళ్లి సంబంధాలు వెతికేంత పెద్ద వయసటండీ మాకు" అంటూఖండించింది తాయారు! అయినా మిమ్మల్నని ఏంలాభం! ఈయనగారి వేషం అలాంటిది! ఇంకా కొన్ని రోజులు పోతే, ఈయన వయసువారు కూడా తాతయ్య! అని పిలిచినా ఆశ్చర్యం లేదు! మనసులో అనుకుని పళ్లు పటపటలాడించింది! నువ్వూరుకో తాయారూ! పిన్నిగారూ! మీరు నిశ్చింతగా ఉండండి! చెల్లి పెళ్లినేను చేస్తాగా! ఇప్పటికి నేను పది పెళ్లిళ్లు చేశాను సుమండీ! అంటూ శ్రీకృష్ణునిలా అభయ హస్తమిచ్చేశాడు! అన్నట్టుగానే పైసా కట్నం లేకుండా, మంచి వరుడిని వెతికి పెట్టాడు! లక్షణంగా పెళ్లయిపోయింది! పెళ్లంతా తమ ఇంట్లోనే అన్నట్టు హడావిడి పడిపోయి, పెళ్లి పనులు చేశాడు శ్రీనాధరావు!

పెళ్లిలో ఎవరో "ఈ సంబంధం చూసింది మీ ఎదిరింటి తాయారమ్మ మొగుడేనట కదా! అంటూ పెళ్లికూతురి తల్లిని ప్రశ్నించారు! ఆవిడ అంది కదా! ఎల్లమ్మ మొగుడు, పుల్లమ్మ మొగుడు సంబంధాలు కుదిరిస్తే పెళ్ళిళ్ళవుతాయా? కళ్యాణ మొచ్చినా, కక్కొచ్చినా ఆగదంటారు. మా అమ్మాయి జాతకంలో ఈ నెలలో పెళ్లవుతుందని రాసిపెట్టిఉంది! అబ్బాయి ఇలా పెళ్లి చూపుల కొచ్చి వెళ్లాడో లేదో, అలా ఇంజనీరుద్యోగం వచ్చేసింది! నా, కూతురు అదృష్టవంతురాలు సుమా! అంది! తాయారు ఎదురుగానే!

సంతకం చేయటం రానివాడికి, తన కూతురి అదృష్టం వల్లే ఇంజనీరుద్యోగం వచ్చినంత విడ్డూరంగా ఆవిడ మాట్లాడుతుంటే తాయారుకు వళ్లు మండింది! ఆ మాటే భర్తతో అంటే పోనిద్దూ! ఆవిడ పొగడాలని చేశామా? ఆ అమ్మాయి పెళ్లయింది అంతేచాలు! అన్నాడు తేలిగ్గా శ్రీపాదరావు. ఆసంఘటన గుర్చి మరచిపోక ముందే ఓ శుభముహూర్తాన

భర్తతో పోట్లాడి సూట్‌కేస్‌పట్టుకుని సినిమా హీరోయిన్‌లా గడపదాటి వచ్చేసింది! వచ్చిన తర్వాత రెండు రోజులకే ఆమె భర్తరావటం, రాజీకుదుర్చుకుని భార్యను తీసికెళ్లటం జరిగాయి అది వేరేసంగతి! కానీ ఈ మధ్యకాలంలో నలిగిన రెండు రోజులు మంగ తాయారుకు నరక ప్రాయంగా పరిణమించాయి! ఆ అమ్మాయి తల్లి నాలుగు వీధులకు వినబడేలా శోకాలు పెట్టింది! పెళ్లిలో వియ్యాలవారు ప్లాస్టిక్ చెంబు ఎత్తుకెళ్లినపుడే అనుకున్నా కక్కుర్తి సంబంధం అని! అయినా ఆ జిడ్డు శ్రీనాథరావుకూ మాకూ పెద్ద పరిచయమేలేదు! ఉన్న పళంగా సంబంధం తెచ్చాడేమిటా అని అనుమానిస్తూనే ఉన్నాను. దిక్కుమాలిన సంబంధం అంటగట్టి అటువైపు కమీషను బాగా లాగిఉంటాడు- అంటూ కర్ణ కఠోరంగా మాట్లాడుతుంటే తాయారు రక్తం ఉడికి పోసాగింది! "పెళ్లికాని వారందరికీ పెళ్లిళ్లుకుదిర్చి గిన్నీస్ బుక్‌లో కెక్కుదామను కున్నారా? మన కెందు కొచ్చిన గొడవంటే వినరు కదా! పనయిపోగానే ఆవిడ మిమ్మల్ని కరివేపను తీసిపారేసినట్టు, ఎలా కించపరచిమాట్లాడుతోందో చూశారా?" అంటూ భర్తతో పోట్లాటకు దిగింది!

"అన్నీ తెలిసి ఆవిడ అలా మాట్లాడగలగటం ఆవిడ దౌర్జన్యం! అది ఆవిడ తప్పు! మనతప్పు కాదు! అందుకు మనం బాధ్యులమూ కాదు! బాధ పడకూడదు! అంటూ శాంతంగా జవాబిచ్చాడు శ్రీనాథరావు! నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు మంగతాయారుకు! ఇలాంటి పరిస్థితి శ్రీనాథరావు చాలాసార్లు కల్పించి బాధపెట్టాడు!

ఇంకోసారి ఓ గుంటూరతను ఇంటి ప్రక్కన అద్దెకుచేరి, ఈ వూళ్లో మెస్సు పెడదామనుకున్నాను మాకు ఊరుక్రొత్త మంచి స్థలం చూపించండి అంటూ ప్రాదేయ పడ్డాడు! ఇంజనీరింగు కాలేజి దగ్గర పెడితే బావుంటుందని సలహాచెప్పి ఇల్లుచూసి, పాంప్లెట్లు పంచి, పోస్టర్లతికించి తాయారు వారిస్తున్నా వారి పెట్టుబడికి స్వంతపూచీతో బ్యాంకులో లోను ఇప్పించి వాళ్లు కుదురుకునేలా చేసి తృప్తి పడ్డాడు! ఓ సంవత్సరం తిరిగేలోగా, మంచి ఫర్నిచరు కొన్నారు, ఓ ఇల్లుకొన్నారు! బ్యాంకు బ్యాలెన్సు పెరిగింది! టౌనులో ఇంకో మంచి హోటల్ కూడా తెరిచారు. ఓసారి శ్రీనాథరావుకు డబ్బు ఇబ్బంది కలిగి ఓ అయిదు వేలు అప్పు అడగటానికెళ్లాడు! నిజానికి వారి నడగటం అతనికిష్టం లేదు! తాయారు బలవంతం మీద వెళ్లాడు!" మనం ఊరికే అడుగుతున్నామా? అప్పేకదా! వారికిబ్బందిలే కుండా వడ్డీకూడా వేసిస్తామని చెప్పండి! బాగా తెలసిన వారు కాకుంటే కొత్తవారు అప్పిస్తారుటండీ! అంటూ వెన్నుతట్టి పంపింది!

"అయ్యో! ఎక్కడండీ! మిమ్మల్ని మంచిస్థలం చూపమంటే ఇలా అడివిలో పడేస్తారనుకోలేదు. రెక్కల కష్టం తప్పితే పైసా మిగలటంలేదు. మీకంత అవసరమైతే మాకిక్కడ తెలిసిన వారున్నారు! అయిదురూపాయలు వడ్డీ ప్రకారం ఇస్తారు! ఇప్పించమన్నారా? బాండురాసివ్వాలి సుమండీ! ఏ మాత్రం తేడా లేకుండా కట్టండేం? అంటూ చెప్పాడు!

మనుషులింతే తక్కువ కాలంలో, ఇంత విచిత్రంగా ఎందుకు మారతారో కదా! అని భాదపడ్డాడేతప్ప, చ! ఇంకోసారి ఎవ్వరికీ ఏ సహాయమూ చెయ్యకూడదు అని మాత్రం అనుకోలేదు!

ఇలాగ ఎంతోమందికి దగ్గరుండి ఇళ్లు కట్టించాడు! లోన్లు ఇప్పించాడు! ఉద్యోగాలకు

రికమెండేషన్లు చేయించాడు!నా ఆస్థి ఖర్చు పెడుతున్నానా? నోటి సహాయమే కదా! మనిషై పుట్టింతర్వాత మరీ నన్ను ముట్టుకోకు నామాలకాకి అన్నట్టు బ్రతగ్గూడదు! చేతనైన సహాయం చెయ్యాలి! అంటూ కొటేషన్లు చెప్పే మగడిని చూసి చిర్రెత్తుకొచ్చేది తాయారుకు!

మన చేతులు మంచివికావు! ఎవరికే సహాయం చేసినా గుర్తింపులేదు! మహారాజా కుర్చీలో కూర్చో బెట్టి సన్మానం చెయ్యమన్నామా? మనిషిగా ఓ చిన్నమెచ్చుకోలు. ఓ ప్రశంస ఆశించటంలో తప్పులేదుగా! ఇప్పటికి నూటొక్కసార్లు బాధపడ్డాము. ఇదిగో మీకిదే చెబుతున్నాను. ఇంకెప్పుడూ తగుదునమ్మా! అంటూ సహాయం గాడిదగుడ్డూ అంటూ వెళ్లారంటే ఊరుకునేది లేదు! గుర్తింపులేని పనులు చెయ్యటమెందుకు బాధపడట మెందుకు? మన కొంపలో సమస్యలే దిక్కుమాలినన్ని ఉన్నాయి. అవి పరిష్కరించండి చాలు! ఇలా మంగతాయారు శ్రీనాధరావు మీద ఎన్నిసార్లు విరుచుకుపడ్డా.......శ్రీనాధరావు చిరునవ్వుతో భరించేవాడు తప్ప తన అలవాటు మాత్రం మార్చుకోలేదు!

ఓసారి ఊరెళ్లాలని, భార్యాభర్తలిద్దరూ రైల్వేస్టేషన్‌లో కూర్చున్నారు! ఓ నడివయసాయన వారి దగ్గర కొచ్చి "ఏంటర్రా! నన్ను గుర్తు పట్టారా? మీ పెళ్లిచేసింది నేనే!" అంటూ తనను తాను పరిచయం చేసుకున్నాడు! తాయారుకు అతన్ని చూడగానే వళ్లు మండిపోయింది! "మా గొప్ప భర్తనెతికి పెట్టావు! ఈ జన్మలో నాకిక పెళ్లికాదేమో వృద్ధ కన్యలా మిగిలి పోతానన్నట్టు మావాళ్లు నిన్ను ప్రాదేయపడితే మంకు పట్టు మనిషిని, కట్టబెట్టావు! ఈయనతో వేగలేక చస్తున్నా! ఉద్ధరించావులే వెళ్లు'! నాలిక చివరిదాకా వచ్చిన మాటలు ఏ అనుభవ శక్తో ఆపేసినట్టు ఆగిపోయాయి! తనను తాను తమాయించుకుని "అవును బాబాయి గారూ! బావున్నారా? మీ చలవ వల్ల నా కాపురం చల్లగా ఉంది సుమండీ! ఏమండీ! ఈయన మన పెళ్లి పెద్ద! అంటూ గుర్తు చేసింది.

శ్రీనాధరావు నమస్కారం పెట్టాడాయనకు! చిత్రకారుడు తను గీచిన చిత్రాన్ని తన్మయత్వంతో చూసుకున్నట్టు, ఆ పెద్ద మనిషి, ఆదంపతులిద్దరినీ తృప్తిగా కళ్లారా చూశాడు! ఆయన కళ్లల్లో వెలుగుకు వెలకట్టలేమనిపించింది తాయారుకు!

శ్రీనాధరావు తాయారువైపు చిరునవ్వుతో చూశాడు! ఆనవ్వులో, మనం అందరికీ కరివేపలా మిగిలి పోయినా, మన మెవ్వరినీ కరివేపలా చూడకూడదన్న సత్యాన్ని తెలుసుకున్నావు సుమా...... అన్న భావం ద్యోతకమయి మనసారా నవ్వింది! మళ్లీ మంగతాయారు పెరట్లో కరివేప చిగురించింది!

ఎ. జయలక్ష్మీరాజ్, ఇంటి నెం. 4/600 (ఎ1)
బైపాస్ రోడ్, అనంతపురం

పాలెమి రామనరసింహం కథ

# అమృతంగమయ!

**అం**దరూ ఒక్కసారి గొల్లుమన్నారు.....ఏడుపులు, పొంగి పొర్లి వస్తున్న దుఃఖం; గుండెలు బాదుకోటాలు ఒక్కసారిగా వాతావరణ మంతా కట్టలు తెంచుకున్న నిండు చెరువులా తయారైంది. ఇంతలోనే నూరేళ్లు నిండాయిరా నాయనా. ఎక్కడ్నించి దాపురించిందిరా ఈ పాడు ప్రయాణం నీకు! నీ కోసమే వచ్చిందిరా ఈ ఇంటర్వ్యూ....ఊర్కో తల్లీ... ఏం చేస్తాం.... మంచి వాళ్లనే దేవుడు ముందు తీసుకుపోతాడు... సముదాయించుకో తల్లీ!.... సముదాయించుకోక నేనేం చేతునే తల్లీ... ఓరిదేవుడో.... నాకెంత కడుపుకోత పెట్టావురా... అంతేనమ్మా... వాడంతే..... మంచివాళ్లకే పెడతాడు కష్టాలు.... కష్టమంటే కష్టమా తల్లీ..... శత్రువులకు కూడా ఒద్దమ్మా ఇట్టాంటి కడుపుకోత.... అనుభవించామమ్మా! చాలు చాలు - ఈ కష్టం ఇప్పటికీ పచ్చి పుండులా సలపరిస్తూనే ఉంది.

కొంచెం పక్కకు జరగండమ్మా.....గాలిరానివ్వండి కొంచెం..... ఏం నాయనా....నీకెంత కష్టం వచ్చిందోయ్....తట్టుకోవాలి నాయన్నా.... మన చేతిలో ఏముంది?

అసలేం జరిగిందండీ......? ఏక్సిడెంటు......ఎలా జరిగింది? ఆటోలో వస్తున్నాట్ట. దేన్నో తప్పించబోయి బ్రేకు వేయడంతో ఆటో తలకిందులైందిట. ఒక్కడే ఉన్నాడా?..... అవును....డ్రైవరు చిన్న చిన్న దెబ్బలతో బయటపడ్డాడు.... అంతమాత్రానికేనా?.....నిజానికిదేం పెద్ద ఏక్సిడెంటుకిందికి రాదట - రాసిపెట్టి ఉంది. ఏం చేస్తాం?

ముందు జరగవలసిందేమిటో చూడండి బాబు......రాగూడని కష్టమే కానీ, మరి మన చేతిలో ఏమీ లేదు కదా....

ఎన్నేళ్లుంటాయండీ?..,..ఎన్నో ఎక్కడివండీ...ఇరవైనాలుగు....

ఏమిటిదంతా? ఎందుకు వీళ్లంతా నా శరీరం చుట్టూ చేరి ఏడుస్తున్నారు? అవునూ... నా శరీరం అట్లా కదలకుండా పడి ఉందేం? అమ్మ ఎందుకలా గుండెలవిసి పోయేలా ఏడుస్తోంది? అమ్మా!...... ఎందుకమ్మా ఏడుస్తున్నావు? నేనిక్కడే ఉన్నానమ్మా....ఇటు చూడమ్మా... ఒద్దమ్మా.... అట్లా ఏడవకమ్మా...నాన్నగారూ! మీరు కూడా ఎందుకట్లా డీలాపడిపోతున్నారు? నా వైపు చూడండి నాన్నగారూ...అమ్మకు చెప్పండి ఏడవవద్దని. ఏమిటి ఆ చెయ్యి కదలడేం? అమ్మ అమ్మ ఏడుస్తుంటే నా గుండె తరుక్కుపోతోంది. అమ్మా! ఏడువకమ్మా...ఎందుకమ్మా నామీదపడి అట్లా ఏడుస్తావు...అమ్మ గడ్డంపట్టుకు బతిమలాడుకుని ఓదారుద్దా మంటే చెయ్యి

కదలకుండా ఉందేం? ఏమైంది అసలు? ఎవరు వీళ్లంతా? అసలు ఎక్కడున్నాం? అడుగో సుబ్బులు. ఆరేయ్ సుబ్బులూ......ఇట్రారా ఏమిటిరా ఇదంతా? నువ్వు కూడా అట్లా ఉన్నవేంరా? ఎందుకురా అట్లా వెక్కి వెక్కి ఏడుస్తావు? ఒక చెంపన నేను పిలుస్తుంటే అస్సలు పట్టించుకోకుండా ఏమిట్రా అట్లా దిక్కులు చూస్తావు? అంతా నేను ఇక్కడ లేనట్లే ప్రవర్తిస్తున్నారు.

అదిగో అక్కయ్య వస్తోంది; ఏమిటి అక్కయ్య కూడా వస్తూనే గుండెలు బాదుకుంటూ ఏడుస్తోంది.

అప్పుడే నీకు నూరేళ్లు నిండాయిరా వేణూ! నా పట్టు చీరేదిరా? 'అక్కయ్యా! నా పెళ్లికి పట్టుచీర కొనిపెడతానే అన్నావు కదరా!.....ఏమైపోయినావురా!......

ఊర్కోమ్మా! ఊర్కో..... విషపు ఘడియల్లో అట్టా ముంచుకొచ్చేసింది.... అంతేనమ్మా... వాడెట్టా ఆడిస్తే అట్టా ఆడాల్సిన తోలుబొమ్మలము కదమ్మా మనం? 'నీ పనైపోయింది ఇకరా' అంటే వెళ్లి పోవాల్సిందే కదా! మనం చేయగలిగేదేముంది? అవునమ్మా....పాతికేళ్లు నిండలేదు....అప్పుడే వాడొచ్చిన పనైపోయిందని పిల్చుకుపోయాడమ్మా ఆ దేవుడు...

ఏమిటి వీళ్లంటున్న మాటలు! నేను చచ్చిపోయానా? అందుకనే నా శరీరం కదలటం లేదా? మరి నేను నేనుగానే ఉన్నాను కదా? మరి నేనెవరిని? నా శరీరం అట్లాపడి ఉన్నా నేను నేనుగానే ఎట్లా ఉండగలను? ఇదేనా చావంటే..... నా శరీరం నుండి నేను వేరుగా ఉండటమేనా చావుఅంటే? అయితే నా శరీరమే తప్ప నేను కనిపించనా వీళ్లకు? అమ్మ అట్లా ఏడుస్తుంటే నాకెంత బాధగా ఉంది? ఈ బాధ చాలా తీవ్రంగా ఉంది. ఏడ్చి కన్నీళ్లు కార్చి తేలికపడదామంటే శరీరం లేదుగా! అబ్బ! ఈ నరకం భరించలేను. అమ్మా! ఏడవకమ్మా! అరేయ్ సుబ్బులూ అట్లా బిక్కమొహం వేసుకుని కూర్చోకురా! నేను చూడలేకుండా ఉన్నాను.

బాబూ! జరగవలసింది చూడండి నాయనా.... ఇప్పుడేమిటి ఆలస్యం?..... పోస్టుమార్టం చేయాలట...నా శరీరాన్ని పోస్టుమార్టం చేస్తారా?.... అదిగో ఆ మాటవిని అమ్మ మరీ బాధ పడుతోంది. అమ్మ బాధను నేనెట్లా తగ్గించగలను?......నేనందరినీ చూస్తున్నాను....నన్నెవరూ చూడటం లేదు; నేనందరి మాటలూ వింటున్నాను... నామాట లెవరూ వినటం లేదు, నేనందరి బాధనూ చూస్తున్నాను...నా బాధెవరికీ తెలియటం లేదు.... ఇదేం బాధ?......ఇది నెప్పికాదు; ఇది దు:ఖం కాదు... ఇదొక విచిత్రం అయిన బాధ...విచిత్రమైన పరిస్థితి... అమ్మను ఓదార్చాలనుకుంటున్నాను...ఓదార్చలేక పోతున్నాను.... తమ్ముణ్ణి సముదాయించాలనుకుంటున్నాను...సముదాయించలేక పోతున్నాను.... అక్కను నా మాటలు వినిపించుకోమని బతిమాలుదామనుకుంటున్నాను.....బతిమాలలేకపోతున్నాను.....నాన్నగారితో మాట్లాడదాం అనుకుంటున్నాను....మాట్లాడలేకపోతున్నాను...... ఈ చుట్టూ చేరిన వాళ్లందర్నీ వెళ్లిపొమ్మని కసురుకుందా మనుకుంటున్నాను....కసురుకోలేక పోతున్నాను....ఈ పనులన్నీ నేను చేస్తున్నట్లే ఉంది; వాటికి ఫలితం కనిపించటంలేదు; అసలు నేనీ పనులన్నీ చేస్తున్నానా?..... చేయాలనుకుంటున్నానా?......ఇది కేవలం చేయాలనే కోరిక,....సంకల్పం....అంతే...ఆచరణ సాధ్యం కావటంలేదు...

రత్నం అమ్మా కుర్రవాడు.....ఒకరి జోలిలేదు; ఒకరిని పల్లెత్తు మాట కూడ అనగా వినలేదు....ఒక తపస్సమాధిలో ఉన్నట్లుంటాడమ్మ ఎప్పుడూ...ఎంత మంచివాడే...

చెప్పానుగదమ్మా...మంచి వాళ్లనే ఆ దేవుడు ముందు తీసుకుపోతాడని....

వీళ్లు నాగురించే మాట్లాడుతున్నారు....నేనేదో మంచి వాణ్నిట..... నా కొకరి గురించి ఆలోచించాలనీ ఒకళ్లను ఏమన్నా అనాలనీ అనిపించేది కాదు; ఇది నా స్వభావం...ఇందులో మంచే ముందో.... ఎవరెవరి తీరునుబట్టి వారు నడుచుకుంటారు.

అదుగో వాళ్లెవరో వచ్చారు; నా శరీరాన్ని లోపలికి తీసికెళ్తారట....అమ్మ అతలాకుతల మౌవుతుంది...అట్టుడికి నట్టుడికి పోతున్నది.....తెకతెకలాడిపోతున్నది....అమ్మకింత ప్రేమా నా మీద?.....నాన్నగారు నిండుకుండలా ఉన్నారు... ఆయన మనస్సులో దు:ఖం పైకివ్యక్తం కావటం లేదు....ఆయన మనస్సు నాకింత స్పష్టంగా ఎట్లా తెలుస్తోంది?..... వీళ్లందరూ మాట్లాడుతున్నారు; వినిపిస్తున్నై, తెలుస్తున్నది.... అమ్మా అక్కయ్యా విలవిలలాడిపోతున్నారు, తమ్ముడు బిక్కమొహం వేసుకుని ఉండిపోయాడు; కనిపిస్తున్నది, తెలుస్తున్నది. కానీ నాన్నగారిలో ఏ చేష్టలూ లేవే... నాకెలా తెలుస్తున్నది? నాన్నగారి మనస్సు ఇంత స్పష్టంగా నా ఎరుకలోకి ఎట్లా వస్తున్నది...? కానిదంతా తెలుసుకోవడంలో ఒక ప్రత్యేకత ఉంది; చెవులు వినటం లేదు; కళ్ళు చూడడం లేదు.. అయినా నాకన్నీ తెలుస్తున్నయ్.... అందుకే నాన్నగారి మనస్సు నాకు అద్దంలో బొమ్మలా కనిపిస్తున్నది... కనిపించటం కాదు, తెలుస్తున్నది... నా శరీరం చేయలేని పని ఇది. శరీరంతో విన్నాను, చూశాను... ఇప్పుడు కళ్ళతో, చెవులతో పని లేకుండా చూస్తున్నాను, వింటున్నాను... మాటలను ధ్వనులుగా వినటం లేదు.... భావాలుగా తెలుసుకుంటున్నాను. జరుగుతున్న వాటిని దృశ్యాలుగా చూడడం లేదు; అనుభవాలుగా గ్రహిస్తున్నాను... వీటన్నింటినీ మించి వీళ్ళందరి మనస్సులనూ చూడగలుగుతున్నాను. అదుగో వాళ్ళు అమ్మను, నాన్నగారినీ ఓదార్చటానికి వచ్చినవాళ్ళు. ఎప్పుడు వెళ్ళిపోదామా అని ఆలోచిస్తున్నారు. ఆ ఎర్రచొక్కా అతను ముఖ్యమైన పని వదిలేసి వచ్చానే అని బాధపడుతున్నాడు. మీరందరూ వెళ్ళిపోవచ్చు కదా! మీరుండి చేసేదేం ఉంది ఇక్కడ... ఒక్కొక్క మనిషీ రావటం అమ్మకు బాధ, దుఃఖం ఉప్పెనలా పొంగిపోవటమే జరుగుతుంది. ఇదంతా నా కళ్ళతో పని లేకుండానే చూడగలుగుతున్నాను.

అవును కళ్ళు!... ఇప్పుడు ఎందుకూ పనికి రాని నా కళ్ళు... నాక్కూడా పనికిరాని నా కళ్ళు.. వీటిని గురించి ఇన్నాళ్ళూ నేనేమనుకున్నాను? నేనే ఏమిటి?... ఈ మాట వచ్చినప్పుడు నాన్నగారు, అమ్మ అందరూ అదే అనేవాళ్ళు.... 'ఒక చీకటి బతుకులో వెలుగు నింపుతై... అన్నప్పుడు ప్రాణం పోయిన తర్వాత ఆ కళ్ళు శరీరంతో ఎందుకు కాలిపోవాలి?' ఇదేగా మీ అందరి అభిప్రాయం... మరి ఇప్పుడు నా కళ్ళు... ఇదుగో!... నా కళ్ళు తీస్కోండి... నేను నా కళ్ళను దానం చేస్తున్నాను... నా కళ్ళు తీసుకోండి... నా కళ్ళు తీసుకోండి...

ఎవరూ పట్టించుకోవటం లేదు. ఇప్పుడెట్లా?... ఇంతమంది ఉన్నారు..... ఒక్కరికీ నా మాటలు వినబడటం లేదా?... నా కళ్ళు తీస్కోండి.... నా శరీరంలో పనికొచ్చే ఏ అవయవాలనైనా తీస్కోండి... వాటిని కాల్చేయకండి... నాన్నగారూ!... మీరైనా చెప్పండి.... హు.... నేను నోటితో మాట్లాడలేను కదా! మరి వీళ్ళెట్లా వినగలరు? నా మనస్సుతోనైనా వీళ్ళు మనసులకు తెలియబరచలేనా?.... నా మనస్సేదీ? అసలది ఏమైందో?... అంతా అల్లకల్లోలంగా ఉంది. దానికి రాకుండా ఉంది... చీకటి చీకటిగా వుంది. చిందర వందరగా ఉంది. చీమల పుట్టలాగా ఉంది. కందిరీగల తెట్టలాగా ఉంది.

గుంటూరు వెళ్ళాలి.... అక్కడ ఇంటర్వ్యూ వుంది.... ఆ ఉద్యోగం నాకు తప్పకుండా వస్తుంది... మంచి పేరు సంపాయించాలి... బాగా డబ్బు సంపాయించాలి... స్కూటరు కొనుక్కోవాలి... మంచి బట్టలు కొనుక్కోవాలి. నాన్నగారు ఇల్లు కట్టాలని ఒకటే సతమతమైపోతున్నారు... నేను డబ్బు సాయం చేయాలి... కోరికలు... కోరికలు.... ఇవి తీరవు... బాధ, బాధ,... హింస... రాజుకు నేనంటే అలుసు... వాడెప్పుడు నా గురించి వక్రంగానే మాట్లాడతాడు. ఎందుకో మరి, వాడితో మాట్లాడడం నాకు చేతకాదు... వాడితో వ్యవహారం అంటే ఎప్పుడు నాది కింద చెయ్యే... ఎప్పటికైనా వాడికి దీటుగా జవాబు చెప్పాలి.... ఒక్కసారి, ఒక్కసారి వాడికంటే పై చెయ్యి కావాలి... ఈ కోరిక తీరదు... నాన్నగారి దగ్గిర ఎప్పుడూ డబ్బుండదు... నాకు జీడిపప్పులు కావాలి..., మిల్క్ స్వీట్లు కావాలి... నా గదిలో ఒక ఫేను ఉంటే బాగుంటుంది. లేదు... నాన్నగారు కొనలేరు... అన్నిటికీ డబ్బు... డబ్బు కావాలి. తమ్ముడేమైనా అడిగితే కొనిపెడతారు. నాకే ఏమీ ఉండవు... ఎందుకో మరి... నేను పెద్దవాణ్ణట... లేకపోయినా సర్దుకోగలనట... పెద్దవాళ్ళకు మాత్రమే కోరికలుండవేమిటి? నిన్న స్కూల్లో హెడ్ మాస్టరు... ఊర్కెనే కోప్పడ్డాడు.... చిన్న పొరపాటు... అంతలోనే మాట అనాలా?... ఆ మాట సలపరిస్తోంది. ఇదీ నా మనసు పరిస్థితి. దాహం... తీరని దాహం..

అయ్యో! కళ్ళండీ... వాడి కళ్ళండీ... కళ్ళు దానం చేద్దామండీ!... అవును.. నా కళ్ళు తీస్కోండి... అమ్మయ్యా! నా కోరిక అందరికీ తెలిసింది. నాకెంత హాయిగా ఉంది?... ఆc, ఆc..! అవునవును;... డాక్టరు గారూ! We want to donate his eyes... please make necessary arrangements... టైం ఉందా?... ఆ ఆ .... ఆరు గంటల్లోగా. తీయవచ్చు.... You are a brave man! నేనిప్పుడే ఫోన్ చేస్తాను... హలో... Eye bank... డా॥ విశాలి గారున్నారా? ఇక్కడ మా ఆస్పత్రిలో ఒక Accident case అండీ... death... about one hour back. Eyes donate చేస్తున్నారు. వెంటనే మీ యూనిట్‌ను పంపండి... OK... 30 minuits లో వచ్చేస్తారా?... OK... thank you...

నా మనస్సు నాకు స్వాధీనం అవుతోంది... మెత్తమెత్తగా ఉంది... చల్ల చల్లగా ఉంది... నా కళ్ళు తీసుకోవటానికి కొచ్చేస్తున్నారట... ఎంత బాగుంది.... నా బరువంతా తగ్గిపోతోంది... తేలికైపోతున్నాను... తేలిపోతున్నాను...

ఏమిటి జనం అంతా నిశ్శబ్దం!... ఒక్కళ్ళలో చేష్టలు లేవు. అందరూ చెక్కిన రాళ్ళలా బిర్ర బిగుసుకుపోయారు.

'ఇంత కష్టంలో ఈ తల్లి కొడుకు కళ్ళు దానం చేయమంటోందా?".. అంటున్నై వాళ్ళందరి మనస్సులు..

నువ్వు మానవురాలివి కాదమ్మా... ఇంత మంచి మనిషికా అమ్మా! ఆ దేవుడు ఇట్లాంటి కష్టం కలిగించాడు!...

నాకు గుర్తు రావటం వాడు చేసుకున్న పుణ్యమమ్మా... ఇట్లాంటి మాటలొచ్చినప్పుడల్లా అందరూ కళ్ళు దానం చేసి తీరాలి... అసలది ఒక చట్టంగా రావాలి అంటూ ఉంటాడమ్మా.. బంగారు తండ్రి... ఎట్లాంటి బిడ్డను కన్నావమ్మా... పుట్టినందుకు జన్మ సార్ధకం చేసుకున్నాడమ్మా... మనమూ పుట్టాం... ఎందుకు?...

అదుగో... ఏదో కారొచ్చింది... రాండి, రాండి... ఇక్కడే ఉంది... ఎన్నేళ్ళు.. ఇరవై నాలుగు... ఏక్సిడెంటన్నారు కదా! కళ్ళు డామేజ్ కాలేదుగా... లేదండీ... ఓ.కే... డాక్టర్.. మీరు అన్నీ సిద్ధం చేసుకోండి.. ఈ గది ఉపయోగించుకోవచ్చు మీరు... అట్లాగే... సర్... We are very proud of you! Our condolences to you... దేవుడు మీకు చాలా అన్యాయం చేశాడు.. కానీ మీరు చేస్తున్న పని చాలా మంచిది సార్! నలభై ఎనిమిది గంటల్లో ఇద్దరు అంధులకు చూపు ప్రసాదించబోతున్నారు సార్! ఈ కాయితాల మీద సంతకం పెడతారా?...

అట్లాగేనండీ...

నాన్నగారు సంతకం చేస్తున్నారు... నా శరీరాన్ని లోపలికి తీసుకుపోతున్నారు... ముఖం కప్పేతున్నారు... కళ్ల దగ్గర మాత్రమే ఆ ముసుగుకు రెండు రంధ్రాలున్నై. కళ్ళు తీసేస్తున్నారు. నాకేం నొప్పి పుట్టటం లేదేమిటి? కత్తి పెట్టి గుచ్చుతున్నా కూడా బాధే అనిపించటం లేదు.. ఒక కన్ను తీశారు... ఆ ప్లాస్కు లాంటి డబ్బాలో పెడుతున్నారు. రెండో కన్ను కూడా... చల్లగా ఉంది... నా కళ్లు చల్లగా ఉన్నాయి... నా కళ్ళు తీసిన చోట గుంటలు పడ్డాయి.. ఆ గుంటలలో కళ్ళు మాదిరిగానేఉన్న గాజు కళ్ళను అమర్చారు. నా ముఖం మామూలుగానే వుంది. కళ్ళు తీసినట్లే లేదు.

నా శరీరాన్ని ఏం చేస్తున్నారు?... ఇది ఏక్సిడెంట్ డెత్ అండీ... పెద్దగా మీరేమీ చూడాల్సిన పనిలేదు. ఏదో ఫార్మాలిటీ కింద అయిందనిపించండి.... అలాగే... అయిపోయింది...

బయటికి తీసుకొస్తున్నారు. అదుగో అమ్మ ఎంత కుంగిపోయిందో...

★ ★ ★

నా శరీరం పంచభూతాలలో కలిసిపోయింది. ఇప్పుడిక నాకేది ఆధారం?... ఏం సందేహం? శరీరం నాకు ఆధారం కాకుండా పోయి ఎంతో సేపైంది కదా! అయినా నేనా శరీరం చుట్టూనే తచ్చాడుతున్నానేం? ఇప్పుడదీ పోయింది. పోవటమేముంది? అదుగో బూడిద... నా శరీరం ఏమైంది? మంటలలో ఆ భౌతిక పదార్థం అంతా గాలిలో కలిసిపోయింది. అయినా నేను నేనుగానే ఉన్నాను. ఇక్కడే నా శరీరాన్ని దహనం చేశారు. ఇక్కడే తిరుగుతూ ఉండాలనిపిస్తోంది. తిరుగుతున్నాను... తిరుగుతున్నాను... ఇంతేనా ఇంక? శరీరాన్ని అగ్ని దహించి వేసింది. శరీరం గాలిమార్గాన అనంత విశ్వంలో కలిసిపోయింది... ఇంత భస్మం మిగిలింది. ఇప్పుడదే నా శరీరమా?... నన్ను నా కోరికలు కూడా దహించి వేస్తున్నాయి. అయినా నేను ఇలాగే మిగిలి వున్నానేం? నా శరీరం కంటే నేనే గట్టి, నేనే స్థిరం, నేనే శాశ్వతంలాగా ఉందే!... మనస్సు... దాహం... ఏం చేయాలి? ఆఁ! నా కళ్ళు... అక్కడికే పోతాను... అనుకుంటూనే వచ్చేశానే... అయితే శరీరం లేని నేను ఎక్కడికి కావాలంటే అక్కడికి వెళ్ళగలనా? అవిగో నా కళ్ళు... ఆ మంచు డబ్బాలో అలాగే ఉన్నాయి.. భద్రంగా... చల్లగా... హాయిగా ఉంది... నా మనస్సు మళ్ళీ తేలిక పడుతోంది.

★ ★ ★

ఎవరతను? తడుముకుంటూ నడుస్తున్నాడు... గుడ్డివాడిలా ఉన్నాడు. ఆ ముఖంలో దైన్యం... ఆ మనస్సు నిండా ముసురుకున్న చీకటి... నిర్వేదం... అయ్యో... అతనికి కళ్ళు కనిపించవా? అతను ఏట్లా బతుకుతున్నాడు?... భవిష్యత్తు కోసం చూసి చూసి కళ్ళు లోతుకు పీక్కుపోయి నిర్జీవంగా ఉన్నాయి... కాంతి విహీనంగా ఉన్నాయి.

అతన్ని పడుకోపెట్టారు. ఏదో ఇంజక్షన్లు ఇస్తున్నారు... అతనికి స్పృహ పోతోంది. మత్తులోకి వెళ్ళిపోయింది. నాకళ్ళు.. నా కళ్ళు ఒక కన్ను బయటికి తీశారు... ఏమిటో చేస్తున్నారు.. పై పొర తీస్తున్నారు... అదుగో అతని కంటి పొర కూడా తీస్తున్నారు... నా కన్ను... నా కంటి పొరను అతనికి అమర్చారు..

నా మనస్సు మళ్ళీ తేలికపడుతోంది... హాయిగా ఉంది ఒంటికి చల్లని గాలి తగిలినట్లుగా ఉంది, మనస్సు సేద తీరుతోంది. దాహం తీరినట్లొతుంది. చల్లని నీరు తాగినట్లొతుంది... మల్లెల గాలి సోకినట్లొతుంది.

మళ్ళీ ఇంకొకరు... అతనూ ఇందాకటి వ్యక్తిలాగానే ఉన్నాడు. అతనికీ కూడా కనిపిస్తున్నట్లు లేదు. అతనికి నా రెండో కంటిమీది నల్లగుడ్డు పొరను పెడుతున్నారు...

ఇప్పుడింకా బాగుంది... నా మనస్సు దూదిపింజమౌతోంది.. వెండి వెన్నెలలు కురుస్తోంది.. పన్నీటి జల్లు వెదజల్లుతోంది... ఏమిటి ఈ వెలుగు... నేను మారిపోతున్నానేమిటి? నాలో నించే ఈ వెలుగు! వెలుగు నాలో నుంచి కాదు... నేనే వెలుగును... అరె... నేను... తేలికైపోతున్నాను... వ్యాపించి పోతున్నాను.

★ ★ ★

వాళ్ళకు కట్లు విప్పుతున్నారు. ఇద్దరికీ ఒక్కొక్క కన్నే అమర్చారు. రెండో కన్ను అట్లాగే వదిలేశారు. అది కనిపించకపోయినా ఫరవాలేదట. రెండు కళ్ళు కనిపించని స్థితి కంటే ఒక కన్ను కనిపించే స్థితి మెరుగు కదా...

కట్లు విప్పారు... మెల్లగా కన్ను తెరవండి... మెల్లగా.. ఒక్కసారే తెరవకండి... వాళ్ళు కళ్ళు తెరుస్తున్నారు. మెల్లగా... రెప్పలల్లారుస్తూ... సన్నని వెలుగు... వాళ్లు వెలుగును చూస్తున్నారు..

అబ్బ! వాళ్ళ ముఖంలో ఏం కాంతి! ఏమానందం! వెన్నెలలు విరిసినట్లు... మల్లెలు పరచినట్లు... పాలమీద మీగడలా..., కడలి కెరటాల మీద మెరిసే వెలుగు లేఖలలా... అమ్మ ఒళ్ళో పసిపాపలా.. ఆహా! ఇంతకు ముందు వారి ముఖాలు దైన్యం ఆవరించి మసివులిమిన సిబ్బిరేకులు... వారి మనస్సు నిండా ముసిరిన చీకట్లు, కళ్ళు నిర్జీవాలు, కాంతి విహీనాలు.. ఇప్పుడు ఆనంద నిలయాలు; వెన్నెల వెలుగులు, కాంతి పుంజాలు...

ఇదేమిటి నేనేమైపోతున్నాను... వీళ్ళ ఆనందం నన్నేదో లోకాల్లోకి తీసుకుపోతున్నది... నా చుట్టూ అంతా వెలుగే... నేనూ వెలుగునే... ఆ వెలుగు ఇంకా వ్యాపిస్తోంది.... నేనూ పెరిగిపోతున్నాను. అన్నివైపులా వ్యాపిస్తున్నాను... ఆ వెలుగులో కలిసిపోతున్నాను... ఇంకా నే... ను... న్నా... నా! అదే నేను... ఆ వెలుగే నా వెలుగు... అంతా నేనే... అంతా వెలుగే... ఆనందమే ఆనందం.... అంతటా ఆనందం... నిండిన ఆనందం... చోటే లేదు.... అంతా ఆనందమే...

పరిమి నరసింహం, 101 డామెన్స్ టౌన్‌షిప్,
శేరిలింగంపల్లి, హైద్రాబాద్ - 500 133

# ఎన్నాళ్ళకు వసంతం

జీవితంలోని కష్టసుఖాన్ని మోయటానికి అలవాటు పడిన మనిషి ఎంతైనా ముందుకే నడచినట్లు గుంటలు మిట్టలుగా వున్న తార్రోడ్డు మీద తాపీగా గమ్యం వైపుకే పరుగెడుతోంది ఆర్టీసీ బస్సు.

కండక్టరు ప్రక్కన సీట్లో కూర్చుని వున్నాడు అశోక్. కండక్టరు వెనుక సీట్లో వెంకటరెడ్డి ఆయన భార్య సుగుణమ్మ కూర్చుని వున్నారు. బస్సు కుదుపులకు భార్య శరీరం తగిలినప్పుడల్లా ఒళ్ళు పులకరించసాగింది వెంకటరెడ్డికి. ముందు సీట్లో కండక్టరు ప్రక్కన పెళ్ళయిన కొడుకు కూర్చుని వున్నాడన్న విషయం కూడా మర్చిపోయినట్లు.. ఇంకా బాగా తగుల్తూ కూర్చువాలని ఆమెకు మరీ దగ్గరగా జరిగాడు వెంకటరెడ్డి.. కుదుపులకు భార్య శరీరం మరీ దగ్గరవుతుంటే... ఆమెను గురించి మొదటిసారిగా విన్నరోజు గుర్తొచ్చింది.... దక్షిణ పొలంలో నాటిన మొలగొలుకు పైరు కోతకొచ్చింది. మర్నాటి కోతకు కూలీల్ని మాట్లాడి సంధ్య వేళకు ఇంటికి తిరిగొచ్చాడు వెంకటరెడ్డి. ఇంట్లోకి వెళ్ళబోతున్న అతడితో...

"ఒరే అబయా...! కొత్తపల్లి రంగారెడ్డి నీకు తెలుసు గదరా... ఆయన్తో మనకి దూరపు బందుత్తం కూడా వుండాది. ఆయన కూతుర్ని నీకిస్తామని వొచ్చినాడు. ఉగాది బోయినాక మూర్తాలు బెట్టుకోమని జెప్పినా..." చెప్పాడు పెద్దరెడ్డి.

"అట్నే నాయినా... నీ యిష్టవే...!" అని ఇంట్లోకి వెళ్ళిపోయాడు వెంకటరెడ్డి. స్నానం భోజనం అయ్యాక అరుగుమీద నులక మంచం వాల్చి పడుకున్నాడు వెంకటరెడ్డి. ఎంత ప్రయత్నించినా అతడి కళ్ళు మూతలు పడడం లేదు. అతడి ఆలోచనలన్నీ కొత్తపల్లి రంగారెడ్డి కూతురు ఎలా వుంటుందో అన్నదానిమీదే ఉన్నాయి.

పెళ్ళికి ముందు ఒక్కసారన్నా రంగారెడ్డి కూతుర్ని చూడాలని అతడు చాలాసార్లు అనుకున్నాడు.

కానీ పెళ్ళి రోజువరకూ ఈతడికా అవకాశమే రాలేదు.

రెండో తమ్ముడి కానుపులో అమ్మ చనిపోవడంతో వెంకటరెడ్డికి తన భావాలను చెప్పుకునేందుకు ఎవ్వరూ లేకపోయారు. పెద్దరెడ్డి చిన్నపిల్లలను మేనత్తలకు అవ్వలకూ అప్పగించాడే గానీ మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. ఊహ తెలిసే వరకూ తల్లిలేని లోటు ఎవరూ పూరించలేక పోయారు. తండ్రి దగ్గర గౌరవం భయం తప్ప చనువు లేదు. వెంకటరెడ్డికే కాదు.. వాళ్ళిద్దరు తమ్ముళ్ళకు కూడా.

అందుకే కేవలం తన భార్యను అతడు మొట్టమొదటిసారిగా చూసింది పెళ్ళి పీటల మీదే!

చూడగానే -

"కుందనపు బొమ్మ మాదిరి పిల్లనే నాకు జోడీగా చూసినాడు మా నాయిన." అని మనసులోనే తండ్రిని అభినందించాడు.

పెళ్ళయిన తర్వాత పసుపు బట్టల్తో కొత్త పెళ్ళికొడుకుగా కొత్తపల్లిలోని అత్తగారింట్లో అడుగు పెట్టాడు వెంకటరెడ్డి. అతడి మనసంతా ఏదో మధురమైన అనుభూతికి లోనయ్యింది.

మూడు రాత్రులు అత్తారింట్లో గడిపిన తర్వాత సతీసమేతంగా స్వగ్రామానికి తిరిగి వచ్చాడు. అరుగు మీద, ఆరు బయట, పొన్న చెట్టు క్రింద మాత్రమే వాలే వెంకటరెడ్డి నులకమంచం కొత్తగా ఇంటిలోపల వాలింది.

భార్య లేకపోవటంతో ప్రత్యేకమైన గది కట్టించాలన్న ఆలోచనే రాలేదు పెద్దరెడ్డికి. అతడికా అవసరమూ లేదు, ఆవశ్యకతా తోచలేదు. అందువల్లే కొత్త జంటకు మంచాన్ని హాల్లోనే వాల్చింది వెంకటరెడ్డి మేనత్త.

మూడొంతులు వడ్లబస్తాలు ఆక్రమించేయడంతో పన్నెండంకణాల హాలు కూడా ఇరుగ్గా అన్పిస్తోంది.

బయట్నుంచి చల్లటి గాలి ఆ హాల్లోకి నిరాటంకంగా వీస్తోంది.

తలపైకెత్తి చూస్తేరెండు దూలాల మధ్య క్రమబద్ధంగా వేలాడదీసి వున్న తెల్ల ఎర్ర గడ్డల వుచ్చులు ఎంతో ముచ్చటగా వున్నాయి.

బయట్నుంచి వస్తున్న మల్లెలు సన్నజాజుల వాసనలు, ఎర్రగడ్డల ఘాటు కలసి ఒక వింత పరిమళంగా తోస్తోంది. రోజూ ఆరుబయట పడుకునే వెంకటరెడ్డికి ఆ పరిమళం ఎన్నడూ లేని భావావేశాన్ని కలిగించింది. పూలవాసనలోని సున్నితత్వం ఎర్రగడ్డల ఘాటు కలిసి అతడి మనసులో ఏకాంతపు హాయిని, కోరికల వేడిని కలిపి అనుభవంలోకి తెస్తున్నాయి.

'ప్రతిరోజూ ఒక్కడి బరువు మాత్రమే మోయటానికలవాటు పడ్డ ఆ నులక మంచం ఆ రాత్రి అతి కష్టం మీద ఇద్దర్నీ మోయగలిగింది. ఆ తర్వాత ఇద్దర్నీ మోయటానికలవాటు పడింది.

పెళ్ళయిన పది నెలలకే వెంకటరెడ్డి భార్య సుగుణమ్మ గర్భవతయ్యింది. పదకొండో నెలకల్లా పండంటి మగబిడ్డను ప్రసవించిందామె.

కొడుకు పుట్టాడని వెంకటరెడ్డి సంతోషిస్తే... మనవడు పుట్టాడని మీసం మెలేశాడు పెద్దరెడ్డి.

కొద్ది రోజులు గడిచేసరికి పెద్దరెడ్డి రెండో కొడుకు రామిరెడ్డికి పెళ్ళి నిశ్చయమైంది.

రామిరెడ్డికి పెళ్ళయ్యింది.

రామిరెడ్డి నులకమంచం ఇంటి లోపల వాలింది.

వెంకటరెడ్డి నులకమంచం మళ్ళీ అరుగు మీదకు తిరిగొచ్చింది.

అతడి భార్య సుగుణమ్మకు ఓ కొత్త మంచం వచ్చింది.

మరి కొన్నాళ్ళకు పెద్దరెడ్డి మూడో కొడుకు రమణారెడ్డికి పెళ్ళయ్యింది.

అతడి నులక మంచం ఇంటిలోపల వాలింది.

రామిరెడ్డి నులకమంచం అరుగుమీదకు తిరిగొచ్చింది.

అతడి భార్యకు ఇంకో కొత్త మంచం వచ్చింది.

ఇంకొద్ది రోజులు గడిచాయి.

వూర్లో ఐదవ తరగతి చదవటం పూర్తి చేసిన వెంకటరెడ్డి కొడుకు అశోక్ పట్నంలోని హైస్కూల్లో చేరాడు.

అప్పుడు పసి పిల్లాడ్ని ఒంటరిగా పట్నం పంపించడం వెంకటరెడ్డికి గుర్తొచ్చి... ఇప్పుడు ముందు సీట్లో తనకంటే ఎదిగిపోయిన అశోక్‌ని చూసి నవ్వొచ్చింది.

బస్సు వున్నట్లుండి వేగంగా మలుపు తిరగడంతో తూలుతున్న సుగుణమ్మ తల వెంకటరెడ్డి ఎద మీదకు వాలింది. ఆమె తల్లోని మల్లెపూల వాసనతో వెంకటరెడ్డికి గతంలోని మరో రోజు గుర్తొచ్చింది.

ఆరోజు....

..పిండారబోసినట్లు పున్నమి వెన్నెల, చల్లటి వాతావరణం.

దాదాపు ఎకరం విస్తీర్ణం చుట్టూ కట్టబడి వున్న పాతకాలం ప్రహరీ గోడ పాతదైనా పండు వెన్నెల్లో వెండిలా తళతళ మెరుస్తోంది.

ఓ మూల పొన్న చెట్టు దాని పక్కన పున్నాగ సంపంగి చెట్లు, వాటికి కొద్ది దూరంలో మల్లె, జాజి పందిళ్ళు. వాటికి పది గజాల దూరంలో ఓ గున్న మామిడి, ఓ జామ రెండు సీతాఫలం చెట్లు.

ఆ చెట్లలోంచి చూస్తే -

ఒళ్ళంతా వెండి పూలతో అలంకరించుకున్నట్లు కన్పిస్తోంది పొన్న చెట్టు. దాని క్రింద నులక మంచం మీద ఒంటరిగా పడుకొని వున్నాడు వెంకటరెడ్డి.

మల్లె, జాజి పందిర్లు కమ్మటి సువాసనల్ని వెదజల్లుతున్నాయి. తనకింకేం పని లేనట్లు చల్లగాలి ఆ సువాసనల్ని వెంకటరెడ్డి దగ్గరకు మోసుకొచ్చింది. నులక మంచం మీద నిద్ర నటిస్తున్న అతడికి వళ్ళంతా ఏదో తెలియని తియ్యటి పులకింత...

మంచం మీద అటూ ఇటూ అసహనంగా దొర్లాడు.

మంచానికి అల్లి వున్న మెత్తటి గోగునార నులక కూడా తాటినార నులకలా వళ్ళంతా గుచ్చుకుంటున్నట్లుగా వుందతడికి.

కోరుకుంటోందతడి శరీరం.

శరీరం ఏం కావాలని కోరుకుంటోందో అతడికి స్పష్టంగా తెలుసు. అందుకనే అతడ్ని మంచం మీద నుంచి లేపింది మనస్సు.

మంచం దిగి పిల్లిలా నిశ్శబ్దంగా మెల్లగా అడుగులేస్తూ మూడు మంచాల కవతల వున్న భార్య మంచం దగ్గరకెళ్ళడానికి కదిలాడు.

ఒక మంచాన్ని దిగ్విజయంగా దాటాడు. రెండో మంచాన్ని దాటబోయేటప్పుడు... "ఖళ్.. ఖళ్.." మంటే ఓ దగ్గు దగ్గి లేచి కూర్చున్నాడు పెద్దరెడ్డి.

వెంకటరెడ్డి గుండెలో పెద్ద బండ పడ్డట్టయ్యింది...!

మెల్లగా వెనక్కు తిరగబోతున్న అతడ్ని చూసి -

"పెద్దోడా...! నీళ్ళేవన్నా గావాల్నా...?" ఎంతో ఆప్యాయంగా అడిగాడు పెద్ద రెడ్డి.

"నిజవే.. నాకిప్పుడు గావాల్సింది నీళ్ళే...! సల్లటి నీళ్ళు గావాల. అదీ లోటాడో చెబుడో గాదు బిందెడు నీళ్ళు గావాల. నెత్తి గుమ్మరించుకోవడానికి గావాల." అనుకొని.

"ఆ... నీళు గావాల్నాయినా..." అంటూ తండ్రి మంచం దగ్గరకెళ్ళి రాగి చెంబు తీసుకొని బలవంతంగా రెండు గుక్కలు మింగాడు.

"షోడా గావాల్నాయినా...?" బస్సు గూడూరు బస్టాండులో ఆగడంతో తండ్రిని అడిగాడు అశోక్.

"ఆఁ!" వులిక్కి పడ్తూ చెప్పాడు.

అమ్మకు పన్నీరు షోడా అంటే ఇష్టమని... "మో... నీకు పన్నీరు షోడా తెచ్చేదా...?' ' అనడిగాడు.

"ఊ".. అందామె.

షోడాలు తాగాక బస్సు కదిలింది.

తనకూ భార్యకు ఏం ఇష్టమో తెల్సుకుని మరీ షోడాలు తెచ్చిచ్చిన కొడుకును ఆప్యాయంగా చూసుకున్నాడు వెంకటరెడ్డి.

అసలీ ప్రయాణం కుదురుతుందనే అతననుకోలేదు.

ఉదయం జరిగిందతని మనసులో మెదిలింది.

... పెంకుటింటి పడమర అరుగుమీద రక్తచందనంతో చేయబడ్డ పాతకాలపు పడక కుర్చీలో కూర్చుని వున్న పెద్దరెడ్డి లంక పొగాకు కాడల్ని ఎంతో తీరిగ్గా పాయలు చీలుస్తున్నాడు. పింజపోసి కట్టిన ఫాల చెంగావి పంచె, పైన కోరవా బనీను, దబ్బ పండు ఛాయ, తెల్లటి గుబురు మీసాల్తో ఆరు పదులు నిండిన వయసులో కూడా ఎంతో హుందాగా వున్నాడు పెద్దరెడ్డి. ఆయన ముందు నిలబడి... "నాయినో... అబ్బయ్యొచ్చి వూరికి రమ్మని ఒకటే పోరు బెడ్తుండాడు..." జంకుతూ చెప్పాడు వెంకటరెడ్డి.

కొడుకు మాటలు విన్న పెద్దరెడ్డి ఓసారి కొడుకు వంక ఎగాదిగా చూసి లంక పొగాకుని పాయలు చీల్చడం పూర్తి చేసి చుట్ట చుట్టి రెండు కొసల్ని నోటితో కొరికి నోట్లో పెట్టుకున్న చుట్టని వెలిగించాడు.

రెండు దమ్ములు గుప్పుగుప్పుమని లాగాక తెల్లటి గుబురు మీసాల్ని కుడిచేత్తో సవరించుకొని - "పొదిక్యాం పంగా బాటా లేనట్టుండాదే... మూడు మూడ్దినాల కోసారొచ్చేది, మిమ్మల రమ్మనేది. అసల్యాందంటోడి కత...? ఆయదవని నాదెగ్గరికి రమ్మనుబో..." అన్నాడు. ముగ్గురు కొడుకులకు పెళ్ళిళ్ళయ్యి వారి పిల్లలకు కొందరికి పెళ్ళిళ్ళయినా ఈనాటికీ ఏ కొడుకూ పెద్దరెడ్డి మాటకు ఎదురు చెప్పి ఎరగరు.

అందుకనే వెంకటరెడ్డి ఏం మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

"ఏం తాతా... రమ్మన్నావంట...?" పెద్దరెడ్డి కూర్చున్న పడక కుర్చీ పక్కన నిలబడి భయంగా అడిగాడు అశోక్.

మనవడి వంకోసారి ఎగాదిగా చూసి -

"పొద్దననగా వొచ్చినోడివి నాతో ఒగ్గెంటైనా పట్నం ఇసేషాల్జెప్పినావంట్రా... ఈ పెద్దరెడ్డి కెదుర్జెప్పి మాట్లాడగల్లోడివి, ఇష్టమైన మనవడివి నువ్వే గదరా బుడ్డయ్యా...! నువ్వు కూడా నాతో కబుర్లు చెప్పకపోతే యట్టరా... రారా.. ఇట్టొచ్చి కూకోరా..." అంటూ పడక్కుర్చీ చేతిపట్టీ మనవడికి చూపించాడు.

తాతయ్య కోపంగా పిలుస్తున్నాడని తండ్రి చెప్పేసరికి భయపడ్తూ వచ్చిన అశోక్... తాతయ్య ఎంతో అనునయంగా మాట్లాడి కూర్చోమనేసరికి... "హమ్మయ్యా!" అనుకొని పడక్కుర్చీ చేతిపట్టీ మీద కూర్చుని తాతయ్య భుజం మీద చెయ్యేసి..." నువ్వు కోపంగా పిలుస్తుండావనేసరికి భయమేసింది తాతా..." అన్నాడు.

"ఒరే బడవా...! నన్నే ఎదిరించి పెళ్ళి జేసుకున్నోడివి.... నీకేందిరా బుడ్డయ్య నన్ను జూస్తే బయం?" అంటూ మనవడి భుజాన్ని ఎంతో ఆప్యాయంగా తట్టి నోట్లోని చుట్టని ఒక దమ్ము తృప్తిగా లాగి చుట్ట వాసన మనవడికి పడదని విసిరి పారేశాడు పెద్దరెడ్డి. వెంకటరెడ్డి ఏకైక పుత్రుడైన అశోక్ పట్నంలో తనతోపాటు బ్యాంకులో ఉద్యోగం చేస్తున్న అమలను ప్రేమించాడు. ఆమెనే పెళ్ళి చేసుకుంటానన్న తన నిర్ణయాన్ని తండ్రితో చెప్పాడు. ఆయన వెళ్ళి ఆయన తండ్రి పెద్దరెడ్డితో చెప్పాడు. "వీల్లేదు... ఆ పెళ్ళి జరగడానికి వీల్లేద' 'ని ఖచ్చితంగా చెప్పాడాయన. "అమలను కాదని వేరొకర్ని చేసుకునే ప్రసక్తే లేద"ని అశోక్ కూడా ఖచ్చితంగా చెప్పాడు. ఇంట్లో అందరూ సహజంగానే పెద్దరెడ్డి పక్షాన మాట్లాడారు. అయినా అందర్ని ఎదిరించి అమలను రిజిస్ట్రారాఫీసులో చట్టబద్ధంగా పెళ్ళి చేసుకున్నాడు అశోక్. అశోక్ పెళ్ళి అమలతో జరిగిపోయిందని తెలిసినా ఇంట్లో వాళ్ళెవ్వరూ పట్నం వెళ్ళి వాళ్ళ జంటను చూసేందుకు సాహసించలేకపోయారు.

కానీ వాళ్ళ పెళ్ళయిన మూడోరోజే పెద్దరెడ్డి పట్నంలో వున్న మనవడింటికి స్వయంగా వెళ్ళాడు. మనవడు ధైర్యంగా అందర్నీ ఎదిరించి ఇష్టపడ్డ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నందుకు అభినందించాడు. కొత్తజంటను తనతో వూరికి తీసుకొచ్చాడు. మరుసటి రోజు రెండు జోళ్ళు పొట్టేళ్ళు నరికించి వూరంతా ఘనంగా విందుకు ఏర్పాటు చేశాడు!

"బుడ్డయ్యా! పిల్లకేవన్నా ఇసేషవా?" కన్నుగీటి మరీ మనవడ్ని అడిగాడు పెద్దరెడ్డి.

తాతయ్య అలా అడగడంతో సిగ్గుపడిపోతూ -

"అప్పుడే ఏం తొందర తాతా.." అన్నాడు తల వంచుకొని.

"పెళ్ళయ్యి యాడాది దాటతా వుంటే... అప్పుడే యాం తొందరంటావేందిరా...?"

"అది కాదు తాతా..." ఎలా మాట్లాడాలో తెలియక ఆపై ఏం మాట్లాడలేకపోయాడు.

"సరేగా(నా బుడ్డయ్యా... నువ్విట్ట మూడు మూడ్దినాలకోసారొచ్చి మీయమ్మా నాయిన్ని నీతో తోడుకొని బోతుంటే... ఈడ కయిల్లో పన్లెవుడు జేస్తారనుకుంటుండావు జెప్పు...? నాల్దినాలు దాల్తే... కుప్పల్దియాల... గెడ్డివావులెయ్యాల..."

"అంటే నువ్విప్పుడు అమ్మా నాయిన్ని నాతో బంపిచ్చవా...?."

"అబ్బ... నువ్వట్ట రెట్టించినట్టడగబాకరా... నీకడ్దాం చెప్పి నేం బతగ్గల్నా...' తీసకబో... కాకపోతే తొందరగా తిరగబంపిచ్చెయ్‌రా...!" బ్రతిమిలాడినట్లు మనవడితో చెప్పాడు.

ఆర్టీసీ బస్సు చిన్న కుదుపుతో నెల్లూరు బస్టాండులో ఆగింది.

బస్సు కుదుపుతో వాస్తవంలోకొచ్చాడు వెంకటరెడ్డి.

బస్సు దిగి భార్యా కొడుకుతో కలిసి ఆటో ఎక్కి ఐదు నిముషాల్లో కొడుకు ఇంటి ముందు దిగాడు. ఇంటిపక్కన ఇల్లు... ఇంటికీ ఇంటికీ అరడుగు చోటు కూడా వదలకుండా.. క్రమబద్ధంగా కట్టివున్న ఆ ఇళ్ళను చూసినప్పుడంతా ఎంతో ఆశ్చర్యపోతుంటాడు వెంకటరెడ్డి.

తక్కువ స్థలంలో కట్టిన కొడుకు ఇంట్లో ఒక హాలు, రెండు బెడ్‌రూంలు, కిచెన్‌తో సహా అన్నీ, వసతులూ లోపలే వున్నాయి.

స్నానాల కార్యక్రమం ముగించాక కొడుకూ కోడలూ నలుగురూ కలిసే భోంచేశారు. కోడలి వేడి కూరలకు తోడు అత్తగారు మూటగట్టి తెచ్చిన పచ్చళ్ళతో, హాయైన ముచ్చట్లతో ఎంతో రుచిగా అన్పించింది భోజనం.

గెస్ట్ బెడ్‌రూంలో విశ్రాంతి తీసుకుంటున్న అత్తమామల దగ్గరకెళ్ళి -

"అత్తయ్యా! మా స్నేహితురాలింట్లో సాయంత్రం చిన్న పార్టీ వుంది. అందుకని నేనూ మీ అబ్బాయీ కలిసి ఇంకో గంటలో బయలుదేరతాం. తిరిగి రావటానికి కాస్త ఆలస్యం కావచ్చు. అందుకనే రాత్రి భోజనం డైనింగ్ టేబిలు మీదుంచాను. మాకోసం ఎదురు చూడకుండా మీరు టయానికి భోం చేసెయ్యండి" అని చెప్పి వెనక్కు తిరిగింది అమల.

కోడలు దూరంగా వెళ్ళిపోయాక... "యావయ్యో..! నాకో ఇసయం అర్థమవడంలా... మనోడ్యావో మూడు మూడ్దినాలకోసారొచ్చి మనవల్నీడకు దీసుకొస్తాడా.. తీరా ఈడ కొచ్చినాక కోడలు పిల్లేవో ఆపనీ.. ఈపనీ ఆ పార్టీ... ఈ పార్టీ అంటూ మొగుడ్ని దీసుకొని బయటికెళ్ళి పోతుంటాదా... అసలీయెమ్మి వాలకం జూస్తుంటే.. మనిద్దరమీడకి రావడం అంత గిష్టంగున్నెట్టులా..." కష్టపెట్టుకుంటూ అంది భర్తతో.

"మే నోర్మూయ్... కోడలినగల్దు.." అని పెళ్ళాన్ని కసిరాడు.

తర్వాత మెల్లగా... "మే... మన పెళ్ళయి పాతికేళ్ళు దాట్నాదా... అసలు మన పెళ్ళయినాక ఎన్ని దినాలు మనం సుకంగా కాపరం జేసుంటాం?... మహా అంటే మీ ఇంట్లో ఓ మూడ్దినాలు మా ఇంట్లో ఓ రెండ్నెల్లు. ఆనేక నీ కడుపని, సీమంతమని, పురుడని నువ్వు తిరగనే సరిపొయ్యింది. తరువాత మన మంచాలేరయిపొయ్యి అరుగుల మీదకొచ్చినాక కాపరం సంగతేందో నీకింక నేన్జెప్పబళ్ళా..." అని ఆగాడు.

"అయితే దానికీ దీనికీ సంబంధమేందంటా..?" గుసగుసగా భర్తనడిగింది.

"మే... పిచ్చిముండా... నేన్యావో అనుకున్నాగానే... నిజంగా నువ్వట్టి అమాయక్క పచ్చివేనే..." అని భార్యకేదో చెప్పబోతున్న వెంకటరెడ్డి మాటలకు అడ్డు తగుల్తూ -

"అబ్బ ఆడదాన్ని నేను తొందరగా రెడీ అయ్యాను. మీరేంటి ఇంత ఆలస్యం చేస్తున్నారు. మీ షోకు పూర్తయ్యే లోపల మాట్నీ షో వదిలేస్తారేమో! మీరు కాస్త తొందరగా తయారైతే ఇల్లు త్వరగా అత్తమామల కొదిలెయ్యొచ్చు. పాపం వారి వయస్సంతా ఉమ్మడి కుటుంబంలో చాకిరీ చెయ్యటానికే సరిపోయింది. కనీసం ఇప్పుడన్నా వారికి అప్పుడప్పుడిలా కొంత ఏకాంతం కల్పిస్తే ఒకరితో ఒకరు మనసు విప్పి మాట్లాడుకోడానికి అవకాశం

దొరుకుతుంది" అంటూ కోడలు కొడుకుతో చెప్పడం విన్న సుగుణమ్మ నిలువెల్లా చలించి పోయింది.

కొద్దిసేపటి తర్వాత -

"అత్తయ్యా...! మేం వెళ్ళొస్తాం...!" అని కోడలు చెప్పి వెళ్తుంటే -

కోడలు వంక ఎంతో కృతజ్ఞతగా చూసిందామె.

తను ఊహించిన దానికంటే ఎంతో భిన్నంగా కన్పిస్తున్న కోడలు ఇప్పుడామె కంటికి మహోన్నతమైన వ్యక్తిగా కన్పిస్తోంది.

భర్తవైపు చూస్తూ - "నీకు నా మీద చానా పేవుంది. నాకూ నీమీద యంతో పేవుంది. కానీ మన పేవ ఒకర్తో ఒకరం చెప్పుకోవడానికి ఇప్పటిదాకా మనకి ఏకాంతవూ... సొతంత్రవూ లేదు. కనీసం ఇప్పుడైనా మనకి ఆ ఏకాంతవూ సొతంత్రవూ అప్పుడప్పుడో రెండు మూడ్డినాలైనా కోడలు పిల్ల వల్ల దొరుకుతుండాయి" అనుకుంది సుగుణమ్మ.

"మే... ఓ లోటా నీళ్ళి...." భార్యనడిగాడు వెంకటరెడ్డి.

హాల్లోకెళ్ళి ఫ్రిజ్ తెరిచి బాటిల్‌లోని నీళ్ళు గ్లాసులోకి వంచుకొంది. గ్లాసు చేతిలోకి తీసుకున్నాక హాలంతా కలయజూసి ఇంట్లో ఇంకెవ్వరూ లేరని నిర్ణయించుకొంది. తర్వాత బయట తలుపు గడియపెట్టి భర్త దగ్గరకొచ్చి నీళ్ల గ్లాసు అతడి చేతికిచ్చింది సుగుణమ్మ.

నీళ్ళు తాగుతున్న భర్త వైపు చూసింది.

"యావయ్యో...! అప్పుడొక రాత్తిరి జరిగింది గుర్తుండాదా... ఎన్నెల్లో సల్లగాలికి నీకు నిదరబట్టక మంచం మీది నించి లెయిడం, ఇంక నా మంచం దెగ్గిరికొచ్చేస్తావని నేను సంతోషం గుండేటప్పుడే మావ లెయిడం... 'పెద్దోడా...! నీళ్ళేవన్నా గావాల్నా...!' అనాయనడగడం... అప్పుడు నీకు మంచినీళ్ళన్నా' దొరికినాయి... నాకు మాత్తరం కన్నీళ్ళు కూడా రాలా..."

ప్రేమగా భార్య చెయ్యి పట్టుకున్నాడు వెంకటరెడ్డి.

మల్లె పూల వాసనల్లేవు.

జాజిపూల వాసనల్లేవు.

చల్లటిగాలి అసలే వీచడం లేదు.

ఒకే ఒక కిటికీ వున్న ఆ గదిలోకి గాలసలే రావడం లేదు.

లోపల నిలవున్న గాలే ఫ్యాన్ తోస్తోంటే సుడులు తిరుగుతోంది.

కానీ ఆ భార్యభర్తల కలయిక తాలూకు ఆనంద పరిమళం ఆ గది నిండా వ్యాపించింది. వాళ్ళ శరీరాల పులకరింతల చివురులతో వాళ్ళ మనసులలో వసంతం వెల్లి విరిసింది.

పల్లేటి బాలాజి, బి-4, 172 పులికాట్ నగర్,
సూళ్ళూరు పేట - 524 121

డా॥ ఆర్. అనంతపద్మనాభరావు కథ

# మాకూ వున్నాయి స్వగతాలు

"నరిసింహులూ!... నరిసింహులూ!"

ఊc...

'నిన్నేనయ్యా! నరిసింహులూ! ఇవాళ ఏదో పరధ్యానంలో ఉన్నట్లున్నావ్! ఏ 5 క్లార్కు రాఘవరావు వరండాలో కునికిపాట్లు తీస్తున్న దఫేదార్ నరిసింహుల్ని పలకరించాడు. నరిసింహాలు ఇరవై ఏళ్లుగా కలెక్టరు బంట్రోతుగా పేరుతెచ్చుకొన్నాడు.

'దొరగారు రెస్ట్‌తీసుకొంటున్నారు. 3 గంటల వరకు ఎవర్నీ లోపలికి పంపొద్దన్నారు.'

'అయితే...... ఆఫైలు యివాళ బయటికి రానట్లే....'

MLA రామభద్రంగారు మెట్లెక్కిరావడం చూశాడు నర్సింహాలు. సవరించుకొంటూ పలకరించాడు.

'ఏవోయ్! మీవాడు I.A.S. పరీక్షలు బాగా వ్రాశాడా?'

'ఏదో తమ దయవల్ల బాగానే వ్రాశాడు.

రేపు మీవాడు కలెక్టరయితే నువు ఉద్యోగం మానేస్తావా?'

'నా ఉద్యోగం నాది. వాడి ఉద్యోగం వాడిది.'

'గట్టి వాడివే. నీకొడల్ని కూడా ఐ.ఏ.యస్. కూ పొమ్మనకపోయావా?' వ్యంగ్యంగా అన్నాడు యమ్.ఎల్.ఏ.

"అందరికీ ఆ అదృష్టం ఉండొద్దూ 'ఠకీమని అన్నాడు నర్సింహాలు. రామభద్రంగారి అబ్బాయి రెండు సార్లు ఐ.ఏ.యస్. ఫెయిల్ అయ్యాడు.

'సరే.... దొరగారికి చెప్పు'.......ఎం.ఎల్.ఏ సీరియస్‌గా అంటూ మీటింగ్ కార్డు యిచ్చాడు.

'దొరగారు....' నసుగుతూ నిలబడ్డాడు నర్సింహాలు.

'భోంచేస్తున్నారా?......

'ఇప్పుడే భోంచేసి రెస్ట్ తీసుకొంటున్నారు. రెండు గంటల కల్లా.....'

'కలెక్టర్లకు రెస్టు, గిస్టులేదు. ప్రజా సమస్య మీద మాట్లాడటానికి వచ్చాం...వెళ్లి చెప్పు.

'మూడు గంటల వరకూ డిస్టర్బ్ చెయ్యొద్దన్నారు....'

'నీకు వాళ్లు పొగరెక్కింది నర్సింహులు.....నీకొడుకు రేపు కలెక్టర్ అవుతాడని మురిసి పోతున్నావ్.....'

'నేను దొరగారు చెప్పిన మాట చెప్పాను....నేనెంత వాణ్ణి.

'క్యాంప్ క్లర్కు ఏడీ?'

'భోజనానికెళ్లారండీ!

'హుజూర్ హెడ్‌క్లర్క్!

'సెలవు పెట్టారండీ!

'అన్నింటికీ అన్ని సమాధానాలు చెబుతున్నావ్....నీసంగతి తేలుస్తాను.....'విసురుగా వెళ్లిపోయారు ఏం.ఎల్.ఏగారు. ఆయన వెనక వచ్చిన జనం నరసింహుల్ని తలవోమాట అన్నారు.

'తనదిగాని తప్పుకు తాను బాధ్యత వహించాలా! తన దౌర్భన్య స్థితికి తిట్టుకొన్నాడు నర్సింహులు. టెలిఫోన్ మోగడంతో లోపలికెళ్లి తీశాడు!

'కలెక్టర్ గారి ఆఫీసుబాబూ!

'ఊనేను....ఏం.ఎల్.ఏ రామచంద్రం మాట్లాడుతున్నాను. కలెక్టర్‌తో మాట్లాడాలి. కనెక్షన్ యివ్వు......'

'లోపలి రూంలో ఉన్నారు బాబూ!

'కనెక్షన్ యిస్తావా? లేదా?

నరసింహాలు యాంత్రికంగా కనెక్షన్ యిచ్చాడు. ఎం.ఏల్.ఏగారు కలెక్టరుతో చాలా సేపు మాట్లాడారు.

కలెక్టర్ దొరగారు మరు క్షణంలో ఆఫీస్ రూంలోకి తక్షణంగా వచ్చారు. ఫైలు విసిరేశారు.

'నువ్ ఎన్నేళ్ల సర్వీస్ చేశావ్. నర్సింహులూ!' అన్నారు కలెక్టరు.

'3గంటల వరకూ ఎవర్నీ పంపొద్దని....నసిగాడు నర్సింహాలు.

'ఏం.ఏల్.ఏ గారొస్తే లోపలికి పంపాలనే తెలివి వుండొద్దూ.......

'ఎవ్వర్నీ..........'

'ఆయన చాలా పవర్‌ఫుల్ ఏం.ఏల్.ఏ......'

'మొన్న మరో ఏం.ఏల్.ఏని పంపానని.......'

'నీకు నోరు జాస్తి అవుతోంది....'కసురుకొన్నారు.

తన బిడ్డ ఐ.ఏ.యస్ వ్రాశాడని ఈ దొరగారికే కన్నుకుట్టింది. "భగవంతుడు తనకెందుకీ శిక్ష విధిస్తున్నాడు.' వరండాలో కూలబడుతూ అనుకొన్నాడు నర్సింహులు.

★ ★ ★

'నర్సింహులూ; కలెక్టరుగారు బెంగుళూరు వెళ్లారుగదా..... నిన్ను తీసుకెళ్లలేదేం.' గుమాస్తా బాబూరావు సాగదీస్తూ అడిగాడు.

'సొంతపని మీద వెళ్లారు.'

'నిన్నూ దసరాలకు తీసుకెళ్తే బాగుండేది!

'నాకంత యిష్టం లేదు.' ముక్త సరిగా అన్నాడు నర్సింహులు.

'నర్సింహులూ! నీ సర్వీసులో ఎంతోమంది కలెక్టర్లని చూసివుంటావ్.....'

'ఒక్కొక్కళ్లు ఒక్కోరకం. కొందరు నేను ఎలా నడచుకోవాలో చెప్పేవాళ్లు. యువరక్తం నామీద ఒక్కోసారి కోపగించుకునేలా చేసేది.'

'రాఘవన్ గారు ఉన్నప్పుడు ఎలావుండేది?'

'ఆయనకు తెలుగు రాదు. పల్లెటూరి జనంతోమాట్లాడం చేతనయ్యేది గాదు. నేను మధ్యవర్తిని. కానీ, చాలా నెమ్మది మనిషి.'

'నీతో గొడవ పెట్టుకొన్నాడటగా' - బాబూరావు కూపీ తీయాలని మాట వరసకన్నాడు.

'నేను పెద్ద ఆఫీసర్‌నా ఏంటి? నాతో గొడవ పడటానికి.. ఆరోజు ఏదో మనసుకు బాధ బాధపడ్డాను....అంతే...'

'ఏం జరిగింది: పక్కనే కుర్చీలో కూర్చొంటూ బాబూరావు నర్సింహుల్ని అడిగాడు.

నర్సింహులు పాతజ్ఞాపకాలు తిరగవేశాడు.

ఆరోజు కలెక్టర్ దొరగారు హుషారుగా వున్నారు. మా ఇంటి దగ్గర నాభార్య రాజ్యం నొప్పులు పడుతోంది. కాన్పుకు సిద్ధం. ఆఫీసుకెళ్లవద్దని బతిమాలింది. దొరగారితో చెప్పివస్తానని బయలు దేరాను. బంగళా కెళ్లేటప్పటికి ఉదయం 6గంటలు. దొరగారు స్నానం చేసిరెడీగా వున్నారు. జమాబందీ ఆఫీసరుగా క్యాంప్ కెళ్లాలి.

జమాబందీ పకడ్బందీగా జరిగేరోజులవి. గ్రామాధికార్లకు ఆ నెలరోజులు నిద్రాహారాలు సరిగా వుండవు. రైతులు పిటీషన్లు యిచ్చేవారు. కలెక్టర్లు అక్కడికక్కడే ఆర్డర్లు వేసారు.

ఫైళ్లు దస్త్రంలో కడుతూ నసుగుతున్నాను.

'పొద్దటే ఐదున్నరకు రమ్మన్నాను' కటువుగా అన్నారు కలెక్టర్.'

'చిత్తం దొరా!'

'లాభం లేదు..... నీకు వొళ్లు తెలీడంలేదు.'

'ఇంటి దగ్గర....'సమాధనం చెప్పబోయాను.

'నో,నో,'

'చిత్తం దొరా...'దస్త్రం కారు దగ్గరకు పట్టుకెళ్లాను.

'నీకు వొళ్లు తెలీడం లేదు. దస్త్రం అక్కడ పెట్టి వెళ్ళిపో'.

'ఆడదానికి వొంట్లో'... సా సమాధానంవినే స్థితిలో లేరు.

'ఇంటి దగ్గరే అఘోరించు...కాన్పుచెయ్యి....'

'నెలలు నిండాయి దొరా!'

'నిండుతాయి. ఇక్కడ ఆఫీసు ఏమైనా ఫర్వాలేదు.' కారు పోనీమంటూ డ్రైవర్‌తో చెప్పి వెళ్లిపోయారు.

నాపొరబాటుకు నేను బాధపడ్డాను.

నెలరోజులు సెలవు చీటీ టేబుల్ మీదపెట్టి వచ్చేశాను.

సరాసరి యింటి కెళ్లాను.

రాజ్యం నొప్పులు పడుతోంది.

నా మనసు బాధ పడుతోంది.

పుట్టబోయే బిడ్డలో కాన్ని చూడాలని అప్పుడే ఆరాట పడుతోంది.

దొరగారు జమాబందీ నుంచి రాగానే కబురు పంపారునాకు.

నేను లేనిలోటు వారికి కనిపించింది.

ఫైళ్లు కనబడటం లేదు సరిగా,

నా బదులు పనిచేసిన ప్యూన్ పనితనం కలెక్టరుగారికి నచ్చలేదు.

ఎలా వెళ్దామా? అని సందేహిస్తున్నాను.

ఉదయం 5 గంటలకే బంగళా కెళ్లాను. దొరగారింకా నిద్రలేవలేదు.

ఫైళ్లన్నీ జాగ్రత్తగా విడదీసి దస్త్రాలు కట్టాను.

దొరగారు మేడమెట్లు దిగి వచ్చారు.

'నమస్కారం దొరా.....' అన్నాను.

'పిల్లాడికి ఏం పేరు పెట్టావు నర్సింహులూ' అన్నాడు - పాతకథ ఏమీ గుర్తులేనట్లు దొరగారు.

'తమరే పెట్టాలి దొరా!'

'భేష్...అమ్మగారినడుగు.....ఏదో చెబుతుంది'. అంటూ పనిలో మునిగిపోయారు.

ఆయనగారితో తర్వాత బాగా అనుబంధం పెరిగింది. - అదీ రాఘవన్ గారి కోసం అన్నాడు నర్సింహులు.

నర్సింహులు వినయం బాబూరావుకి నచ్చింది.

డా॥ ఆర్. అనంతపద్మనాభరావు, స్టేషన్ డైరెక్టర్,
ఆకాశవాణి, విజయవాడ - 520 010

# మోటూరు గంగాధర ప్రసాద్ కథ

# మహాస్థితి

**కి**టికీ తలుపులు తీశాను.

విసురుగా గాలి ముఖాన్ని తాకింది. నల్లటి మేఘాలు భయంకరంగా కనిపిస్తున్నాయి. ఎటు చూసినా ఆ నలుపుదనమే. మెల్లగా ముందుకు కదులుతున్నాయి. దానికి తోడు గాలి మొదలైంది. రేడియో వార్తల ప్రకారం ఇదో భయంకర తుఫాన్‌గా మారనుంది. గంటకు వంద నుండి నూట యాభై కిలోమీటర్ల వేగంతో గాలులు వీస్తాయంటున్నారు. బంగాళా ఖాతంలో ఏర్పడిన అల్పపీడనం క్రమంగా తుఫాన్‌గా మారింది. రాత్రి రెండు గంటల ప్రాంతంలో తీరం దాటవచ్చునంటున్నారు.

ఇప్పుడు సమయం పన్నెండు గంటలు. ఉదయంలా లేదు. ఇలాంటి తుఫాన్లు నా జీవితంలో కొత్త కాదు. అయితే మరిచిపోలేని రాత్రి మాత్రం ఒకటుంది.

"ఎందుకక్కడ, తలుపులు మూయండి" అంటోంది నా శ్రీమతి. తలుపులు మూస్తే గాలి ఉండని మాట నిజమే. జ్ఞాపకమూ ఉండదు. ఇంట్లో ఎవరూ లేరు. పిల్లలంతా ఎక్కడో ఉద్యోగాలు చేసుకుంటున్నారు. వారందరూ ఇంటి దగ్గర టి.వి. సెట్ల ముందు కూర్చుని ఉంటారు. తుఫాన్ గురించి మాట్లాడుకుంటూ ఉంటారు. వారి చర్చల్లో మేం కూడా చోటు చేసుకుంటాం.

నిజమే. ఇంకాం మేం ఈ ఇంటిని వదలి వెళ్ళలేకపోతున్నాం. వారి దగ్గరకు వెళ్ళటానికి మరి కొంత సమయం ఉంది. నాకింకా ఈ కిటికీ తలుపులు తెరుచుకొని జ్ఞాపకాల్లోకి జారిపోగల శక్తి ఉంది. తనూ అంతే. ఆ ఓపికలుడిగిపోయాక ఎటూ తప్పదు.

నా జీవితంలో అపురూపమైనది తుఫాన్.

ఆశ్చర్యంగానే ఉంటుంది. అందులోనూ మూడున్నర దశాబ్దాల క్రితం - ఇరవై నాలుగు గంటల కాలం విరుచుకుపడి, అల్లకల్లోలం చేసిన ఆ తుఫాన్. ఇప్పటివరకూ నా తరంవారు ఎవరూ మరచిపోలేని ఆ తుఫాన్. అది గుర్తుకు వస్తే ఒక్కొక్కరికి ఒక్కో జ్ఞాపకం. నాకెందుకో ఎపుడూ అదే గుర్తొస్తుంది. మేఘాలు దట్టంగా కమ్ముకున్నప్పుడూ, జోరున వానలు కురుస్తున్నప్పుడూ, రేడియోల నిండా గంట గంటకూ ప్రమాద సూచికలు ఎగరవేశాం అని చెబుతున్నప్పుడు ఆ రోజే గుర్తొస్తుంటుంది.

మూడున్నర దశాబ్దాలలోను అలాంటి తుఫాన్ రాలేదు. రాకూడదు కూడా. వస్తే మనుషులు కోలుకోలేరు. వేలాది మందిని పొట్టన పెట్టుకున్న ఆ కాళరాత్రి మళ్ళీ మళ్ళీ

విరుచుకుపడితే ఈ ప్రపంచం విధ్వంసంకేసి మరలుతుంది. కానీ చాలా చిన్న చిన్నవి వచ్చాయి. ఓ మోస్తరు నష్టాన్ని కలిగించినవి వున్నాయి. భీకరమైన గాలులూ వున్నాయి. వృక్షాలను పడదోసుకుంటూ, రోడ్లను కోసుకుంటూ పోయినవి వున్నాయి. కానీ....

ఆ ఉదయమే.... మూడున్నర దశాబ్దాల క్రితపు ఉదయం....

మబ్బులన్నీ కమ్ముకున్న వేళ. అప్పటి వరకూ రేడియోలో వస్తున్న హెచ్చరికల గురించి ఏమాత్రం పట్టించుకోకుండా నేను ఇంటి నుండి బయటికొచ్చాను. అయిదు కిలో మీటర్లు ప్రయాణం చేస్తే గాని నేను పనిచేస్తున్న ఆఫీసు రాదు. రోజూ సిటీబస్‌లో వెళ్తాను. ఈరోజు వెళ్ళకుండా ఉండటానికి లేదు. ఎలా అయినా వెళ్ళాలి. ఎందుకో సిటీబస్ రాలేదు. అప్పటికే గాలులు మొదలయ్యాయి. రిక్షాలు సైతం లేవు. ఆ గాలిలో రిక్షాలు ఎక్కడం కంటే నడిచి వెళ్ళడమే మంచిది. మరికొద్ది సేపు చూశాను. సిటీబస్ వచ్చే దాఖలాలు కనిపించడం లేదు. నడక ఆరంభించాను.

జనం అంతా ఏమైపోయారో తెలియదు. వాన యింకా ఆరంభం కాలేదు. ఒకరో అరో కన్పిస్తున్నారు. ఈ ప్రాంతంలో అంతగా జనసమ్మర్దం ఉండదు. గాలి నన్ను నడవనీయకుండా నిరోధిస్తోంది. అప్పటికే నలభై నుండి యాభై కిలోమీటర్ల వేగం ఉండి ఉంటుంది. ఆ ప్రాంతం నుండి దూసుకువెళ్తున్నప్పుడు అదోరకం శబ్దం. నాకెందుకో అలా నిలబడిపోయి వినాలనిపించింది. రోడ్డుకు రెండుపక్కలా పంటచేలు. అనుకోని తుఫాన్ ఇది. పంటలు పండాయి. ఇదే లేకపోతే ఇంక కోతలు ఆరంభించాల్సిన తరుణం. నేను నడుస్తున్నాను.

నాకింకా పెళ్ళి కాలేదు. ఉద్యోగంలో చేరి రెండు సంవత్సరాలైంది. జీతం బాగానే వస్తుంది. నా జీతం ఇంట్లో యివ్వాల్సిన అవసరం లేదు. అలా అని విచ్చల విడిగా ఖర్చు చేసే తత్వం కాదు నాది. కొంతమంది మిత్రులు జీతం తీసుకున్న మొదటి రోజునే సరదాగా కాలక్షేపం చేసేవారు. నన్నూ ఆహ్వానించేవారు. 'కనీసం ఓ బీర్ తీసుకోవచ్చు కదా' అనేవారు. నాకు ఇష్టం ఉండేది కాదు. చిరునవ్వుతో సెలవు తీసుకునేవాడిని. నాకు ఆఫీసు విడిచిపెడితే 'చంద్రం'తోనే కాలక్షేపం.

వాడు నాకంటే చిన్నవాడు. అయిదు సంవత్సరాల క్రితం పెళ్ళి చేసుకున్నాడు. వాళ్ళకో బాబు. ఇంకోరు పుట్టబోతున్నారు. వాడికో చిన్న 'కిళ్లీ బడ్డీ' ఉంది. నేను అక్కడికి చేరుకుని పుస్తకాలు తిరగేస్తూ కబుర్లు చెప్పేవాడిని. ఒక్కోసారి వాడి ఇంట్లోనే ఉండిపోయేవాడిని. రాత్రంతా కబుర్లే కబుర్లు.

"పెళ్ళి చేసుకోవా, మధూ" అనేవాడు.

"నువ్వు చేసుకుని తిప్పలు పడుతున్నావుగా, నాక్కూడా ఎందుకు"

"నా పరిస్థితి వేరు, నాకు నీలా మంచి ఉద్యోగం లేదు. ఈ ఆదాయం ముంచదూ, తేల్చదూ. చూస్తువున్నావుగా" అనేవాడు.

నిజమే. తనూ ఇంటర్ దాకా చదివాడు. చాలా పైకి రావాల్సినవాడు. అవకాశాలు లేవు. దానికితోడు పద్దెనిమిది సంవత్సరాలకే పెళ్ళి చేసుకోవాల్సి వచ్చింది.

నేను ఆఫీసుకు చేరుకోవటానికి కనీసం గంటన్నర పట్టింది. ఈలోగా చిన్నగా జల్లులు మొదలయ్యాయి. గాలి వేగం పెరిగింది. రేడియో వార్తల ప్రకారం నూట ఏభై నుండి

రెండు వందలకిలోమీటర్ల వేగంతో గాలులు వీయవచ్చు.

దాన్నే "టార్నెడో" అంటారంట.

నేనే కాదు. రేడియో వారిని చాలామంది నమ్మరు. ఈ విషయంలో ముందు జాగ్రత్త కోసం కొంత అతిగా చెబుతారని నమ్మకం. కానీ ఎందుకో బయటికి వచ్చి చూస్తే పరిస్థితి అంత సులభంగా ఉండేలా కనిపించలేదు. మధ్యాహ్నం నుండి ఇంటికి వెళ్ళిపోవచ్చని మేనేజర్ చెప్పాడు. ఆయనయితే ఇంటి నుండి అటెండర్‌తో కబురు చేశాడు. ఫోన్లు పలకటం లేదు. తిరిగి నేను అంత దూరం వెళ్ళటం కంటే 'చంద్రం'తో ఉంటే బాగుండు ననిపించింది.

ఓ గంట గడిచింది.

పరిస్థితిలో పెను మార్పు వచ్చింది. అసలు 'చంద్రం' ఉన్నాడో, లేదో, ఆఫీసు నుండి బయటకు వచ్చాను. గాలి హోరు. అడుగు ముందుకు పడనీయదు. అయినా బలవంతాన నడుచుకుంటూ వెళ్ళాను. చంద్రం లేడు. బడ్డీ కొట్టు గాలికి ఓ ప్రక్కకి ఒరిగిపోయింది. మరికొంచెం సేపట్లో విరుచుకు పడ్డా ఆశ్చర్యం లేదు. నేను వెనక్కి తిరిగాను. దాదాపు అందరూ షాపులు కట్టేశారు. రోడ్డుమీద కొందరు సైకిళ్ల నడిపించుకుంటూ వెళ్తున్నారు. ఆకులూ, చెత్తా రోడ్డును కప్పేశాయి. నేను 'చంద్రం' ఇంటికేసి నడుస్తున్నా.

ఇపుడు వెనక నుండి గాలి ముందుకు తోస్తోంది. ఎందుకో గాలి లోకి ఎగిరిపోగలనేమో అనిపించింది. అంతలోనే భయం. ఏ రేకులో ఎగురుకుంటూ వస్తేనో. దూరంగా రోడ్డు ప్రక్కగా ఓ దున్నపోతు పడిపోయి వుంది. మైగాడ్.. కరెంటు తీగ తెగి దానిమీద పడి ఉంటుంది. ఇంతకూ కరెంటు ఉందా? తీసివేసి ఉంటారు. ఏమైనా త్వరగా 'చంద్రం' ఇంటికి చేరాలి.

రోడ్డు మలుపు తిరుగుతుండగా గమనించాను. షాపు తెరిచి ఉంది. ఓ క్షణం ఆగాను. గాలి నెట్టేస్తుంది. నాకు తెలియకుండా అడుగులు పడ్డాయి.

"ఏంటి సార్"

"ఓ బీర్ కావాలి."

"ఈ టైంలో బీరేంటి సార్"

"ఫర్వాలేదు. ఇవ్వండి."

"ఏదో ఇచ్చారు. అందుకుని బయలుదేరాను. 'చంద్రం ఇంటిదగ్గరే వున్నాడు.

"పొద్దున కొంచెం సేపు తీసి లాభంలేదని వచ్చా"నన్నాడు.

"బడ్డీ ఓ పక్కకి వొరిగిపోయింది. క్రింద పడిపోతుందేమో"

"పడనీ, ఏం చేస్తాం. అప్పటికీ కొన్ని సిగరెట్ పెట్టెలు సంచిలో వేసి తెచ్చా" అన్నాడు.

రెండు గదుల ఇల్లు. మేమిద్దరం ఓ గదిలో కూర్చున్నాం. వాడు తాగడు. నా చేతిలో బీర్ బాటిల్ చూసి ఆశ్చర్యపోయాడు.

"ఎప్పట్నుంచి"

"ఇపుడే. ఎందుకో తాగాలనిపించింది."

"పకోడి వేయించుకుందాం."

"ఈ గాల్లో ఆ అమ్మాయిని ఇబ్బంది పెట్టడం ఎందుకు?"

"ఏం కాదులే" అన్నాడు.

చంద్రం కొడుకు ప్రక్కవారింటి దగ్గర కబుర్లు చెబుతున్నాడు. దాదాపు నాలుగు పోర్షన్ల లోగిలి అది. మాటలు విన్పిస్తున్నాయి. జరగబోయే నష్టం గురించి అందరూ తల్లడిల్లుతున్నారు. ఆ సమయంలో నేను బాటిల్ మూత బలవంతంగా తీశాను.

సీసా ఎత్తి మొదటిసారి గొంతులోకి వంపుకొన్నపుడు అదోరకమైన అనుభూతి. అంతవరకూ ఎపుడూ కలగని ఫీలింగ్. ఇప్పటికీ నాకింకా గుర్తు. 'చంద్రం' ప్లేటుతో వచ్చాడు. ప్రక్కన కూర్చున్నాడు.

"పెళ్ళి చేసుకోవా?"

నవ్వాను.

"ఈ గాలేంటి యిలా ఉంది. ఇంతకు ముందెపుడూ చూడలేదు."

తలూపాను.

గాలి తలుపుల్ని బలంగా తాకుతున్నపుడు వింత శబ్దం. తలుపులన్నీ మూశాం. కరెంటు లేదు. చలి వణికిస్తోంది. గాలి ఆగి ఆగి వీయటం తెలుసు గాని, విరామం లేకుండా హోరున దూసుకుపోవటం ఇపుడే. అంతే కాదు. ఇన్ని సంవత్సరాల తర్వాత కూడా ఆ రకమైన అనుభవం లేదు.

బాటిల్ పూర్తి చేశాను.

'చంద్రం' కొడుకు 'అంకుల్' అంటూ వచ్చాడు. ముఖం చిట్లించాడు. 'వాసన' అన్నాడు. మేం నవ్వాం. నేను కొద్ది సేపటి తర్వాత పడుకున్నాను. వెంటనే నిద్రపట్టేసింది. దాదాపు ఏడుగంటల ప్రాంతంలో లేచాను.

'ఓసారి బయటకొస్తావా' అన్నాడు చంద్రం. అతి కష్టం మీద వెళ్ళాం. గోడ విరుచుకు పడిపోయి ఉంది. ఎదురుగా కొన్ని ఇళ్ళమీద రేకులు లేవు. స్తంభాలు వంగిపోయాయి. చెట్ల ఆకులూ, కొమ్మలూ, రోడ్ల మీద పడి వున్నాయి. గాలి బీభత్సం అలానే వుంది. సరిగ్గా ఆ క్షణమే మార్పు....

'టార్నెడో'ను అనుభూతి చెందింది ఆ రెండు గంటలే. ఇల్లు కూలిపోతుందేమో అనిపించింది. చంద్రం మాట్లాడడం లేదు. ఏం ఆలోచిస్తున్నారో తెలియదు. ఆ అమ్మాయి పిల్లవాడ్ని గుండెలకి హత్తుకుని పడుకుంది.

ఈనాటికీ అర్థం కాదు.

నాకెందుకో చాలా ప్రశాంతంగా అనిపించింది. నాలో ఏ ఆందోళనలూ లేవు.

నాకు అమ్మా, నాన్న గుర్తుకు రావటం లేదు. భవిష్యత్ గురించిన ఆలోచనలు లేవు. నేనేదో ట్రాన్స్‌లో జారిపోయాను. ఆరాత్రి భీభత్సం అంతా యింతా కాదు. పది గంటల ప్రాంతంలో ఓ మెరుపు. ఒక్కసారి సముద్రం శరీరాన్ని కుదిపింది. ఉప్పెన విరుచుకు పడింది. అయితే మమ్మల్ని తాకలేదు. రాత్రంతా ఎలా నిద్రపోయానో తెలియదు.

ఉదయాన్నే -

ఎటుచూస్తే అటు కూలిన గోడలు, చేతులు తెగినవారు, గోడల క్రింద కూరుకు

పోయినవారు. కరెంటు లేదు. ఫోన్లు లేవు. బయటి ప్రపంచంతో సంబంధం లేదు. పేపర్లు లేవు. అపుడు ఆరంభం అయింది. ముందుగా అమ్మనూ, నాన్ననూ చూడాలి. 'చంద్రం' కు చెప్పి పరుగులు తీసుకుంటూ వెళ్ళాను. దారిపొడుగునా అడ్డంకులే. ఇంటికి వెళ్ళి వారిని చూడగానే 'అమ్మయ్య' అనిపించింది.

మెల్లగా వార్తలు బయటికొచ్చాయి.

ఉప్పెన గ్రామాలెన్నింటినో తుడిచిపెట్టిందని... అదంతా ఓ విషాదం.

కిటికీ తలుపులు మూశాను..

తిరిగి అలాంటిదే వస్తుందా?

వస్తే ఎలా?

పిల్లలు దగ్గర లేరు. అప్పటిలా జరిగితే... జరిగితే బాగుండునేమో... నవ్వు వచ్చింది.

నిజం.... జీవితంలో నేనెప్పుడూ తాగలేదు. అదే మొదటిసారీ... చివరి సారీ కూడానేమో!

'చంద్రం' ఇపుడు దూరంగా వెళ్ళిపోయాడు. ఎప్పుడన్నా ఉత్తరాలే రాసుకుంటుంటాం.

ఇన్ని సంవత్సరాల తర్వాత వెనక్కి చూసుకున్నా...

నాకు అర్థం కానిదదే.

ఆరోజు నాలో ఎందుకంత తృప్తి?

ఎందుకంత ప్రశాంతత?

ఎందుకని 'భయం' నన్ను లోబరచుకోలేదు?

ఇప్పటివరకూ -

ఆ తృప్తి కలగదెందుకు?

ఆ 'నిద్ర' నన్ను ఎందుకు ఆవరించుకోలేదు?

అసలు నాలో ఈ భయాలేమిటి? ఈ ప్రేమలేమిటి?

జవాబులు దొరకవు. ఒక్కోసారి ఏదో తెలిసినట్లే ఉంటుంది.

నిజం చెబుతున్నాను.

నాకు తిరిగి అలాంటి 'మహా స్థితి' కావాలి.

ఆ భీభత్సం మాత్రం వద్దు!

అలాంటి పరిస్థితి వస్తుందా?

వచ్చినా తిరిగి నేను ఆ స్థితికి చేరుకోగలనా?

ఏమో!

మోటూరు గంగాధర ప్రసాద్, వెల్లటూరు పోస్ట్,
భట్టిప్రోలు మండలం, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.

సంపత్‌కుమార్ కథ

# గిల్లేసిన రెమ్మలు

ఢిల్లీ నగరం. డిసెంబర్ నెల. మహా నగరంలో మహాచలి! ఒంటరిగా ఉన్నవారికే ఇంకాస్సేపు పడుకుంటే బాగుండనిపిస్తుంది. ఆంధ్రా నుండి హనీమూన్ కొచ్చిన ఆ జంట ఇంకా రజాయిలోనే దూరిఉంది. హనీమూన్ను రంగులమయం చేసే హంగులు, వాతావరణ నేపథ్యం ఢిల్లీలో దొరుకుతుందని మరీ వచ్చారు. సమయం ఉదయం ఎనిమిదిన్నర కావస్తుంది.

ఢిల్లీ వచ్చి పదిహేను రోజులయ్యింది. ఇంకో రెండురోజుల్లో తిరుగు ప్రయాణం. దాదాపుగా ఢిల్లీ అంతా తిరిగారు. ఇండియా గేట్ వద్ద రాత్రిపూట వెలుగులో తడిసిపోయారు. కన్నాట్‌ప్లేస్‌లో చెట్టాపట్టాలేసుకొని తిరిగారు. విదేశీ జంటల్ని చూసి మేమూ మీకేం తీసిపోలేదని మరింత దగ్గరయ్యారు. జంతర్ మంతర్‌ను చూసామనిపించారు. ఎర్రకోట చూస్తుండగా వెర్రిమూడ్‌వచ్చి గదికి చేరుకున్నారు. ఒహాయ్ ప్రార్థనామందిరంలో కళ్ళుమూసుకొని ఒకరి రూపాన్ని మరొకరు ఫాషన్‌గా తలచుకున్నారు. రేల్‌ట్రాన్స్‌పోర్ట్ మ్యూజియంలోని బుల్లిట్రేన్‌లో పిల్లలై పోయారు. పాలికాబజార్‌లోని రష్ ఒకరినొకరు చేయి విడవకుండా

నడిపించింది. కరోల్‌బాగ్ కావాలసినవన్ని కొని ఇచ్చింది పార్లమెంట్ ప్రేమ చతురతను నేర్పింది. రాష్ట్రపతి భవనం ఇరువురిపై విశ్వాసాన్ని పెంచింది. ఘాట్‌లు, స్థల్‌లు ప్రస్తుత పరిధిలో లేవు. ఇక చూడాలనుకున్నది ఒక్కటే - కుతుబ్‌మినార్. ఈరోజు చూడాలి దాన్ని.

"మై డియర్ లేడీ" కళ్ళు మూసుకునే మెల్లగా అన్నాడు.

"......... ......" ఏంది కావాలనే జవాబివ్వలేదు. ఆమె మెలకువగా ఉందని ఆమె అంగాల కదలికలే చెబుతున్నాయి. ఆయనకు తెలుసది. మరింత దగ్గరగా హత్తుకున్నాడు. మొహమంతా ముద్దుల ముద్రలు వేసాడు. మత్తుగా ఉంది ఇద్దరికి. పెదిమల్ని మెల్లగా చెవి దగ్గరికి తీసుకెళ్ళి ఏదో అన్నాడు.

"యూ నాటీ ఫెలో ..... ఎంత ధైర్యం నీకు ....." అంటూ మత్తు వదిలించుకొని చప్పున లేచి బెడ్ దిగింది. అతనిపైనుండి రొజాయిని లాగేసింది.

ఇద్దరూ నవ్వుకున్నారు.

★ ★ ★

"చలో భాయ్ కుతుబ్‌మినార్" ఆటోలో కూచున్నాక అన్నాడతను. ఆటో దూసుకుపోతుంటే పక్కల నుండి రయ్యంటూ డిసెంబర్ శీతల గాలలు ఉలన్ దుస్తుల్ని చొచ్చుకొని చర్మానికి చిల్లులు చేసి ఎములకు వణుకు పుట్టిస్తుంది. ఆంధ్రాలో అంతంత చలినే ఎరిగినవారు మరింత దగ్గరై కూచున్నారు. ఎంత కొత్తజంటైనా ఢిల్లీ చేరుకున్నరోజే స్వెటర్లు, షాల్ కొనాల్సి వచ్చింది.

మాట్లాడినపుడల్లా, శ్వాస వదలుతున్నపుడల్లా బయటకొచ్చే ఆవిర్లు ఘనీభవించడం వారికి తమాషాగా ఉంది. చిరుమేఘాల్ని చిన్నపిల్లల్లా చూస్తూ ముచ్చటపడిపోతున్నారు. అపుడపుడు వుఫ్ .... వుఫ్ .... మంటూ ఊదుతూ కంటికి కనపబడని ఆవిరి కళ్ళముందే రూపం దాల్చడం గమ్మత్తుగా ఉంది. ఢిల్లీ చేరుకున్నప్పటి నుండి ఈ 'ఆట'తో ఎంతో సరదా పడిపోయారు.

ఆమె స్వెట్టర్‌పైనుండి చుట్టుకున్న షాల్‌ను తీసి ఇద్దరికి వచ్చేట్టుగా ముందు నుండి కప్పింది. షాల్‌కింద నాలుగు చేతులు పోకిరి ఆట ఆడుకుంటున్నాయ్!

ఆటో ఐ.ఐ.టి. దాటి హైజ్‌ఖాస్ చౌరస్తా రాగానే కుడివైపు తిరిగి ఆగింది. మరో ఐదునిమిషాల్లో కుతుబ్‌మినార్ చేరుకోవచ్చు.

డబ్బులు చెల్లించి "షుక్రియా" అనబోతూ ఒక్కసారే నాలుక్కరుచుకొని ఆగి "ధన్యవాద్" అని డ్రైవర్‌కు చెప్పి కుతుబ్‌మినార్ ఆవరణ మేన్‌గేట్ వైపు దారితీసారు. హైద్రాబాద్‌లో 'షుక్రియా' చెప్పే అలవాటును ఢిల్లీవచ్చాక 'ధన్యవాద్'గా మార్చుకున్నాడు.

"డ్రైవర్‌కు షుక్రియా అని చెప్పినా అర్థమవుతుందిలే" అని కవ్వింపుగా ఆయనవైపు చూసిందామె.

"అబ్ దిఖావోఁ, యహాఁ పర్ క్యాహై" హిందీలో ఆయన్ను ఆటపట్టించడానికి అంది. జవాబు ఏ భాషలో చెబుతాడా అని ఆసక్తితో ఎదురు చూసింది.

"సబ్ దిఖాయేంగే మేమ్‌సాబ్" అంటూ కుడిచేత్తో ఆమె ఎడమ చేతినందుకొని మేన్‌గేట్ ఎడమవైపున్న కుతుబ్‌మినార్‌వైపు తిరిగారు.

"దేశంలోకెల్లా ఎత్తైన టవర్. 234 అడుగులు. భూమిదగ్గర దీని వ్యాసమెంతో తెలుసా? ..... 47 అడుగులు. ఇది పైకిపోయినకొద్ది క్రమేణ సన్నబడుతూ తొమ్మిదడుగు లవుతుంది ..... మొత్తం అయిదంతస్తులున్నాయి .... చూడు .... లెక్కపెట్టు....."

"వన్ .... టూ ...... త్రీ ..... ఫోర్ .... ఫైవ్ .... యస్ .... యూ ఆర్ రైట్ ... మీకెలా తెలుసు .... గైడ్‌గా బాగా సరిపోతావే....." అంటూ నవ్వింది.

"ఇంకా చెప్పు. నువ్వు చెబుతుంటే ఇంకా వినాలనిపిస్తుంది."

"నిజంగానా లేక ఆటపట్టిస్తున్నావా?"

"అబ్బ! నేనేం మాట్లాడినా నీకెపుడూ అంతే! ప్లీజ్ చెప్పవూ...."

"అయితే విను"

"ఐదంతస్తుల్లో మొదటి అంతస్తు వరకు మాత్రమే దర్శకుల్ని వెళ్ళనిచ్చేవారు. నేను కాలేజీ ఎక్స్‌కర్షన్‌లో వచ్చినపుడు చూసాను. మొదటి అంతస్తు నుండి మినార్ చివరను చూస్తే కదులుతున్న థ్రిల్ ఉండేది. ఆ అనుభూతి నాకింకా బాగా గుర్తుంది."

"ఆ తరువాత" ఆసక్తితో అడిగిందామె.

"కొన్ని సంవత్సరాలక్రితం స్కూలు పిల్లలు మినార్ లోపలున్నపుడు దురదృష్టవశాత్తు కరెంట్ పోవడంతో చీకట్లో భయాందోళనలు మితిమీరి స్టాంపేడ్‌కు దారితీసింది. దాంతో నలభైకి పైగా పిల్లలు చనిపోయారు. అప్పటి నుండి ఎవర్నీ లోనికి వెళ్ళనివ్వడంలేదు" మినార్‌వైపు పరీక్షగా చూస్తూ చెబుతున్నాడు.

కాని అప్పటికే ఆమె మినార్‌ను ఎగాదిగా చూస్తున్న అతని ముఖాన్ని అదేపనిగా చూస్తోంది. మినార్‌పై నుండి దృష్టి తను తెలియకుండానే ఎపుడో అతనిపైకి షిఫ్ట్ అయ్యింది. అతని కళ్ళలో కదలాడుతున్న మినార్‌ను తాను వెదుకుతుందా? లేక పొద్దున తొందరలో తీయకుండ ఉంచిన గడ్డాన్ని ఆశగా చూస్తూ రాత్రికది కలిగించే గరకు స్పర్శనూహించు కుంటుందా? మొత్తానికి అతను చెప్పే విషయాలను ఆమె చెవులు వినడం ఎపుడో మానేసాయి.

ఇదంతా గమనించి తను అవకాశం దొరికింది కదా అని ఒక్కసారే ఆమెను గిల్లాడు.

ఆమె కెవ్వుమంది. చిరుకోపాన్ని కూడా అభినయించింది.

"ఇంతవరకేం చెప్పానో ఓసారి చెప్పు చూద్దాం"

"ప్లీజ్ ...... ఇప్పటినుండి సరిగా వింటాను ...... సారీ ....."

"నో .... నో .... చెప్పేంతవరకు వదిలేది లేదు....."

"అయితే విను .... ఆఁ ..... కుబుత్‌మినార్ చార్‌మినార్ కన్నా ఎత్తైంది. దీన్నో రాజు కట్టించాడు ..... ఊఁ ..... ఇంకా ...... ఇంకా ....... ఇది ఢిల్లీలో ఉంది....."

"ఇంకా నయం. దీన్ని మనుషులు కట్టారని అనలేదు" తనకు ఇష్టమైన దుస్తుల్లో వున్న ఆమెను చూస్తుంటే ఇప్పుడు మైకం కమ్మడం తనవంతయ్యింది. మాట తప్పాడు.

"హబ్బీ ..... ముంగేరి లాల్ కే హసీన్ సప్నేలో మాదిరిగా లోకం మార్చావా? చలో .... చలో ..... ఇంకేమైనా చూపుతావా లేక మినార్ దగ్గరే మనం మినారెట్లమై పోదామా? చలో....." అంటూ అందరూ వెళుతున్నవైపు చేయిపట్టి లాగింది.

కుతుబ్‌మినార్ నుండి నిదానంగా వెళ్ళి కుడివైపు తిరిగి మెట్లెక్కి విశాలంగా స్టేజీలా

ఉన్న దానిపైకి వెళ్ళారు. ఓ పెద్ద ద్వారం. చుట్టంతా గోడలు. స్తంభాలు. మధ్యలో సమాధులు. రకరకాల నిర్మాణాలు అక్కడి పరిసరాల్లో ఉన్నాయి. ఇవన్నీ దర్శకుల్ని అంతగా ఆకర్షించవు. కాని విశాలావరణం మధ్యలో ఓ నల్లని లోహ స్తంభముంది. ఈ 'ఐరన్ పిల్లర్' చూడ్డానికి టూరిస్ట్ ఎంతో ఆసక్తి చూపుతారు.

ఆ జంట చేరేసరికి టూరిస్ట్‌లు పిల్లర్‌వద్ద గుమిగూడి ఉన్నారు. పరీక్షగా చూస్తే కొందరు పిల్లర్ చుట్టూ చేతులుంచడానికి హడావుడి పడుతున్నారు.

పిల్లర్‌కు వీపునానించి చేతుల్ని వెనకవైపు నుండి పిల్లర్ చుట్టూతా రెండువైపులా పోనించి చేతుల్ని తాకగలిగితే అదృష్టవంతులంటారు. మనసులో ఉన్న కోరికలు నెరవేరుతాయని కూడ అనుకుంటారు. అందుకేనేమో ఎక్కువమంది కుతుబ్‌మినార్ కంటే పిల్లర్‌ను చూడ్డంతో సరదాపడిపోతారు. పొట్టి చేతులవారు, పొడుగుచేతుల వారు, చిన్నా పెద్దా .... అందరూ తమ అదృష్టాన్ని పరీక్షించుకుంటారు. అందని చేతుల్ని జబర్‌దస్తీగా లాగి మరీలాగి శరీరాన్ని స్ట్రెచ్ చేసి చేతుల్ని కలిపే ప్రయత్నం చేయించడానికి అక్కడివారు సహాయపడుతుంటారు. ప్రాంతీయభేదం కాని కులాల పట్టింపులు కాని అక్కడ కానరావు. "అబీ జార్ ఏక్ ఈంచ్ గ్యాప్ హై" అంటూనో లేక "థోడాసా చాహియే" అంటూనో .... అందుకోలేకపోతే అదృష్టం చేయిజారిపోయినట్లు చింతించడం, చేతుల్ని తాకగలిగినవారేదో వినూత్న అనుభూతిని పొందడమో టూరిస్టుల ముఖాల్లో చక్కగా గమనించవచ్చు. కుర్రాళ్ళు, అమ్మాయిలైతే చేతులు కలవగానే కేకలు వేయడం, అరవడం ఎగరడం లాంటివి కూడ జరుగుతుంటాయి.

చిలిపివారు, హాస్యప్రియులు చేతుల్ని అందుకోలేకపోతే వెంటనే శరీరాన్ని తిప్పి పిల్లర్‌ను ముందునుండి చుట్టేసుకుంటారు. చేతులపుడు సునాయాసంగా కలుస్తాయి. "కిస్మత్ పీచేసే నహీఁ, ఆగేసే పహూంఛ్‌నా చాహియే!" అంటూ నవ్వుకుంటూ అక్కడున్నవారిని నవ్విస్తూ వెళ్ళిపోయేవారు కొందరుంటారు.

రంగురంగుల దుస్తుల్లో వివిధ ప్రాంతాలనుండి వచ్చిన టూరిస్ట్‌లు పిల్లర్ చుట్టూతా గుమిగూడి బహుభాషలు గుబాళిస్తుండగా ఆ ప్రదేశం చూడ్డానికి మినీభారత్‌లా ఉంది. దేశం నలుమూలల నుండి జనాన్ని ఒక్కచోటికి తెచ్చిన ఆ పిల్లర్‌ను చూసి ఆ జంట ఎంతో మురిసిపోయింది. 'అదృష్టాన్ని' పరీక్షించుకుంటున్న వారిని గమనిస్తూ ఆమె మరీ నవ్వుతుంది. ప్రయత్నిస్తున్న చేతుల కదలికలను ఆసక్తితో పరిశీలిస్తుంది. అతడు మాత్రం ఆమె నవ్వినపుడల్లా ముత్యాల్లాంటి పళ్ళవైపు, ఎరుపెక్కే చెక్కిళ్ళలో కనిపించే మందారాలను చూస్తున్నాడు. కాశ్మీరు నుండి వస్తున్న చల్లగాలులకు ఆమె ముంగురులకు అలజడిగా నాన్‌స్టాప్‌గా కదలుతూనే ఉన్నాయి.

ఇక తనవంతు వచ్చిందన్నట్టుగా అతనూ వెళ్ళాడు. పిల్లర్‌కు వీపు తగిలేట్టుగా, సిపాయిలా అటెన్షన్ ఫోజులో నిలబడ్డాడు. చేతుల్ని మెల్లగా వెనక్కు మళ్ళించాడు. ఆమె వన్‌డే క్రికెట్ ఆటలో గెలుపో ఓటమో తెలిపే చివరి బంతి కొట్టేందుకు సిద్ధంగా ఉన్న బ్యాట్‌మన్‌ను చూస్తున్నంత ఉత్కంఠతో రెప్పలార్చకుండ చూస్తోంది. చేతులు మెల్లగా, మెల్లమెల్లగా వెనక్కి కదులుతున్నాయి. గ్యాప్ క్రమేణా తగ్గుతుంది. ఆయన చేతులు నున్నని పిల్లర్ చుట్టూతా ప్రాకుతుంటే ఆమెకు ఒళ్ళంతా పులకరింతలవుతున్నాయి. తన నడుంమీదే చేతులు కదులుతున్నట్టనిపించి ఓసారి తడుముకుంది! తరువాత నవ్వుకుంది!!

గ్యాప్ తగ్గుతూ చివరకు చేతులు చక్కగా కలుసుకున్నాయి.

"వ్వాహ్..... గ్రేట్...." అని పిల్లర్ వదిలివస్తున్న ఆయన్ని అరచేతిలో స్టైలుగా విజయపూర్వకంగా తన చేత్తో చరిచింది.

"అయితే నువ్వు అదృష్టవంతుడివన్నమాట"

"అందుకేగా నీలాంటి భార్య దొరికింది"

"అచ్ఛాః!" అంది కొంటెగా. లోలోపల గర్వపడుతున్నా బయటకు కనబడనీయలేదు.

"ఇపుడు నీవంతు ..... నడు"

"నాకు చేతులు కలుస్తాయన్న నమ్మకం లేదు. కావాలంటే నిన్ను చుట్టుకుంటాను, ముందునుండి" అంది చిలిపిగా.

"ఆపని ఇక్కడ చేసేది కాదు" నడవమంటూ తొందర పెట్టాడు.

ఇబ్బందిగా వెళ్ళి పిల్లరుకానుకొని చేతుల్ని వెనక్కి పోనిచ్చింది. కలువలేదు. బెత్తెడుకుపైగా గ్యాపుంది. ఒళ్ళు విరిచి ప్రయత్నించింది. చేతివేళ్ళు సున్నితంగా టెంటకిల్స్‌లా కలుసుకునేందుకు వెలుతురులోనే వెతుక్కుంటున్నాయి. ప్చ్..... లాభం లేదు. ఇంకా గ్యాపుంది. ఆయన ఆమె రెండు చేతుల్ని పట్టుకొని అదృష్టసీమలోకి తీసుకెళ్ళేందుకు తటాలున లాగాడు. ఆమె వక్షం ఒక్కసారే ముందుకు పొడుచుకుంది. గాలికి చైతన్యం వచ్చినట్టుంది. రయ్‌మని ముందుకు వీస్తూ పోయింది. అదృష్టం అందనంటుంది. అంగాలు అంతకు మించి స్ట్రెచ్ కానంటున్నాయి!

"ముందునుండి అందుకోనా?" అంటూ తిరిగింది.

"ఆపని మాత్రం చేయకు. ప్లిలర్‌కు ప్రాణమొస్తుందేమో?" సూటిగా కళ్ళలోకి చూస్తూ అన్నాడు.

"ఈ పిల్లర్ ప్రత్యేకత మరోటుంది, తెలుసా?"

"ఏంటది. కాస్సేపు అక్కడ కూచుందాం నడు" కొద్దిదూరంలో ఉన్న రాళ్ళగోడ వైపు చేయిపట్టుకొని లాగుతూ తీసుకెళ్ళింది.

"ఇపుడు చెప్పు. పిల్లర్ గురించి ఇంకా ఏమో చెబుతానన్నావ్" గోముగా అడిగింది.

"ఈ పిల్లర్ ఎన్నో వందల సంవత్సరాల నుండి చెక్కుచెదరకుండా త్రుప్పుపట్టకుండ ఉంది. ఏలాంటి కప్పులేకుండా ఎండల్లో, వానల్లో శతాబ్దాల కొద్దీ ఇలాగే ఉంది. ఈ పరిశీలన ఆధారంగానే మనదేశం ఆకాలంలో లోహశాస్త్రం, దాని సంబంధిత విజ్ఞానంలో ఎంతో ముంధుండేదని చెప్పుకుంటారు. దీనికి నిదర్శనమే మనకళ్ళ ముందుండి శాస్త్రజ్ఞులతో సవాల్ చేస్తుంది ఈ పిల్లర్! ప్రకృతి వైపరీత్యాలను తట్టుకునే ఇంతటి మహత్తర శక్తి ఉన్న ఈ లోహపు కంపోజిషన్ను తెలుసుకోవడానికి సైంటిస్టులు పిల్లర్ నుండి సాంపిల్స్ తీసుకెళ్ళి విశ్లేషించారు. ఘటకాలను కూడా తెలుసుకున్నారు.

ఆసక్తిగా వింటోందామె.

"ఏయ్! ఓ మాంచి ఆలోచన. నిన్ను కాలేజి రోజులనుండి చూస్తున్నాను. ఇప్పటికి ఎనిమిది సంవత్సరాలు కావస్తుంది. అప్పటికి, ఇప్పటికి నీ అందం చెదరకుండ కందిగింజలా అలాగే ఉంది. నీ శరీరం నుండి కూడ కొంత సాంపిల్ తీసి జెనిటిక్ ఇంజనీర్‌కో లేక

డి.యన్.ఎ. సైంటిస్ట్‌కో ఇచ్చి నీ అందం వెనకాల ఉన్న చిదంబర రహస్యమేమిటో తెలుసుకోవాలి.''

''కొయ్ రాజా కొయ్ .... అందర్నీ నాలా తయారుచేస్తూ పోతే మొగుళ్ళకు పెళ్ళాల్ని వెతుక్కోవడం కష్టం కాదటోయ్ .... మా చెల్లిని నా పక్కన నిలబెడితే నీ పెళ్ళాం ఎవరో తెలుసుకోలేక గాబరాపడతావ్. జెనిటిక్స్ చదువుకోలా ..... జీవరాశుల్లో వైవిధ్యం అవసరమని...' ' అంటూ ముక్కుకొనని సుతారంగా ఊపి ఓ ఫోజు పెట్టిందామె.

ఆయన మృదువుగా అమె తొడను నొక్కుతూ ''లే.... ఇంకా కొంత చూసేదుంది' ' అంటూ లేచాడు.

ఇద్దరు పిల్లర్‌ను దాటి నిదానంగా పోయి మెట్లుదిగి రాళ్ళ మధ్యనుండి నడుస్తూ 'అలైమినార్' వైపు నడిచారు.

''గైడ్ సాబ్! ఇదేంటో చెప్పండి'' అంటూ తనను టీజ్ చేస్తున్నాననుకొని గిల్లుతాడేమోనని మొదలే దూరంగా జరుగుతూ నవ్వుల్ని వెదజల్లింది. ఏమాటకు ఎలాటి ప్రతిస్పందన వస్తుందో ఇరువురు ఒకరినొకరు బాగా అర్థం చేసుకున్నారు.

అంతా గమనించి నవ్వుకుంటూ ''పహలే ఇస్కో పడో'' అని ఓ రాయి ఫలకంపై రాసిఉన్నచోటికి రమ్మని చేయి అందించాడు.

ఒకసారెపుడో తన ఇంగ్లీషు ఉచ్చారణ స్టైల్‌గా ఉంటుందని అన్న విషయం గుర్తుకొచ్చి ఆయన్ని ఇంప్రెస్ చేయడానికి బిగ్గరగా చదువుతుంది.

"Alaid Minar : This unfinished Minar with its extant height of 24.5 Metas commenced by Alauddin Khilji (AD 1296 - 1316). It had hardly reahced its first storey when he died. He had conceived this Minar to be double the height of the Qutub Minar....."

ఫలకానికి పక్కనే ఉన్న అలైమినార్‌ను ఎక్కువమంది పట్టించుకోరు. గమనించినా అసంపూర్ణ నిర్మాణాన్ని చూసేందుకు ఆసక్తి చూపరు. కొద్దిగా శ్రమపడి పైకి ఎక్కితే లోపలికెళ్ళి చూడవచ్చు.

అవసరానికి మించిన ఆసరాతో చేతులందించుకుంటూ అమె ఆయన సహాయంతో అలైమినార్ లోపలికెళ్ళగలిగింది. లోపల ఎవరూ లేరు. ఎంతోసేపటినుండి రాజుకుంటున్న 'వెర్రి' పెల్లుబికి తటాలున ఆమెను ముద్దుపెట్టుకొన్నాడు. మరొకటి ..... ఆపై మరొకటి ... క్షణాలు గడిచాయి. ఎవరో వస్తున్న అలికిడి విని అలైమినార్ అంతర్భాగం చుట్టూతా నడిచి 'దర్గా' కిందికి దిగారు.

అలైమినార్ దగ్గర్లో ఉన్న లాన్‌పై కాసేపు కూచోని చుట్టంతా చూసుకుంటూ ముచ్చట్లలో పడ్డారు.

ఎక్కడినుండో స్కూలుపిల్లల గుంపొకటి అలైమినార్ వైపు వచ్చింది. వాతావరణమంతా హాయిగా తయారయ్యింది. ఇక వెళ్ళడానికని లేచి కుతుబ్‌మినార్ ఆవరణ నుండి బయటపడ్డారు.

చలిగాలులు తమకేమి పట్టనట్లుగా వీస్తూనే ఉన్నాయ్!

★ ★ ★

న్యూఢిల్లీ రైల్వే స్టేషన్ జనంతో కిటకిటలాడుతుంది. హైద్రాబాద్‌కు బయలుదేరే ఆంధ్రప్రదేశ్ ఎక్స్‌ప్రెస్ బయలుదేరే సమయానికి నలభై నిమిషాల ముందొచ్చింది.

గుండెనిండా తీపి అనుభవాలతో నింపుకున్న ఆ జంట ఏసీ బోగీలో సామానంత సర్దుకొని అంటుకొని కూచున్నారు. హైద్రాబాద్‌లో కాపురం పెట్టబోయే ఆ జంటకు ఢిల్లీ అనుభవాలు మంచి పటిష్ఠతను చేకూర్చాయి. ఒక సంసారం సునాయాసంగా టేకాఫ్ తీసుకోవాలి మరి! చిత్రవర్ణాల్ని నింపుకున్న ఆ గుండెలు ఆంధ్రాలో ఇంద్రధనస్సుగా బహిర్గతమయ్యేందుకు గంటలు లెక్కబెడుతున్నాయి.

ఇంకో పదిహేనే నిమిషాలుంది, ట్రయిను బయలుదేరడానికి.

* * *

శ్రీధర్ పైచదువులకు అమెరికా వెళ్ళేందుకు ఢిల్లీలో పనులన్ని పూర్తిచేసుకొని వెళ్ళేముందు తల్లితండ్రుల్ని కలుసుకునేందుకు అదే ట్రయిన్‌లో హైద్రబాద్ బయలుదేరాడు. ఇంకో పదిరోజుల్లో బోస్టన్‌లో ఉంటాడనని ఊహించుకుంటూ తాను దీనికోసం ఎంత ప్రయాసపడాల్సి వచ్చిందో పునరావృతం చేసుకుంటున్నాడు.

ప్రొఫెసర్ కేశవరావు ఢిల్లీలోని ప్రముఖ పరిశోధనా సంస్థ నుండి రిటైర్మెంటు తీసుకొని కుటుంబంతో సహా ఆంధ్రాలో స్థిరపడడానికి అదే ట్రయినులో ప్రయాణం చేస్తున్నాడు. బంధుమిత్రులకు దగ్గరలో ఉండబోతున్నందుకు అందరికీ సంతోషంగా ఉంది.

రమణమ్మ తనకొచ్చిన వ్యాధికి ఆంధ్రాలో సరైన చికిత్స దొరక్కపోతే ఓ తెలిసిన యం.పి. సహాయంతో ఢిల్లీలోని ఏ.ఐ.ఐ.యమ్.యస్.లోని డాక్టర్ల పుణ్యాన మామూలు మనిషయ్యింది. మనమడితో ప్రయాణం చేస్తున్న రమణమ్మకు ఎపుడెపుడు ఆంధ్రా చేరుకొని తన పిల్లల్ని ఎపుడెపుడు చూసుకుంటానన్న కుతూహలం ఎంత ఆపుకుందామన్న ఆగడంలేదు.

ఇలా ఎందరో ఎవరి పనులమీద వారు ఆరోజటి ఏ.పి. ఎక్స్‌ప్రెస్‌లో తమ తమ సీట్లలో కూచోని అపుడపుడు వాచీలను చూసుకుంటున్నారు. ఒక్కొక్క ప్రయాణికుడిది ఒక్కో రసవత్తరమైన కథావస్తువు కావచ్చు. చేయి తిరిగిన రచయితకు ఈ కథావస్తువులు ఓ ఖజానా. పాఠకుల్ని అదృష్టవంతులుగా చేయవచ్చు. నిరాశ నిస్పృహలతో ఉన్నవారికి ముఖ్యంగా యువతకు శ్రీధర్ కథతో జీవితంలో పైకొచ్చి అమెరికాకు ఎలా చేరుకున్నాడో చెప్పగలడు. ప్రొ. కేశవరావు దినం-రాత్రనకుండా పరిశోధనచేసి దేశానికి ఎంతపేరు తెచ్చింది, ఎన్ని అవార్డులు స్వీకరించింది తెలుపుతు ప్రేరేపించ గలడు. జీవితం బతకడానికని, దానికోసం ఎన్నెన్నో కష్టాలుపడి అంతు తెలియని రోగాలనుండి ఎలా బయటపడిందీ తెలిపి, చనిపోయిన వారికి కూడా బ్రతికే ఆశకల్పించేటట్లుగా రమణమ్మ కథతో చెప్పవచ్చేమో? ఇలా ఎందరో, ఎందరెందరివో వైవిధ్యం గల విలువైన అనుభవాలను నింపుకున్నవారిని మోస్తుందా ట్రయిను ఆరోజు.

* * *

ఇంకో ఐదు నిమిషాలు .... నాలుగు ... మూడు .... రెండు ...... ఒకటి ..

పచ్చ జెండా ఊగింది

ట్రయిను కదిలింది.

ఆ ట్రయిన్‌లో నాలుగు బోగీల్లో నాలుగు బ్రీఫ్‌కేసులున్నాయి. వీటికి సంబంధించిన

మనుషులు మాత్రం ట్రయిన్‌లో లేరు. బ్రీఫ్‌కేస్‌లోని గడియారాలు చేసే టిక్.... టిక్.... శబ్దం ఎవ్వరికీ వినిపించడం లేదు. వినిపించదు కూడా.

కడ్ కడ్ కడ్ కడ్ .... ట్రయిను స్పీడుగా పోతోంది. టైముకే బయలుదేరిందని ప్రయాణీకుల ముఖాలపై తృప్తి.

కడ్ కడ్ కడ్ కడ్......

టిక్ .... టిక్ .... టిక్ .... టిక్ ..... గడియారాలు బ్రీఫ్‌కేసుల్లో తమ విధులను నిర్వర్తిస్తున్నాయి. వాటికి తెలియదు, ఆరున్నరకు తమ ఉపయోగం తీరుతుందని .... కాలం చెల్లుతుందని .....

కడ్ కడ్ కడ్ కడ్ ....

టిక్ టిక్ టిక్ టిక్ .....

ఆరు గంటల ఇరవై తొమ్మిది నిమిషాలు. ఇంకా అరవై సెకన్లు ...... యాభై తొమ్మిది .... యాభై ఎనిమిది ......

కడ్ కడ్ కడ్ కడ్ ..... ట్రయిను స్పీడు ఎపుడో పుంజుకుంది.

టిక్ టిక్ టిక్ ......

గడియారాలు లయ తప్పకుండా పనిచేస్తున్నాయి.

ప్రయాణీకుల గుండెలూ లయ తప్పకుండా కొట్టుకుంటాయి.

సరిగ్గా ఆ ..... రు ..... న్న ...... ర .....

ఢాం...! ఢాం....!! ఢాం....!!! ఢాం.....!!!!

ఒకేసారి నాలుగు బోగీల్లో టైంబాంబులు ప్రేలిన చప్పుళ్ళు.

ఆంధ్రులు గర్వపడే ట్రయిను బోగీలు చెల్లాచెదరయ్యాయి!

జీవితాలు గాలిలో కలిసిపోయాయి!!

డీరైల్‌మెంట్ ... ఆకాశం నుండి అగ్గిపెట్టెల్ని విసిరేసినట్టుగా పడి ఉన్నాయి బోగాలు. అష్టవంకర్లు తిరిగిన బోగీలతో ఆ స్థలమంతా అస్తవ్యస్తంగా ఉంది.

మంటలు .......

మారణకాండ ....

ఓ జంట ..... ఓ శ్రీధర్ ..... ఓ కేశవరావు ..... ఓ రమణమ్మ ..... ఓ అబ్దుల్ ..... ఓ థామస్ ..... ఓ జోగిందర్ సింగ్ ..... ఎందరో ..... ఇంకా ఎందరో ..... ఎందరెందరో .....

అర్ధాంతరంగా ముగిసిన జీవితాలు. టెర్రరిజం గిల్లేసిన కొమ్మలూ, రెమ్మలూ.

★ ★ ★

పార్లమెంటు భవనంపై మన జాతీయపతాకం తనకేమి పట్టనట్టుగా గాలికి పోటీపడి మరీ రెపరెప లాడుతుంది.

డా॥ టి. సంపత్ కుమార్, ఇంటి నెం. 18-డి/1 (జి.ఎఫ్.),
జైసరాయ్, ఐటిఐ దగ్గర, న్యూఢిల్లీ - 110016

# పెసిమిస్ట్

'ఒరేయ్ రాజా. ఉన్నావంటరా' అంటూ సుడిగాలిలా గదిలోకి దూసుకువచ్చాడు అనంతంగాడు. వచ్చీ రావడంతోనే "ఒరేయ్! నేను నీహారికను ప్రేమిస్తున్నానురా" అంటూ ఓ స్టేట్‌మెంట్ పారేసాడు. "నీహారిక లేకపోతే నేను బతకలేనురా. ఆమె నన్ను కాదంటే ఆత్మహత్య చేసుకుంటాను" అంటూ మరో స్టేట్‌మెంట్ పారేసేడు. దానితో నాకు చిర్రెత్తుకొచ్చింది. ఇదుగో ఈ రకం 'అతి' గాళ్ళంటేనే నాకు మొదట్నుంచీ మంట. మనుషులు అసలు అంత అతిగా ఎందుకుంటారో నాకు అర్థమయేది గాదు. ఆ పిల్ల ఎవరో మరీచికో, నీహారికో ప్రేమించకపోతే వీడెందుకు చావడం?' పరీక్షలో పాసవకపోతే చావడం, ఉద్యోగం రాకపోతే చావడం - అసలు ఇదంతా నాన్సెన్స్ అనిపిస్తుంది నాకు.

దేనికైనా జరిగితే జరుగుతుంది, లేకపోతే లేదు అనుకుని సిద్ధపడి ఉండాలనేది నా తత్వం. జరిగిందా! మంచిదే. జరగలేదూ. నష్టమేం లేదు. నెక్స్ట్ టైమ్ బెటర్ లక్

అనుకునే ధోరణి వీళ్ళకెందుకు అలవడదో నాకు చచ్చినా అర్థం కాదు. నేనే ఇంత మంచిగా తామరాకు మీద నీటిబొట్టులా ఆలోచిస్తానా మా ఫ్రెండ్స్ వెధవలు అందరూ నన్ను "వీడా! గొప్ప పెసిమిస్ట్ గాడు" అంటూ తిట్టేవారు.

మొదట ఆమాట ఇంటర్‌లో ఉండగా అనుకుంటా అనిపించుకున్నాను. ఓరోజ నేనూ, మా ఫ్రెండ్స్ ట్యూషన్‌కు వెళుతున్నాం. ఎగ్జామ్స్ ఇంకో రెండు నెలల్లో ఉన్నాయి. సినిమాలూ, ఫ్రెండ్స్, ఇంటర్ కదా హీరోలయి పోయామని దొంగచాటుగా అలవాటు చేసుకున్న సిగరెట్లు, అమ్మాయిల్ని ఏడిపించడం - ఇవన్నీ అయేటప్పటికి బుర్రలో ఉన్నది కూడా ఊడ్చిపెట్టుకుని పోయింది. పరీక్ష సున్న చుడితే ఈడ్చి తతంతానని బెదిరించాడు మా నాన్న. అదే ఆలోచిస్తూ వాడితో యాధాలాపంగా అన్నాను.

"పరీక్షలు ఎలా రాస్తామో, ఏమోరా. తప్పుతామేమోనని భయంగా ఉంది" అని.

వాడు నావంక చురుక్కున చూశాడు. చూసి "నువ్వో పెసిమిస్ట్ గాడివిరా. నువ్వు తప్పుతావేమో నాకు తెలీదు గానీ నేను మాత్రం తప్పకుండా పాసవుతాను" అనేశాడు పుటుక్కున.

చెప్పొద్దూ ఆ మాటతో నాకు వళ్ళు మండింది. నేను ఏదో యాధాలాపంగా అంటే వాడంత మాట అనేయాలా అని. అయినా గొప్ప విశాల హృదయంతో ఆ మాట అన్నా వాడిని క్షమించేసి ఊరుకుని నా ఉదారత్వానికి నేనే మురిసిపోయాను.

అయితే వాడు నన్ను పెసిమిస్ట్ అన్నందుకు మాత్రం ఉడుక్కున్నాను. హు! వాడేదో వాడిది ఆశావాదం అనుకుని మురుస్తున్నాడు కాబోలు. తర్వాత ఇట్లాంటి వాళ్ళే బోర్లాపడుతారు అనుకున్నాను కసిగా. అంతేకానీ అప్పుడు కూడా వాడు తప్పాలని నేనేం కోరుకోలేదు.

పరీక్షలు అయిపోయి రిజల్ట్స్ వచ్చాయి. నేను బొటాబొటీ ఫస్ట్‌క్లాస్ తెచ్చుకున్నాను. వాడు ఇంగ్లీష్‌లో తప్పాడు. రిజల్ట్స్ చూసి నా థియరీకి అప్పుడే శ్రీకారం చుట్టాను. అయితే మావాడు మాత్రం నన్ను తెగ తిట్టాడు. నాది అపశకునం నోరంట. నేను తప్పుతాం అనబట్టే వాడు తప్పాడుట.

అదుగో ఆ సంఘటనతో నేను ఒక కొత్త సిద్ధాంతం నేర్చుకున్నాను. అనవసరంగా ఏదీ అతిగా ఊహించుకోకూడదు. ఊహించుకుంటే ఎదురు దెబ్బలే. ఆత్మహత్యలే. సుఖాలు వస్తే పొంగిపోకూడదు. కష్టాలు వస్తే కుంగిపోకూడదు. అన్నీ మన మంచికే అనుకోవాలి అని.

కొంచెం పెద్దయ్యాక తెల్సింది. కృష్ణభగవానుడు కూడా 'గీత'లో అదే చెప్పాడంట అని. ఆ లక్షణాన్నే 'స్థితి ప్రజ్ఞత' అంటారని ఓరోజు ఘంటసాల గారి గీతవిని తెల్సుకుని ఆహా! కృష్ణుడంతటివాడే నామాట ఔనన్నాడని మురిసిపోయాను. "కర్మణ్యే యధికారస్తే మా ఫలేషు కదాచన" అనే శ్లోకం అర్థం తెలుసుకుని నా థియరీని నాకన్నా ముందే ఎవరో కొట్టేసి రాసేసారని బాధగా ఉండేది మొదట్లో. ఆ ఇంటరు ఫ్రెండు అప్పుడప్పుడు రోడ్డుమీద ఆసరాగా తిరుగుతూ కనిపించి నా థియరీని మరింత గట్టిపరచిచేవాడు.

అందుకే ఎవరేమనుకున్నా నేను చలించేవాడిని కాదు. ఏదన్నా కష్టం వస్తే తెగ బాధపడి ఆరాటపడేవాళ్ళని, అన్ని ఆనందాలకే పొంగిపోయి ఆకాశం అంచులోకి చూసేవాళ్ళను

చూసి జాలిపడేవాడిని. వీళ్ళు ఎప్పటికి బతకడం నేర్చుకుంటారా? ఇట్లా బఫూన్లలా అన్నిటికీ తలకిందులైపోయి ఏడవడం, నవ్వడం ఎప్పుడు మానుకుంటారా అని. ఒకరిద్దరు ఫ్రెండ్స్‌ని నాలా 'బాలెన్స్‌డ్'గా మారుద్దామని ప్రయత్నించాను కానీ మిగతా వెధవలు పడనిచ్చారుకాదు. వాడో పెస్సిమిస్టురా. వాడి జోలికిపోతే మీ గతి అంతే. ఎందుకూ పనికిరాకుండా ఎక్కడేసిన గొంగళి అక్కడే అన్నట్టు ఉండిపోతారని బెదిరించేవాళ్ళు. దానితో నా ప్రయోగం బెడిసికొట్టింది.

డిగ్రీలో నాకో ఫ్రెండ్ ఉండేవాడు. ఎప్పుడూ తెగ వాగుతుండేవాడు. ఉన్నవీ, లేనివీ కల్పించి తెగ కోస్తుండేవాడు. అవడానికి తెలివైనవాడే కానీ, ఈ లక్షణాలన్నీ చూసి మా ఫ్రెండ్స్ వాడిని "ఊదరగాడు" అని పిలిచేవాళ్ళు.

డిగ్రీ పరీక్షలయ్యాక వాడూ, నేనూ బ్యాంక్ పరీక్షలు రాయాలనుకున్నాం. మా ఊళ్ళోనే కోచింగ్ కూడా తీసుకుని అంకెల్ని బ్రహ్మాండంగా రుబ్బేయడం మొదలుపెట్టాం. వాడు అప్పటికే ఓసారి బ్యాంక్ పరీక్ష రాశాడు. నేను అదే మొదటిసారి అయినా నా థియరీ నాకు ఉండనే ఉంది కదా వస్తే వస్తుంది, లేకపోతే లేదు అని. అందుకే నేనంతగా ఆశలేం పెట్టుకోలేదు.

కానీ మా ఊదరగాడికి తనమీద, తన తెలివితేటల మీద తనకి బోలెడు నమ్మకం. ఈసారి తనకి సెలక్షన్ రావడం ఖాయమని బల్లగుద్ది మరీ చెప్పేవాడు. అది మా బల్ల కావడంతో నేను ఆపని చేయకపోయినా నీకు రాకపోతే ఎవడికి వస్తుందిరా అని పైకి నచ్చచెప్పేవాడిని.

ఇద్దరం బ్యాంక్ పరీక్షలు రాశాం. రిజల్ట్స్ వచ్చాయి. ఇద్దరం పాసయ్యాం. ఇక ఇంటర్వ్యూనే మిగిలింది. మావాడు నేనుకూడా పాసవ్వడంతో బోర్డువాళ్ళ తెలివితేటల మీద కొద్దిపాటి అపనమ్మకం వ్యక్తం చేసినా నేనేం పట్టించుకోలేదు. చివరకు ఎదురుచూసిన ఇంటర్వ్యూ ముగిసింది. ఇంటర్వ్యూ అవగానే బైటకు వచ్చి నా చేతులు పట్టుకుని ఊపేస్తూ సక్సెస్, గ్రాండ్ సక్సెస్ అని ఆనందంతో గంతులు వేశాడు.

వాడి ఆనందం చూసి వాడికి ఉద్యోగం రావచ్చనే బాధతో ఏమూలో ఏడ్పువచ్చినా సర్దేసుకుని పైకి ఆనందించినట్టు మొహం పెట్టాను. తర్వాత నా ఇంటర్వ్యూ కూడా అయిపోయింది.

తిరిగి వచ్చేటప్పుడు బస్సులో తను ఇంటర్వ్యూలో ఎలా అదరగొట్టిందీ వాళ్ళు ఒకటి అడిగితే తను మూడు ఎలా చెప్పిందీ, వాళ్ళు మూడు అడిగితే తాను ఆరు ఎలా చెప్పిందీ ఆ గొడవంతా చెప్పుకొచ్చాడు. ఇంటర్వ్యూ చేసే వాళ్ళలో ఒకడు ఒక సుత్తి ప్రశ్న వేశాడుట. "ఎమ్టీ వెసెల్స్ మేక్ మచ్ నోయిస్" అంటే ఏంటీ అని.... చెప్పొద్దూ నాకు ఆ అడిగినాయన సమయస్ఫూర్తి చూసి భలే ముచ్చటేసింది. మా ఊదరగాడిని ఐదు నిమిషాల్లో అంచనావేసి దెబ్బకొట్టడం మాటలా మరి.

కానీ మావాడు మావాడే. మహా వాగుడు గాడు కదా. అప్పటికీ ఆయన అర్థం గ్రహించి నోరు అదుపులోకి తెచ్చుకోకుండా "అది ఓ ఇంగ్లీషు సామెతండి. అలాంటిదే ఆంగ్లంలో మరోటి ఉంది. తెలుగులో కూడా ఇంకో సామెతుంది. అలాంటిదే ఇది కూడా' ' అని మొదలుపెట్టి అనర్గళంగా దంచేస్తే వాళ్లు డంగైపోయి చూశారు (?) అని చెప్పుకొచ్చాడు.

చెప్పొద్దూ. నాకు ఆ క్షణంలోనే అనుమానం వేసింది. మావాడు వాళ్ళను కూడా ఊదర గొట్టివేశాడు, వాళ్ళు వీడిని చస్తే సెలక్టు చెయ్యరు అని.

ఆరకంగా మా ఊదరగాడి ఇంటర్వ్యూ కొండెక్కవచ్చేమోనని నాకు తేలింది. కానీ ఆ మాట అనడానికి నోరు రాలేదు. అక్కడికీ ఇన్‌డైరెక్టుగా అని చూశాను. "పోతే పోనీ, వస్తే వస్తుంది. లేకపోతే లేదు. మళ్ళీ ఇంకో ఎగ్జామ్ ఉంది కదా. దానికి సీరియస్‌గా ప్రిపేర్ అవుదాం ఇప్పట్నించే" అని.

మావాడు నన్నుత్త ఫూల్‌ని చూసినట్టు చూశాడు. "ఇది ఖచ్చితంగా వస్తుందిరా. రాకపోతే చూడు" అన్నాడు గొప్ప విశ్వాసంతో. అని ఊరుకోకుండా "నీలాంటి పెసిమిస్ట్ గాడిని కదిలించడం నాదే బుద్ధి తక్కువ" అనేశాడు.

తర్వాత నెలా రెండు నెలలూ అదే కలలతో బతికాడు. వాడి కలలు చూసి పాపం వాడికి ఉద్యోగం రావాలనే నేనూ మనస్ఫూర్తిగా కోరుకున్నాను. అయితే నాకు ఉద్యోగం వస్తే నాలుగు కొబ్బరికాయలు (కాస్త ఎక్కువే అనిపించినా ఉద్యోగం వస్తే అదో లెక్కలోది కాదు కాబట్టి అని సర్దేసుకుని) కొడతానని మొక్కుకున్నాను. కాని మావాడికి వస్తే కొడతానని మొక్కుకోవడం మరీ ఫూలిష్‌నెస్, బీసీనాటివాడు చేయాల్సిన పని అని చేయలేదు.

పైగా మొక్కుకున్నా అది మావాడికి చెప్పడానికి కుదరదు. ఎందుకంటే నేను దేవుడు లేడు, గీవుడు లేడు అంతా నాన్సెన్స్ అంటుండేవాడిని ఎప్పుడూ. అయితే అన్నవెంటనే మనసు లోపల చెంపలేసుకుని నువ్వు లేకపోతే సరేగానీ, ఉంటే గనుక నన్ను క్షమించేసెయ్ స్వామీ అని భక్తిగ కళ్ళు మూసుకునేవాడిని.

"స్వామీ! నువ్వు కనుక నిజంగా ఉంటే నన్నీ పరీక్ష గట్టెక్కించు. అప్పుడు నువ్వున్నావని నమ్ముతాను. నీకు నాలుగు కొబ్బరి కాయలు కొడతాను. లేకపోతే నువ్వు లేనట్టే లెక్క. కొబ్బరికాయలు కొట్టను" అని బెదిరించేవాడిని. టూబర్డ్స్ ఎట్ వన్ షాట్ అంటారు. అదన్నమాట. ఏది జరిగినా నాకే లాభం. ఉద్యోగం వస్తే మంచిదే. లేకపోతే దేవుడికి కొబ్బరికాయలు కొట్టనక్కరలేదు. దేవుడు లేడని, ఉన్నా మనకి సాయం చేయలేడని తేలిపోయింది గదా. ఇంక పాపపుణ్యాల గురించి భయం లేదుగదా అని ధైర్యం తెచ్చుకునే వాడిని.

ఈ జీవితంలో నాకు ముచ్చట కలిగించే మరో విషయం కూడా ఉంది. అది ఇదే. మనం మనసులో ఏమనుకుంటున్నామో అది మన ఎదుట ఉన్నవాడికి కూడా తెలీక పోవడం. నిజంగా అది ఎంత వరమో అది లేకుండా పోతే తప్ప తెలీదు. అబద్ధాలు చెప్పకుండా పై అభిప్రాయంతోనూ, ఇంట్లో పెళ్ళాలతోనూ (బహువచనం కాదు, కంగారుపడకండి. జనరల్‌గా అనేస్తున్నాను కదా. అందరికీ వర్తిస్తుంది) ఎలా వాగగలం? అందుకే నేను మురిసిపోయేది.

ఆ ఏం చెబుతున్నానూ బ్యాంకు పరీక్ష సంగతి కదా. తర్వాత మా ఇద్దరికీ పరీక్ష తన్నేసింది. మా ఊదరగాడు ఆ దెబ్బతో మరిక కోలుకోలేక పోయాడు. అంతవరకూ వాడిమీద ఆశలు పెట్టుకున్న వాడి తల్లి ఈ విషయం తెలియగానే మనోవ్యాధితో మంచమెక్కింది. ఆవిడకు సమాధానం చెప్పకోలేక, మొహం చూపించలేక వాడు ఇల్లు విడిచి పారిపోయాడు. తర్వాత ఎక్కడో కాలవలో శవంగా తేలితే మా ఊరివాళ్ళు చూసి

గుర్తుపట్టారు.

వాడు అలా భయంకరంగా మృత్యువాత పడడం నా మనసుమీద గట్టి దెబ్బ తీసింది. వాడి కళ్ళల్లో రెపరెపలాడే ఆశ నన్ను ఎప్పుడూ పలకరిస్తున్నట్టుండేది. ఆ ఆశే వాడి కొంపముంచింది అని. అలాంటి సందర్భాల్లో నాలో నేనే గొణుక్కునే వాడిని. తర్వాత నేను పట్టుబట్టి బ్యాంకు పరీక్ష రెండోసారి పాసయినా, ఉద్యోగం తెచ్చుకున్నా మా ఊదరగాడు గుర్తుకొచ్చినప్పుడల్లా గుండె చెరువైపోతుండేది. ఊదరగాడు చనిపోవడంతో జీవితంపైన నిర్లిప్తత మరింత పెరిగింది. ఏది చూసినా అన్నీ బుద్బుదప్రాయమే అనిపించింది.

ఒకటి రెండుసార్లు వాళ్ళ దగ్గరా వీళ్ళదగ్గరా "జీవితం అంటే ఏంలేదు. అంతా వట్టి మాయ, మోసం, భ్రాంతి. అంతే. మన కోరికలు కూడా మాయే. మనం వాటి దగ్గరకు వెళితే అవి దూరంగా పోతాయి. మనం దూరంపోతే అవి మన వెంటపడతాయి' ' అని వేదాంతం వల్లించబోయి ఈ వయస్సులో ఈ మెట్ట వేదాంతం నేర్చుకుంటే ఇక బాగుపడ్డట్టే అని ముక్క చీవాట్లు తిని ఆ ప్రయత్నం విరమించుకున్నాను.

ఇంతకీ నేను ఏం చెబుదామని మొదలు పెట్టాను. మా అనంతం గాడి ప్రేమకథ కదూ. సారీ ఫర్ ది డైవర్షన్. వాడు ఆ పిల్ల మరీచిక సారీ నీహారిక లేకుండా బతకలేనన్నాడు కాదూ. దానికి చెప్పుకొచ్చాను ఇదంతా. అసలు ఈ ప్రేమంతా మరో అద్భుతమైన మాయ. ఇప్పుడు మావాడినే చూడండి. ఆ అమ్మాయి లేకపోతే బతకలేనన్నాడా? రేపు ఆ అమ్మాయి వీడిని కాదంటే వీడేమీ అంత తేలిగ్గా చావడు. ఎల్లుండి నుంచే మరో అమ్మాయి కోసం ప్రయత్నించడం మొదలుపెడతాడు అనుకున్నా.

కానీ మావాడు ఎంత మారిపోయాడంటే ఇంక వాడికి బాహ్యస్మృతి అనేది లేకుండా పోయింది. ఇరవై నాలుగ్గంటలూ నీహారిక జపమే. ఆమె జ్ఞాపకాలు, కబుర్లు తప్ప మధురమైంది మరోటి లేదు. ఆ అమ్మాయికి తనంటే ఎంత ఇష్టమో, తనకి ఆ అమ్మాయంటే ఇంకెంత ఇష్టమో, ఆ అమ్మాయి ఎంత ఆర్టిస్టుగా లెటర్ రాస్తుందో, ఎంత సెన్సిబుల్‌గా ఆలోచిస్తుందో, గడ్డిపరకలమీద మెరిసే సూర్యకాంతిని చూసి ఎంత ముచ్చట పడుతుందో ఇలా ఏమిటేమిటో తెగ చెబుతుండేవాడు.

రానురాను వాడి కబుర్లు వింటుంటే, అవి చెప్పేటప్పుడు వాడి మొహంలో కనిపించే ఆనందం చూస్తుంటే ఒకరకమైన భయం పట్టుకుంది నన్ను. ఒకవేళ రేపు వాడి పెళ్ళి జరక్కపోతే? వాడు ఏం అఘాయిత్యం చేస్తాడో. ముందు వాడిని హెచ్చరించుదామనిపించింది. స్నేహితుడిగా అది నా ధర్మం అనుకున్నాను.

అందుకే ఓరోజు వాడితో అన్నాను. "ఒరేయ్! ఆ అమ్మాయిని నువ్వు ప్రేమిస్తున్నావు. నిజమే. బాగానే ఉంది. కానీ రేపు ఒకవేళ ఏదైనా జరగకూడనిది జరిగితే నువ్వు ఏమైపోతావో ఆలోచించు. అందుకే మన పెద్దవాళ్ళు "అతి సర్వత్రా వర్జయేత్" అన్నారు. దాన్నే "టూమచ్ ఈజ్ ఆల్వేస్ బేడ్" అన్నాడు ఇంగ్లీషువాడు. వాళ్ళంతా దానికి చెప్పారో అర్థం చూసుకుని, కీడెంచి మేలెంచమనే ఆర్యోక్తిలో నిజం గ్రహించ మసలుకొంటే ఇటు నీకూ, అటు ఆ అమ్మాయికీ మంచిదిరా" అని పెద్ద తరహాగా నచ్చచెప్పాను.

ఇంతేనండీ నేను చేసింది. అదేమన్నా పెద్ద అపరాధమా మీరు చెప్పండి. కానీ అదే నాపాలిట అపరాధమై కూచుంది మావాడి దృష్టిలో.

"శుభమా అంటూ నీ సలహాకొస్తే వెధవ అపశకునం కూతలూ నువ్వూనూ. ఛస్తే నీ మొహం చూస్తే ఒట్టు" అని నన్ను తిట్టేసి మరీ పోయాడు వాడు.

తర్వాత్తరవాత బైటకూడా నన్ను అలాగే తిట్టాడని, పెసిమిస్ట్ గాడని ప్రచారం చేస్తున్నాడని తెలిసిన ఒకరిద్దరు (ఫ్రెండ్స్) చెప్పినా నేనేం పట్టించుకోలేదు. వాడిని నా గొప్ప మనస్సుతో క్షమించేసి ఊరుకున్నాను.

వాడి ప్రేమకథ కాదుగానీ అది నాకో అంత అయిపోయింది. ఈ ప్రేమకుండే జబ్బే అంత. ఫలానా పుల్లారావును ఫలానా ఎల్లమ్మ గాఢంగా ప్రేమిస్తోందనో, ఫలానా ఎల్లమ్మను, ఫలానా పుల్లారావు అతి గాఢంగా ప్రేమిస్తున్నాడనో తెలీగానే పుల్లారావు చుట్టుపక్కల వాళ్ళకీ, ఎల్లమ్మ చుట్టుపక్కలవాళ్ళకి ఇద్దరూ మామూలు మనుషుల్లా కనిపించడం మానేసి అద్భుతమైన వ్యక్తుల్లా కనిపించడం మొదలుపెడతారు.

వాళ్ళకి లేని అపురూప లక్షణాలు కూడా అంటగట్టి వాళ్ళంటే అంతులేని అడ్మిరేషన్ పెంచుకుంటారు.

పుల్లారావుతో ఎల్లమ్మ ప్రేమమైకంలో గొప్పతనాన్ని, గొప్ప గుణాల్ని చూస్తుంది మరి. ఆమె సమక్షంలో అతను కూడా వీలైనంత ఉదారంగా మంచిగానే ఉంటాడు. అలాంటి పుల్లారావును చూసి అవే అతని లక్షణాలని లోకానికి చాటుతుంది ఎల్లమ్మ. ఎల్లమ్మ విషయంలో పుల్లారావు కూడా అంతే. తమను ప్రేమించకుండా తమ పక్కవాళ్ళను ప్రేమించారంటే వాళ్ళలో ఏదో ఒక గొప్పతనం ఉండాలి కదా మరి అనుకుంటారు మిగిలినవాళ్ళు.

అలాగే నేను కూడా అనంతంగాడి మాటలు వినీ వినీ నీహారిక మీద అభిమానం పెంచుకున్నానని ఆలస్యంగా తెలుసుకునేసరికి నా గుండె పగిలిపోయింది. కానీ ఆవిడ అనంతంగాడికి నీహారిక కానీ మనకి మరీచికయ్యె. అందుమీద ఆవిడని ప్రేమించడం పాపమనిపించింది. ఆ అమ్మాయిని దూరంగా నెట్టాయాలంటే అర్జంటుగా మరో ప్రత్యామ్నాయం కావలసి వచ్చింది.

అసలు మొదట నాకు ఈ ప్రేమల్లో నమ్మకం ఉండేది కాదు. ప్రేమంటే ఆశతోనే మొదలవుతుంది. ప్రేమను పెంచడం అంటే పూలమొక్కను పెంచటం లాంటిది. దానికి నీరుపోసి చీడలు రాకుండా ఎంత జాగ్రత్తగా చూస్తే, ఎంత ఖర్చు పెడితే ప్రేమపుష్పం ఫలిస్తుందో నాకన్నా బాగా ఇంకెవ్వరికీ తెలీదు. అంత భారీ పరిశ్రమకు నా జేబు, అంత భారీ ఆశా ప్రయోగానికి నా మనసు ఎపుడూ సిద్ధంగా ఉండేవి కాదు. అయినా ఇపుడు నా మనసు ప్రేమవైపు లాగడం మొదలు పెట్టింది.

దానితో అసలు ప్రేమించేవాళ్ళంతా ఎలా ప్రేమిస్తారు? ప్రేమించడానికి మనుషులు ఎక్కడ ఎలా దొరుకుతారు అని తీవ్రంగా ఆలోచించడం మొదలు పెట్టారు. నేను ఈ ప్రయత్నాల్లో ఉండగానే ఒకరోజు మా ఫ్రెండొకడు వార్త మోసుకొచ్చాడు. అనంతంగాడు, ఆ అమ్మాయి పెళ్ళి చేసుకోవడం లేదు. విడిపోయారంట అని.

నాకు గొప్ప ఆశ్చర్యం వేసింది. లోపలెక్కడో ఆనందం కూడా వేసిందనే అనుమానం. అయితే వాళ్ళు ఎందుకు విడిపోయారనేది నాకు గొప్ప సందేహంగా ఉండేది. అయితే తర్వాత పదిరోజులకే దానికి సమాధానం దొరుకుతుందని మాత్రం నేను అనుకోలేదు.

ఆరోజు పౌర్ణమి. ఏం తోచక బీచ్‌కు వెళ్ళాను. కాసేపు కూర్చుని వచ్చేస్తుంటే ఆ పిల్ల మరీచిక ఎదురుగా వస్తూ కనిపించింది. మావాడు అంతకు ముందు నన్ను బెస్ట్‌ఫ్రెండ్‌గా ఆ అమ్మాయికి పరిచయం చేశాడుగా. వెళ్ళి పలకరిద్దామా అనుకున్నాను కానీ అమ్మాయితో ఎలా మాట్లాడాలో అభ్యాసం లేకపోవడంతో వద్దనుకుని వెనుదిరిగాను.

ఇంతలో ఆ అమ్మాయే సన్నగా పిలిచినట్లనిపించింది 'ఏమండీ' అంటూ. చటుక్కున ఆగిపోయాను. నా గుండె వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టింది. వాడితో ఆరోజు అలా అన్నందుకు తిడుతుందో ఏమో భగవంతుడా అనుకున్నాను.

"మీతో మాట్లాడాలి. కాసేపు ఇక్కడ కూర్చుందామా" అంది ఆ అమ్మాయి ఎంతో మర్యాదగా.

వెంటనే కింద చతికిల పడ్డాను. ఆ అమ్మాయి కొద్దిసేపు అలలవైపు చూస్తూ కూర్చుంది.

తర్వాత నావైపు తిరిగి "మేం విడిపోయామని మీకు తెలిసే ఉంటుంది" అంది చిన్నగా.

నేను అవనూ, కాదూ మధ్యగా హడావుడిగా తల ఊపాను.

"అనంతం బాగా సెన్సిటివ్ అండీ. ఏదైనా ఎక్స్‌ట్రీమ్స్‌కు వెళ్ళిపోతాడు. ప్రేమ అయినా అంతే. ద్వేషం అయినా అంతే. ఓవర్ సెన్సిటివ్. సెంటిమెంటల్‌గా ఆలోచిస్తాడు. తను అనుకున్నది జరగకపోతే ఎంతగా నిరాశపడతాడంటే ఇంక అందులోంచి తేరుకోలేడు. తనది మరీ ఓవర్ ఆప్టిమిజమ్. అందుకే తనతో జీవితం పంచుకోవాలంటే భయం వేసింది. నేనూ తనలాగానే సెన్సిటివ్‌గా ఆలోచిస్తాను. తన కన్నా సెంటిమెంటల్ ఫూల్‌ని. మాకు ఇద్దరికీ తర్వాత ఏదన్నా కష్టం వస్తే ఇద్దరం ఒకళ్ళని ఒకళ్ళు ఓదార్చుకుని నచ్చ చెప్పుకునేది పోయి ఇద్దరం దుఃఖసముద్రంలో మునిగిపోతామని, ఆరకంగా ఇద్దరం సరైన జోడీ కాదనిపించింది నాకు. అందుకే అనంతానికి నచ్చచెప్పాను. తనూ అర్థం చేసుకున్నాడు.

మీ గురించి అనంతం ఎప్పుడూ నాకు చెబుతుండేవాడు. మీ స్వభావం గురించి తను చెబుతున్న కొద్దీ నాకు మొదట ఆశ్చర్యంగా అనిపించేది. కానీ తర్వాత తర్వాత అలా ఉంటే తప్ప జీవితంలోని క్లిష్టత తట్టుకోలేం అనిపించడం మొదలుపెట్టింది. క్లిష్టత పెరిగే కొద్దీ జీవితమంతా డిజప్పాయింట్‌మెంట్ల మయం అలాంటి పరిస్థితుల్లో కూడా ధైర్యంగా నిలబడగలిగితే మీరంటే నాకు తెలీకుండానే ఇష్టం కలగటం మొదలుపెట్టింది. నాలాటి మనస్తత్వం ఉన్నవాళ్ళకి కావలసింది మీలాగా ప్రాక్టికల్‌గా ఉండేవాళ్ళే. మీకిష్టమైతే మనం పెళ్ళి చేసుకుందాం. ఏమంటారు."

ఏమంటారు? నాకెందుకో ఆమె ధోరణి యిష్టమే అయింది మరి!

జి. లక్ష్మి, ఆంధ్రభూమి దినపత్రిక,
36, సరోజినీదేవి రోడ్, సికింద్రాబాద్ - 500 003

# నిష్పక్షపాతం

భారద్దేశంలో ఎందరో మనుషులున్నట్టే ఆంధ్రదేశంలో పాపారావని ఒకాయన ఉన్నాడు. అయితే ఈ పాపారావు ఒక్క ఆంధ్రదేశంలోనే కాక ఇతర రాష్ట్రాల్లో కూడా ఎన్నోసార్లు తటస్థపడ్డాడు నాకు. హరిద్వార్‌లోని సాధువుల్లో ఒకసారి, అహ్మదాబాదులో వ్యాపారిగా ఇంకొకసారి, కలకత్తాలో జరిగిన సైంటిస్టుల కాన్ఫరెన్సులో మరికొసారి, ఇంకా కేరళలోని ఒక పట్టణంలో డాక్టర్ల నడుమా, బొంబాయిలో సినీకళాకారుల మధ్యా, ఒరిస్సాలో రచయితలతో కలిసీ - ఇలా ఎన్నోచోట్ల ఎన్నోసార్లు! మొదట్లో పాపారావు ఆంధ్రేతర ప్రాంతాల్లో కలిసినప్పుడు అతన్ని గుర్తుపట్టడానికి కొంత సమయం పట్టేది నాకు. అతని మాటల్ని వింటూ వింటూ

'ఇంతకుముందు ఇతన్నెక్కడో చూసినట్టున్నానే' అని ఆలోచించగా ఆలోచించగా 'అవును, ఆంధ్రదేశ రాజధానిలోనే' అని చటుక్కున జ్ఞాపకం వచ్చేది. అయితే తర్వాత్తర్వాత పాపారావు నాకు బాగా పరిచితుడై పోవడం వల్ల దేశంలోని ఏమూలన కనపడ్డా కొంత సంభాషణ సాగిందే తడవు నేనతన్ని వెంటనే గుర్తుపట్టసాగాను. ఇప్పుడైతే పాపారావు నాకు పాత స్నేహితుడు.

★ ★ ★

పాపారావు చేసేది ఒక చిన్నపాటి వ్యాపారం. హోల్‌సేల్ డీలర్లకు మందుల్ని సరఫరా చెయ్యటం అతని పని. దీన్నొకరకమైన దళారీ వ్యాపారంగా చెప్పుకోవచ్చు. మంచి నడవడి కలిగిన ఒక మర్యాదస్తునిగా పేరున్న పాపారావు ఇలాంటి వ్యాపారాన్ని ప్రారంభించినప్పుడు అతనికి తెలిసినవాళ్ళు ముందుగా కొంచెం ఆశ్చర్యపడ్డా 'అయినా దీన్ని పెద్దగా తీసుకోవటానికి ఇందులో అంత గర్హించదగిందేముంది?' అని తర్వాత తమను తాము సరిపెట్టుకున్నారు. మందుల కంపెనీలకు వెళ్ళి అక్కడినుండి మందుల్ని డీలర్లకు సప్లై చేయటానికి అతనికొక వ్యానుండాలి. తను డ్రైవింగ్ నేర్చుకునేంతవరకైనా ఒక డ్రైవరు అవసరం. పోతే ఆ కంపెనీల్లో ముందు కొంత డబ్బును డిపాజిట్ చెయ్యాల్సి ఉంటుంది. వీటన్నిటికోసం బాగా పెట్టుబడి అవసరమయింది పాపారావుకు. అయితే అంతడబ్బు తనదగ్గర లేకపోవటం వల్ల తనతో వ్యాపారంలో భాగస్వామిగా చేరేవాళ్ళకోసం వెతకసాగాడు. అతని మేనకోడలు మరిది అయిన జీవన్‌కు ఈవిషయం తెలిసి పాపారావుతో బిజినెస్‌లో పార్ట్‌నర్‌గా చేరటానికి తన సంసిద్ధతను వ్యక్తం చేశాడు. జీవన్‌కు దాదాపు పాపారావు వయసే ఉంటుంది. ఇద్దరూ మధ్య వయస్కులే. పాపారావు తన పెద్దక్కయ్యకంటె ఎంతో చిన్నవాడు ఆమెకూ అతనికీ మధ్య మరో ఇద్దరు మగవాళ్ళు, ఇద్దరు ఆడవాళ్ళున్నారు. ఆవిధంగా తనకంటే ఎంతో ఎక్కువ వయసున్న తన పెద్దక్కయ్యకు అల్లుడి తమ్ముడవుతాడు జీవన్. పాపారావుకు తన పెద్దక్కయ్య పట్లా మేనకోడలు పట్లా విపరీతమైన ప్రేమాభిమానాలున్నట్టు దగ్గరివాళ్ళతో అతడు మాట్లాడుతుంటే కొన్నిసార్లు తెలిసిపోతుంది. పాపారావు మేనకోడల్ని ఆమె భర్త - అంటే జీవన్ అన్న - ప్రేమగా చూసుకోడనీ, మధ్యమధ్య ఆమెను వేధిస్తాడనీ, ఆ భార్యాభర్తల కాపురం చాలావరకు ఎడముఖం పెడముఖంగానే ఉంటుందనీ నాకు చూచాయగా తెలియడంతో వీళ్ళ పార్ట్‌నర్‌షిప్ వ్యవహారాన్ని కొంచెం ఉత్కంఠతో గమనిస్తూ వచ్చాను.

తన మేనకోడలి భర్తను గురించి చుట్టాలముందు అగౌరవంగా మాట్లాడి పాపారావు తన విసుగునూ, కోపాన్నీ ప్రదర్శించిన సందర్భాలెన్నో ఉన్నాయి. విధవరాలైన తన అక్కయ్యనూ, అమాయకురాలైన మేనకోడలునూ తల్చుకున్నప్పుడల్లా అతడు కోపంతో కుతకుతలాడిపోయి మేనకోడలి భర్తను గురించి దుర్భాషలాడేవాడు. జీవన్ అన్న దగ్గర పెద్ద తప్పేదో లేనిదే పాపారావు అనవసరంగా అతన్ని అసహ్యించుకోడని, ఎందుకంటే పాపారావు నిజంగా ఎంతో సచ్ఛీలుడూ నిజాయితీపరుడూ అని నేను ఒకరిద్దరు మిత్రులతో అన్నాను కూడా. అయితే నాకు మిత్రుడు కావటం వల్లనే అతన్ని నేనలా వెనకేసుకు వస్తున్నాననీ, నేను చెప్పేదాంట్లో వాస్తవం ఉండకపోవచ్చుననీ అనుకున్నారు నా మిత్రులు.

జీవన్‌కు చిన్నతమ్ముడైన జగన్ స్ఫురద్రూపి. ఎమ్మే పూర్తిచేసి డాక్టరేట్ కోసం థీసీస్ రాసే ప్రయత్నంలో ఉన్నాడు. మంచి ఆటగాడు కూడా. టెన్నిస్ అంటే అతనికి మహా ఇష్టం.

★ ★ ★

వెనుక ఇంత నేపథ్యం ఉండగా జీవన్‌ను వ్యాపారంలో భాగస్వామిగా చేర్చుకోవటానికి పాపారావు అసలు సందేహించలేదా అంటే సందేహించాడు. కానీ గత్యంతరం లేకపోయింది మరి. అందువల్ల ఒప్పేసుకున్నాడు వారి ఉమ్మడి వ్యాపారం మొదలై సాఫీగా సాగిపోయింది. బిజినెస్‌లో జీవన్ ఎక్కువ చురుకుగా పనిచేయటం వల్ల మంచి ఫలితాలు రాసాగినై. పాపారావుకు సంతోషం కలిగింది. జీవన్ ఎంతో తెలివైనవాడనీ, నిజాయితీ, దూరదృష్టి ఈ రెండూ కలవాడనీ స్నేహితుల ముందు ప్రస్తుతించాడు. ఉత్సాహంగా జీవన్‌తో షేక్‌హాండ్ చేశాడు చాలాసార్లు.

'వాళ్ళ కుటుంబాల మధ్య ఒకరకంగా కొంత పరోక్షమైన దూరం ఉన్నప్పటికీ దాన్నంతా మరిచి ఎంత సహృదయంతో జీవన్‌ను అభినందిస్తున్నాడీ పాపారావు!' అని తెగ మురిసిపోయాను నేను. పాపారావు అంతటితో ఆగకుండా జీవన్ అన్నతో కూడా సఖ్యతను నెలకొల్పుకున్నాడు. అతనిలో మంచితనం కొట్టొచ్చినట్టుగా కనిపించసాగింది పాపారావుకు.

"నెమ్మదస్తునిలా కనిపించే నీతో నా కోడలుకు ఇబ్బంది ఎక్కడ ఎలా కలుగుతుందో నా ఊహకు అందటం లేదు. అయినా అమ్మాయితో నేను వివరంగా మాట్లాడుతాలే" అన్నాడు నవ్వుతూ జీవన్ అన్నతో.

ఒకసారి నేను పాపారావుతో సాయంత్రాన్ని గడుపుతున్నప్పుడు ఆటల గురించి మాట్లాడుకునే సందర్భం వచ్చింది. "ఒలింపిక్స్‌లో మనదేశం ఎంత ఘోరంగా విఫలమౌతోందో చూడు. ఇంతవరకు మనవాళ్ళెవరూ దీనికి ఉపాయాన్ని కనిపెట్టలేకపోయిరి" అన్నాడు పాపారావు.

"అయినా టెన్నిస్‌లో అంతో ఇంతో ఆశ కనబడుతున్నది కదా" అన్నాను నేను.

"టెన్నిస్ అంటే గుర్తొచ్చింది. జీవన్ తమ్ముడు జగన్ టెన్నిస్ బాగా ఆడతాడు. ఒకసారి అనుకోకుండా అతని ఆటను చూసే అవకాశం కలిగింది నాకు. బాగా కృషి చేస్తే స్టేట్ లెవెల్లో ఓ మోస్తరు ఆటగాడు కాగలడనిపించింది" అన్నాడు పాపారావు.

"అలాగా, నాకీ విషయం తెలియదే" అని కొంచెం ఆశ్చర్యాన్ని ప్రకటించాను నేను.

★ ★ ★

పాపారావు సాధారణంగా మంచివాడే అయినా అతనికి కొంచెం బద్ధకం ఉంది. నన్ను నేను గొప్పచేసుకోవటం కాదుగానీ ఎవరి గుణగణాల గురించయినా చెప్పేటప్పుడు నేను చాలా నిష్పక్షపాతంగా ఉంటాను. పాపారావుకు బద్ధకం ఉన్న సంగతిని నేనెప్పుడూ కాదనను. ఆ బద్ధకం మూలంగానే అతడు వ్యాపార కార్యకలాపాల్లో అంత ఎక్కువగా పాలుపంచుకోలేక పోయాడు. అత్యవసరంగా మందులకంపెనీలకు వెళ్ళవలసి వచ్చినప్పుడు కూడా కొన్నిసార్లు అతడు తన అశక్తతను తెలుపడంతో అలాంటి సందర్భాల్లో జీవన్‌కు ఎంత ముఖ్యమైన పనులున్నా వాటిని మానుకుని బిజినెస్ పనిమీద పాపారావుకు బదులుగా వెళ్ళవలసి వచ్చింది. ఇలా జరిగినప్పుడు పాపారావు ఎంతగానో నొచ్చుకున్నాడు. తన ఆరోగ్యం బాగుండటం లేదనీ, డాక్టరు కొంచెం రెస్టు తీసుకోమన్నారనీ చెప్పి తన నిస్సహాయతను వెలిబుచ్చాడు. "అయినా వ్యానులో పోయి అధికారులతో మాట్లాడిరావటం కూడా చేయలేకపోతే ఎలా?' ' అని తన అసంతృప్తిని తెలిపాడు జీవన్.

"ఈ విషయంలో ముసుగులో గుద్దులాటలా వ్యవహరించడం నాకిష్టం లేదు. కాబట్టి ఇప్పుడు స్పష్టంగా చెబుతాను. అసలు ఈ విషయాన్ని చెప్పాలని కొద్ది రోజులుగా అనుకుంటూనే తాత్సారం చేశాను. నాకు ఆరోగ్యం బాగాలేదు కనుక నేను పొద్దంతా మన ఆఫీసురూంలోనే ఉండి వ్యవహారాలు చూస్తాను. ఈ బయట తిరగడాలు మాత్రం కొంచెం నువ్వే చూసుకోవాలి" అన్నాడు పాపారావు.

జీవన్‌కు కోపం ముంచుకొచ్చింది. అలా అయితే లాభాల్లో తనకు సగం వాటాకన్న ఎక్కువ రావాలన్నాడు. పాపారావు సరేనన్నాడు కానీ ఎవరికి ఎంతశాతం వాటా అన్న దగ్గర వాళ్ళిద్దరికీ ఏకాభిప్రాయం ఎంతమాత్రం కుదరలేదు.

"ఏదో నా మేనకోడలి మరిదివని నిన్ను పార్ట్‌నర్‌గా పెట్టుకున్నాను. అసలు నేను నీకా అవకాశాన్నే ఇవ్వకపోయి ఉంటే నువ్వీరోజు ఏ స్థితిలో ఉండేవాడివో తెలుసా? మొదట్లో నేనీ వ్యాపారం గురించి ఎంత పట్టించుకున్నానో జ్ఞాపకం తెచ్చుకో. ఆఖరుకు నువ్వింత నమ్మకద్రోహివనీ, ఇంత స్వార్థపరుడివనీ తేలిపోయింది. అయినా నీలాంటివాణ్ని పార్ట్‌నర్‌గా పెట్టుకోవటం నాదే బుద్ధితక్కువ. అందుకు నాకు తగిన శాస్తే అయింది-" అంటూ బిగ్గరగా అరిచాడు పాపారావు.

"నువ్వు నన్ను కనికరంతో పార్ట్‌నర్‌గా పెట్టుకున్నావా? పెట్టుబడిలో నావంతు సగం డబ్బు ఇవ్వలేదా నేను? నీ దయా దాక్షిణ్యాల మీద బతుకుతున్న బిచ్చగాడి ననుకుంటున్నావా? మాటలు కొంచెం తిన్నగా రానియ్. ఎవరు స్వార్థపరులో ఎవరు నమ్మకద్రోహులో నీ నిర్వాకం చూస్తే తెలియటంలేదా? పైగా నాగురించే ఇలా మాట్లాడ్డానికి నీకు సిగ్గనిపించటం లేదా?' ' అంటూ మరింత బిగ్గరగా అరిచాడు జీవన్.

మాటా మాటా పెరిగింది. ఆఖరుకు కొట్టుకునేదాకా వచ్చారు. అంతటితో వారి వ్యాపారం ఆగిపోయి తగాదా కోర్టుకెక్కడంతో ఇప్పుడు వాళ్ళకు కోర్టుపనే వ్యాపారం కన్నా పెద్దపనైపోయింది!

ఈమధ్యకాలంలో పాపారావు మేనకోడలుకూ, ఆమె భర్తకూ మధ్య పోట్లాటలు విపరీతంగా పెరిగిపోయాయి. భార్యాభర్తలు విడివిడిగా బ్రతకవలసి వచ్చేటంతగా విషమించి పోయింది పరిస్థితి. ఈ పరిణామంతో మరింత కృంగిపోయాడు పాపారావు. అతడు జోక్యం చేసుకోవటానికి వీల్లేని పరిస్థితి ఏర్పడటం వల్ల చేసేదేమీ లేక ఊరుకోవడం అతని వంతయింది.

ఒకరోజు పాపారావును అప్పడగటానికి అతని ఇంటికి పోయిన నాకు నిరాశే ఎదురైంది. నేను ఊహించని విధంగా తనదగ్గర డబ్బు లేదన్నాడు. కొంతైనా సర్దమని ఎంత అడిగినా లాభంలేకపోయింది. తర్వాత ఒకటి రెండుసార్లు కూడా అలానే నాకు అప్పివ్వటానికి నిరాకరించాడు పాపారావు. వ్యాపారం ఆగిపోయి ఆర్థికంగా అతడు కొద్దిగా క్షీణించిన మాట నిజమే ఐనప్పటికీ నేనడిగినంత కాకపోయినా, కొంతైనా డబ్బును అప్పుగా ఇవ్వవచ్చు కదా అనుకున్నాను నేను. ఇక ఆపై పాపారావును అప్పడగటానికి నేనసలు ప్రయత్నించే లేదు. ఆవిధంగా అతడు నాకు అప్పివ్వడం పూర్తిగా మానేశాడు.

★ ★ ★

ఇప్పుడు పాపారావు దగ్గర ఎవరైనా జీవన్ విషయం ఎత్తితే "వాడి విషయం నాదగ్గర

తీసుకురావద్దు. వంశపారంపర్యంగా వచ్చే బుద్ధులెక్కడికి పోతాయ్? వాడి అన్నను చూశావా? బంగారంలాంటి నా మేనకోడలి జీవితాన్ని నాశనం చేశాడు దుర్మార్గుడు. అమ్మాయి దగ్గర ఏదైనా తప్పుంటే నలుగురు పెద్దల ముందు చెప్పి ఆమె బుద్ధిగా నడుచుకునేలా చేసుకోవచ్చు కదా! ఏకంగా దాన్ని వదిలెయ్యాలనే నిర్ణయానికే రావటం చూస్తే ఆ కుటుంబ సంస్కారం ఎటువంటిదో వేరే చెప్పనక్కర్లేదు. ఈ జీవన్‌గాడేమైనా తక్కువ తిన్నాడా? నా ఆరోగ్యం చెడిపోవటంతో వ్యాపారంలో నేనెక్కువ శ్రమించలేకపోయానన్నది వాస్తవమే. అయితే లాభాల్లో ఎక్కువ వాటా ఇవ్వటానికి నేను ఒప్పుకున్నా వాడు వినలేదు. అన్నను మించిన దగుల్బాజి తమ్ముడు, తమ్ముని మించిన దగాకోరు అన్న" అంటూ ధారాళంగా దూషిస్తాడు.

ఒకసారి నలుగురైదుగురు మిత్రులం కలిసి ముచ్చటించుకుంటున్నాము. టెన్నిస్ గురించిన చర్చ వచ్చింది. మా బృందంలో ఒకతను అనాలోచితంగా గబుక్కున అన్నాడు "జీవన్ తమ్ముడు జగన్ స్టేట్‌లెవెల్ పోటీల్లో ఈసారి ప్రి క్వార్టర్ ఫైనల్స్ దాకానైనా వస్తాడనుకున్నాము. కానీ పాపం మొదటి రౌండ్‌లోనే ఓడిపోయాడు".

పాపారావు అక్కడ మాతో ఉన్న విషయం చప్పున స్ఫురించి, ఈ మాటన్నాయన వైపు నేనొక చురకలాంటి చూపును పారేశాను. ఆయనకు అసలు విషయం అర్థమై కొంచెం తికమకపడ్డాడు.

వెంటనే అందుకుని అన్నాడు పాపారావు "మన ఆటగాళ్ళతో వచ్చిన ఇబ్బందే ఇది. ఒకటి రెండుసార్లు గెలవగానే పెద్ద చాంపియన్ అయిపోయినట్టు కాలరెగరేసుకుని తిరుగుతారు. అయినా ఒరిజినల్‌గా ప్రతిభ ఉండాలే తప్ప ఎంత ప్రాక్టీసు చేస్తే మాత్రం గొప్ప ఆటగాళ్ళై పోతారా?"

అంతటితో టెన్నిస్ ప్రసక్తి ఆగిపోయింది.

★ ★ ★

పాపారావుకూ జీవన్‌కూ మధ్య తలెత్తి వివాదం పట్ల కుతూహలాన్ని పెంచుకున్న నా మిత్రులొకరిద్దరు ఈ విషయంలో అసలు తప్పెవరిదని అడిగారు నన్ను. దానికి నా సమాధానాన్ని ఈవిధంగా విన్నవించుకున్నాను.

"వీళ్ళ తగాదా విషయమ్మీద నా నిష్పక్షపాతమైన అభిప్రాయమేమిటంటే - జీవన్ కొంతవరకు కపటంలేని మనిషి. కష్టపడి న్యాయంగా, నీతిగా బ్రతికే స్వభావం అతనిది. పాపారావు బద్ధకస్తుడే కాక దురాశాపరుడు కూడా. ఒకవిధంగా పాపారావు జీవన్‌ను మోసం చేశాడని చెప్పవచ్చు."

★ ★ ★

ఇప్పుడు చెప్పండి పాఠకవర్యులారా! మీకుకూడా, పాపారావు తటస్థపడ్డ సంగతి ఈ కథను చదవడం పూర్తి చేసింతర్వాతనైనా తెలియడం లేదా!

ఎలనాగ (డా॥ సురేంద్ర), 5-1-33, శాంతి నగర్,
సెయింట్ జోసెఫ్ స్కూల్ వెనుక, సంగారెడ్డి

# తెలుగువాడు

పుట్టినదగ్గరనుండి ఆంధ్రప్రదేశ్ లోనే పెరిగి అకస్మాత్తుగా పై చదువులకోసం ఇంకో రాష్ట్రం వచ్చిన విద్యార్థి పరిస్థితి ఎలా వుంటుందనేదే నేను చెప్పబోయే ఈ కథా సారాంశం. మన హీరో చిన్న టౌను వాతావరణంలో పెరిగాడు. బి.టెక్. కూడా ఆంధ్రప్రదేశ్‌లోనే చదివాడు. అయితే మనవాడికి ఐ.ఐ.టి (ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ) బొంబాయిలో ఎమ్.టెక్‌లో సీటు వచ్చింది. ఇంటర్వ్యూకి వెళ్ళినప్పుడు "మిగతా ఫ్రెండ్స్ ఎవ్వరికీ సీటురాలేదని, తనకు ఒక్కడికే వచ్చిందనీ" ఆనందించినా "ఒంటరిగా ఎలా మానేజ్ అవ్వాలో" అర్థం కాలేదు. హిందీ అస్సలు రాదు - ఇంగ్లీషు వచ్చీరానట్లు వచ్చు. ఏదయితేనేం జాయిన్ అవ్వడానికే నిర్ణయించుకున్నాడు.

విషయం తెలిసిన ఇంట్లోవాళ్ళంతా మనవాణ్ణి ఆకాశంలోకి ఎత్తేశారు. అసలు మనవాడిపేరు చెప్పనే లేదు కదూ!

హి ఈజ్ మిస్టర్ జి. గురుమూర్తి.

మరి ఐ.ఐ.టి.లో సీటు వచ్చిందని ఊరంతా చెప్పాలి కదా! అందుకే మొట్టమొదట ఆ ఊర్లోనే ఉంటున్న వాళ్ల మావయ్య ఇంటికి వెళ్లాడు. మనవాడు మామయ్యమీద అభిమానంతో వెళ్లాడని అనుకుంటే పప్పులో కాలువేసినట్లే. మామయ్యవాళ్ళకి, ఇంట్లోవాళ్ళకీ మధ్య కోల్డ్‌వార్ నడుస్తుంది. "ఈ విషయం చెపితే మామయ్య ఎంత ఉడుక్కుంటాడో! ఆ ముఖాన్ని చూసి ఆనందించవచ్చు" అనుకొన్నాడు.

విషయమంతా విన్న మామయ్య "ఎదవ ఐ.టి.ఐ. సదవడానికి బొంబాయెల్లాలేటి? మనూర్లో లేదేట్రా! మొన్న పదో తరగతి మూడోసారి పాసయిన అప్పారావుగాడు మనూర్లోనే కదా జాయిన్ అయ్యాడు" అని పెసరపప్పు పొట్లం కడుతూ కస్టమర్‌కి అందిస్తున్న మామయ్య అడిగేసరికి మనవాడికి నోటమాట రాలేదు.

"ఐ.టి.ఐ. కాదు మామయ్యా! ఐ.ఐ.టి." అని చెబుదామనుకొన్నా, "వీడికి చింత పండు, బెల్లం, ఉల్లిపాయలు తప్ప ఇవేమీ అర్థంకావు" అని మనసులోనే తిట్టుకున్నాడు.

ఇంతలో అత్తయ్య పిలిస్తే కొట్టుముందు నిలబడి మామయ్యతో మాట్లాడుతున్నవాడు కాస్త ఇంటిలోకి వెళ్లాడు. అత్తయ్యతో విషయం చెబితే ఇంతకంటే దారుణమైన ప్రశ్నలు వేసింది.

"ఏటీ! ఆల్లే డబ్బులిచ్చి (స్కాలర్‌షిప్), ఆల్లే సదివించుకొంటారా?" అని సంభ్రమాశ్చర్యాలు ప్రకటించినా, "మా దగ్గర కొయ్యకోయ్" అన్నట్లుగా ఉన్నాయి ఆమె చూపులు.

"తనకు ఐ.ఐ.టిలో అడ్మిషన్ వచ్చిందన్న విషయం ఈ పెద్ద పల్లెటూర్లో మళ్ళీ ఎవరికీ చెప్పకూడదు" అనే గట్టి నిర్ణయానికి వచ్చేశాడు.

ఇంట్లో వాళ్ళంతా తనని హీరోలా చూస్తుంటే గురుమూర్తి సంతోషం పట్టలేకపోతున్నాడు. అంతెందుకు, మొన్న ప్రక్కింటి ప్రశాంతి వచ్చి ఎంత పొగిడింది! "అది తన గొప్పతనానికి నిదర్శనం" అని అనుకొన్నాడు. ప్రశాంతి తనని విపరీతంగా ప్రేమించేస్తోందన్న అనుమానం కూడా రాకపోలేదు.

తను మూటాముల్లు వేస్కుని బొంబాయి వెళ్ళవలసిన రోజు రానే వచ్చింది. ఇంటర్వ్యూకి వెళ్ళినపుడు చాలామంది ఫ్రెండ్స్‌తో కలసి వెళ్ళాడు కాబట్టి హిందీ, ఇంగ్లీషు సరిగ్గా రాకపోయినా, ఏదోరకంగా నడిపించేశాడు. ఇప్పుడు ఒక్కడే వెళ్ళాలంటే కొద్దిగా బెరుకుగానే ఉంది. బొంబాయి వెళ్ళాల్సిన కోణార్క్ ఎక్స్‌ప్రెస్ వాళ్ళ ఊరికి రాత్రి ఒంటిగంటకి వస్తుంది.

పాపం అబ్బాయి బొంబాయి వెళ్తున్నాడు కదా అని ఇంటిల్లపాది ఇంటికి తాళంపెట్టి గురుమూర్తితో రైల్వేస్టేషన్‌కి వచ్చారు. కానీ, కోణార్క్ ఎక్స్‌ప్రెస్ తన అలవాటు ప్రకారం ఉదయం 6 గంటలకి రావడం వలన ఆరోజు ఇంట్లో వాళ్ళందరికీ జాగారం తప్పలేదు. అసలే రాత్రంతా నిద్రలేదేమో చాలా అలసట ఫీల్ అవుతూ, ట్రెయిన్ ఎక్కగానే నిద్రపోదామనుకొన్నాడు కానీ, తీరా చూస్తే తనబెర్త్‌లో ఎవడో నిద్రపోతూ కనిపించాడు - చిర్రెత్తుకొచ్చింది. అతన్ని నిద్రలేపితే వాడు హిందీలో ఏదోవాగి అటుతిరిగి పడుకొన్నాడు. మన మూర్తికి ఏంచేయాలో అర్థంకాక, టి.టి. వచ్చేదాకా వాడి కాళ్ళదగ్గరే కూర్చొని వైజాగ్ దగ్గరలో బెర్త్ ఖాళీచేయించి నిద్రపోయాడు.

దాదర్ స్టేషన్‌కి ఉదయం 6 గంటలకి రావలసిన ట్రెయిన్ మధ్యాహ్నం రెండుగంటలకి చేరుకుంది. ట్రెయిన్ దిగాడు మన మూర్తి. ప్లాట్‌ఫారమ్ అంతా గందరగోళంగా ఉంది. లోకల్ ట్రెయిన్ టికెట్ ఎలా కొనాలో, ఎక్కడ కొనాలో, లగేజ్‌తో ఎలావెళ్ళాలో అర్థంకాక తికమక పడిపోతున్నప్పుడు కూలీ వచ్చి అడుగుతున్నాడు. ఈ పరిస్థితుల్లో కూలీ అవసరం ఎంతైనా ఉందనిపించింది. కానీ, విక్రోలీకి వెళ్ళవలసిన ట్రైన్‌లు ఏ ప్లాట్‌ఫారమ్ మీదకు వస్తాయో కనుక్కొని దాని ప్రకారం బేరం కుదుర్చుకోవాలనే ఉద్దేశ్యంతో
"విక్రోలీ జానా ...... ట్రెయిన్ ప్లాట్‌ఫారమ్ కౌన్‌సా" అని కూలీని అడిగాడు.

మొదట్లో కూలీకి విషయం ఏమిటో అర్థం కాలేదు. కొద్దిగా ఆలోచించిన తరువాత విషయం అర్థమయి కూలీ ప్లాట్‌ఫారమ్ నంబర్ చెప్పాడు.

"కితనా?" అని గురుమూర్తి అడిగాడు. మళ్ళీ వాడు ప్లాట్‌ఫారమ్ నంబర్ చెప్పాడు కాస్త విసుగ్గా.

"ప్లాట్‌ఫారమ్ నహీఁ పైసా! లగేజ్ కితనా' అంటే "లగేజీ అక్కడికి తీసుకువెళ్ళడానికి ఎంత" అని మూర్తి ఉద్దేశ్యమని వాడు గ్రహించేసి -

"పచ్చీస్ రుపయే" అన్నాడు.

"ఇంగ్లీషు మే కితనా" అని మన మూర్తి అడిగేసరికి "ట్వంటీ ఫైవ్ రుపీస్ ఓన్లీ' ' అని వాడి సమాధానం.

"నహీఁ దస్ రుపయా" అన్నాడు మూర్తి.

ఇలాంటి పాసింజర్స్ వాడికి మామూలే కాబట్టి కొద్దిగైనా తగ్గనని మొరాయించాడు. ఇక వేరే దిక్కులేక వాడు అడిగినంత ఇచ్చి ఏదో రకంగా ఐ.ఐ.టిలో వచ్చిపడ్డాడు.

మన మూర్తికిచ్చిన హాస్టల్లో రూమ్స్ అలాట్ చేసే హాస్టల్ కౌన్సిల్ మెంబర్ తెలుగువాడే అని ఎంతో సంబరపడిపోయాడు. తీరా వాడిదగ్గరకెళ్ళి ఆరాతీస్తే, మొదట రూములు ఖాళీ లేవని, కొద్దిసేపు హాస్టల్ కౌన్సిల్ యూనిట్‌మీద, ఇంతమందిని సెలెక్ట్ చేసినందుకు ఇనిస్టిట్యూట్ మీద విసుక్కొని తరువాత "సరే! ఒక్క రూమ్ మాత్రం ఖాళీ ఉంది. ఖాళీ ఉందంటే ఉందని కాదు ఆల్‌రెడీ ఒక జూనియర్ అక్కడ ఉంటున్నాడు. నువ్వు అడ్జస్ట్ అవుతానంటే అలాట్ చేస్తాను. ఆఁ ఇంకొక విషయం ఆ రూమ్‌లో ఫాన్ లేదు" అని చావుకబురు చల్లగా చెప్పాడు. ఈమాత్రం దానికి ఏదో ఫేవర్ చేసేస్తున్నట్లుంది వాడిమొహం,

"సర్లే! ఏదో ఒకటి తగలెయ్!" అని మనసులోనే అనుకొని, బయటికి మాత్రం "సరే సార్! అదే అలాట్ చేయండి" అన్నాడు మన మూర్తి.

తనకు అలాట్ అయిన రూమ్ నంబర్ కనుక్కొని వెళ్ళిచూస్తే అక్కడ ఆల్‌రెడీ ఉన్న కుర్రవాడు రూమ్‌కి తాళంవేసుకొని ఎక్కడికో వెళ్లాడని తెలిసింది. ప్రక్కరూమ్ వాడ్ని వచ్చీరాని ఇంగ్లీషులో బ్రతిమాలి అక్కడ లగేజీ పెట్టి రీడింగ్‌రూమ్‌లో తను ఇంతకుముందు చూడని తన రూమ్మేటు కోసం పాపం మూడుగంటలు వెయిట్‌చేశాడు. మొత్తంమీద మన మూర్తి ఎన్నో బాధలుకోర్చి రూమ్ ప్రవేశం చేశాడు. ఇక రూమ్‌లో పరిస్థితి చూస్తే ఇంకొకరకంగా ఉంది. రూమ్మేటు వెస్ట్‌బెంగాల్ వాడు కావడం వలన కమ్యూనిస్టు భావాలు కాస్త ఎక్కువగా వంటబట్టినట్లున్నాయ్. రూమ్‌లో ఉన్న ఏ వస్తువునీ "ఇది నీది, అది నాది" అనే బేధం లేకుండా "రూమ్‌లో ఉన్నవన్నీ మనవే" అనే మనస్తత్వం వాడిది. వాడికి ఇస్త్రీబట్టలు లేకపోతే ఎన్నోసార్లు మూర్తి బట్టలు వేసుకొని ఊరేగిన సంఘటనలున్నాయి. సరే! ఇక ఆ బాధలు సంగతి వదిలేద్దాం.

కొద్దిసేపు పేపర్ చదువుదామని రీడింగ్‌రూమ్‌లో కూర్చున్నాడు. ఒక బంగ్లాదేశీ కుర్రాడు, ఇంకొక ఈజిప్షియన్ కలసి ఇంగ్లీషులో మాటాడుకొంటున్నారు. బంగ్లావాడు అడిగిన దానికి ఈజిప్టు వాడు సమాధానం ఇస్తున్నాడు. అదేవిధంగా ఈజిప్టువాడి ప్రశ్నలకు బంగ్లావాడూ సమాధానం చెపుతున్నాడు. వాళ్లు దాదాపుగా అరగంట మాట్లాడుకున్న తరువాత ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు. ఆ సంభాషణ విన్న తరువాత మూర్తికి బుర్ర తిరిగింది. కారణమేమిటంటే "ఇంగ్లీషు తనకు మాటాడడమే సరిగ్గారాదు గానీ, ఎవరైనా మాటాడితే బాగానే అర్థమవుతుంది" అని అనుకొనేవాడు. ఇప్పుడు వీళ్ళ సంభాషణ విన్న తరువాత ఆ నమ్మకం కూడా పోయింది. కొద్దిగా బుర్ర విదిలించుకొని వచ్చి నోటీస్‌బోర్డ్ చూడడం మొదలుపెట్టాడు. ఒక నోటీస్‌లో "UMBY FOUND ON A SCOOTY, CONTACT WATCHY" అని ఉంది. దానర్థం ఏమిటోనని కొద్దిసేపు ఆలోచించాడు. మెదడుకి తట్టలేదు. తాను చాలా వెనకబడిపోయానని బాధపడ్డాడు. ప్రక్కనే వెళ్లిపోతున్న ఒక తెలుగు సీనియర్ని ఇదే విషయాన్ని అడిగాడు.

"నీకు ఈమాత్రంకూడా తెలియదా?" అన్నట్లుగా ఒక వెటకారపు నవ్వు నవ్వి, "Umby" అంటే Umbrella, Scooty అంటే Scooter, Watchy అంటే Watchman" అని చెప్పాడు.

"వీళ్ళ పిండాకూడు" అనుకొన్నాడు మూర్తి మనసులోనే. అయోమయ స్థితిలో మెస్‌లోకి వెళ్లి టేబిల్ ముందు భోజనానికి కూర్చున్నాడు. ఆరోజు సాంబారు. సాంబారునిండా కొత్తిమీద కట్టలూ, కరివేపాకు కాడలూ. ప్రక్కనేఉన్న కుర్రాడు ఎదురుగా ఉన్నవాణ్ణి

ఉద్దేశించి "సాంబారులో ఇన్ని ఫారిన్ బాడీస్ ఉన్నాయేమిటని" అడిగాడు ఇంగ్లీషులో.

"ఆఁ ఏముందీ! నిన్న గాలీవానకి కాంపస్‌లో చెట్లు పడిపోయాయి కదా. అవన్నీ తీసుకొచ్చి ఇందులో పడేసుంటార్లే" అని గోకాడు ఎదురుగా ఉన్నవాడు.

భోజనం విషయంలో ఒక తెలుగు సీనియర్ దగ్గర విపరీతంగా వాపోయాడు మూర్తి. "నేను ఇంటిదగ్గర ఉన్నప్పుడు అమ్మచేసిన వంటలు బాగాలేవని ఆటపట్టించేవాడిని. బి.టెక్‌లో జాయిన్ అయిన తరువాత అక్కడ తిండికంటే అమ్మ చేతివంటే బాగుందనిపించింది. ఇప్పుడు బి.టెక్‌లో తిన్న పుడ్డే ఇంతకంటే బెటర్ అనిపిస్తోందండీ" అన్నాడు మన మూర్తి తనేదో ఒక జీవిత సత్యాన్ని వెలికితీసినట్లుగా.

"సర్లే, పెళ్లి చేసుకొన్న తరువాత ఇక్కడి పుడ్డే బాగుందంటావు" అని సీనియర్ వెటకారం.

"వచ్చి 2 నెలలయింది. ఒక్క తెలుగు సినిమా అయినా చూడలేదు" అని ఒక తెలుగు సీనియర్‌తో బాధపడిపోయాడు. పాపం మూర్తి బాధ చూడలేక "సరేలే వచ్చేవారం మన హాస్టల్‌లో తెలుగు వీడియో షో వేయిద్దాం" అని మనసు ఊరట కలిగించాడు ఆ తెలుగు సీనియర్. దాని నిమిత్తం తెలుగు వారందరి దగ్గరా డబ్బులు కలక్ట్ చేద్దామనుకున్నారు. కలక్షన్ మొదలయింది. తెలుగువాడన్న ప్రతివాడి రూమ్‌కి వెళ్లి తమ బ్రిలియంట్ ఐడియా చెప్పి డబ్బు లడిగితే "సారీఁ, నేను ఆరోజు ఉండనండీ, నేను సినిమాలు చూడనండీ" అనే సమాధానాలే ఎక్కువ వచ్చాయి. ఇన్‌డైరెక్ట్‌గా "డబ్బులివ్వను" అనే సందేశాన్నిస్తూ. పాపం మన మూర్తి బాధచూడలేకనో, లేక వాళ్లకీ చూడాలనిపించినవాళ్లో కొంతమంది డబ్బులిచ్చారు. కానీ వాళ్లలో చాలామందికి చాలా కండిషన్లు ఉన్నాయి. ఒకడు క్రొత్త సినిమాలు చూడాలట. "రాజేంద్రప్రసాద్ సినిమాలు వద్దు బాస్, బోర్ కొట్టిస్తాడు" అని ఇంకొకడు. "నగ్మా సినిమా లేమైనా ఉంటే చూడుబాస్" అని ఇంకొకడి సలహా. "డబ్బులిస్తున్నారు కదా చెప్పండిరా బాబూ" అని మనసులోనే తిట్టుకొని "సరేనండీ ఉంటే తీసుకువస్తాము" అని చెప్పక తప్పలేదు.

ఠాణే వెళ్లి, దొరికిన తెలుగు క్యాసెట్లు తీసుకువచ్చారు. టి.వి., వి.సి.పి. గురించి మాటాడడానికి మన మూర్తిని పంపించాడు ఆ సీనియర్. అడ్వాన్స్ కూడా ఇచ్చేసి వచ్చాడు మూర్తి. ఆ ఆదివారం 2 గంటలకు రావలసిన టి.వి., వి.సి.పి.లు సాయంత్రం నాలుగైనా రావడం లేదు.

"ఈ మూర్తిగాడు, హిందీలో షాపువాడితో ఏం మాటాడాడో వాడికేం అర్థమయిందో" అనే అనుమానం సీనియర్లలో ఒకడికి రానేవచ్చింది. వెళ్ళి కనుక్కొంటే, విషయం ఏమిటంటే "కల్"కి "ఆజ్"కి సరిగ్గా తేడా తెలియకపోవడం వలన ఈరోజు పంపించమని అడగడానికి బదులు మరుసటినాడు కావాలన్నట్లుగా మనమూర్తి వాడితో చెప్పాడని అర్థమయింది. షాపువాణ్ణి బ్రతిమాలి మొత్తంమీద 6 గంటలకి సినిమాలు మొదలయ్యేటట్లు చూశారు. అయితే విచిత్రం ఏమిటంటే సినిమాలు చూస్తున్నవారిలో "నేను ఆరోజు ఉండనండీ, నేను సినిమాలు చూడనండీ" అనిచెప్పి తప్పించుకున్నవారే ఎక్కువ మంది ఉన్నారు.

ఇకపోతే, మనవాడి చదువు విషయానికి వద్దాం. వచ్చినరోజునుండి క్లాస్ వర్క్ మొదలయిపోయింది. ఎసైన్‌మెంట్లనీ, సర్‌ప్రైజ్ టెస్టులనీ, మిడ్ ఎగ్జామ్స్ అనీ ప్రొఫెసర్లు

ప్రాణం తోడేస్తున్నారు. ఇది చాలదన్నట్లు అప్పుడప్పుడు సెమినార్‌లు కూడా ఇవ్వాలి. "పరీక్షల్లో ప్రశ్నలకి సమాధానం ఎలా వ్రాయలి" అన్నదానికి కొన్ని సిద్ధాంతాలు బి.టెక్. చదువుతున్న రోజుల్లోనే రూపొందించాడు. అందులో చాలా ముఖ్యమైన పాయింట్ ఏమిటంటే ఏదైనా ప్రశ్నకు సరియైన సమాధానం తెలియకపోతే, ఆ ప్రశ్నకు సమాధానంగా మనకు తెలిసింది జనరల్‌గా ఊహించేసి పేజీలు నింపాలి. అటువంటి టెక్నిక్‌నే ఇక్కడ ప్రయోగించాడు. ఒక ప్రశ్నకు సమాధానం తెలియకపోతే, తనకు తెలిసిందేదో దానికి జవాబుగా వ్రాసేసి, "రెండు పేజీలు వ్రాశాను, అయిదు మార్కులకి రెండయినా పడవా' ' అనుకొన్నాడు.

"ఐ.ఐ.టి.లో అలాగ పడవు" అనే విషయం ఆ తరువాత అర్థమయిందనుకోండి.

తను సెమినార్ ఇవ్వవలసిన సమయం ఆసన్నమయింది. ఇంతవరకు స్టేజీ ఎక్కి కనీసం తెలుగులో కూడా మాటాడలేదు. ఇప్పుడు ఇంగ్లీషులో, అందునా ప్రొఫెసర్‌ల ముందు మాటాడాలి. పాపం భయపడుతూనే ఉన్నాడు.

"సెమినార్ రిపోర్ట్ ఎలా వ్రాయాలి. ఏం వ్రాయాలి" అని అడుగుదామని తన సూపర్‌వైజర్ (గైడ్) దగ్గరకి వెళ్ళాడు. అంతేకాదు సబ్జక్ట్‌కి సంబంధిచిన కొన్ని డౌట్లు కూడా ఉన్నాయి. గురుమూర్తిని చూడగానే ఆయన "కమిన్, గురుమూర్తి" అని ఆహ్వానించారు. (అతను మళయాళీ అని గమనించవలసిందిగా ప్రార్థన). తెలుగులో ఆ సంబోధనకి అర్థమేమిటో గురుమూర్తికి తెలుసుకాబట్టి ముఖం ఇబ్బందిగా పెట్టి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

మూర్తి అతన్ని ఏదో డౌటు అడిగాడు. డౌటు వినగానే ప్రొఫెసరు గారు (గైడ్) సడన్‌గా కుర్చీలోంచి లేచారు. "కొట్టడానికి లేచారా" అని కంగారుపడ్డాడు మూర్తి. కాని అతను ప్రక్కనే ఉన్న బీరువాలోంచి ఒక లావుపాటి పుస్తకం తీసి గురుమూర్తి కిచ్చారు. "ఇది చదువుకో, నీ డౌట్స్ క్లియర్ అయిపోతాయి" అనే ఉద్దేశ్యంతో. అంతేకాకుండా 5, 6 పుస్తకాల పేర్లు కూడా చెప్పారు చదవమని. ఇంకా డౌట్‌లు అడిగితే లైబ్రరీ మొత్తం చదవమనేటట్లున్నారని, ఇక డౌట్‌లు వచ్చినా అడగకూడదని, అడగడానికి డౌట్‌లు ఇంకా ఉన్నా బ్రతుకుజీవుడా అని బయటపడ్డాడు.

అది సెమినార్ హాల్. మన మూర్తి ఆవేశంతో చెప్పుకుపోతున్నాడు. ఇంగ్లీషులో ఎంతో అపశృతి కనిపిస్తుంది. ఆడియన్స్, ఆ సెమినార్ దేనిగురించో మరచిపోయి మన మూర్తి మాటాడే ఇంగ్లీషులో గ్రామర్ తప్పులు పట్టుకోవడంలో నిమగ్నులయ్యారు, సెమినార్ ఇస్తున్నంతసేపు, మన మూర్తిగాడి గైడ్ గారు మాత్రం తలపట్టుకు కూర్చున్నారు.

ఇలా చాలా పాట్లుపడి ఒక సంవత్సరం పూర్తయిందనిపించాడు. ప్రస్తుతం తను సీనియర్ ఎమ్.టెక్. బాచ్‌లోకి వచ్చాడు. మూర్తిలో చాలా మార్పులొచ్చాయి. ఇంగ్లీషులో బాగా మాటాడలేకపోయినా తప్పులుండడం లేదు. హిందీ అర్థం అవుతుంది. జూనియర్ ఎమ్.టెక్‌లో ఎవరైనా ఇంగ్లీషులో తప్పులు మాటాడితే తన మొదటి పరిస్థితిని మరచిపోయి వాళ్ళని హేళన చేయడం మామూలు అయింది మూర్తికి.

కందుకూరి అప్పలరాజు, రిసెర్చి స్కాలర్, సివిల్ ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంట్,
ఐఐటి, పొవాయ్, ముంబాయి - 400 076

తిరుమల కవిత కథ

# కాలమిచ్చిన తీర్పు

కళ్ళుమూసుకుని ప్రశ్నలను మననం చేసుకుంటున్నాను. గమ్యం చేరామన్నట్టు కారు ఆగడంతో వెనుక సీట్‌లో ఉన్న నేను "వచ్చేసామా?" అన్నాను.

"జీ! యెహి హై మేమ్ సాబ్‌కా ఘర్" అంటూనే డోర్ తెరిచాడు డ్రైవర్. దిగిన నన్ను శీతాకాలపు చల్లగాలి జివ్వున తాకింది.

రోడ్డు కెడమపక్క ఎకరం స్థలం చుట్టూ తోట. విచ్చిన కమలంలోని పుప్పొడిలా చిన్న ఇల్లు. తన్మయత్వంగా గేటును సమీపిస్తున్నాయి నా అడుగులు.

"యల్లిందరు బందె?"

అప్పుడు నేను వచ్చింది కర్నాటక అనీ, అక్కడున్నతనితో కూడా చెప్పి లోపలికి వెళ్ళాలని గుర్తొచ్చింది. హిందీలో చెప్పిన మాటకు "నమస్కారం! బన్ని" అంటూ దారితీసాడు.

గేటుకిరుప్రక్కల అశీకాలు స్వాగతం పలుకుతున్నాయి. కొబ్బరి, మామిడి, సపోట, జామ ఆకాశన్నంటుదామా అన్నట్లు కొమ్మలను చాచి ఉన్నాయి. ఇంటి వరకున్న దారిలో ఎర్రమట్టిపై ఆరోహణ క్రమంలో నిలిచిన నాపరాళ్ళ కిరువైపులా చేమంతి, గులాబి, కనకాంబరం, పారిజాతం గుత్తులుగా పూసి తలలూపుతున్నాయి. శ్రద్ధగా పెంచిన తోట చేయి తిరిగిన చిత్రకారుడు గీసిన చిత్రంలాగుంది. మంచుపొగను చీల్చుకుంటే వచ్చే ఉదయ కిరణాలు అక్కడి ప్రకృతిని మెత్తగా చుంబిస్తున్నాయి.

గుమ్మం పక్కన నృత్యభంగిమలో నున్న కర్పూరపు కొమ్మ క్రింద డా॥ యామినీ చరణ్ అక్షరాలు బంగారు రంగులో మెరుస్తూ నా కాళ్ళనక్కడే నిలిపాయి.

టాక్సీ దిగిన్నుంచి అతం, ఆకర్షణ కలగలిసిన పరిసరాలు మనస్సును ఆనందానికి గురి చేస్తున్నాయి.

"కళాసాగరంలో మునగబోతున్నావు జాగ్రత్త!" సిక్త్‌సెన్స్ హెచ్చరిక మెదడులో రాత్రినుండే మొదలైంది.

"కళే జీవంగా ఉన్నవాళ్ళను ఇంటర్వ్యూ చేయడం నావల్లకాదు సార్" అని ఆనాడు తప్పించుకున్నా, నిన్ను బెంగుళూర్ పంపేదే ఆ కళామతల్లి సంతానం ఇంటర్వ్యూ కొరకు. ఆ సమర్థత నీలోనే ఉందని ఎడిటర్‌గారు వెన్నుతట్టడంతో ధైర్యం చేతబట్టుకుని బయల్దేరాను.

"అమ్మవరు బందారె, కూత్‌కళి" ప్యూన్ మాటలకు మనస్సుకు సర్దిచెప్పి లోపలికి అడుగు పెట్టాను.

స, రి, గ, మ ..... రాగాలాపన ఎక్కడినుండో చల్లగా గాలిలో కలిసి ఆగింది.

ఆకాశం రంగు నింపుకున్న గోడలపై గోల్డ్‌కలర్ ప్రేముల్లో సృజనశీలుల ఆత్మానుభూతులను నింపుకున్న చిత్రాలు చుట్టూ ఉన్నాయి. ఒకమూల నటరాజస్వామి బంగారు రంగులో మెరుస్తున్నాడు. కాళ్ళదగ్గర రెండు గులాబీలు, అక్కడే ఉన్న అందెలు

తకథిమి, తకథిమి ..... వెలుగుతున్న అగరు ధూపం గజ్జలు లోపల కదిలి సవ్వడి చేస్తుంది.

ఇంకోమూల పచ్చటి గుడ్డ తొలగించిన వీణ. తీగల్లో గాలి చేరి గాంధారాన్ని శృతి చేస్తుంది.

"ప్లీజ్ సిడౌన్!" పియానో మెట్లపై వేలుంచితే జారే స్వరంలాంటి మాట వినపడ్డవైపు కళ్ళు చెమక్కున కదిలాయి.

తెల్లటి లేత పాదాలు సిల్కుచీరలో కలిసిపోయాయి. భుజాల మీదుగా విరబోసిన పొడవాటి జుట్టు, కలువరేకుల్లాంటి పెద్ద కళ్ళమధ్య కంచెలాంటి సన్న ముక్కు. వంపు తిరిగిన పెదవుల కింది చిన్న గడ్డం. అలంకరణంతా పూర్తిచేసిన చిత్రకారుడు ఎర్రటి రంగులో కుంచెముంచి నుదుటిపై అద్దినట్టు చిన్న బొట్టు. దానికిందే నల్లటి పుట్టుమచ్చనుకుంటా. సుమారు మధ్య వయస్సు.

కూర్చోండి! అన్నట్లు చేయూపింది.

గోడల రంగులో కలిసే దిండ్లున్న స్వచ్ఛమైన తెల్లటి సోఫాలో అనుకున్న దానికంటే ఎక్కువే కూరుకుపోయి కూర్చున్నా.

పట్టులాంటి జుట్టు వెనక్కి తోసుకుంటూ, కూర్చుని, చెప్పండన్నట్లు నావైపోసారి చూసింది.

"నేను మిమ్మల్ని ఇంటర్వ్యూ....." మాట పూర్తికాకుండానే తనకివన్నీ మామూలే అన్నట్టు కళ్ళు తిప్పి "అడగండి" అంది.

"నేను హైదరాబాద్ నుండి ....." మొత్తం చెప్పనీయకుండానే అలవాటైన ఇంగ్లీషులో సాగుతున్న సంభాషణను మారుస్తూ "మీరు తెలుగువాళ్ళా!" అంది.

ఆశ్చర్యం, ఆనందం ఆమె కళ్ళలో తొంగిచూసాయి.

నాలోను చాలా సంతోషం.

ఒక గొప్పవ్యక్తి అంతర్జాతీయంగా ఎదిగితే మనదేశం వాడని, జాతీయంగా అయితే మన రాష్ట్రం వాడని తెలిసిన క్షణం కళ్లే గర్వం నన్నావహించింది.

"ఇప్పుడే వస్తాను" ఆమె నడకలోనూ లయ. తక, తక ..... తక లోపలికెళ్ళింది.

వీణ పక్కనున్న పాలరాతి సరస్వతీ విగ్రహం మెడలోని మల్లెలు గదంతా పరిమళాన్ని నింపాయి.

గది నలుమూలలా తడిమిన నా చూపులు ముందున్న టీపాయి పైకి మళ్ళాయి. వీక్లీస్, న్యూస్‌పేపర్స్, కన్నడ, ఇంగ్లీషు చాలా ఉన్నాయి. ఇంగ్లీష్ పేపరు చేతిలోకి తీసుకున్నాను.

"రండి! బ్రేక్‌ఫాస్ట్ చేస్తూ మాట్లాడుకుందాం" ఆమె వచ్చి లోపలికి దారితీసింది. ఆమె నడుస్తున్నంతసేపూ నా నాలుక తక్, తక్ ... అంటూనే వుంది.

డైనింగ్‌హాల్ మధ్య టేబిల్‌పై అప్పుడే కోసిన పసుపు, ఎరుపు గులాబీలు గుత్తిగా పేర్చి ఉన్నాయి.

"ప్రజ్ఞా!" గుండెలోతుల్లోంచి ఆత్మీయత నింపుకుని వచ్చిన పిలుపు. కుర్చీలో కూర్చుంటున్న దాన్నల్లా చటుక్కున అటుతిరిగి చూసా.

"వస్తున్నా డాడి!" నన్ను కాదన్నట్టు, ఎవరిదో సమాధానం.

అయినా ఆ పిలుపు తాలూకు అనుభూతి గుండెలో వేలుపెట్టి దేనికోసమో వెతుకుతునే ఉంది.

నా నేత్రాలు పరిశీలనలో మునిగాయి.

ఎదురుగా ఉన్న గులాబి రంగు గోడపై ఒక పెయింటింగ్. ఆపక్క ఒక పాత ఫోటో. రంగు వెలసిపోయింది.

ఆకలేసిన వాడు కంచంలో వడ్డించిన ప్రతిదీ తిన్నట్టు. నాకళ్ళకు ఆకలెక్కువ. కనబడ్డ దేన్ని వదిలిపెట్టవు.

ఇద్దరమ్మాయిలు చెక్క మోటారుసైకిలుపై కూర్చుంటే వెనకనుండి ఒకబ్బాయి వారిపై చేతులు వేసి తొంగి చూస్తున్నాడు.

వేగంగా నా అడుగులు అక్కడికి వెళ్ళాయి. చేత్తో తడిమి చూసాను.

నా ఆల్బమ్‌లో భద్రంగా అడుగునున్న ఫోటో ..... ఇక్కడకి??

నాలో కోటి ప్రశ్నలు.

'ఆ ఫోటో నా చిన్నప్పటిది. ముందు నేను, వెనక నా స్నేహితురాలు, మా వారు' వెనకనుండి చెబుతుందావిడ.

మావారు ..... అంటే .... కృష్ణచరణా?

ఈమె ....యామిని చరిత. కలెక్టరు గారమ్మాయి.

అవును. ఆ నుదుటిపై పుట్టుమచ్చ. చిన్నప్పుడు స్కూలుకు బొట్టుపెట్టుకొస్తే "చరితా! నల్లబొట్టులా పుట్టుమచ్చే బాగుంది" ఇదెందుకని తుడిచేసేదాన్ని.

"చరితా!" ఆ పిలుపుకు అటుచూసాను. భార్యను పిలుస్తూ నీలంరంగు సూటులో నడిచివస్తున్నాడు. అప్పటిలా ముఖంలో అదే అందం. నేను చేసిన గాయపు మచ్చ బుగ్గపై మిగులుంది. చిన్నప్పుడు ఎన్నోసార్లు కోపంవచ్చి బావను కొట్టిన నా చేతులు ఒక్కదగ్గర చేరి నమస్కారం చేశాయి.

"ఆ ఫోటోనేం చూస్తారు. మా ఆవిడకో పిచ్చిసరదా. దాన్ని రోజుకోసారైనా చూడందే తోచదు. అందుకే అక్కడ పెట్టాము. రండి. టీ చల్లారిపోతుంది."

అదే ఆత్మీయత, అదే మాటతీరు.

★ ★ ★

పడిపోతావు ప్రజ్ఞా! పరిగెత్తకు, నా వెనకే కర్రనేలకు తాటిస్తూ వచ్చేవాడు. నేనింకా పరిగెత్తేదాన్ని. పరిగెత్తి పరిగెత్తి ఏ మట్టి గుంటలోనే, ఏ దిబ్బలోనో పడిపోయేదాన్ని. తనే వచ్చి చేయందించేవాడు. సరదా అయితే నన్నేడిపించు. కాని ఇలా మురికిలో పడకు. అత్తయ్య నన్ను తిడుతుంది అని ఏడిచేవాడు. అతను లేపగానే మళ్ళీ పరిగెత్తే దాన్ని.

అమ్మ, నాన్న యాక్సిడెంట్‌లోపోతే, కాలు మాత్రం పోయి అనాధగా మాఇంట్లో బ్రతికిన అవిటివాడు. ఘనా ఘన సుందరా ..... రాజశేఖరా నీపై మోజుతీర ..... అంటూ రాగాలు తీసే పిచ్చివాడి దగ్గరకు వెళ్ళకు, అన్ని వెధవ్వేషాలు అంటూ అమ్మ ఆడుకోనీయకున్నా, కంటిపాపలా నన్ను చూసే బావ.

ఇప్పుడు ..... ప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాసుడు.

"మాకు తెలుగు వాళ్ళను చూస్తే ఆత్మీయులను కలిసినట్టనిపిస్తుంది. అందుకే మీరు ఇంటర్వ్యూ కొరకొచ్చినా బ్రేక్‌ఫాస్ట్ కుండమన్నాను" టీ కప్పు నాముందుంచింది.

"మమ్మీ! ఫోటో అంటే గుర్తొచ్చింది. డాడీ మీతో వచ్చేసినప్పుడు ఏమనడిగారో ఒకసారి ఇమిటేట్ చేయి మమ్మీ" తల్లి భుజాల మీదుగా చేతులు చుట్టి గారాలు పోతుంది అప్పుడే వచ్చిన వాళ్ళమ్మాయి.

"ప్రజ్ఞా! ఏమిటీ చిన్నపిల్లలా?"

"అదేంలేదు. ఆ మాటలు వినక చాలా కాలమైంది ఈ రోజు తప్పదు."

చరిత పెదవులపై నవ్వు తళుక్కుమంది. గొంతు సవరించుకుని "నన్ను మీతో రానీయండి సార్. మీ ఇంట్లో పని చేస్తాను. ఒక ముద్దపెట్టినా చాలు. చూడు బాబు నీవు నిన్నటిరోజైనా చెబితే మీ మామయ్యతో చెప్పే వాడిని, ఇప్పుడు, ఇలా స్టేషన్‌కు వచ్చి అడిగితే నేనేం చేసేది. అతను కంగారుపడతాడు. కృష్ణా! ప్రజ్ఞ కోసమైనా నీవుండిపో, తను నిన్ను విడిచుండదు. లేదు చరితా! ఒక్క ప్రజ్ఞకోసం నేనా నరకంలో ఉండలేను. మీరు కాదంటే నాకు చావేగతి. ప్లీజ్! నన్ను రానీయండి" రైలుకూతతో మానాన్నగారు మీ డాడిని పైకెక్కించారు.

"ఆ తర్వాతేం జరిగింది?" నా ప్రశ్నకు తన తండ్రి, కృష్ణల గొంతులు మార్చి పలుకుతున్న పెదవులు అలాగే ఆగిపోయాయి.

ఒక జర్నలిస్టును నేనక్కడున్న విషయమూ మరిచిపోయినట్టున్నారు. నా చూపులకు తప్పదన్నట్టు "ఆ ఊరునుండి మేమిక్కడికే వచ్చాము. భరతనాట్యం నేర్చుకుంటున్న నా దగ్గరే ఉండి రాగాలు తీసే మావారికి సంగీతం నేర్పిస్తే బాగుంటుందన్న మాస్టారు సలహాపై నాన్నగారు ఆయనకు సంగీతం చెప్పించారు."

"నా కాలులేని అవిటితనానికి ఆసరాఅయిన కర్ర మా ఊరు స్టేషన్‌లోనే పడిపోతే, ఊతగా నిలిచి, కాగితం పువ్వులాంటి నాలో తావిని నింపిన దేవతండి......" అతని మాటను మధ్యలోనే తుంపి -

"చాల్లెండి. మిమ్మల్ని మాట్లాడనిస్తే ఇక వేరే మాటలే రావు" చిన్నగా భర్తను వారించింది.

సంతోషమో, బాధో కాని నాలో దుఃఖం ఉదయపు వెలుగులా, క్షణక్షణానికి పెరుగుతోంది. వృత్తినేర్పిన గాంభీర్యం కూడా సడలుతోంది.

ఏవో నేనడిగిన కొన్ని ప్రశ్నలకు నిగర్వంగా, సౌమ్యంగా సమాధానాలిచ్చిన వారిని నా కెమెరాలో బంధించి, నన్నూ, నాలో జరిగే హోరునూ వాళ్ళు పసిగట్టకూడదనే తొందరగా వెనుదిరిగాను.

కానీ, నా పాదలు ముందుకు సాగడం లేదు. ఆత్మీయులను విడిచి వెళ్ళుతున్నట్టు ఏదో బంధం వెనక్కు లాగుతుంది. వెళ్ళిన దారివెంటే వచ్చాను. ఆ ప్రకృతే నన్ను తనలో కలుపుకోలేక పోయింది.

నాకొరకు వెయిట్ చేస్తున్న డ్రైవర్ డోరుతీసి పట్టుకున్నాడు. కారులో ఎక్కబోతూ చూసాను. బయటవరకు వచ్చిసాగనంపిన ముగ్గురూ అక్కడే నిలబడున్నారు. చేతిపైబద్ధ

కన్నీటిని తుడుచుకుంటూ లోపల కూర్చున్నాను.

"హైదరాబాద్‌కు ట్రైన్ ఎప్పుడుంది" స్టీరింగ్ తిప్పుతున్న డ్రైవర్ నడిగాను.

"ఏక్ గంటేమే మేడమ్".

"సరే ముందు హోటల్‌కు పోనీ, అక్కడినుండి స్టేషన్ కెళదాము"

టికెట్ తీసుకుని రైలెక్కి కూర్చున్న నన్ను కన్నీళ్ళు ముంచేస్తున్నాయి. నాకళ్ళు బాధకు కరుగుతున్న హిమగిరులయ్యాయి.

చాలాసేపటికి దుఃఖం వెక్కిళ్ళతో ఆగింది. రైలు చాలాదూరం సాగింది. టాయ్‌లెట్‌లో కెళ్ళి ముఖం కడుక్కుని వచ్చాను.

ఎన్నాళ్ళకు నాలో మనిషి మేల్కొంది? దాదాపు ముప్పై ఏళ్ళు. బావ వెళ్ళిపోయిన్నాడూ ఇలాగే ఏడిచాను, అల్లరి చేసాను, జుట్టు పీక్కున్నాను, కానీ, బావనెవరూ వెతకి తేలేదు. ఆనాడే నాలోమనిషి చచ్చిపోయింది. ఇన్నాళ్ళకు ..... బావను చూసాకే జీవం పోసుకుంది. దానికీ దుఃఖమే సాక్ష్యం. దుఃఖించే వాళ్ళే ప్రేమిస్తారట. నాలో ఇన్నాళ్ళు ఆరెండూ లేవు.

పదిహేనేళ్ళనాడు భర్త, పిల్లలు ఢిల్లీ వెళ్ళిపోతున్నప్పుడురాని కన్నీరు ఈనాడు వచ్చిందంటే, బావలేక నేనే యంత్రంలా మారాను. బావను నిజంగా అభిమానించాను. అతను వెళ్ళాక నేను ఒంటరిదాన్నే అయ్యాను. ఆ ఒంటరితనమే నాలో కరుకుదనాన్ని పోసి ఉంటుంది. భర్త, పిల్లలు కూడా నాకు తోడుకాలేకపోయారు. అందుకే అందరినీ యంత్రాల్లా చూసాను.

అయినా రాతికి శిల్పం కావాలని ఉంటేనే ఉలి చెప్పినట్టు విని అందంగా మారుతుంది. లేకపోతే పగిలి ముక్కలౌతుంది, నాలాగ.

ముక్కల్ని ఏరి ఒక్క దగ్గర చేరుస్తాను. అతికి అందంగా మారితే నా అదృష్టం.

ఒక నిర్ణయం నాలో రూపుదిద్దుకుంది.

వెల్లువలా పొంగిన ఆలోచనల్ని కట్టిపెట్టి జర్నలిజం డిగ్రీ తెచ్చిన మేధతో, అనుభవం నేర్పిన అక్షరాలతో ఒక ఆర్టికల్ తయారుచేసాను. ఫస్ట్‌క్లాస్ కావడంతో ఎలాంటి ఆటంకం లేదు.

పేపర్స్ గుండెలపై పెట్టుకుని అలాగే నిద్రపోయాను. నాంపల్లి స్టేషన్‌లో గోలకి మెలకువ వచ్చింది.

అబ్బ! ఎంత ఆనందం. ఉరుములు, మెరుపులతో అస్తవ్యస్తంగా ఉన్న ఆకాశం వర్షిస్తే ఏర్పడే ప్రకృతి ప్రశాంతత నాలో నిండింది.

ఇంటికెళ్ళి స్నానం చేసి ఎంగిలిపడ్డాను. పత్రికాఫీసుకు వెళ్ళడానికి శరీరం మొరాయిస్తున్నా నేను తీసుకున్న నిర్ణయానికి మొదటిమెట్టు ఇదే కనుక బయల్దేరాను.

పార్కింగ్‌లో మోపెడ్ ఆపి పది సంవత్సరాలుగా అలవాటైన పరిసరాలు కాబట్టి నేరుగా ఎడిటర్ క్యాబిన్‌లోకి వెళ్ళాను. దాదాపు డెబ్బై సంవత్సరాల అనుభవాలతో పండిన తల వంచి ఏదో రాస్తున్నారు.

మౌనంగా వెళ్ళి రెండు కవర్లు ఆయన ముందుంచాను.

"ఎప్పుడొచ్చావు? ప్రయాణం బాగా సాగిందా?" ప్రశ్నిస్తున్నా బరువుగా ఉన్న కవరు

పక్కన పెట్టి ఇంకొకరు విప్పి చూసారు.

"ఏమిటిది?" అభిమానం నిండిన కోపం.

"రిజిగ్నేషన్ లెటర్"

"కనబడుతూనే ఉంది. ఇక్కడ రిజైన్ చేసి ఏం చేద్దామని".

"క్షమించండి సార్ నాలో ఉన్న భాషనంతా నింపి ఆ ఆర్టికల్ వ్రాసాను. ఇంక నేను వ్రాయలేను. నా మెదడులో పెద్ద శూన్యం రాజ్యమేలుతోంది. నాలో ఇప్పుడేమీ లేదు. నాద్వారా ఏమైనా తప్పులుంటే క్షమించండి. పదేళ్ళుగా మీదానిగా చూసారు. కృతజ్ఞురాల్ని."

కళ్ళు వర్షించడానికి సిద్ధంగా ఉన్నాయి. నాలో చేరిన బేలతనం ఆయన ముందు బయటపడకూడదని లేచాను.

"ప్రజ్ఞా!" వాత్సల్యం పిలుపుగా వెలువడింది. ఆయనలో అధికమైన ప్రేమో, బాధో కల్గితేనే గాని నన్ను పేరుపెట్టి పిలవరు.

తిరిగి చూసా.

"ఎక్కడికి?"

"రేపు రాజధాని బండిలో ఢిల్లీకి".

అనుకున్నట్టుగానే ప్రభాకరుడి దర్శనం కంటే ముందే ట్రైన్‌లో కూర్చున్నాను. ఇంక పది నిముషాలు టైముంది. "జీవితం చివరివరకూ నీకోసం ఎదురు చూస్తాను. మనసు మార్చుకుని రావడానికి ప్రయత్నించు" అని వెళుతూ చెప్పిన ఢిల్లీలోని అడ్రసును పదే పదే జ్ఞాపకం చేసుకుంటుంది మనసు. కళ్ళు ప్లాట్‌ఫాం అంతా కలియ తిరుగుతున్నాయి.

"నీవు ఎవరికైనా సెండాఫ్ ఇచ్చావా? నీకోసం రావడానికి" మనసు సర్ది చెపుతోంది.

చూపులు వ్యర్థం కానట్టు వడివడిగా బోగీలపై నున్న లిస్టు చూస్తున్న ఎడిటర్ ...

"సార్!" దిగి పిలిచాను.

"ప్రజ్ఞ! కాస్త ఆలస్యం అయ్యింది. కాని, నా స్నేహితుడికి అక్కడొక ఇనిస్టిట్యూట్ ఉంది. దాంట్లో లెక్చరర్‌గా చేరిపో. అక్కడేమి అవస్థలు పడకు. లేకపోతే నా దగ్గరకు వచ్చేయ్. మా ఇంట్లో ఉండిపోదువు. ఈ లెటరు ఉంచు....."

"సార్!" రెండు చేతులు పట్టుకున్నాను. ఇద్దరి కళ్ళు ప్రవాహాలయ్యాయి.

"నేననుకున్నట్టు జరిగితే వారం రోజుల్లో మీ దగ్గరకు వస్తాను. లేదు. మీరు చెప్పిన చోట లెక్చరర్‌గా చేరిపోతాను."

కొత్తగా కాపురానికి వెళ్ళుతున్న కూతురి కళ్ళు తుడిచి రైలెక్కించినట్టు పైకెక్కించారు. కూతతో కదిలిన రైలు ఒకరి కొకర్ని దూరం చేస్తుంది.

లెటరునేం . చేస్తావు? మనస్సడిగిన ప్రశ్నకు కిటికీలోనుండి బయటకు విసిరి నిశ్చితంగా కూర్చున్నాను.

క్షమించండి ..... మెదడులో రిహార్సల్స్. ఎంతటి తప్పునైనా ఒప్పుగా మార్చే పదం. అందుకే అదొక్కటే అడగాలని క్ష .... మిం .... చం ..... డి. మననం చేసుకుంటూ కళ్ళు మూసుకున్నాను ఎవరేమైతే నాకేంటన్నట్లు సాగే కాలంతో రైలు పరిగెడుతుంది.

ఎ.టి. కవిత, ఇంటి నెం. 1-6-25/బి,
నారాయణఖేడ్, మెదక్ జిల్లా - 502 286

## అయినవోలు వెంకట అరుణాదేవి కథ

# ఎర్రగంగ పొంగింది

భారత్ బంద్ పాక్షికం.
బెంగాల్, బీహార్, కేరళ, త్రిపుర, అస్సాంలలో పూర్తి బంద్.
బ్యాంకింగ్ వ్యవస్థలో అంతరాయం. కార్యకలాపాల స్తంభన.
358 మండలాల్లో ఖరీఫ్ పంటకు గండం.
ఉపగ్రహ చిత్రప్రదర్శన.
రాష్ట్రంలో ప్రశాంతత.
5వేల మంది అరెస్టు. ముగ్గురికి గాయాలు. నలుగురు మృతి.
లాఠీచార్జి ఫలితాలు.
ఆర్థిక బంధం పటిష్ఠతే మాధ్యేయం, మంత్రుల ఉవాచ.
షేర్ కొటేషన్‌లో తొలగిన భయం. షేర్‌మార్కెట్ హోరు.
పెట్టుబడులలో నిర్ణయం ABC అన్నంత తేలిక.
బాలశిక్షకుల నుండి షేర్‌పోరాటం.
కోట్ల పెట్టుబడి.
రోజ్‌గార్ యోజనలు.
పన్నువసూళ్ళలో రాజకీయ జోక్యం. మున్సిపల్ సిబ్బందికి బకాయిల చెల్లింపు.
విద్యుత్ సిబ్బంది సమ్మె ప్రారంభం.
3 రోజుల ఎన్‌కౌంటర్‌లో తప్పించుకున్న నక్సల్ దళాలు.
"ఆపేయ్ మానేజరూ. ఇంక ఆపెయ్యవయ్యా నీ రీడింగు."
"చిత్తం మహాప్రభో చిత్తం"
"ఏంటి సిత్తం సిత్తం. సిత్తుగా మత్తెక్కింది మరి ఆపైన....."
"బాబూ రత్తిని రమ్మని కబురుచెయ్యనా"
"రతి రత్తి సుత్తి రత్తి. ఉత్త పాతరత్తి అదేం వద్దు....."

"పోనీ దాని మేనకోడలు కమిలిని...!"

"నల్లముండ అదేంవద్దు."

"మరిc!"

"మరీలేదు గిరీలేదు. దాని కూతురు గంగిని పట్కురా".

గంగి .... అనేది ఒకర్త ఉన్నదా .... ఆలోచనలో పడ్డాడు మానేజర్ పార్వతీశం.

★ ★ ★

పరాంకుశం ఓ బట్టల మిల్లు యజమాని. వెయ్యిమంది కూలీలకు అన్నదాత. అతని అణువణువు తెలిసినవాడు పార్వతీశం లేనివాడే అయినా మనసున్న వాడని, ఎన్నో క్లిష్ట పరిస్థితుల నుండి రక్షించిన వాడని జ్ఞాపకం పెట్టుకుని రోజుకూలీ నుండి రాజుకూలీదాకా అతణ్ని లాక్కొచ్చాడు యజమాని పరాంకుశం.

సదరు యజమానికి ఇల్లు ఇల్లాలు అవసరం లేదు. రోజుకో రసగుల్లా అంటే వల్లమాలిన తనం. అలా చాలాకాలంనుండే అందిస్తున్నాడు పార్వతీశం. ఎన్ని సరగుల్లాలున్నా రత్తి పేటెంటన్నది అందరికీ తెల్సిన విషయం.

ఉత్త పాతరత్తికి మొట్టమొదట ఒడినింపినవాడు పరాంకుశం. అందుకే అదన్నా దానికి ఇతడన్నా మహా ఇది. ఇంతింతై వటుడింతై అన్నట్టు ఎక్కిన ప్రతిమెట్టు దాన్ని తల్చుకోంది ఉండలేడతడు. దాన్ని పట్టిన్నాటినుండే అంతవాణ్ని అయ్యానని అదో ఇది అతనికి. అతడో ఉడుం. దానిమీద ఈగకాదు కదా గాలికూడా సోకనివ్వడు. కూలీలకు లీడరు రత్తి.

ఇటు కూలీలు అటు యాజమాన్యం రత్తి చేతిలో ఉండబట్టే రత్తంటే యాజమాన్యానికీ, కూలీలకు అంత ఇది కూడ.

★ ★ ★

మొగుడు చచ్చిన అనాధగా ఇల్లు చేరితే కమిలిని కాదనలేక చేరదీసింది రత్తి.

యాజమాన్యం చూపు కమిలి మీదకూడా పడింది.

రత్తి కమిలికాదు.

భాగస్వాములైన యాజమాన్యం మొత్తం రత్తిని చూడలేదు. రత్తిని పట్టిన ఉడుం కమిలిని కూడా చూడాలనుకుంది. కాని రత్తి ఉత్తదికాదు. సుత్తితో రత్తి నణచింది. అవాక్కైపోయింది ఉడుం.

అలా కాలం ఇరవై వసంతాలు దాటింది.

★ ★ ★

చినబాబుకు ఐదో వసంతంనాడు కమలికి గంగ పుట్టింది.

స్కూల్ ఫైనల్ ప్యాసై ఇంకా చదువుకుంటానంది గంగ.

గంగకి 'సదువేటికే' యాజమాన్యం మాట.

ఆమాటే "వొల్ల"నని రత్తి చెప్పింది.

ఎవ్వరూ మాట్లాడలేదు.

★ ★ ★

' ౦రికా నుండి వచ్చాక నిన్ను నాదాన్ని చేసుకుంటా"నని చేతిలో చేయివేశాడు చిన్నబాబ..

"అంతవరకు నేను ...."

"కాలం నిర్ణయించిన ఫలితంకోసం ప్రతి ఒక్కరం వేచి చూడాల్సిందే"నని ధైర్యం చెప్పాడు

గంగ గుండెల్లో నిండిన అలజడి తగ్గింది.

కాలం తీర్పులో రత్తికి నూకలు చెల్లినయ్.

కమిలి - కమిలిగానే ఉంది.

కమిలి రత్తి కాలేదు.

కాలం శతచక్ర శకటంపై పరుగుతీస్తూనే ఉంది.

రత్తి పోయినప్పటి నుండి పెద్దమ్మగారికి చేరువైంది గంగ. మాలిమై మారాం చేసేటంత చనువును పెంచుకుంది.

"పట్నం వెళ్ళి చదువుకుంటా"నని అడిగింది పెద్దమ్మగార్ని.

"చినబాబు వచ్చాక చెప్పిచూస్తాను. వాడైనా నామాట వింటే నీ కోరిక తీరుస్తా'నని చెప్పింది ఆమె.

"చినబాబు వచ్చేదాక తోచడం లేదనే" అడిగింది గంగ. ఆమాట పైకి అనలేదు. ఎవరితోనూ చెప్పలేదు. రోజులు యుగాల్లా గడచినా క్షణాల్లా దొర్లే రోజుకోసం ఎదురుచూడక తప్పింది కాదు గంగకు.

రోజుకోసారైనా ఎదురయ్యేవాడు యజమాని. గద్దనుచూసి భయపడే కోడిపిల్లలా తల్లి రెక్కల్లో దాగినట్టు పెద్దమ్మగారి నీడన దాగిపోయేది గంగ.

"అది కనిపించని రాక్షసత్వపు పతిమకు వినిపించని పర్యవసానపు విమోచనలా" తోచింది.

"ఆస్తి అంతస్తు, హోదా సంఘంలోని తాహతు మనిషిని ఏదో ఓ మత్తులోనికి దించుతుంది" అన్న వాక్యం కొంతవరకు సమంజసమేనేమో! ఏ మత్తూలేని వారెందరు?!

★ ★ ★

చినబాబు రెండురోజుల్లో వస్తున్నాడన్న తారుకు తేరుకున్న గంగ సంతోషానికి అవధి లేదు.

అందరిలోను హడావిడి.

రాత్రి తెల్లవారుతోంది. తిరిగి రాత్రి అవుతోంది ఇది కాలక్రమంలోని చక్రమేనిక్రమం.

రెండోరోజు రాత్రి.

ఆపాదమస్తకం ఎక్కి తొక్కిన లాడిస్తున్న మత్తు గమ్మత్తుగా ఉంది యజమానితో

అతని ఇల్లాలు ఆరోజు తన సంతోషాన్ని పంచుకోడానికి గంగను తన దగ్గరే ఉండమని చెప్పింది

అలాగే ఉండిపోయింది గంగ

బయట హోరుగాలి జోరుగానే ఉంది.

ఉత్తమ ఇల్లాలు పెద్దమ్మగారు తన పాన్పు పక్కన నులకమంచం వేయించింది. అందాల బొమ్మకు దిష్టిచుక్కలా ఉందా మంచం.

అదే ఆనందం అనిపించింది గంగకు. పెద్దమ్మగారు పడుకుంటే "ఓ పట్టు పట్టనా'

అమ్మగారు అని అడిగింది.

"ఏ పట్టువద్దే గంగా. అప్పుడప్పుడు నాకనిపిస్తుంది ....."

"ఏమనండి"

"గంగ నా కూతురైతే బావుండునని"

ఆమె మాట పూర్తయ్యే లోపునే "అలా అనకండమ్మా" అప్రయత్నంగానే అనేసింది గంగ.

"ఏఁ ఎందుకు?!" అడిగింది పెద్దమ్మగారు.

గంగ మనసులో చినబాబు మెదిలాడు. మౌనంగానే ఉండిపోయింది.

తట్టి మళ్ళీ ఓసారి అడిగింది పెద్దమ్మగారు.

పరధ్యానంగా వదిలి తత్తరపడిందే కాని ఏమీ చెప్పలేక పోయింది.

"సరే చాలా పొద్దుపోయింది ఇక పడుకో" అంటూ లైటాఫ్ చేసింది పెద్దమ్మగారు.

"చీకటంటే నాకు భయం."

"క్షణం కళ్ళు మూసుకుని తెరిస్తే అంత చీకటి ఉండదు" సర్దిచెప్పి ఒత్తిగిలి పడుకుందామె.

అలాగే చేసింది గంగ. ఆమె చెప్పినట్టే తోచింది. కళ్ళు నిద్రలోకి ఎప్పుడు చేరిపోయాయో! తెలియనేలేదు.

* * *

పెనుగులాటగా తోస్తే లైటెయ్యాలనుకుంది ఇల్లాలు.

"పగిలిన బాటిల్ శబ్దం" వినిపించి కేక వేయాలనుకుంది. కాని ఆ కేక తన చివరి కేక అవుతుందని ఆమెకే తెలియదు.

"ఘోరం జరిగి పోయింది."

మరో కేక తనకే తప్ప మరెవ్వరికీ వినిపించలేదు.

తుఫాను హోరు ఉధృతమై తగ్గింది.

* * *

డాక్టర్ ప్రణవ్. ప్రణవ్ రెండుసార్లు మననం చేసుకుంది గంగ. ఏమీ పాలుపోని స్థితి.

పక్కనే పడున్న పెద్దమ్మగారి శవం.

ఇంట్లో నిశ్శబ్దంతోపాటు శ్మశాన ప్రశాంతత.

వొంట్లో నిన్నటిదాకా తెలియని వికృత నిశాంతత.

* * *

గంగ లేచింది.

జానెడు ప్రొద్దులో సూరీడు నిప్పులు కక్కబోతున్నాడు. కాని అవి అంత తీక్షణంగా లేవు.

జవ చచ్చిన చంద్రనిప్పుముద్దలా తాటాకు సెగలా తోచింది

పవిత్ర గంగ పారుతూ ఉంది. ఉధృతమై ఆగని ఆ పరుగు సంద్రం చేరే సందడి పడుతోంది.

గంగ దిక్కుతోచక దిక్కులు చూస్తూ క్షణం నిల్చుని చుట్టూ చూసింది.

యజమాని ఖాళీచేసిన సీసా నేలనదొర్లి దూరంగా పడి ఉంది.

"దాన్నో బండకు కొడితే" ఏదో స్ఫురించి లేచింది.

ఆన ఆలోచనలా ఫెళ్లున కూలాయి సీసాముక్కలు.

అమ్మగారి నెత్తుటితో తడిసిన ప్రాంతంలో పగిలిన గాజుపెంకులు మంచుముక్కల్లా మెరిసాయి. మరోసీసా నేలకేసి కొట్టింది.

అది శూలంలా పగిలింది.

అదేదీ పట్టనట్టు మత్తులోని హాయి చిత్తుచేస్తే వెల్లకిలా పడుకుని ఉన్న యజమానిని చూసింది. ఏదో కలల లోకంలో విహరిస్తున్న అతనిని ఈ లోకంలోనే విహరింపచేయాలనుకుంది.

బ్రతకడానికన్నా పదిరెట్లు ఎక్కువైన ఆశ పెరిగింది ఆమెలో. మనిషి నిలువునా దహించి ప్రవహిస్తున్న నెత్తుటి ఆలజడి కుత్తుకలో స్థంభించింది.

ఒడుదుడుకులుగా సాగిన అడుగులు ముందు ముందుకు భయంకరంగా నడిపించాయి.

గంగకు పగ్గంపెట్టుదూరంలో ఉంది యజమాని మంచం. అతనికి దగ్గరగా నడచిన కాళ్ళు అప్రయత్నంగా చేతులను లేపాయి.

నిశ్శబ్దంతోపాటు ఆలోచనా రాహిత్యం అంతట అలుముకుంది.

లేచిన చేతుల్లోంచి గాజుబాకు అతని గొంతులో దిగి నాట్యం చేస్తూ దరులు చూసింది.

శబ్దంలేని ఒక్క మూల్గుతో అతని కాళ్లూ చేతులు చలనాన్ని కోల్పోయాయి.

ప్రవాహంగా పారిన నెత్తుటేరు గంగ పాదాలనంటి పునీతమైనట్టు ప్రవహించింది.

కళ్ళు చీకట్లుకమ్మగా తడబడిన అడుగులు మందుకు సాగాయి.

అరుణుడు అప్పుడే ఉదయాద్రి నలంకరించ బోతున్నాడు. పెనుతుఫానులో చిక్కిన ఏర్‌బస్ కూలిపోయింది. డా॥ ప్రణవ్, ప్రదీప్, సేఠీ, భార్గవ్, లామెలా, తేజస్విని, మిగిలిన 58 మందితో ఉన్న డాక్టర్ బృందం జాడ తెలియడంలేదు. బొంబాయినుండి హైదరాబాదు రావలసిన వాయుదూత్ నేలకూలిందన్న వార్త తెల్లవారి ప్రాంతీయవార్తల్లో అందరూ విన్నారు.

గంగ పవిత్ర గంగా తీరానికి చేరుకుంది.

బలంగా బిగుసుకుని ఉన్న పిడికిలిలోని గాజు - బాకు లేత కిరణాలకు మందుతున్న ఎర్రని కొర్రాయిలా మెరిసింది. మెరిసినంతసేపు పట్టలేదు. గంగ కడుపులో దిగి వెనక్కితేలి చల్లబడింది.

అడుగుల దూరంలో ఉన్న గంగలో కలిసింది. గంగ సాగి కనిపించినంత దూరం రక్తసిక్తమై ఎర్రబడి ప్రవహించింది.

ప్రవాహం అలా సాగుతూనే ఉంది.

ఎర్రబడ్డ గంగ పొంగుతూనే ఉంది.

అయినవోలు వెంకట అరుణాదేవి, 2-2-1105/9/12,
తిలక్‌నగర్, నల్లకుంట, హైదరాబాద్ - 500 044.

# స్వర్గంలో దాస్యం

'ఛైల్డ్‌క్రైస్ట్ అనాధాశ్రమం' ముందు కంటెస్సా కారాగింది.

ముందు డోరు తెరుచుకోగానే కిందకు దూకింది సౌజన్యం.

ఏడేళ్ళుంటాయామెకు. వెనకసీట్లో ఉన్నవాళ్ళకి 'టాటా' చెప్పి ఆశ్రమంలోకి పరుగుతీసింది.

వెనకసీటు కిటికీ అద్దం కూడా తెరచుకోలేదు ..... ఏసీకారు కదా మరి! బర్రున కారు సాగిపోయింది.

* * *

'సౌజన్యొచ్చింది! సౌజన్యొచ్చింది!"

.... ఆశ్రమం పిల్లల కలకలం విని, ఆఫీసుగదిలోంచి బయటకు వచ్చింది ఆ ఆశ్రమ నిర్వాహకురాలు, మిస్ నైటింగేల్. ఆమె అంతవరకూ అక్కడి పిల్లల హెల్త్ రిపోర్ట్స్ చూస్తూ ఉంది.

'గుడీవెనింగ్ మిస్!' నవ్వుతూ పలకరించింది సౌజన్య.

'గుడీవెనింగ్ సౌజన్యా! ఏమిటి సంగతి? మీ మమ్మీ డాడీ ఏరి?' అడిగింది నైటింగేల్

'వాళ్ళిద్దరూ అక్కావాళ్ళ స్కూల్ ఏనివర్సరీ ప్రోగ్రామ్సుకి వెళ్ళారు. నన్ను అంతవరకూ యిక్కడ ఫ్రెండ్స్‌తో మాట్లాడుతూ ఉండమని చెప్పారు!'

'సరే! మీరంతా మాట్లాడుకుంటూ ఉండండి. నేనిప్పుడే వస్తాను' అంటూ మళ్ళీ ఆఫీసుగదిలోకి వెళ్ళిపోయింది నైటింగేల్.

'చైల్డ్‌క్రైస్ట్' అనాధాశ్రమం నెలకొల్పిన మొదటి సంవత్సరంలోనే పసిగుడ్డుగా చేర్చుకోబడింది సౌజన్య. దాదాపు ఆరున్నర సంవత్సరాలు అక్కడే పెరిగింది. అనాథ శిశువులను దత్తత తీసుకోవలసిందిగా ప్రజలకు ప్రభుత్వం చేసిన విజ్ఞప్తిని పురస్కరించుకుని ముందుకువచ్చిన వాళ్ళలో ధనీరామ్ దంపతులొకరు. 'చురుకైన పిల్ల' అంటూ సౌజన్యని ఎంచుకుని దత్తత తీసుకున్నారు. వాళ్ళకి అప్పటికే 'సౌందర్య' అనే పదేళ్ళ కూతురు ఉంది. సాధారణంగా పిల్లలేనివాళ్ళకే దత్తత యివ్వాలన్న తమ ఆశ్రమపు నిబంధనను సడలించక తప్పలేదు నైటింగేలుకి - ధనీరామ్ దంపతుల హోదా, పలుకుబడీ చూసాక.

దత్తత వెళ్ళిన ఆరునెల్లకి సౌజన్య యిప్పుడే తొలిసారిగా ఆశ్రమానికి వచ్చింది .... అందుకే యింత కోలాహలం. స్వర్గతుల్యమైన గృహవాతావరణంలో ఆమె అనుభవాలు విని తెలుసుకుందామని ఆశ్రమం పిల్లలంతా సౌజన్య చుట్టూ చేరారు.

★ ★ ★

'ఆ యిల్లు ఎంత పెద్దదనుకున్నారు? ...... మన ఆశ్రమాల్లాటివి పదైనా అందులో సరిపోతాయి' చెప్తోంది సౌజన్య కళ్ళింత చేసి.

'మరా యింట్లో ఎంతమందుంటారు? ..... వందమందా!' అడిగాడు సూర్యం. వాడేమో నాలుగేళ్ళవాడు. వాడికి బుర్రనిండా సందేహాలే!

'వందమందా? ..... ఇంకానయం! అయ్యగారూ, అమ్మగారూ, అక్కా, నేనూ ఒక పనివాడూ, ఒక తోటమాలీ, ఒక డ్రైవరూ, ఒక వాచ్‌మేనూ ..... ఇంకా, వంటావిడ విశాల కూడా ఉంది!

'అంత పెద్దింట్లో పదిమందైనా లేరా!' ఆశ్చర్యపోయేరందరూ.

'అవునూ .... నువ్వేమిటీ అయ్యగారూ, అమ్మగారూ అంటున్నావు? మీ సౌందర్య కూడా అలాగే అంటుందా వాళ్ళ మమ్మీ డాడీని?'

సంయుక్త అడిగిందీసారి. పన్నెండేళ్ళుంటాయామెకి.

'అక్కకి మర్యాదగా మాట్లాడడం తెలీదుట ..... అందుకే మమ్మీ డాడీ అంటుంది. అసలెప్పుడూ 'మా. పప్పా' అంటుందిలే! ..... ఇన్నాళ్ళూ అమ్మా, అయ్యా లేనిదాన్ని కదా, నన్నందుకే అమ్మగారూ. అయ్యగారూ అని మర్యాదగా పిలవమన్నారు'.

'మరి నిన్ను వాళ్ళెలా పిలుస్తారు?' సూర్యం డౌటు.

'నన్నందరు 'సుజీ' అనే పిలుస్తారు. అయ్యగారికీ, అమ్మగారికీ నేను లేకపోతే క్షణం తోచదు తెలుసా! ఎప్పుడూ ఏదో ఒకదానికి పిలుస్తూనే ఉంటారు. అక్కకేమో ఒక్క పనీ సరిగ్గా చెయ్యడం రాదుట ..... ఎప్పటికి నేర్చుకుంటుందో ఏమో!'

'మరి చదువుకోవడం మానేసావా ఏమిటి? ఇక్కడున్నప్పుడు మూడోక్లాసు దాకా చదివేవు కదా!' అడిగాడు వాసు. వాడూ సౌజన్యా కలిసే చదువుకున్నారు.

'ఇప్పుడు నేను యింట్లోనే చదువుకుంటున్నాను. అక్క పుస్తకాలు నాలుగవ తరగతివి

ఉన్నాయిలే!'

'అక్కడ టీవీ ఉందా?' మళ్ళీ సూర్యం అడిగాడు. సౌజన్య దత్తత వెళ్ళిన తర్వాత యిక్కడ పోర్టబుల్ టీవీ కొన్నారు, బ్లాక్ అండ్ వైట్‌ది.

'ఓ! ఉత్త టీవీయేకాదు .... కేబుల్ టీవీ, వీసీఆర్, అన్నీ ఉన్నాయి తెలుసా! టీవీలో బొమ్మరంగుల్లో వస్తుంది!' ఉత్సాహంగా చెప్పింది సౌజన్య.

'సాయంత్రమయ్యేసరికి మీరంతా చక్కగా సోఫాల్లో కూచుని అన్నీ చూస్తారు కాబోలు!' కొంచెం యీర్ష్యగా అన్నాడు వాసు. ఇక్కడ వీళ్ళంతా నేలమీదే కూచుని చూస్తారు .... అదీ రాత్రి చదువయ్యాక, భోజనాలు చేస్తున్నప్పుడే. ఎప్పుడైనా మంచి ప్రోగ్రాములు వస్తూ మాత్రం చదువాపి చూడవచ్చును.

'అందరం చూస్తామనుకో! అంటే వాళ్ళందరూ సోఫాల్లో కూర్చుంటారు. నేనేమో కార్పెట్ మీద కూర్చుంటాను .... కార్పెట్ కూడా చాలా మెత్తగా ఉంటుంది తెలుసా! ..... నాకింకా సోఫాలో సరిగ్గా కూచోడం రాదుగా! .... అందుకూ!' పక్కనే ఉన్న ఆఫీసుగదిలో కూర్చుని, పని చేసుకుంటూనే, వీళ్ళ సంభాషణ అంతా వింటున్న నైటింగేలుకి ఎందుకో మనస్సు చివుక్కుమంది.

'సౌజన్యా! మరీ .... నీ గౌనెంతో బాగా మెరుస్తోంది. ఎప్పుడు కొనుక్కున్నావు? నీకు కొంచెం పొడుగైనట్టుందే!' ఈ ప్రశ్న సుందరి వేసింది. ఆ అమ్మాయి కెప్పుడూ మంచి బట్టలూ, నగలూ ఉంటే చాలు .... ఊహల్లో!

'ఇది అక్క గౌను. తనకు పొట్టి అయిపోయిందని, అమ్మగారు నాకు యిచ్చారు .... మొన్న పండక్కి నాకూ కొన్నారు కొత్త గౌను'.

'సౌందర్యా, నువ్వూ కలిసే వెళ్ళి ఎంచుకున్నారా కొత్తగౌన్లు?'

'లేదు .... లిక్కేమో పేచీపెట్టి అయ్యగారి వెంటే వెళ్ళి గౌను కొనిపించుకుంది. నేనేమో అమ్మగారి మాట విని బుద్ధిగా యింట్లోనే ఉన్నాను కాబట్టి, అమ్మగారే నౌకర్ని పంపించి అక్కావాళ్ళు వచ్చేలోపే నాకు కొత్త గౌను తెప్పించారు తెల్సా!'

'ఎక్కడ కొన్నారుట?' సూర్యం దౌట్లకి అంతుండదు.

'ఎక్కడో ఏమిటి? దూరంవెళ్తే లేటైపోదూ! అక్కకన్నా ముందు నాకే గౌను తేవాలని, మా యింటి ఎదురుగానే పేవ్‌మెంటుమీద కొత్త గౌన్లమ్ముతుంటే కొని పట్టుకొచ్చాడు.'

ఆఫీసు గదిలోంచి బయటకొచ్చింది నైటింగేల్. సౌజన్యతో చాలా విషయాలు మాట్లాడాలనీ, ఎన్నో సంగతులు అడిగి తెలుసుకోవాలనీ ఎంతగానో అనిపించిందామెకు కానీ, ఇంతలోనే వీధి గేటు దగ్గర కారాగిన శబ్దం, వెనువెంటనే కారు హారన్ వినిపించేయి ఒక్క ఉదుటున లేచి పరుగుతీసింది సౌజన్యం 'టాటా ఫ్రెండ్స్! .... టాటా మిస్! .. సీయూ!' అంటూ, ...... పాపం పిచ్చిపిల్ల.

ఛాయామల్లిక్, 26-1-7, బౌడారా రోడ్, విశాఖపట్నం - 1

# మేష్టారి తీర్పు

ఈజీ ఛైర్‌లో రాఘవయ్య వాలాడు. చుట్టూరా ఆయన గది అంతా అల్లకల్లోలంగా వుంది. టేబుల్ మీది కాగితాలూ అస్తవ్యస్థంగా వున్నాయి. ఆయన ఆలోచనల్లా - ఆయన మనసులా - ఉదయం నుండి దేనికోసమో నిరీక్షణ - దేనికోసమో అన్వేషణ - మంచం నుండి లేవడం, మంచంమీద వాలడం మళ్ళీ ఓపిక కూడకట్టుకొని ఛైర్ నుండి లేవడం మంచంమీద కూలడం - అంతలో అలికిడి - తలుపు కొట్టిన శబ్దం. అది విన్న రాఘవులు మనసు శాంతించింది. లేచి తలుపు తీసాడు. ఎదురుగా నవ్వులు పులుముకున్న పోస్ట్‌మన్. ఉత్తరం ఇచ్చాడు - లోపలకు వస్తూ వస్తూనే అక్షరాల వెంట పరుగుతీసాడు. "క్షమించండి! బ్యాంక్‌లో ఆడిట్ అవుతుంది. రావడం కుదరదు. యమునను పంపడం కూడా కుదరదు. నమస్కారముల్తో మీ అల్లుడు చక్రవర్తి. చెప్పడం మరిచాను. నీ ఇద్దరు మనుమరాళ్ళు క్షేమం". ఒక్కసారి రాఘవయ్య కళ్ళు మూసుకున్నాడు. ఎడమచేతిని అలా పైకిలేపి జుత్తులోకి పోనిచ్చాడు. బుర్రమీద కాసేపు గోక్కొని మాలిష్ చేసాడు. ఏమిటి చేసేది? ఏమిటి ఇలా వచ్చింది ఉత్తరం? బ్యాంక్‌లో నిజంగా పనులుంటాయి. లేకపోతే అల్లుడుగారు అలా ఎందుకు రాస్తారు. తలుపు మీద టకటకలు - సారీ మాస్టారు మీకు మరో వుత్తరం కూడా వచ్చింది. నా హడావుడితో ఒకే ఉత్తరం ఇచ్చాను మీకు - అందుకొని ఆత్రుతగా చదవడం మొదలెట్టాడు. "నమస్కారముల్తో - మీ ఉత్తరం అందింది. రమ్మని కబురు చేసారు - సారీ మామగారు ఇక్కడ నేను సీట్లో లేకపోతే ఆఫీసు కురుక్షేత్రం చేస్తారు. సబ్‌స్టాఫ్ అంతా రెచ్చిపోతారు. సెకండ్ ఆఫీసర్ లీవ్‌నుండి రాగానే వస్తాను. నీ మనుమరాలి అల్లరితో సరస్వతి చిక్కిపోయింది - వుంటాను మీ అల్లుడు ధన్‌రాజ్. మళ్ళీ నిరాశకి గురికావల్సి వచ్చింది. రెండు రెమ్మలు కూలి మీదపడ్డట్టు. రెండో అల్లుడు, మూడో అల్లుడు ఇద్దరిక్కూడా పనులున్నాయని రాసారు. బాధతో వుండకట్టుకపోయాడు. ఆఖరి ఘడియల్లో కాస్సేపు మాట్లాడ్దామనే ఆలోచన తప్ప మరే పనంటూ ఏమీలేదు రాఘవయ్యకి.

* * *

సాయంత్రం ఆరుగంటలు. ఉదయం నుండి కాఫీల్తో కాలం గడుపుతూ అలా నీరసంగా పడివున్నాడు. రాఘవయ్య మాష్టారు వృద్ధసింహంలా వుంటాడు. కూలిపోతున్న గంభీర ముఖవర్చష్సుతో చెక్కుచెదరని గోల్కొండ ఖిలలా వుంటాడు. మహాప్రస్థానం పుస్తకం మీద శ్రీశ్రీ బొమ్మలా వుంటాడు. రిక్షాదిగి సరాసరి తలుపు తీసుకుని గంగ లోనికి వచ్చింది. చేతిలోని బ్యాగ్ పక్కనేస్తూ నాన్నను కౌగిలించుకొని ఏడ్వడం మొదలెట్టింది. పది నిమిషాలలా ఏడుస్తునే వుంది - గంగను ఓదార్చే ప్రయత్నం చేయలేదు. "నన్ను క్షమించు - నాకేం

తెలియదు - మీ అల్లుడు మంచివాడు - ఎలా జరిగిందో - బ్రహ్మపుత్ర నిన్న నా చెల్లెలు - ఈవాళ సవితి - పోట్లాడాను - కలిసి వుంటాం - నాన్నా నన్ను క్షమించు - నీ ముగ్గురు మనువరాళ్ళూ ఏడుస్తూనే వున్నారు. మేఘమాల ఉరిమి అలసిపోయింది - కన్నీరై పారిపోయింది.

★ ★ ★

రాఘవయ్యకి నల్గురు కూతుళ్ళు - గంగ, యమున, సరస్వతి, బ్రహ్మపుత్ర. అనగా అయన నాల్గు నదుల తండ్రి - ఇంటర్ సైన్స్ గ్రూప్ స్వంత వూళ్లో లేకపోతే అక్కయ్య దగ్గర చదువుకుంటానని వెళ్ళింది. వచ్చీరాని వయస్సులో అర్థంఅయి కాని ప్రపంచంలో మిడిమిడి జ్ఞానంలో వున్న బ్రహ్మపుత్రలో బావలింగన్న స్నానం చేసాడు. అది భరించలేని రాఘవయ్య మంచం పడ్డాడు. మానసిక వేదనకి, ఆందోళనకి గుర్తై మృత్యువుకు దగ్గరయ్యాడు. తాను నీతిగా వుండాలని తన గూర్చి శత్రువులు విమర్శ చేయకూడదని ఆలోచించే ఆయనకి ఈవార్త భూకంపం - ఒక విద్యుత్ స్పర్శ - ఒక పీడకల - ఒక భయంకర సత్యం. తన నలభై రెండో ఏటే భార్య పోయిన రాఘవయ్యకి చాలామంది మళ్ళీ పెళ్ళిచేసుకోమని సలహా ఇచ్చినా పట్టించుకోలేదు. అలాంటి ఆ ఉపిరిదీపం మీద ఆగని తుఫాను హోరు.

★ ★ ★

గదులు చిమ్మింది. ఇల్లంతా సర్దింది. నీళ్ళు పట్టింది. లాల్చీ పైజమాలు ఉతికింది. కాఫీ తయారుచేసి ఫ్లాస్కులో పోసింది. నిద్రనుండి లేపి స్నానం చేయిద్దామని మంచం మీదున్న నాన్న ఒంటిమీద చెయ్యివేసింది. శరీరమంతా చల్లగా, మంచుముద్దలా - ముఖంమీద వున్న దుప్పటి క్రిందకి జార్చింది. గంత ఆశ్చర్యపోయింది.

★ ★ ★

ఊర్లనుండి లింగన్న, బ్రహ్మపుత్ర, చక్రవర్తి, యమున, ధన్‌రాజ్, సరస్వతీ వచ్చారు. మనుమరాళ్ళు వచ్చారు. అంతా కన్నీటి వీడ్కోలు ఇచ్చారు - స్నానాలు చేసి అన్నం పచ్చిపులుసు గిలికి చాపలమీద వాలిపోయారు. రాత్రి అందరూ నిద్రపోయారు. ఒకపిల్లి ఎలుకను వెంటాడుతూ టేబుల్ మీదున్న మాష్టారు ఫోటోను క్రిందేసింది. ఇంకా పూర్తిగా నిద్రపోని లింగన్న లేచాడు. ఫోటో క్రింద పోస్ట్ చేయమని మామగారు రాసిన ఒక ఉత్తరం వుంది. తన మిత్రునికి ఆఖరి వుత్తరం బహుశా ఇదే. నల్గురు కూతుళ్ళకి నల్గురు అల్లుళ్ళనుకున్నాను. గంగలో మునిగి బ్రహ్మపుత్రలో తేలిన లింగన్నని నా అల్లునిగా రద్దు చేసుకున్నాను. నేనుపోయాక 'యమునని చక్రవర్తిని వాళ్ళపిల్లల్ని, సరస్వతిని, ధన్‌రాజ్‌ని, వాళ్ళ చిన్నపిల్లని' చూసిపో - ధైర్యం, నీతి విడువవద్దని హితబోధ చేసిపో -

ఉత్తరాన్ని లింగన్న చదువుతూ కొయ్యబారిపోయాడు. మామగార్ని ఎంత వేదనకి గురిచేసింది తెలుసుకున్నాడు. బ్యాంక్‌లో బ్రహ్మపుత్ర పెళ్ళికోసం దాచిన మూడు లక్షల ఫిక్స్‌డ్ డిపాజిట్‌కి నామినేషన్లుగా "చక్రవర్తి, ధన్‌రాజ్"లని ఆయనకి ఇంకా తెలియదు.

కె. చంద్రశేఖర్, మంజరీ గ్రామీణ బ్యాంక్, మల్లికార్జునపల్లి - 502 345
సదాశివపేట తాలూకా, మెదక్ జిల్లా.

గొల్లపిన్ని విమలాదేవి కథ

# సత్యం వధ, ధర్మం చెర

గణగణ గంట మ్రోగింది. పాఠం చెప్తున్న నాకర్థమైంది. స్ట్రైక్ వాళ్ళు వచ్చేసారు. అంటే ఈరోజు స్ట్రైక్ జరుపుతున్నారన్నమాట. అసలు స్ట్రైక్ ఎందుకు జరుపుతున్నట్లో అర్థం కాలేదు. అందుకే క్లాస్ నుండి బయటకొచ్చి స్ట్రైక్ చేస్తున్న స్టూడెంట్స్‌తో

“ఎందుకు స్ట్రైక్ చేస్తున్నారు బాబూ” అని అడిగాను

ఎందుకంటారేంటి మేడమ్. ఎప్పుడూ బందులు, రాస్తారోకోలు, స్ట్రైక్‌లు జరిగి ఈ సంవత్సరము పాఠాలు సరిగా జరుగలేదు. కాని పరీక్షలు మాత్రం సకాలంలోనే జరుపుతారట.

సిలబస్‌కాక, లెక్చరర్ సరిగాలేక, నోట్సులు లేక మేము ఛస్తుంటే, మధ్యలో పరీక్షలు జరిపే తీరాలంటూ నిశ్చయించింది ప్రభుత్వం అందుకే పరీక్షలు "పోస్ట్‌పోన్" కావాలని స్ట్రైక్ చేస్తున్నాం."

ఆశ్చర్యపోవడం నావంతయింది. స్ట్రైక్, బందుల వల్ల పాఠాలు కాక కాలం వ్యర్థమై పోయిందని బాధపడక, పాఠాలు కాలేదని మళ్ళీ స్ట్రైక్ చేస్తున్నారట. అసలు సంవత్సరంలో ఎన్ని బందులు, ఎన్ని స్ట్రైక్‌లు జరుపుతున్నారు. మూడు పువ్వులు ఆరు కాయల్లా కొనసాగే ఈ పద్ధతి వల్ల ఎవరు స్వంతలాభాన్ని పొందుతున్నారో, ఎందరు నష్టపోతున్నారో! కారణం ఉన్నా లేకున్న ఈలాగెందుకు జరిగిపోతున్నది.

"ఏయ్! ఏంటి ఆలోచిస్తున్నావ్! ఈ స్ట్రైక్ పుణ్యమా అంటూ హాయిగా యింటికెళ్ళి రెస్ట్ తీసుకుందాం పద" అంది అరుణ.

"అదికాదే. అసలే సిలబస్ కాక ఛస్తుంటే యిదేంటి మళ్ళా స్ట్రైక్ ప్రారంభమయిందే! ఈలాగయితే పిల్లలు ఎలా బాగుపడతారే. దీనికి బాధ్యులెవరు? ఎంతో భవిష్యత్తు ఉన్న పిల్లలు ఏమైపోవాలి?"

"చాల్లేవే! మనమేం చేస్తాం నలుగురితోపాటు నారాయణా అనుకుంటూ పోవాలి. మన జీతాలు మనకొస్తాయి. చెల్లుబిల్లు అనే దమననీతే చలామణి అవుతోంది ఈ సమాజములో. మనం అలా మెలగక పోతే మనపని గోవిందా గోవిందా" అంటూ అరుణ నాభుజంపై చేయి వేస్తూ ముందుకు నడిచింది. నేనూ కదలక తప్పలేదు. దారిలో "అరుణా! నీవన్న మాట యదార్థమేనే! కాదు అనను కాని బంగారం వంటి భవిష్యత్తు కల పిల్లల మధ్యలో మనపిల్లల భవితవ్యం కూడా ఉందన్న విషయం మరచిపోతున్నావ్. స్వతంత్ర్యం కోసం ఒక మంచిపనికోసం గాంధీజీ ప్రవేశపెట్టిన సహాయ నిరాకరణోద్యమాన్ని నేటితరం వాళ్ళు ఇలా దుర్వినియోగం చేస్తున్నారు. భస్మాసుర హస్తంలా అందర్నీ సర్వనాశనం చేస్తోంది కదే! ఇలాగే కొనసాగితే". ఇక మాట్లాడడం యిష్టంలేక మౌనం వహించాను.

"చూడు సుమతీ! నీవు ప్రతిదాన్ని గురించి చాలా డీప్‌గా ఆలోచిస్తావ్. మనం ఏమీ చేయలేక ఈ విప్లవాల వెల్లువలో కొట్టుకొని పోవలసిందే మరి! ఆఁ ..... కస్తూరి ఈరోజు లీవ్ లెటర్ పంపింది కదా! ఎందుకో మరి. మనం పోయేదారే దాని యిల్లు కాబట్టి దాన్ని చూచిపోదామా" అంది అరుణ. "సరే" అంటూ ఇద్దరం కస్తూరి ఇంటికి బయలుదేరాం. మంచంపై కస్తూరి ముడుచుకొని మూల్గుతూ పండుకొని ఉంది. దాని బిడ్డలు ప్రతిమ, ప్రీతి అల్లరి చేస్తూ కొట్టుకుంటూ కనిపించారు. ఇల్లంతా అరణ్యంలా ఉంది. లేవలేక పడుకొన్న ఫ్రెండ్ కస్తూరిని చూచి నా మనసు అదోలా అయిపోయింది. తన స్వభావం హెల్పింగ్ నేచర్, ఎవరికైనా ఏకాస్తంత బాగాలేదన్నా ఏ యిబ్బంది కలిగినా వెంటనే వాళ్ళకు సహాయం చేయకపోతే దానికి తోచదు. అలాంటి కస్తూరి యిప్పుడిలా అసహాయురాలయింది.

మమ్మల్ని చూసిన పిల్లలిద్దరు "ఆంటిలొచ్చేసారోచ్" అంటూ గట్టిగా అరుస్తూ మమ్మల్నిద్దరిని చుట్టేసుకున్నారు పొద్దుట్నుంచి వారి ఆలనా పాలనా చూచేవాళ్ళు లేక తిండి సరిగ్గా లేకనేమో వారి ముఖాలు బాగా డీలా పడినట్లున్నాయి పిల్లల అరుపులకు కస్తూరి

కళ్ళు తెరచి మమ్మల్ని చూచి పైకి లేవబోయింది.

"ఆఁ .. ఆఁ... లేవద్దు పడుకో! ఎప్పటినుండి నీకు జ్వరమొస్తోంది. మీ శ్రీవారు ఈరోజు సెలవుపెట్టలేదా! పిల్లలకు తిండితిప్పలు..."అని నేను అడుగుతుండగానే కస్తూరి -

"నిన్న పొద్దట్నుంచి కొంత నలతగా ఉండింది. ఆదివారం కదా! పని ఎక్కువయి పోయి అలసట వల్ల వచ్చిన జ్వరం అనుకొన్నా కాని రాత్రికి రాత్రే వొళ్ళు నొప్పులు తలనొప్పితో జ్వరం ప్రారంభమయి యిప్పటికి కూడా టెంపరేచర్ తగ్గలేదు. డాక్టర్ గారి దగ్గరికెళితే మలేరియా అటాక్ అయిందేమోనని ఏవో మందులు రాసిచ్చాడు. మావారేమో ఎలక్షన్స్ డ్యూటీలంటూ తిరుగుతున్నారు. ఇక ఆ రాక్షసులా! ఒకటే అల్లరి. హోటల్ నుంచి క్యారియర్ పంపించారు - వాళ్ళ నాన్న. కాని ఈ చిన్నది ఉందే - దీనికి నేనో, వాళ్ళ నాన్నో బుజ్జగిస్తే తప్ప భోంచేయదు. వీళ్ళ కొట్లాటలు, ఏడుపులు, అల్లరి రామ! రామ! ఈ యింటి పరిస్థితి ఎలా ఉందో. పెద్ద దిక్కులేని ఇల్లు ఇలాగే వుంటుంది. మరి ఏమనుకోకుండా ఆ కుర్చీలు యిలా లాక్కొని కూర్చోండి - అంది" నీరసంగా.

కొంచెముసేపు కూర్చొని వాళ్ళ యిల్లు సర్దేసి, కొంచెము కాఫీ తయారు చేసి బ్రెడ్ యిచ్చేసి, నేను అరుణ యింటికి బయల్దేరుతూ -

"కస్తూరీ! ఎలాగూ అనుకోకుండా స్ట్రైక్ వచ్చేసింది. నేను ఇంట్లోనే ఉంటాను గదా! నీ పిల్లల్ని నేను తీసుకెళ్తాను. వాళ్ళ నాన్నగారొచ్చాక మా ఇంటికి రమ్మని చెప్పు. అపుడు వాళ్ళను పంపుతాను" అని చెప్పి ప్రతిమ, ప్రీతిని మా ఇంటికి తీసుకొచ్చేసాను. కాలేజికి కూడా స్ట్రైక్ కాబట్టి మాపిల్లలు రాజు, శాంతి ముందుగానే ఇంటికొచ్చేసినట్లుంది. వి.సి.పి. వేసుకొని "మిస్టర్ పెళ్ళాం" సినిమా చూస్తున్నారు. ప్రతిమ, ప్రీతి కూడా సినిమా చూస్తూ మా పిల్లలతో కబుర్లు చెప్తూ భోంచేస్తున్నారు. సినిమాలో నారదుని మాటల ప్రభావం వల్ల లక్ష్మీదేవి విష్ణువుతో తమ స్థానాలు మార్చుకుందామని కోరటం, కాసేపు విష్ణుమూర్తి ఆలోచించి తన స్థానం మార్చుకొంటే తన పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించుకోవడం, ఆమె కోరిక ఏమరుపాటు లేక స్థానాలు మార్చటం, స్థానం మారినా లక్ష్మీదేవికి మాత్రం విష్ణుమూర్తిగారి పాదసేవ చేయడం తప్పకపోవడం ఆ సన్నివేశాన్ని చూచి నాకు బలే నవ్వు వచ్చింది. స్వతంత్ర్యం కావాలంటూ మనం నినాదాలు చేస్తున్నామే కాని మన స్త్రీ జాతికి వంటపని, శ్రీవారి సేవ, ఉద్యోగం, పిల్లల బాధ్యత తప్పడం లేదు కదా! పైపెచ్చు మనమే ఎక్కువ బాధ్యతలు మోస్తున్నామేమో! దర్శకుడు ఎంత సూక్ష్మంగా ఆ దృశ్యంద్వారా హాస్యంగా సునిశితంగా మన స్త్రీ జాతి స్థితిని వ్యక్తీకరించినాడో కదా అని ఆలోచిస్తూ ఉండిపోయాను. ప్రతిమ, ప్రీతి ఆడుకొంటున్నారు. సాయంత్రం మా శ్రీవారు రాగానే

"హాయ్! ప్రీతీ, హలో ప్రతిమా! ఎప్పుడొచ్చారు. మీమమ్మీ, డాడీ రాలేదా!" అంటూ ప్రీతిని ఎత్తుకొంటూ ముద్దు చేస్తూ అడిగారు.

"అంకుల్! మా డాడీకేమో ఆఫీసులో వర్క్ ఎక్కువగా ఉందంట. మమ్మీకేమో జ్వరము. మాకేమో స్కూలులేదు. ఆంటీ మమ్మల్నిద్దరినీ ప్రొద్దునే తీసుకొచ్చేసింది ఇక్కడికి" అంటూ గుక్కతిప్పుకోకుండా ప్రీతి చెబుతోంది. ప్రతిమకంటే ఐదేండ్లు చిన్నది. సెకండ్ క్లాసు చదువుతున్న ప్రీతి చాలా ఇంటలిజెంట్ అనే చెప్పాలి.

శ్రీవారికి కాఫీ యిస్తూ "పాపం! కస్తూరికి చాలా జ్వరంగా వుందండీ! వాళ్ళాయనకేమో

ఎలక్షన్ డ్యూటీ అట. అందుకే పిల్లల్ని తీసుకొచ్చేసాను. బహుశా ప్రీతివాళ్ళ నాన్న రాత్రి లేటుగా రావచ్చట. అందుకే పిల్లలు రాత్రి మనింట్లోనే వుండాల్సొస్తుందేమో మరి. అమ్మా నాన్నల మీద వాళ్ళ మనస్సులు మళ్ళకుండా పిల్లల్ని ఆడించుకొంటూ ఉండండి. నేను యింతలో వంటచేసి వడ్డిస్తాను" అంటూ వంటగదికేసి వెళ్ళాను. హాలు నుండి పిల్లలు, శ్రీవారు మాట్లాడే మాటలు నాకు వినబడుతూనే ఉన్నాయి. ప్రీతి పాటలు మొదలెట్టింది. టేప్‌రికార్డర్ వేసుకొని ఆ మ్యూజిక్ అనుగుణంగా మారాజు, శాంతి, ప్రతిమ, ప్రీతి, మావారు లయబద్ధంగా డ్యాన్సు చేయడం మొదలెట్టారు. కొంచెము సేపటికి అలసిపోయారేమో! సోఫాలో కూలబడ్డారు.

"అంకుల్ మేమింటికెళ్ళాలి. మా డాడీ యింకా రాలేదేంటి? ఇంటికెలా వెళతాం' '? ప్రతిమ ఉన్నట్లుండి అడిగేసింది.

"మా డాడి వచ్చేస్తారుగా మీరింతలో భోంచేయండి. One day the child అనే తమాషా సినిమా చూపిస్తాను. చూడండి. మీడాడీ వచ్చాక మీరు వెళ్ళచ్చు సరేనా!" అంటూ మావారు వాళ్ళను బుజ్జగిస్తున్నారు.

భోజనాలయ్యాక మావారు పిల్లల్ని ఆడిస్తుంటే నేను లోపలికి వెళ్ళాను. ఇంతలో మావారు "ప్రీతి! మీడాడీ వచ్చేసారు" అంటూ గట్టిగా కేక వేశారు. నేను బయటికొచ్చి తొంగి చూచాను. ప్రీతి గుమ్మందాకా వెళ్ళి చూచి వచ్చి వాళ్ళ డాడీ కనపడనందున "ఎక్కడ అంకుల్ మాడాడీ?" అని అడిగింది.

"ఏయ్! నీవు ఓడిపోయావు. నామాటలు నమ్మేసావు. హాయ్-హాయ్" అంటూ చప్పట్లు కొట్టూ చిన్నపిల్లాడిలా ఆపిల్ల చుట్టూ తిరగడం మొదలెట్టారు. మావారికి వయస్సు వచ్చిందే కాని చిన్నపిల్లల మనస్తత్వం మాత్రం పోలేదు. పిల్లలతో కలిసి అల్లరి చేయడం అంటే చాలా సరదా. మా పిల్లలేమో పెద్దవాళ్ళయ్యారు. ప్రీతి చిన్నపిల్ల కాబట్టి ఆట పట్టించడం మొదలెట్టారు. కాని ఆ పసిదాని ముఖం కందగడ్డలా మారిపోయింది. రోషంతో "అంకుల్" అని నాలుగిండ్ల వాళ్ళకు వినపడేటట్లుగా కంఠనాళాలు తెగుతాయేమో అన్నట్లుగా గట్టిగా అరిచింది. నేను ఉలిక్కిపడ్డాను.

"అంకుల్ మా డాడీని చూపించు. చూపించు. మా మమ్మీ దగ్గరికి నేను వెళ్ళి తీరాలి. డాడీని చూపిస్తావా లేదా!" అని పిచ్చిగా గెంతులు వేస్తూ అరవటం మొదలు పెట్టింది.

"అబ్బే! ఊరికే తమాషాకు అన్నాను ప్రీతి. మీడాడీ వచ్చేస్తారుగా, కమాన్ మై చైల్డ్. జెస్ట్ ఫర్ ఎ జోక్! అంతే! దా! దా! నా బంగారు కదూ" అంటూ మావారు ఆ అమ్మాయిని దగ్గరకు తీసుకోబోయారు. అంతే. ఆ అమ్మాయి మరింత రెచ్చిపోయి నేలపై కూలబడి కాళ్ళను రెండు నేలకేసి కొడుతూ

"అబద్దాలాడ్తావా అంకుల్! అలా అబద్దాలు చెప్పొచ్చా! నాకబద్దాలంటేనే అసహ్యం."

"ఐ లైక్ ద ట్రూత్ బట్ ఐ హేట్ ద లైస్" అనే ఆ అమ్మాయి మాటలకు దిగ్భ్రాంతుల మయ్యాము.

"ఏయ్! నువ్వు మాత్రం ఏప్రిల్ 1న చాక్లెట్ అంకుల్ అంటూ చాక్లెట్ కాగితంలో

చిన్నరాయి పెట్టి నన్ను ఫూల్ చేయలేదా! అదిమాత్రం అబద్ధం కాదా! నీవుకూడా నన్ను మోసం చేసినట్లే కదా!'' అని అన్న మావారి మాటలకు మరింత రెచ్చిపోయి ప్రీతి కన్నీళ్లు కారుస్తూ

"నాకలాంటి పనులంటేనే ఇష్టంలేదు మా మమ్మీ డాడీలు ఏప్రిల్ ఫస్టన మాత్రం అలా చేయచ్చని బతిమాల్తే అలా చేశాను. అంతే. నాకిష్టంలేని పని అది. మా టీచరు సత్య హరిశ్చంద్రుని కథ చెప్పింది తెలుసా! ఆ కథ అంటే నాకు చాలా ఇష్టం. గాంధీ తాతకూడా అబద్ధాలు ఆడలేదట. మంచివాళ్ళెప్పుడూ అబద్ధాలు ఆడరట. మా టీచరు మంచి కథలు చెప్తారు తెలుసా! మా టీచరంటేనే నాకెంతో ఇష్టం. అపద్ధాలాడేవారంటే అసహ్యం'' నిర్మొహమాటంగా మాట్లాడే ఆ అమ్మాయి మాటలు నాలో ఆలోచనలు రేకెత్తించినాయి. అపుడు చూడాలి సునాయసంగా, అవసరమున్నా, లేకున్నా అబద్ధాలాడే ఆయన స్వభావానికి ప్రీతి మాటలు ఒక గుణపాఠం చెప్పిందనే అనాలి. ఇంతలో ప్రతిమ వాళ్ళ నాన్న రావడం, విషయమంతా తెలుసుకొని ఆయన మనసు నొచ్చుకొంటూ ప్రీతిని దగ్గరికి తీసుకొని "అంకుల్‌ని అలా అనొచ్చా తప్పుకదూ! సారీ చెప్పు వెళదాం'' అన్న ఆయన మాటలకు ప్రీతి -

మావారి దగ్గరకు వచ్చి "సారీ అంకుల్'' అని అయిష్టంగానే చెప్పింది.

"ఏమనుకోకండి. ఈకాలం పిల్లల తీరే అంత. పెద్ద పెద్ద డైలాగులు చెప్తుంటారు. మీకు చాలా శ్రమ ఇచ్చాము సారీ అండీ బాగా రాత్రయింది. ఇంటికెళ్ళాలి. వెళ్ళొస్తాం' ' అంటూ ఆ అమ్మాయిని తీసుకొని ఆయన వెళ్ళాడు

వాళ్ళు వెళ్ళిపోయినా ఆ అమ్మాయి మాటలే మాఇంట్లో ప్రతిధ్వనిస్తున్నట్లుగా అనిపించింది. ఒక నగ్నసత్యాన్ని ఎంత స్వచ్ఛందంగా చెప్పగలిగింది. సత్యాన్నే పలకాలంటూ ఇంటా, బయట పలుకుతున్న మనం అసత్యమనే ముసుగులో ఎన్ని తప్పులు చేస్తున్నాం. నేతి బీరకాయలో నెయ్యి ఎంత ఉందో మన ప్రవర్తనా సరళిలో కూడా సత్యం అలాగే ఉందనాలి. సత్యం వధ, ధర్మం చర అన్న ఉపనిషత్ వాక్యాన్ని "సత్యం వధ, ధర్మం చెర'' అని సత్యాన్ని వధించేసి, ధర్మాన్ని చెరసాలలో పడవేసే మనము మానవత్వం కలవారమేనా! మన పిల్లలకు మన ప్రవర్తనా సరళి ఆదర్శప్రాయంగా ఉందా! మనల్ని చూచి వాళ్ళేమి నేర్చుకుంటున్నారు. మట్టిముద్దల్ని బొమ్మలుగా మార్చి జీవం పోసి, భగవంతుడు మనకు ప్రసాదిస్తే! వారిని చైతన్యవంతులుగా తీర్చిదిద్దగలుగుతున్నామా! తల్లిదండ్రులుగా మన బాధ్యతల్ని సక్రమంగా నెరవేరుస్తున్నామా! నిజంగా ప్రీతి టీచర్ ఎంత మంచిపని చేసింది. ఒక్క మంచి ఉపాధ్యాయురాలివల్ల ఆ పిల్లలో ఎంత చైతన్యం కలిగింది.

పిల్లలను తీర్చిదిద్దే బాధ్యత ఇటు తల్లిదండ్రుల పైనా, అటు ఉపాధ్యాయుల పైనా ఎంతయినా ఉందనే చెప్పాలి చిన్నపిల్ల అయినా, దాని మాటల ప్రభావము మాపై బాగా పనిచేసింది. తప్పు చేసామేమో అన్న బాధతో కాబోలు మాగృహం మూగపోయింది.

గొల్లాపిన్ని విమలాదేవి, తెలుగు పండిట్,
జి.డి.ఎస్ జి.హెచ్ స్కూల్, అనంతపురం

# ఆవిష్కారం

చేతిలో సూట్‌కేస్‌తో బస్ దిగింది లావణ్య. వెనక నుంచి బస్ దుమ్ము రేపుకుంటూ వెళ్ళిపోయింది. ఓసారి చుట్టూ చూసింది.... ఆ ఊరిని.... దాదాపు పదేళ్ళ తరువాత ఆ ఊరిలో అడుగు పెట్టింది.

అదే బస్టాండు... అవే షాపులు... బైటికి రాగానే కనిపించే కాఫీ హోటలు... అవే అరటిపళ్ళ గెలలు... నిమ్మ సోడాలు... గుబాళించే మల్లెలు... సంపెంగలు... ఊరేమీ మారినట్టు లేదే... మనుషుల్లో వచ్చినట్టు త్వరత్వరగా ఊరిలో ఏమీ మార్పులు రావు కాబోలు...

బస్టాండుకి తను వెళ్ళబోయే ఇల్లు చాలా దగ్గర. రిక్షా అనవసరం.

1984లో మొదటిసారి నవవధువుగా ఆ వూళ్ళో అడుగు పెట్టింది 86లో ఆ వూరినుంచి శాశ్వతంగా వీడ్కోలు తీసుకుంది.

రెండేళ్ళ సహచర్యంతో ఆ ఊరితో ఇంత అనుబంధం ఏర్పడిందా అనిపిస్తోందిప్పుడు .. కారణం మనసు తనకు తెలియకుండానే రెక్కలు చాచి విహంగంలా ఎగురుతోంది... ఓ జలదరింపు... ఓ ఆనంద కెరటం... ఉవ్వెత్తున ఎగసి గుండెల్లో సందడి సృష్టిస్తున్నాయి. కాళ్ళల్లో తడబాటు.. మనసులో గాభరా.. మెదడులో ఆలోచనల తుఫాను... ఆమెకు

తెలియకుండానే అడుగులు ఆ ఇంటి వీధివైపు పడ్డాయి... ఆ వీధిలో కూడా ఏమీ మార్పు లేదు. ప్రపంచం అంతా మారినా ఈ ఊరు మారలేదే... ఇల్లు దగ్గరవుతోంది... అడుగులు తడబడుతూ... గేటు సమీపించింది. తడిక కాకుండా ఇనుప గేటు ఉంటుందేమో అని ఆశించింది. కానీ అదే తడిక - కాకపోతే తడిక కొత్తదిలా ఉంది.. కాంపౌండ్ వాల్‌లా చుట్టూ కట్టిన తడిక... దాని పైకి పాకించిన రకరకాల పూల తీగలు.

వణికే చేతుల్తో తడిక తీసింది.. వీధి వాకిట్లో పేడకళ్ళాపి చల్లి.. అందంగా పేర్చిన ముగ్గులు.. గాలితో పేడ వాసన తేలి వస్తోంది.

అరుగు మీద కూర్చుని బొమ్మల్తో ఆడుకుంటోంది నాలుగేళ్ళ పాప. ఆ పాప పక్కనే రెండేళ్ళ బాబు... ఆరిందాలా వాణ్ణి ఆడిస్తోంది పాప.

లావణ్య అప్రయత్నంగా వంగి ఆ పాప చెక్కిలి మీటింది.

"ఎవరు కావాలండీ" ముద్దు ముద్దుగా అడిగింది పాప.

లావణ్య తడబడింది... "ఆ... నాకు నాకు... అమ్మ... అమ్మ కాదు... తాత... తాతగారు ఉన్నారా?" అడిగింది.

"ఆముక్తా... ఎవరమ్మా..." లోపల్నించి ఓ గంభీరమైన కంఠం వినిపించింది.

లావణ్య మనసులో పదేళ్ళనాటి స్మృతులు ఒక్కసారిగా ఎగిసిపడ్డాయి. ఆకంఠస్వరం వినగానే....

"తాతాలూ.. మీలు కావాల్ట... అత్త వచ్చింది..." లావణ్య చప్పున చేత్తో పాప నోరు మూసి అన్నది.

"అత్త కాదు... తప్పు -"

"మలీ..?" పాప ప్రశ్నార్థకంగా చూసింది...

"నువ్వు నాకేమవుతావు?" అడిగింది సీరియస్‌గా...

"నేను... నేను..." ఆగిపోయింది లావణ్య... గుమ్మం నిండుగా నిల్చున్న ఆ ఆకారం చూసి...

"నువ్వా!" ఆయన కంఠంతో సంభ్రమం..... లావణ్య సూట్‌కేస్ కింద పెట్టి రెండు చేతులు జోడించింది.

ఆయన ఏం మాట్లాడలేదు.

ఇద్దరి మధ్య ఒకలాంటి నిశ్శబ్దం..

"ఏవండీ! ఎవరూ వస్త...." లోపల్నించి చీర చెంగుతో చేతులు తుడుచుకుంటూ వచ్చింది రాజ్యలక్ష్మి.

లావణ్యని చూస్తూనే ఓ క్షణం తెల్లబోయినా. "నువ్వా.... బతుకున్నావా?" ఆవేశంగా అడిగింది రాజ్యలక్ష్మి.

లావణ్య మాట్లాడలేదు... చీర చెంగు వేలికి చుట్టుకుంటూ నేల చూపులు చూస్తూ నిల్చుంది..

"ఏం మహాతల్లీ! ఎవర్ని ఉద్ధరించడానికి వచ్చావు?... ఏం ఆస్తులేమన్నా ముంచుతున్నారేమో అని వచ్చావా?"

లావణ్య దెబ్బతిన్న మనసు కళ్ళల్లో ప్రతిఫలిస్తూ చివ్వున తలెత్తి ఆయన వైపు

చూసింది.

"రాజ్యలక్ష్మి. " మందలింపుగా పిలిచాడాయన...

"అతిధులని ఆదరించడం మన సంస్కారం... ఇంటికి వచ్చిన వాళ్ళతో మాట్లాడే పద్ధతి ఇది కాదు."

ఆవిడ ఛర్రుమంది. "అతిధా! ఇది అతిధా! ఎవరికి? మీకా? నాకా? చాల్లెండి"

"రాజ్యలక్ష్మి! అమ్మాయిని లోపలికి తీసికెళ్ళు"... అజ్ఞాపిస్తున్నట్టుగా అని లావణ్యతో అన్నాడు.

"లోపలికెళ్ళమ్మా..."

ఆవిడకి ఆ ఆజ్ఞ కాదనే సాహసం లేదు. కానీ అసహనం... బాధ దాచుకోలేదు..

"ఇలా నెత్తినెక్కించుకునే ఈ స్థితికొచ్చారు... అయినా బుద్ధి రాలేదు.. ఖర్మ... ఎవర్నని ఏం లాభం?"రుసరుసలాడుతూ లోపలికెళ్ళిపోయింది.

లావణ్య కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి... ఆ ఇంటి కోడలిగా తనా ఇంట్లో అడుగు పెట్టిన దగ్గర్నుంచీ ఆయన చూపించిన ఆదరణ, ఆప్యాయత... చేసిన గారాబం... అన్నీ ఒక్కసారి గుర్తొచ్చాయి...

ఆడపిల్లలు లేరని తననే తమ కూతురుగా భావించి... తండ్రిలా మమతానురాగాలు పంచిన ఆయనకి తను ఇచ్చిన ప్రతిఫలం ఏమిటి? జీవిత కాలానికి సరిపడే మనస్తాపం. కానీ... తనలా ప్రవర్తించడానికి కారణం ఒక విధంగా ఆయన కూడా కదా...

"నేను.. నేను" ఏదో చెప్పబోయింది.

"తరువాత మాట్లాడుకుందాం... లోపలికెళ్ళి స్నానం వగైరా కానివ్వమ్మా.." అన్నాడాయన.

నిశ్శబ్దంగా సూట్‌కేస్‌తో లోపలి గుమ్మంలోకి అడుగుపెడుతున్న ఆమె చెవులకు అమృతప్రాయంగా వినిపించాయి ఆయన మనవరాలితో అంటున్న మాటలు. "తాతాలూ! ఆమె నాకు ఏమవుతారు?"

"పెద్దమ్మ తల్లీ!"

చాలు.. ఇది చాలు... ఇన్నేళ్ళ తరువాత అడుగుపెడుతున్న ఆ ఇంట్లో తనకెలాంటి స్వాగతం లభిస్తుందో!.. ఎలాంటి అవమానాలు భరించాలో...! ఎంత నిరాదరణ సహించాలో! అని రకరకాల ఊహలతో బయల్దేరిన తనకి ఈ ఒక్కోమాట కొండంత ధైర్యాన్నిచ్చింది. హాల్లో అడుగుపెడుతూనే సూట్‌కేస్ ఓ మూల పెట్టి చెప్పులు వదిలి చుట్టూ చూసింది.. చెమ్కీ పూల దండతో శ్రీకాంత్ ఫోటో... శ్రీకాంత్... తన భర్త. ..

లావణ్య గుండెల్లో దుఃఖం ఘనీభవించి ఓ పెద్ద శిలలా మారి అడ్డం పడినట్లయింది. ప్రేమించి, ఏరి, కోరి పెళ్ళి చేసుకుని, తనూ సుఖపడక... భార్యనీ సుఖపెట్టక రెండు సంవత్సరాలు ప్రత్యక్ష నరకం చూపించిన పతి...

మావగారి అనునయంతో, అత్తగారి ఆరళ్ళతో, బావగారి అసూయతో, భర్తగారి నిర్లక్ష్యంతో, ఓ సంప్రదాయ కోడలిగా, ఓ సహనశీలిలా, ఓ సనాతన గృహిణిలా బ్రతకవలసిన తాను... ప్రతి రక్తపు బొట్టులో నిండిపోయిన విప్లవ భావాలతో, చిన్నప్పటి నుంచీ అలవర్చుకున్న తిరుగుబాటు ధోరణితో రెండేళ్ళకే కాపురాన్ని కాలదన్ని, భర్తతో తెగ తెంపులు

చేసుకొని, అత్తగార్ని ఎదిరించి, మావగార్ని క్షోభపెట్టి విసిగి.....వేసారి గుమ్మందాటి... ఊరుదాటి కన్న వారిని చేరింది.....

మధ్యలో ఆపిన చదువు పూర్తి చేసి, గృహిణి పాత్రకి రాజీనామా చేసి ఉద్యోగినిగా మరోపాత్ర పోషించింది.....

కాలం గడిచింది.... తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకోమన్నాడు. విడాకుల నోటిసు పంపించాడు....... కానీ విడాకులిచ్చి ఆమెను స్వేచ్ఛగా వదిలేయడం నచ్చలేదు శ్రీకాంత్‌కి - అందుకే సంతకం చేయలేదు...

అతను సంతకం చేయకపోవడం తన మీద ప్రేమతోఅని ఏనాటికైనా తనని తప్పక తిరిగి తీసుకుపోతాడని నమ్మింది....

కానీ కాలం గడిచాక తెలిసింది..

అది కేవలం తనమీద పగసాధించటానికని...

అతను మాత్రం మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు.. తల్లి కోరిక మేర.. ఆ వంశం నిలవడం కోసం పిల్లల్ని కూడా కన్నాడు... కానీ దురలవాట్లు మానలేదు. ఫలితం...

లావణ్య కళ్ళల్లో ఎందుకో ప్రయత్నించినా రాలలేదు ఓ కన్నీటి బొట్టు...

"వాడు పోగానే వస్తావనుకున్నాను. కనీసం ఆఖరి చూపన్నా చూచేదానివి."

లావణ్య తల తిప్పేసుకుని అన్నది..

"కబురందింది... కానీ వచ్చి ఏంచేయాలో అర్థం కాలేదు.."

"ఇప్పుడు మాత్రం ఏం చేయగలవు? వెళ్ళు... వెళ్ళి స్నానం చేయి... గంగా! అక్కయ్యకి బాత్రూం చూపించు."

అవధాని గారి కంఠం వింటూనే చెంబుతో నీళ్ళతో వచ్చింది గంగ.. ఎర్రంచు తెల్లచీర.. తెల్లని తెలుపు... బొట్టు లేని మొహం... పరిశీలనగా చూస్తోంటే అన్నాడాయన..

"నా కోడలు -"

గుండెల్లో ముల్లు గుచ్చుకున్నట్లయింది.

మూడు పదులు దాటని వయసు. శ్రీకాంత్ కన్నా బహుశా పది పన్నెండేళ్లు చిన్నది కావచ్చు. ఇంత చిన్నపిల్లనా పెళ్ళి చేసుకున్నాడు.

వినయం, అణకువ ఉట్టిపడుతూ రాజ్యలక్ష్మి గారి ఆశల మేరకు రూపుదిద్దుకున్న సాధ్విమణిలా ఉంది.

ఈమె సాంగత్యంలో అతని కోరిక, అంటే భార్య బానిసలా పడి ఉండాలనే కోరిక తీరి ఉంటుంది.

కోడలంటే ఇంటిల్లిపాదికీ సేవలు చేసేది, పిల్లల్ని కని వంశం నిలిపేది, ఇంట్లో ఎన్ని అన్యాయాలు జరిగినా నోరు మెదపకుండా సహించగలిగేది అయి ఉండాలన్న రాజ్యలక్ష్మి గారి కోరిక.

తోడి కోడలంటే తన చెప్పుచేతల్లో ఉండాలనే పైశాచిక మనస్తత్వం కలిగిన అక్కగారి ఆశా, తమ్ముడు భార్య, తన భార్యకి జీతం లేని పనిమనిషి కావాలన్న బావగారి ఆరాటం... అన్ని విధాలా వాళ్ళకు నచ్చిన అమ్మాయి గంగ.

పాపం! ఈ పిల్ల భవిష్యత్తు ఏమిటి? గుండెల్ని చీల్చుకుంటూ వస్తోన్న నిట్టూర్పు అణచుకుంటూ బాత్రూం వైపు నడిచింది "తగుదునమ్మా అని ఎందుకొచ్చినట్టు... మొగుడు పోయాడని తెలుసుగా.. మరి ఆ అలంకారాలు ఏవిటి? మళ్లీ పెళ్ళి చేసుకుందేమో!" తోడికోడలు తారా స్వరం... ఎన్నేళ్ళయినా గుర్తు పట్టగలదు.

"అందుకేగా మొగుణ్ణొదిలి వెళ్ళింది. విచ్చలవిడిగా తిరగడానికి అలవాటుపడ్డ వాళ్ళకి మొగుడెందుకు? సంసారం ఎందుకు? అవ్వ... ఆ షోకేవిటి?" అత్తగారి నొక్కులు.

లావణ్య కోపంగా బాత్రూంలోకెళ్ళిపోయింది. స్నానం కానిచ్చి వచ్చేటప్పటికి గంగ చిక్కటి కాఫీ ఇచ్చింది.

పలకరిస్తే ముభావంగా సమాధానం చెప్పి తప్పించుకుని వెళ్ళిపోతోంది. సాయంత్రం దాకా అవధాని గారు అడపా దడపా పలకరిస్తూ, గంగ కాఫీ, టిఫిను, భోజనాలు ఏర్పాటు చేయడంతో గడిచిపోయింది... మిగతా వాళ్లెవరూ పలకరించలేదు.

నిజానికి తనిక్కడికి రావడం తప్పే... కానీ పెళ్ళి బట్టలు... పెళ్ళి ఫోటో... శ్రీకాంత్ వ్రాసిన ప్రేమ లేఖలు.. అన్నీ కలిసిన ఓ పెట్టె ఇక్కడే ఉండిపోయింది. మనిషి పోయినా అతని జ్ఞాపకాలు కొన్ని తన వెన్నంటే ఉన్నాయి. ఆ పెట్టె కోసం వచ్చింది.

"నువ్వు మళ్లీ పెళ్ళి చేసుకున్నావనుకున్నాను." లావణ్య ఉలిక్కిపడింది.

అవధాని గారు అరుగు మీద ఓ ప్రక్కగా కండువా పరుచుకుని కూర్చుంటూ అన్నారు.

"ఆ అవకాశం ఇవ్వకూడదనేగా మీ అబ్బాయి విడాకుల కాగితం మీద సంతకం చేయలేదు."

"కానీ విడాకులు తీసుకోకపోయినా, వాడు పెళ్ళి చేసుకున్నాడుగా."

"అదే పురుషాహంకారం అంటే.." అనాలనుకుంది. కానీ, ఇన్నేళ్ళ తరువాత కనిపించిన ఆయన మనసు గాయం ఛేయాలనిపించలేదు.

"ఆ ఆలోచన మనసుకి తట్టేటప్పటికి వయసు దాటిపోయింది." అన్నది.

"నిన్ను కన్నకూతురిలా చూసినందుకు, ఈ చివరి రోజుల్లో ఓసారి కన్పించావు.. చాలా సంతోషం."

ఆయన కళ్ళల్లో నిజమైన ఆనందంతో కూడిన కాంతి.

"వాడు పోగానే టెలిగ్రాం ఇచ్చాను. ఆఖరి చూపన్నా చూస్తావని. విడాకులు తీసుకోలేదు కాబట్టి నిన్ను పరాయిదానిలా భావించలేకపోయాను."

"ఆ భావం మీకు మాత్రమే ఉంది. అందరికీ లేదుగా. మీకైనా ఇంకా నామీద అభిమానం మిగిలి వున్నందుకు ధన్యురాల్ని."

"ఇంత అనుబంధం పెంచుకున్నదానివి, అలా ఎలా వెళ్ళిపోగలిగావు లావణ్యా?'

లావణ్య మాట్లాడలేదు. నిజానికీ ప్రశ్నకి సమాధానం లేదు. కానీ ఏదన్నా చెప్పాలనిపించింది. తన తరపున కాకున్నా, తనలాంటి చాలామంది స్త్రీల తరపున.

"ఆడది భర్తనీ, మెట్టింటినీ, అత్తమామల్నీ వదలివెళ్ళిపోవడమంటే కేవలం వ్యక్తుల్ని వదలివెళ్ళడం కాదు మామయ్య గారూ! గౌరవనీయమైన జీవితాన్ని, అనుబంధాలనీ వదలి వెళ్ళడం. ఏదో విశృంఖలంగా జీవించాలనీ, విచ్చలవిడిగా తిరగాలనీ, వంటరిగా బతకాలనీ ఏ స్త్రీ కోరుకోదు. తనో యంత్రంలా కాక తనకో అస్థిత్వాన్ని ఆశిస్తుంది. అది

మృగ్యమైనప్పుడు వాటిని వెతుక్కుంటూ వెళ్ళటంలో తప్పేంటుందా? ఆత్మాభిమానం వున్న స్త్రీ ఓ బానిసలా పడి ఉండగలదా? నా ఎడబాటు ఆయనలో పరివర్తన తీసుకు వస్తుందని ఆశించాను'' అంది లావణ్య.

''భర్త దగ్గర ఆత్మాభిమానం ఏవిటమ్మా.. ఒకరి కోసం ఒకరు కొన్ని ఆనందాలనూ, ఆశయాలనూ, కోరికలనూ, వ్యక్తిత్వాన్ని కొంతన్నా త్యాగం చేస్తేనే కదా!.. దాంపత్య జీవితానికి అర్థం.''

''ఒకరి కోసం ఒకరు... అని మీరే అంటున్నారు... కానీ రెండేళ్ళు నేనే కదా ఆయన కోసం ఎంతో త్యాగం చేశాను.. నా త్యాగానికి ఏం గుర్తింపు లభించింది? ఆయన నాకోసం ఏం చేశారు? ప్రేమించి పెళ్ళి చేసుకుని తన తల్లికి ఓ పనిమనిషిని... తనకో వేశ్యనీ... మాత్రమే తెచ్చుకున్నారు. నా మనసు ముక్కలు చేశారు. నా జీవితాన్ని ఎడారిగా మార్చారు' ' ఆగింది లావణ్య.

అమ్మా లావణ్యా - మీరు ఆధునికత, నాగరికత అంటూ చిన్న చిన్న విషయాల్ని భూతద్దంలో చూసి భయపడుతున్నారు. మీ అత్తయ్య భరించినన్ని బాధలు నువ్వేం భరించావు? నేనేనాడూ ఆవిడ మాటలకి కానీ, ఆలోచనలకి కానీ గడ్డిపోచ విలువ కూడా ఇవ్వలేదు. మా అమ్మ ఆవిణ్ణి రాచి రంపాన పెట్టేది. అన్నీ భరించింది. మాది గౌరవనీయమైన కుటుంబంగా సమాజంలో ఓ స్థానాన్ని సంపాదించింది.

''సమాజంలో స్థానం కుటుంబాలకే కానీ, వ్యక్తులకి లేదంటారా మామయ్యా...''

ఆయన సమాధానం చెప్పలేదు. ఏం చెప్పగలడు! లావణ్య రాజ్యలక్ష్మి కాదు. ఒకప్పుడు స్త్రీలంతా రాజ్యలక్ష్మిలే.... కానీ ఈ కాలంలో ఎందరో లావణ్యలు... కొందరే రాజ్యలక్ష్మిలు. ఆ కొందరిలో ఒక గంగ ఉండబట్టి ఈ ఇంటి కోడలుగా సుస్థిర స్థానాన్ని సంపాదించుకోగలిగింది.

లావణ్యే మళ్ళీ అన్నది.

''మీరు మీ స్వార్థం కోసం, అత్తయ్యని మీ చేతి పనిముట్టుగా తయారు చేసుకున్నారు. ఆవిడ ఆలోచనలు భార్య అంటే బానిస అన్న స్థాయి నుంచి ఎదక్కుండా జాగ్రత్త పడ్డారు. నరనరానా జీర్ణించుకున్న ఆ భావాన్ని, ఆ తత్వాన్ని ఆవిడ కోడళ్ళలో చూడాలనుకున్నారు. కానీ దురదృష్టం మీదో, నాదో నాకు తెలియదు. నేను మాత్రం ఆవిడ ఆశల మేరకు నన్ను మలుచుకోలేక పోయారు. బహుశా ఇందులో తప్పు మీ అబ్బాయిదే అనుకుంటా. చదువుకున్న, నవనాగరిక యువతినైన నన్ను ప్రేమించి పెళ్ళి చేసుకునేకన్నా ముందే గంగ లాంటి అమ్మాయిని చేసుకుని ఉంటే రెండో పెళ్ళి అవసరం కలిగేది కాదు. ఏది ఏమైనా గంగను పెళ్ళి చేసుకుని ఆయన కోరికా, వాళ్ళమ్మ కోరికా తీర్చారు. ఈ రోజు గంగ కేవలం గృహిణిగా, శ్రీకాంత్ భార్యగా, రాజ్యలక్ష్మిగారి కోడలిగా మిగిలిపోయింది.''

''లావణ్యా! వయసుతో పాటు నీ ఆలోచనల్లో కూడా పదును పెరిగింది. అప్పుడు చిన్న పిల్లవి కాబట్టి ఆవేశపడుతోంటే అనునయించి కంట్రోల్ చేయగలిగాను. కానీ ఇప్పుడు పెద్దదానివి అయినావు. పైగా రచయిత్రివి. నీ వివేకం, విజ్ఞత ముందు నేనేపాటి?''

''అంత మాటనకండి మామయ్యా. మీరెప్పుడూ నాకు పితృసమానులే.'' కలవరంగా

అంది.

"పోనీలేమ్మా.. జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు గతం తవ్వుకొని బాధపడితే ప్రయోజనం ఏముంటుంది? నువ్వు వచ్చిన కారణం చెప్పలేదు." మృదువుగా అడిగాడాయన. లావణ్య నిట్టూర్చి అన్నది.

"ఇక్కడికి కేవలం మీకోసమే వచ్చాను. రేపు నా పుస్తకం ఒకటి విజయవాడలో ఆవిష్కరించబడుతోంది. పుస్తకం పేరు బతుకులు.."

"అంటే నీ బ్రాండ్ పుస్తకమేగా! విప్లవం, అభ్యుదయం, స్త్రీ స్వేచ్ఛ.."

"అవును... అలాంటిదే.

"అయితే రేపు వెళ్ళిపోవాలన్న మాట.." ఆయన కంఠంలో అస్పష్టమైన బాధ.

"వాడు పోయినప్పుడు రాలేదు. ఎలాగూ వచ్చావుగా.. మాసికానికి ఉంటావనుకున్నాను.'' మళ్ళీ ఆయనే అన్నాడు.

"మీకు తెలుసుగా... నాకా నమ్మకాలు లేవని... ఈ పుస్తకం ఒకనాటి ఆయన భార్యగా ఆయనకే అంకితం చేస్తున్నాను."

"నీ ప్రేమ ఇలా చాటుకుంటున్నావా?"

"కాదు జీవితాంతం నాపేరు ముందు శ్రీమతి అని తగిలించుకునే అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞత తెలుపుకుంటున్నాను."

"నీతో ఎప్పుడూ మాటల్లో గెలవలేను కదమ్మా..."

కొన్ని క్షణాలు ఇద్దరి మధ్యా నిశ్శబ్దం రాజ్యం చేసింది.

"మామయ్యగారూ! మిమ్మల్నోమాట అడగాలనుకుంటున్నాను." నిశ్శబ్దాన్ని చీలుస్తూ అన్నది లావణ్య.

"అడుగమ్మా... నీకడ్డేవిటి?" ఆప్యాయంగా అన్నాడాయన.

"గంగ భవిష్యత్తు ఏం ఆలోచించారు?"

ఠుళ్ళిపడ్డాడాయన.

"ఇద్దరు పిల్లల తల్లి... మా దగ్గర మా సంరక్షణలో ఉంటూ ఆ పిల్లల్ని పెద్ద చేయడమే గంగ కున్న బాధ్యత. ఇంక వేరే భవిష్యత్తేమిటి?"

"ఎంత ఆప్యాయత! మీ సంరక్షణలో కాదు తనున్నది... మీ పంచన.."

"లావణ్యా -"

"కోపం వద్దు మామయ్యగారూ! సందర్భం వచ్చింది కాబట్టి, మీ దగ్గర నాకు చనువుంది కాబట్టి అడుగుతున్నాను. మూడు పదులు కూడా దాటని ఆ పిల్ల ఇలా మీ ఇంటిల్లిపాదికీ సేవలు చేస్తూ, మీరు పెట్టింది తింటూ బ్రతకాల్సిందేనా!"

"లావణ్యా! నువ్వు చేసిన పనికే ఈ కుటుంబం ఎంత అల్లరిపాలైందో నీకు తెలియదు. మీ అత్తయ్య కుమిలి కుమిలి ఈ మధ్యే కాస్త మనుషుల్లో పడుతోంది మన సంప్రదాయం, ఆచారం వీటికి విరుద్ధమైన పనిచేసి, ఈ ఇంటి కోడలిగా కళంకం తెచ్చావు. గంగనన్నా మా ఇంటి పరువు ప్రతిష్ఠలను నిలపనీ-" కొంచెం ఆగ్రహంగా అన్నాడాయన

"మీ ఇంటి పరువు ప్రతిష్ఠలు నిలపడం కోసం విలువైన ఆడపిల్ల జీవితం బలికావలసిందేనా? ఇంతకన్నా విషాదం ఉందా? మీ అబ్బాయి సంగతి తెలిసీ, ఓ ఆడపిల్ల

అతణ్ణి భర్తగా భరించలేక పారిపోయినా, నిస్సహాయురాలైన మరో ఆడసిల్లని నిర్దాక్షిణ్యంగా అతని జీవితంలో ప్రవేశపెట్టారు. కేవలం మీకో వంశాంకురం అందించడానికి ఆమెను బలి చేశారు ఇప్పటికైనా ఆమె భవిష్యత్తులో బాటవేసి, మీ విశాల హృదయం చాటుకోండి' ' ఆయన అవాక్కైనాడు.. ఏవిటి లావణ్య అనేది! ఏం చేయమంటోంది తనని!

"ఏం చేయమంటావు లావణ్యా!" వణికే కంఠంతో అడిగాడు.

"భయపడకండి మామయ్యా. ముందు ఆమెకి తన కాళ్ళమీద తను నిలబడగల శక్తిని, ధైర్యాన్ని ప్రసాదించండి. ఆర్థికంగా ఆమెకి స్వాతంత్ర్యం కల్పిస్తే జీవితాంతం, మీ దయాభిక్ష మీద ఆధారపడి బ్రతకవలసిన అవసరం ఉండదు కదా! ఇది లావణ్యగా నా సలహా."

అవధాని గారి తలమీద సమ్మెటతో కొడుతున్నట్లయింది. ఇది ఎలా సాధ్యం! కొన్ని నిమిషాల తర్వాత ఆయన అక్కణ్ణించి లేచి వెళ్ళిపోయారు.

లావణ్య నిట్టూర్చింది.

★ ★ ★

తెల్లవారింది. నిద్ర లేచిన లావణ్య గబగబా కాలకృత్యాలు తీర్చుకుని, స్నానం చేసి బయల్దేరింది. గంగ కాఫీ తెచ్చి ఇచ్చి మౌనంగా లోపలికి వెళ్ళిపోయింది.

లావణ్య కాఫీ తాగి గ్లాసు కిటికీలో పెట్టి లోపలికి తొంగి చూస్తూ "గంగా" అని పిలిచింది.

గంగ బైటికి వచ్చింది.

"మామయ్యగారు లేరా?"

"లేరు... గుడికెళ్ళారు..." గంగ చాలా సౌమ్యంగా జవాబిచ్చింది.

"ఎప్పుడొస్తారు? ఏమన్నా చెప్పారా?"

"లేదు మీకది ఇవ్వమన్నారు." వేలితో ఓ మూలగా పెట్టిన చిన్న ఇనప్పెట్టె చూపించింది. లావణ్యకి షాక్ తగిలినట్లయింది.

అదే తను ఆ ఇంట్లో వదిలేసి వెళ్ళిన స్మృతుల ఖజానా.. అది ఇక్కడ పెట్టారంటే... "ఇంక సెలవు... వెళ్ళిరా" అని తనకి ఆయన శాశ్వతమైన వీడ్కోలు పలికినట్లేనా!

లావణ్య గుండెల మీద సమ్మెటతో కొట్టినట్లయింది. ఇంత కాలానికి మొదటిసారి అవధానిగారు తనపట్ల చూపించిన నిరాదరణ... తట్టుకోలేకపోయింది... ఆ పెట్టె ముట్టుకోలేదు. అది ఇక్కడ వదిలేసిన కారణం వేరు... అవధాని గారి కోరిక తీర్చడానికి తను మరోసారి ఆ ఇంటికి రావాలంటే అదో వంక పెట్టి దానికోసం వచ్చానని చెప్పచ్చు అనుకుంది. కానీ ఇప్పుడా అవసరం లేదన్నమాట. ఇంకెందుకీ స్మృతులు.. సూట్‌కేస్ తీసుకుని చకచకా బస్టాండ్ చేరింది.

బస్ వచ్చింది. భారంగా కదిలి. ఫుట్‌బోర్డ్ కడ్డీ పట్టుకుని బస్ ఎక్కబోయిన లావణ్య తన భుజం మీద ఒడుపుగా ఓ చేయి పడడంతో చివ్వున తిరిగి చూసింది.

ప్రశాంతమైన మొహంతో అవధాని గారు... ఆయన ప్రక్కనే చేతిలో సూట్‌కేస్‌తో గంగ..

స్థాణువై పోయింది లావణ్య..

"మామయ్యా... మీరు. "

అవధాని గంభీరంగా నవ్వాడు.

"నేనేనమ్మా. . రాత్రంతా ఆలోచించి... ఆలోచించి నేను స్వార్థపరుణ్ణన్న నిజం గ్రహించాను. నాస్వార్థం కోసం గంగ జీవితం ఇప్పటికే నాశనం చేశాను..ఇంకా అలా జరక్కూడదు, ఈ అమాయకురాలికి సరైన గైడ్‌వి నువ్వే. అందుకే నీకు అప్పగించాలని వచ్చాను. "మరి పిల్లలు" అయోమయంగా అడిగింది. "పిల్లలు - నా వంశం కోసం కాదమ్మ - వాళ్ళ బాధ్యత బ్రతికున్నంత కాలం నాదే.."

"పొరపాటు మామయ్యా... పిల్లలు వంశం కోసమైనా, తల్లి పిల్లల కోసమే. ఈ నిజం మర్చిపోకండి. గంగ తనకంటూ ఓ జీవితాన్ని ఏర్పరచుకునేదాకా వాళ్ళ సంరక్షణ భారం మీదే.'

"లావణ్యా! ఆరోజు నువ్వీ ఇంటి నుంచి వెళ్ళిపోతుంటే.. ఆవేశంలో ఆలోచన మరచి వెళ్లిపోతోంది... గౌరవనీయమైన, భద్రత గల జీవితాన్ని కాలదన్నుకుంటోంది. ఎన్ని బాధలు పడుతుందో! ఏం చేస్తుందో అని మథనపడ్డాను. కానీ సాహసించి వెళ్ళినందుకు ఎంతో ఉన్నత శిఖరాల్ని అధిరోహించడమే కాక, నీ రచనలతో మరెందరికో స్ఫూర్తి నిస్తున్నావు. బహుశా ఆనాడలా నువ్వు వెళ్ళకపోయి వుంటే ఈనాటి గంగ స్థానం నీదై ఉండేది. అందుకే అప్పటి నీ నిర్ణయాన్ని నేనీనాడు మనస్ఫూర్తిగా హర్షిస్తున్నానమ్మా.." ఆయన కళ్ళల్లో భాష్పాలు

"అదృష్టవంతురాల్ని మామయ్యా. గంగని పూర్తి వ్యక్తిత్వం నిండిన స్త్రీగా మీకు అప్పగిస్తాను. మీ కోడలిగా.."

"నా కోడలిగానే నేను కావాలని ఆశిస్తే, అది మళ్ళీ నా స్వార్థమే అవుతుంది... నా కూతురిగా ఆహ్వానిస్తాను."

లావణ్య హృదయం ఆయన ఔన్నత్యానికి మౌనంగా అభివాదం చేసింది.

"అప్పుడా కూతురి జీవితం ఏం చేయాలో నిర్ణయించే భారం మీదే అవుతుంది మామయ్యా" అన్నది.

"నేను అందాకా బ్రతికుంటే తప్పక గంగకో అందమైన బతుకునిస్తాను. అందాకా ఈమె బ్రతుకు పుస్తకం నీకిస్తున్నాను. దీన్ని తిరగరాసి ఆవిష్కరించే బాధ్యత నీదే." గంగ చేయి లావణ్య చేతిలో పెట్టాడు.

"ధన్యురాల్ని" అన్నది లావణ్య.

బస్ ఎక్కమన్నట్టుగా బెల్ కొట్టాడు కండక్టర్. గంగ వంగి ఆయన పాదాలకు నమస్కరించింది.

"వస్తాను మామయ్యా" లావణ్య చేతులు జోడించింది.

"శుభమస్తు" అన్నాడాయన నిండుగా ఇద్దర్నీ దీవిస్తూ.

దుమ్ము రేపుకుంటూ కదిలిన బస్‌లోంచి ఊపుతున్న లావణ్య చేయి కన్నీటి పొరల మధ్య అస్పష్టంగా అభయ హస్తంలా కనిపించిందాయనకి.

అత్తలూరి విజయలక్ష్మి, 10-3-51/బి,
ఈస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాద్ - 500 026

## పగిడిపాల ఆంజనేయులు కథ

# అగమ్యం

పదో తరగతిలోనే చదువాగిపోతుందని భయపడ్డాను! "తిన్టానికి తిండే కరువైపోతుంది నీ సదువుకు పైసలు ఎక్కన్నించొస్తయ్... చదివింది చాల్తియ్" అన్నాడు - మా నాయిన. మూడ్రోజులు తిండి మానుకుని చదువయితే మానుకునేది లేదని అరిచి గీపెట్టి, ఇంటర్‌లో చేరాను! అదయిపోయి డిగ్రీకొచ్చాక చదువ్విలువేంటో తెలిసొచ్చింది నాయినకు - గొప్ప గొప్ప

చదువులు చదివితే పెద్ద పెద్ద ఉద్యోగాలొస్తాయని తెల్సిందేమో! పి.జి.లో సీటొచ్చిందని తెలీగానే నాకన్నా ముందే సంబరపడిపోయాడు! అమ్మయితే వార్తను ఈ ఇల్లూ, ఆ ఇల్లూ దాటించింది! మహానంద పడిపోతున్నారు! ఉద్యోగం చేసి వాళ్ళనుద్ధరిస్తానని కాదు గానీ ప్రయోజకుడ్నయితే నలుగుర్లో 'మా కొడుకు ఫలానా' అని చెప్పుకుందామని వారి ఆశ! నాకో అన్నయ్య ఉండేవాడుట. నా చిన్నప్పుడే అన్నల్లోకి పోయాట్ట. ఆరోజుల్లో అన్నలంటే యువరక్తం చెంగున ఎగిరి దూకేదిట. క్రిందటేడాదే ఎదురు కాల్పుల్లో చనిపోయాడని తెల్సింది. శవం మాదాకా రాలేదు. పోలీసులే ఆ పుణ్యకార్యం కాస్తా చేసి చేతులు దులుపుకున్నార్ట. అక్షరమంటే తెలీని అమ్మా నాయినలు నామీదే ప్రాణాలు నిలుపుకొని బతుకుతున్నారు. 'పెద్దోడట్లా పాడైపోయినాడు(?). చిన్నోడ్నయినా దక్కించుకోవాలె'నని నన్ను కంటికి రెప్పలా గంజిలో మెతుకులా కాపాడుకొస్తున్నారు!!

"తార్నాకా... తార్నాకా వచ్చేసింది దిగండి. దిగండి" కండక్టర్ అరుపులకి ఉలిక్కిపడి ఆలోచనల్లోంచి తేరుకుంటూ లగేజి సర్దుకుని బస్సు దిగేశాను. బయటంతా వెన్నెలను మింగేస్తూ తెల్లగా వీధి లైట్లు వెలుగుతున్నాయి! రోజు రోజుకీ స్వచ్ఛమైన వెన్నెలా, స్వచ్ఛమైన గాలీ కరువైపోతున్నాయి! పల్లెటూళ్ళలో అయితే మనుషులూ కల్మషమైపోతున్నారు. వాళ్ళకూ డబ్బు వాసన తెలుస్తోందిపుడిపుడే. పి.జి.లో సీటొచ్చిందని తెలీగానే నా పొడగిట్టని వాళ్ళూ వచ్చి ప్రశంసిస్తోంటే ఆశ్చర్యపోయాను! 'నేనేదో పెద్ద చదువు చదువుతున్నాననీ... రేపు రేపెదయినా పేద్ద అధికార్నయితే వాళ్ళకి ఉపయోగపడ్తాననీ' చాటు మాటలు కాదవి. వినయంగా (?) ముఖమ్మీదే చెప్పేశారు! లోలోపలే నవ్వుకున్నాను! మన్నిని మన్నిగా గౌరవించాల్సిన స్థాయిని దాటిపోతున్నారు. వాడి వెనుక డబ్బో, అధికారమో, పలుకుబడో ఉండాలి. కాదంటే ఏదో ఒక డిగ్రీ. ప్రకృతికి పుట్టినిల్లంటి పల్లెసీమలూ రాజకీయాల రొచ్చు గుంటల్లో పడి స్వచ్ఛతని కోల్పోతున్నాయి! కష్టాలూ సుఖాలూ కల్సిపంచుకునే జీవితాలు కత్తులూ గొడ్డళ్ళతో కొట్టుకు ఛస్తున్నాయి! చుక్కనీటికి నోచుకోని బూములు దాహార్తితో నెర్రెలు బారుతున్నాయి! వాటి దాహం తీర్చేందుకే అపుడపుడూ రక్తం పారుతోంది! ఎటు చూసినా ప్రశాంతమంతా కల్లోలంగా కన్పిస్తోంది!!

లైట్ల వెల్తుర్లూ, వెన్నెల వెల్తుర్లూ కలగలుపుకుని ఆర్ట్స్ కాలేజీ మేధస్సు మూర్తీభవించినట్టుగా గంభీరంగా దర్శనమిస్తోంది! ఆలోచనల్తోనే క్యాంపస్‌కి చేరుకున్నాను. భారతీయ వారసత్వ సంపదను అట్టహాసంగా ప్రపంచానికి ఎరుకపర్చే అందమైన 'ఆర్ట్స్' కాలేజీని చూడగానే నా మనస్సు ఉత్సాహంగా కెరటమై ఎగిసిపడింది. 'ఈ కాలేజీలో నేనూ చ..దు..వు..కో..బో..తు..న్నా..ను..!' ఒకానొక తన్మయీభావంతో సంతృప్తిగా కళ్ళు మూసుకున్నాను! ఆ ఉత్సాహంతోనూ ఉరకలు వేస్తూ... గోదావరి హాస్టల్లో దూకాను! రాత్రనకా పగలనకా కష్టపడి చదివి ఎంట్రన్స్ రాయడంతో ఒక మజిలీ అయింది. రెండ్రోజులు కాలేజీ చుట్టూతా, వార్డెన్ ఆఫీస్ చుట్టూతా తిరిగి అడ్మిషన్స్ తీసుకోవడంతో మరో మజిలీ అయిపోయింది. ఇక మిగిలిందల్లా... పడుకునేందుకు ఒక 'మంచం' సంపాయించుకోవడం. వినేవాళ్ళకిది కాస్త విడ్డూరంగానే అన్పిస్తుంది కానీ ఇక్కడ వార్డెన్ సిబ్బంది స్టూడెంట్స్‌కి రూమ్సు ఎలాట్ చేయర్ట. స్టూడెంట్సే రూమ్ చూసుకోవాల్ట. హాస్టల్లో గది దొరకడవూ - మంచం దొరకడవూ గగనం

కాదు కదా! అందుకే నేను పుస్తకాలూ, బిస్తర్లూ సర్దేసుకుని బయలుదేరాను! ఈ మజిలీ కాస్తా అయిందనిపించుకుంటే హాయిగా ఊపిరి పీల్చుకోవచ్చు.

★ ★ ★

ఒక రూమ్‌లో...

"నమస్తే సర్!" అన్నాను సీనియర్ నుద్దేసించి.

"నమస్తే" బెదురుగా చూస్తూ ఏవిటన్నట్లుగా కళ్ళతోనే ప్రశ్నించాడాయన.

"మీ రూమ్‌లో కాట్స్ ఖాళీ ఉన్నాయేమోననీ..."

"సారీ కాట్స్ ఖాళీ లేవు" అతడి కళ్ళు తేలికపడ్డాయి.

..........

"చాలామంది ఎంట్రన్స్ రాయగానే, నమ్మకంగా అన్నిస్తే కాట్ చూసుకుని వెళ్తారు లేదా ఫ్రెండ్స్‌కయినా చెబుతారు... మీకు సీనియర్ ఫ్రెండ్స్ ఎవరూ లేరా?"

"లేరండీ" అన్నాను నిర్లిప్తంగా.

"నాల్రోజులు ముందు రావాల్సింది... ఇపుడు కాట్స్ దొరకడం చాలా కష్టం" అతడి మాటల్తో నా గుండెలు గుభేలుమన్నాయి. మంచం దొరకడం కష్టమా? ఆ సీనియర్‌కి కృతజ్ఞతలు చెప్పి బయటకొచ్చాను.

మరో రూమ్‌లో....

"వెల్‌కం" సీనియర్

"సర్ కాట్స్... ఖాళీ...", సంశయంగా అడిగాను.

"ఒక్క మంచం ఖాళీ వుంది...."

"నన్ను చేరిపొమ్మంటారా?" ఆశగా అడిగాను కాస్త ముందుకు వంగి.

"మీది ఏ జిల్లా?" చప్పున చల్లారిపోయానా ప్రశ్నలో. నీది ఏ దేశం, ఏ ఖండం అని నిలదీస్తున్నట్లుగా అన్పించింది. ఓపిగ్గానే జిల్లా పేరు చెప్పాను.

"సారీ మా జిల్లా వాళ్ళకే పరిమితం" ఇంత చదువులు చదువుకున్నా సంకుచితత్వం, ప్రాంతీయ తత్వం పెరుగుతున్నాయే కానీ తగ్గడం లేదు. నవ్వాలో ఏడ్వాలో అర్థం కాని అయోమయ పరిస్థితి. మరో రూమ్‌కెళ్ళాను అలాగే... మరో రూమ్... మరో రూమ్... మరో రూమ్.. మరో రూమ్... లో...

"నమస్తే సర్!" బిక్కుబిక్కుమంటూనే చెప్పాను.

"కూర్చోండి" అన్నాడు సీనియర్ చిర్నవ్వుతో.

"మీ రూమ్‌లో.. మంచం... ఖాళీ ఉంటే ఇప్పిస్తారనీ.." నా మాటలు నాకే నామోషీగా విన్పించాయి. 'ఉద్యోగమిప్పిస్తారా?' అని అడిగినట్లుగా ఉంది నా అభ్యర్థన.

"మంచం ఖాళీగానే ఉంది. ఒకటి కాదు రెండున్నాయి. మీలాంటి జూనియర్స్ వస్తారనే ఉంచాం కానీ..." సంశయిస్తున్నాడు సీనియర్ వాళ్ళింటి సొమ్మయినట్లుగా.

"చెప్పండి సార్" అన్నాను ఎప్పట్లాగే ఆశగా ముందుకు వంగి

"మీది ఏ పార్టీ?" కాస్సేపటి మౌనం తర్వాత అతడడిగిన ప్రశ్న ఛెళ్ళుమని కొరడాతో

కొట్టినట్లు తాకింది. సమైక్యతే ప్రాణంగా, ఆత్మీయతలూ, ఆప్యాయతలూ ఊపిరిగా పోసుకుని బతుకుతూ... నిన్నటి బాలలమే నేటి పౌరులమై రేపటి నవసమాజ నిర్మాతలుగా ప్రసిద్ధికెక్కాల్సిన వారసులం(?)... కాకపోతే నిరుద్యోగులం. కానీ ఈ వేర్పాటువాదమేమిటి? పొరలు పొరలుగా ఏదో విడిపోతున్నట్లుగా అన్పించింది. "మంచం" దొరుకుతుందనే ఆశ క్షణక్షణానికీ అడుగంటిపోతుంది. జానెడు పొట్ట నింపుకునేందుకు అల్లాడిపోతున్న దరిద్రుల్ని ఐక్యం చేసి 'వర్గపోరాటాన్ని' నినదించాల్సిన మార్క్స్ గొంతుకల్లో 'పార్టీ పోరాటాలు' విన్పిస్తున్నాయి! దేశ సంపదనంతా పంచి సమసమాజాన్ని నిర్మిస్తారా? రేపటి ఎమ్మెల్యేలూ, ఎంపీలూ అవుతారా? ఏమౌతారు వీళ్ళంతా? స్టూడెంట్స్‌కి రూమ్స్ ఎలాట్ చేయాల్సిన బాధ్యత హాస్టల్ సిబ్బందికి లేదా? అప్పటికప్పుడే వెళ్ళి ఛీఫ్ వార్డెన్‌ని నిలదీయాలన్నంత కోపమ్ముంచుకొచ్చింది. కానీ ఈ చీకటింకా తెల్లారిపోవద్దూ? మౌనంగా ఆ రూమ్‌లోంచి బయటకొచ్చాను. నిరాశా నిస్పృహలు చుట్టుముడుతున్నాయి! యథాలాపంగా నడుస్తోన్న నాకు ఎదురుగా వస్తోన్న ఓ 'గుంపు విద్యార్థులు' కన్పించారు! ఆ గుంపు మధ్యలో ఒకాయన తెల్లగా ప్రశాంతంగా... ఇంకా చెప్పాలంటే ప్రసన్నంగా ఉన్నారు. ఠక్కున చేతులు జోడించి నమస్కరించాను. విగ్రహమలాంటిది మరి.

"ఏ డిపార్ట్‌మెంట్?" పరిచిత వ్యక్తిలా చిర్నవ్వుతో అతి సౌమ్యంగా అడిగాడు. నేను చదవబోయే కోర్సు వివరాలు చెప్పాను. ఏ జిల్లా, ఏ పార్టీ అని అడగనందుకు సంతోషం వేసింది. అప్పటికే గుంపులో కలిశాన్నేను.

"రూమ్ కోసం వెతుక్కుంటున్నాను" అన్నాను మంచం కోసమని చెప్పుకోలేక.

"తెల్సు" అన్నాడా సీనియర్. నేనాశ్చర్య చకితుణ్ణయ్యాను. 'ఎలా తెల్సు?' నాలో నేనే అనుకుంటున్నట్లుగా పైకనేశాను.

"జూనియర్ మిత్రుల యోగక్షేమాలు తెల్సుకోవడం మా బాధ్యత" నా చేతిలోని బ్రీఫ్‌కేస్ వైపూ, భుజానికున్న బ్యాగు వైపూ చూస్తూ చెప్పాడు.

"ఆపద్బాంధవులు" అనుకున్నాను.

ఇంతలో గుంపు ఓ గది ముందాగింది. గది తలుపులు తెర్చుకున్నాయి.

"ఈ రూమ్‌లో ఎన్ని కాట్స్ ఉన్నాయి?" గుంపు పెద్ద.

"ఆరు" లోపల్నుంచి విన్పించింది.

"ఎందరుంటున్నారు?" గుంపు పెద్ద.

"ఐదుగురం".

"ఐతే ఇంకొకర్ని చేర్చుకోండి" గుంపు పెద్దకి ఎదురు జవాబో ప్రశ్నో వస్తుందనుకున్నాను. నాకన్నా ముందొచ్చిన కొత్త వ్యక్తి రంచన్‌గా ఆ రూమ్‌లో చేరిపోయాడు. అలా నాలుగయిదు రూమ్‌ల్లో నింపేశారు గుంపు విద్యార్థులు. ఇక మరో రూమ్‌లో ఖాళీ మంచం దొరికితే.. చేరిపోయేది నేనే... మొలక లాంటి ఆశ మొక్కై... వృక్షమై ఎదిగిపోతోంది క్రమంగా. ఇంకో ముఖ్య విషయమేమిటంటే కొంతమంది బయటి వ్యక్తులు రూమ్‌లలో వండుకుని తింటూ కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌కి ప్రిపేర్ అవుతూనో... పార్టీపరంగా పని చేస్తూనో గడుపుతార్ట. చదువయిపోయిన సీనియర్స్ కూడా అలాగే చేస్తార్ట. అందువల్ల ఆ గదుల్లో ఉండేది లీడర్సో, నాన్ బోడర్సో తెలీదు. మొత్తానికి గుంపు విద్యార్థులు కొంతమంది నాన్‌బోడర్స్‌ని కూడా

పట్టుకోగలిగారు. ఈలోగా మరో గది తలుపులు భళ్ళున తెరుచుకున్నాయి! లోపల్నుండెవరూ బయటకు రాలేదు ఎందుకో తెలీదు కానీ గుంపు పెద్ద ముఖంలో రంగులు మారుతున్నాయి. ముఖం ఎరుపెక్కుతోంది. కొంచెం సేపు చూసి గుంపు లోపలికెళ్తుండగా లోపల్నుంచి,

"ఏం కావాలి?" అని ఓ గొంతు దృఢంగా పలికింది. నా గుండెలో దఢదడ మొదలయ్యింది. అక్కడున్న కళ్ళన్నీ ఆవేశంతో ఎర్రబడ్తున్నాయి.

"నువ్వా?" ఆశ్చర్యంగా గుంపు పెద్ద.

"ఊఁ" బింకం ధ్వనించింది.

"మన పార్టీలోంచి ఇందులో చేరావుట్రా" గుంపు పెద్ద పళ్ళు నూరాడు. నాలో రక్తం ఎదురు ప్రవహించడం మొదలయింది. ఆశల వటవృక్షం కూ...లి...పో...తోం...ది..

"మన పార్టీకాదు... మీ పార్టీ... మీపార్టీకీ నాకూ ఏ సంబంధమూ లేదు" ఉరుముతున్నట్టుగానే చెప్పాడతడు.

"ఏరా... లం...కా... నిన్న మొన్నటి దాకా మా వెనకాలే తిరిగి ఈరోజు... పార్టీ ఫిరాయిస్తావు బే, ఎక్కడా మంచం దొరక్క పిచ్చికుక్కలా తిరుగుతోంటే మేవే కదరా నిన్నాదుకుంది..." గుంపు పెద్ద నోరు అమ్మనాబూతులు కురుస్తోంది. అప్పటికే మరో గుంపు సిద్ధమయ్యిందక్కడ. మాటలు పెరిగిపోయి... బూతులై ప్రవహించి... క్షణాల్లో మొదలయింది గుంపు పోరాటం... పార్టీల యుద్ధం!! గుండెనెవరో పిసికేస్తున్నట్లుగా విలవిల్లాడిపోయాను. గుంపు సంఘమే విజయ ఢంకా మోగిస్తోంది. కారుణ్యానికి లొంగాల్సిన తలలు కాఠిన్యానికి లొంగిపోతున్నాయి! మేకల్లా నటించిన పులులు పంజా విసుర్తున్నాయి! పులులై తిరిగిన మేకలు రక్తం కారుస్తున్నాయి. కళ్ళ చుట్టూ వలయాలు వలయాలుగా చీకటి చుట్టుకుంటోండగా అక్కడ్నుంచి దూరంగా పారిపోయి హాస్టల్ దాటి బయటకొచ్చాను. 'హింసో ధర్మః' అంటూ హాస్టల్ లోంచి గాండ్రింపులు విన్పిస్తున్నాయి! గుంపు సంఘం స్వైరవిహారం ఇంకా కళ్ళముందు కదుల్తూనే వుంది. గాంధీత్వాన్ని, బుద్ధత్వాన్ని ముసుగుల్లా ధరించిన తెరలు చెదిరిపోయి పశుత్వం తెరకడ్తోంది!! రక్తానికి మరిగిన చేతులు మెత్తగా ఒక్క హృదయాన్నయినా స్పృశించగలవా? గాండ్రింపులకు మరిగిన నోరు తీయగా ఒక్కమాటయినా మనస్సు లోతుల్లోకి చొచ్చుకుపోయేలా మాట్లాడగలుగుతోందా? ఏ సిద్ధాంతమో తెలీదు, గమ్యమేంటో తెలీదు, పోరాటమెందుకో తెలీదు... ఆ నినాదాల ప్రయోజనంతో పన్లేదు. కుప్పలు, తెప్పలుగా మనుషులు వెంట నడిస్తే చాలు అదే పదివేలు! సమాజంలోని అణువు అణువులో ఇదే కదలిక! పల్లెలయినా, పట్నాలయినా, చదువున్నా, లేకపోయినా!! కులాలు కులాలుగా, వర్గాలు వర్గాలుగా, మతాలు మతాలుగా, పార్టీలు పార్టీలుగా.. హృదయాల్లేని వేల వేల మానవాకారాలు డొల్లలు డొల్లలై కొట్టుకు ఛస్తున్నాయి! శతాబ్దాల చరిత్రనూ, తరతరాల సంస్కృతినీ మోసుకొస్తోన్న 'మానవత' రాతి పిడికిలి నుండి ఉక్కు పిడికిలికే హింసన్నుండి హింసకూ పురోగమిస్తోంది??? ఆరోజు తిండి కోసం... ఈ రోజు మనుగడ కోసమో... భద్రత కోసమో!!

ఆ రాత్రి నలుగులు వ్యక్తులు తీవ్ర గాయాలతో ఆస్పత్రి పాలయ్యారుట!!

★ ★ ★

కామన్ హాల్లో నిద్రకుపక్రమించాను. ఎంతకీ నిద్ర రావట్లేదు. బయట కురుస్తోన్న వర్షం చప్పుడికి బాల్యం గుర్తొచ్చింది. ఒంటిమీద నూలుపోగయినా లేకుండా వర్షంలో తడుస్తూ 'వానరాళ్ళు' ఏరుకుని చప్పరిస్తూ గడిపిన మధుర క్షణాలు... ఎంత హాయిదనం! చిప్పిల్లిన కళ్లు తుడుచుకున్నాను! అ, ఆ ల వయస్సులో అరమరికలు లేకుండా భాయీ భాయి అనుకుంటూ భరతమాత ముద్దు బిడ్డలం... భావి భారత పౌరులం అని పాడుకుంటూ చదువుకున్న రోజులు తల్చుకోగానే గుండె లోతుల్లో అణగారిన దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికింది! అపుడూ విద్యనార్జించిన విద్యార్థులమే, ఇపుడూ విద్యనార్జిస్తోన్న వి.. ద్యా... ర్థు...ల...మే...?? అంతటి అర్ధరాత్రిలోనూ నిశ్శబ్ద నీరవంలోనూ గోదావరి హాస్టల్ పైశాచికానందంతో నవ్వుతోంది. కోడి కూతకీ, అర్ధరాత్రికీ మధ్య విరామం తెలీకుండా శ్రమించే అమ్మా నాయినలకు ఏనాటికయినా 'బుక్కెడు బువ్వ' కలిపి తిన్పిస్తాననే ఆశ క్షీణించిందా క్షణంలో! వాళ్ళ రక్తాన్నీ మాంసాన్నీ భుజిస్తూ ఇంకెన్నాళ్ళు శ్రమదోపిడీ చేయాలో... నాకన్నా భయంకరమైన బూర్జువాలుంటారా? జీవిత పోరాటంలోంచి ఎపుడో రిటైరవ్వాల్సిన శరీరాలు అరిగి... కరిగిపోతున్నాయి! పులిచేతిలో బంగారు కడియంలా కన్పిస్తోన్న ఉద్యోగం కోసం ఎన్నాళ్ళు పరుగెత్తాలో... ఎంత దూరమో... అదే క్షణంలో నిర్ణయించుకున్నాను. ఇంటికెళ్ళిపోయి మట్టి దున్నుకుని బతకనేర్చుకుంటే బాగుపడ్తానని.

★ ★ ★

రాత్రి తాలూకూ హింసా దృశ్య ఛాయలేవీ లేవక్కడ! పోలీసుల ఆర్భాటాలు లేవు. కయ్యానికి కాలు దువ్వుకోడాలూ లేవు. ఏమీ ఎరుగని ప్రశాంత దృశ్యంలా వుంది. ఈ దృశ్యం వెనుక ఎన్నెన్నో విషాదాలూ రక్తపాతాలూ నిక్షిప్తంగా ఉన్నాయనేందుకు నిదర్శనంగా ఎవరికి వారే మేకపోతు గాంభీర్యాన్ని ప్రదర్శిస్తున్నారు. బ్యాగు భుజానేసుకుని బయటకొచ్చి క్యాంపస్ దాటుతుండగా.... చల్లటి స్పర్శ తగిలింది భుజమ్మీద! కళ్ళెత్తి చూశాను. ఒళ్ళు జలదరించింది! మాయమైపోయిందనుకున్న విషాద దృశ్యం దైన్యంగా కన్పించింది. కత్తిగాట్లను కప్పేస్తూ ఒంటి నిండా బ్యాండేజీ... దుఃఖాన్నీ, బాధనీ మింగేస్తూ ముఖం నిండా ఎర్రదనం చిరుగులు పడిన చొక్కా నిండా రక్తపు మరకలు! రక్తాన్ని స్రవించినట్టుగా ఉన్నాయా కళ్ళు! గట్టిగా కళ్ళు మూసుకున్నాను.

"పారిపోతున్నావా బ్రదర్!" నూతిలోంచి వస్తున్నట్లుగా లేదా గొంతుక - హుంకరిస్తున్నట్లుగా ఉంది. హడలిపోయాను. భయంతో కాదు ఆశ్చర్యంతో.

"ఎవర్నువ్?" నేనూ మేకపోతు గాంభీర్యాన్నే నటించా.

"నీలాంటి వాడ్నే కాదా?" ఈసారి అతడి పెదాలు చిర్నవ్వు నవ్వాయి! గుండె డప్పులా మోగుతోంది. ప్రమాదం ఏవైపు నుంచి ముంచుకొస్తుందోననే భయంతో.

"చదువుకోవాలనే ఆశ రాత్రే చచ్చిపోయింది" నా గొంతు ఖంగుమంది.

"నాకు చావలేదు" దృఢంగా.

"పార్టీలు పార్టీలని కుళ్ళబొడుస్తోంటే... చదువుకుంటావా?" అసహనంగా అడిగాను.

ఎక్కడో తగిలిన గాయం నెప్పి పుట్టించిందేమో 'అమ్మా' అంటూ నడుం పట్టుకున్నాడు.

"అదే... ఆ అమ్మా నాన్నల కోసమే వెళ్ళిపోతున్నాను" ఈ గుంపు బతుకుల్లో బతకడం

చేతకాదు: నాకు స్వేచ్ఛ కావాలి. ప్రశాంతత కావాలి. నామీద ఎన్నో ఆశలు పెట్టుకుని చదివిస్తున్న నా తల్లితండ్రుల ఆశయాలు నెరవేర్చాలి. నా కష్టార్జితంగా వాళ్ళకో ముద్ద తిన్పించగల్గాలి. ఈ గుంపు... పోరాటం నేను చేయలేను" అప్రయత్నంగా నా కళ్ళల్లో నీళ్ళు పొంగుకొచ్చాయి. మాటలు ఆవేశంగా ధ్వనించాయి. అప్పటికే ఇద్దరమూ ఆర్ట్స్ కాలేజీకి చేరువయ్యాము. బడబాగ్నుల్ని అడుగుపొరల్లో దాచుకున్న నిశ్చల జలపాతంలా ఉందది. సూర్యబింబం లేలేత కిరణాల్ని రాలుస్తోంది. లాన్‌లో కూర్చున్నాం. క్షణాల పరిచయం స్నేహంగా ఊపిరి నింపుకుంటోంది!!

"గుంపు పోరాటం తప్పించుకున్నా... జీవిత పోరాటం తప్పదు బ్రదర్" బాధని కొస పంటి మధ్యన బిగించి అదే చిర్నవ్వుతో చెప్పాడు. నేను తలదించుకున్నాను.

★ ★ ★

'మిత్రా'కి ఆరోగ్యం నయమయ్యింది. ఇద్దరం హాస్పిటల్ లోంచి బయటకొస్తున్నాం.

"ఒక గొప్ప సమాజాన్ని నిర్మించాలని కలలుగన్న మహానుభావులు కనుమరుగయిపోయారు. కొందరు అడవుల పాలయ్యారు. ఇంకొందరు అదృశ్యమై పోయారు. మరికొందరు రంగులు మార్చుకుని తెరమీదికెక్కి ఆడుతున్నారు. వాళ్ళే ప్రయోజకులు" 'మిత్రా' చెబుతుంటే మౌనంగా ఉండిపోయాను.

"జీవించాలంటే పోరాటం తప్పదు. నీతో నీవు పోరాడాలి, నీ చుట్టూ ఉన్న సంఘంతోనూ పోరాడాలి... స్వేచ్ఛగా పుట్టిన మానవుడు సర్వత్రా సంకెళ్ళలో బందీ అయి వున్నాడు..."

"రూసో!" అన్నాను.

"సెలయేళ్ళలో నీళ్ళు తాగుతూ ఆకూ, అలమా తిని స్వేచ్ఛగా బతికిన మనిషి తనని తానే బంధించుకున్నాడు... ఇంకా బంధించుకుంటూనే వున్నాడు. ప్రాకృతిక వ్యవస్థలో ప్రతి వ్యక్తీ తోటివానితో యుద్ధం చేయాల్సొచ్చేదన్నాడు.."

"హాబ్స్"! అన్నాడు మిత్రా.

"మనమింకా ప్రాకృతికావస్థలోనే ఉన్నామా?" అన్నాను.

"నాకన్నా మీరే ముందున్నారే!" నవ్వాడు మిత్రా. ఇద్దరం టిఫిన్ తిని గోదావరి హాస్టల్ వైపు నడిచాం. నల్లటి పెయింటింగ్‌లో "గోదావరి హాస్టల్" అన్న అక్షరాలు తెల్లగా అశాంతిలో శాంతిలా మెరుస్తున్నాయి.

పగిడిపాల ఆంజనేయులు, తొరూర్, నవాబ్‌పేట్,
వరంగల్ - 506 303

# ఇంతకుమించి పెద్ద మార్పేమీ లేదు

కావడానికి మిట్టమధ్యాహ్నమేగానీ, అప్పుడే తెలతెలవారినట్టువుంది వాతావరణం.

ఆవూళ్లో ఎండగాయక ఆవేళ్టికది మూడోరోజు.

ఒకటే ముసురు.

దిక్కూదారి లేకుండా వీస్తున్నగాలి.....గాలికి తోడు కుళ్లు చినుకులు.. మధ్య మధ్య ఆగాగి ఉరుములు, మెరుపులు.

ఆ ఊళ్లో జనంలేరని కాదు వున్నారు. జనసంచారమే అంతగాలేదు. కొక్కెర తెగులు తగిలిన కోడిలా ముణగదీసుకు పడుకుంది వూరు. బంగాళాఖాతంలో ఏర్పడ్డ అల్పపీడనం తాలూకు ప్రభావం ఆవూరి మీద వుందో లేక ఆవూరి దళితజనం తాలూకు అవమానం ప్రభావమే బంగాళాఖాతం మీదపడిందో తెలీదు గానీ - మొత్తమ్మీద - ఉబ్బసరోగి ఊపిరితిత్తుల్లా అల్లకల్లోలంగా వుంది వాతావరణం..

ఊరికి అరమైలు దూరంలో ప్రవహిస్తోంది నది.

నదికి ఆనందం కలిగినా, ఆగ్రహం కలిగినా దాని ప్రభావం ఆవూరి మీద పడ్డాకే మిగతా వూళ్లమీద పడుతుంది. ఊరు ఏర్పడ్డ దగ్గర్నించి యిప్పటికి ఎన్నోసార్లు వరద ముంపుకు గురైంది. నది వరదైనప్పుడల్లా ఊరు పడవగామారడం నేర్చుకుంది. కాబట్టి అదింకా ఊరులాగవుంది. లేకుంటే ఎప్పుడో వల్లకాడయి వుండేదని చెబుతుంటారు పెద్దాళ్లు.

ఆవూరి పొలాల్లో పంటలు గొప్పగా పండుతాయంటే అది [illegible] అంటుంటారు అంతకు ముందుతరం పెద్దాళ్లు. వూరికి పంటకాలమే [illegible] - మృత్యుముఖందాక పోయి అదృష్టవశాత్తు బతికి బట్టకట్టిన [illegible] వూరు. పంటకాలవొచ్చాక అప్పుడే సమర్తాడిన ఆడపిల్లలా తయారవుతుంది.

ఆవూరి గురించి యింతగా చెప్పడం[illegible] జోగినాథం ఆవూళ్లోనే వున్నాడు. ఎల్లయ్య ఆవూళ్లోనే వున్నాడు. ఎల్లయ్య బాపుకి [illegible] పెట్టివున్నాడు జోగినాథం!

★ ★ ★

"రేయ్!"డైనింగ్‌టేబుల్ ముందర కూర్చున్న జోగినాథం వేసిన కేకకి వంటింట్లో గిన్నెలు అదిరిపడ్డాయి. వంటింటి కిటికీలోంచి కనిపిస్తున్న మబ్బుతునక కాస్సేపు పెళపెళామంది.

పనిమనిషి ప్రాణాలు బిగబట్టి "అయ్యా వొచ్చేవొచ్చే" అన్నాడు.

"ఎంతసేపురా నీ...." బూతులు తిట్టేడు జోగినాథం. జోగినాథం మనిషికాదని కాదు, అతనికి సంస్కారం లేదనికాదు, పెద్దకులంలో పుట్టినవాడే చదువూ సంధ్యా తెలిసినవాడే, మర్యాధా మన్ననా ఎరిగినవాడే కాకపోతే కొన్ని కొన్ని విషయాలు అస్సలు భరించలేడు. ఆకలేస్తే తట్టుకోలేడు. అచ్చం పసిపిల్లాళ్లా గోలచేస్తాడు. అతని విషయంలో ఆకలనేది సహజ చర్యకాదని, అది వ్యాధిలా అతిన్ని పీడిస్తోందని వైద్యులు తీర్మానించారు. జోగినాథాన్ని ఎరిగిన వాళ్ళు దాన్ని కరారు చేశారు కూడా.

జోగినాథం బాగా తింటాడు. అన్నంతింటాడు.

అక్కారలుతింటాడు, మాంసంతింటాడు, బుర్రలు తింటాడు. భూములు తింటాడు, అవతిలి వాళ్ల మానమర్యాదలూ తింటాడు, అతను తినే అన్నానికి ఒక పరిమితి అంటూ వుండొచ్చేమోగానీ - అవతలివాడి డబ్బుని తినెయ్యడంలో జోగినాథానికెలాంటి పరిమితులూ లేవు.

"ఒరేయ్ లచ్చిగా!" వికృతంగా అరిచేడు జోగినాథం. అతను వికృతంగా ఏంవుండడు. చాలా అందగాడు. నలభయ్యయిదేళ్ళుంటాయి. మాంచి పుష్టిగలిగిన విగ్రహం. దబ్బపండు ఛాయ. సూదంటురాళ్లంటికళ్లు, బిగితగ్గని కండలు, పహిల్వాన్‌లా వుంటాడు. అతని నవ్వుకూడా ఎంతో అందంగా వుంటుంది. కానీ అతను జనంమధ్య వుండగా చూస్తే - అచ్చం గొర్రెల మందలో దూరిన తోడేల్లాగ వుంటాడు. ఇంతాజేస్తే, అతను ఆవుల్లో మోతుబరే! కాకపోతే కాస్తంత కులపిచ్చి వున్నమోతుబరి!!

అతని భార్యాపిల్లలు హైదరాబాదు వెళ్లి వారంరోజులు పైనే అవుతోంది. అప్పట్నుంచి వంటమనిషికి అనుక్షణం ప్రాణ సంకటంగానే వుంది. పొద్దున్నే టిఫిన్లు, అవయ్యాక ఆసీజన్లో దొరికే పళ్లూపలారాలు, మధ్యాహ్నం మాంసంతో భోజనం, నాలుగింటప్పుడు కాఫీలతో బాటు టిఫిన్లు, పొద్దువాటారు తుండగానే మందులోకి మాంసం, చేపల వేపుళ్లు, రాత్రి ఎనిమిదిన్నర తొమ్మిదవుతుండగా మళ్లీ ఏదో ఒక నీసుతో భోజనం... పడుకోబోయేముందు మళ్లీ కాసిని తినేవి తాగేవి..... వంటమనిషికి యివన్నీ అలవాటేగానీ, ఇంట్లో అమ్మగారుంటే అయ్యగారి అరుపులు, బూతులు అంతగా విన్పించవు. ఆవేళ మధ్యాహ్నం భోజనానికి రానని చెప్పినవాడు హఠాత్తుగా వూడిపడి "ఊఁఊఁ వడ్డించు" అన్నాడు. వంటమనిషి హడిలి పోయాడు. అయ్యగారు కాస్తంత కాకమీదవున్నారు. వంటమనిషి చేతులు యంత్రాల్లా చకచకా పనిచేయ్యడానికి అదోకారణం. అతనికి వున్నంత ఆదుర్దా ఆయింటి గ్యాస్ స్టవ్‌కి లేకుండా పోయింది. కనకనే ఆలస్యం. నరాలు మెలిదిరిగిపోయే ఆలస్యం!

జోగినాథం డైనింగ్‌టేబిల్ ముందర కూర్చున్నా, అతనిధ్యాస తిండిమీదేవున్నా చూపులు మాత్రం వీధిగుమ్మం మీదే వున్నాయి. ఉన్నట్టుండి ఆకాశం ఫెళఫెళా ఉరిమింది. ఉరుముతోపాటు పిడుగులా వచ్చాడు హనుమంతు. జోగినాథానికి ఏళ్లతరబడి నమ్మినబంటు.

"ఏరా....ఎళ్లిన పనేమైంది?"

"నేను యిందాక బయల్దేరేటప్పుడు మీరన్నమాట అచ్చరాలా నిజమేనండీ" గొడుగు మడిచి మూల్న పెడుతూ అన్నాడు హనుమంతు,

"......................................?"

"ఆ ఎల్లయ్యగోడికి యిట్నుంచటు అరిచేతిమందాన అడ్డంగా బలిసిపోయింది"

"ఏవంటాడూ?"

"మీ డబ్బులు మీరు అణాపైసల్తోసహ తీసేసుకుని వాళ్ల భూములు వాళ్లకి వాపసు యివ్వకపోతే ఊరు రగతకొల్లవుద్దని నాకు వార్నింగిచ్చేడు ఆ నా కొడుకు. నిల్చున్న పళంగా నిలువునా నరికేసివుందును గానీ - మళ్లా మీ పరువూ మర్యాదలతో కూడుకున్నయవ్వారం - అనీ - "

"ఇంతకీ ఏం జేసినావ్ - !"

"ఎల్లయ్యని మీరు అరిజెంటుగా రమ్మన్నట్టు చెప్పినా వస్తాలే, నువ్వుపద అన్నాడు. కాస్సేపుట్లో రావొచ్చేమో!"

"రానియ్ నా కొడుకుని - నువ్వైతే రెడీయేగదా"

బొడ్లో దోపుకున్న కత్తిని బైటికి తీసి చూపించి వెకిలిగా నవ్వి, మళ్లీ కత్తిని బొడ్లోదోపుకుని పైన చొక్కా సర్దుకున్నాడు హనుమంతు,

వంటమనిషి ట్రేలో భోజనం సర్దుకుని వొచ్చేడు. ఆకలిగొన్న పులిలాగ అతని మీదికి ఎగబడి జుట్టందుకుని, "ఇంతోటి భోజనం వడ్డించటానికి ఎంతసేపురా ఎడ్డి నా కొడకా ' ' అన్నాడు జోగినాథం.

వంటమనిషి గడగడలాడి పోయేడు, జోగినాథం పళ్లెం అందుకుని విసిరికొట్టబోయేడు గానీ, అందులోంచి పొగలు పొగలుగా తన్నుకొస్తున్న చందవా చేపల పరిమళానికి నోరూరి పోయి వంటమనిషి జుట్టొదిలేసేడు.

వంటమనిషి కూడా ఏమీ జరగనట్టే హనుమంతుని చూసి తెచ్చి పెట్టుకున్న నవ్వుతో "మీక్కూడా వడ్డించుమన్నారా?" అనడిగేడు. అడగకూడనిదేదో అడిగినట్టు అతని కేసి ఉరిమి చూసేడు జోగినాథం. అతని చూపులతిట్లు అర్థం చేసుకున్న వంటమనిషి క్షణాల మీద హనుమంతుక్కూడా భోజనం వడ్డించేడు.

అన్నంతింటూ మధ్యలో అన్నాడు జోగినాథం. "లెక్కప్రకారం చూస్తే బ్రేమ్మలు మంత్రాలు, తంత్రాలు, యవ్వారాలు చూసుకోవాల. రాజులు రంగప్పలు ఏలుబడి చూసుకోవాల, కోమట్లు యాపారాలు చూసుకోవాల, మనబోటోళ్లు ఎగసాయం సంగతి చూడాల - ఆ ఎదవ నాయాలు ఎల్లయ్య బోటోళ్లు కూలీనాలీ చూసుకోకాల.'

"అవునుగదా!"

"మరి వాళ్లు జేస్తుందేమిటి. చదువులు కావాలంట. ఉద్యోగాలు గావాలంట. ఊళ్లేలాలంట. అందర్తోబాటు అన్ని జెయ్యాలంట. సరే యాణ్నో ఏదో చేసుకుంటే చేసుకున్నారు, మనకనోసరం ఈ వూళ్లో నాతోబాటు ఎగసాయంజేత్తారంట."

"అదెట్టాకుదురుద్దీ?" ఎదురు ప్రశ్నవేసేడు హనుమంతు.

"అదేగదా నేనూ చెప్పేది. ఎల్లయ్యగాడిక మాటలకు మణిసికాడని తేలిపోయింది.

వాణ్ని నువ్వే ఏసేస్తావో, ఏసేయిస్తావో నాకనోసరం. చీకటడేతలికి వాడు మనూరి పంటకాలవలో శవమై తేలాల," తేల్చి చెప్పేసేడు జోగినాథం.

హనుమంతు మాట్లాళ్లేదు. చేపముక్కని చిద్విలాసంగా నములుతూ బొడ్లో దోపుకున్న కత్తిని ప్రేమగా నిమిరేడు. ఆ హత్య అతను చేస్తే పదకొండోదవుతుంది. చేయిస్తే పదహారోదౌతుంది.

సరిగ్గా అదేసమయానికి రేడియోలో తుపాను హెచ్చరిక వినిపిస్తోంది! దానికి వంతపలుకుతున్నట్టు దూరంగా నది హోరు వినిపిస్తోంది.

★ ★ ★

ఏణ్ణర్థంకిందట -

వానల్లేక, తిండికి కటకట్లాడి పోతున్నప్పుడు చాలా మంది ఊరువిడిచి పట్నందారి పట్టారు. వాళ్లలో ఎక్కువమంది దళితులే. వాళ్లకూ కొద్దోగొప్పో భూములున్నాయి, వాటిని ధరగాని ధరకు జోగినాథానికే అమ్మేసి ఊరొదిలి వెళ్లిపోయారు చాలమంది. చావైనా బతుకైనా యీ గడ్డమీదనే అని భీష్మించుకుని కూర్చున్న దళితుల్లో మొదటివాడు ఎల్లయ్య. అతనికి అవూళ్లో ఎకరంబాతిక దాక వుంటుంది. ఎల్లయ్యలాంటి వాళ్లు యింకో అరడజనుమంది వుంటారు ఆ గూడెంలోనే. కరువు కలకాలం వుంటుందా? ఎప్పుడో ఒకప్పుడు మంచిరోజులు రాకపోతాయా అనే ఆశాభావంతో తమ భూముల్ని జోగినాథం దగ్గరే తాకట్టు పెట్టుకుని తిండీతిప్పలకి అప్పుడుకాస్త అప్పుడుకాస్త డబ్బులు తీసుకున్నారు. వాళ్లు సేద్యానికి అనర్హులని, వాళ్ల భూముల్నెలాగూ వాళ్లకి తిరిగి యిచ్చేది లేదని బాగా నమ్మినవాడు గనక జోగినాథం - వాళ్లు అడిగినప్పుడు అడిగినంత అప్పు యిచ్చేడు, కొంత కాలంపోయాక అవూరికి పంటకాలవ ఒకటి మంజూరు కావటం, జోగినాథం ఆధ్వర్యంలోనే కాలవతవ్వకం పనులు మొదలవడం జరిగింది. చిన్నా చితక రైతులతో సహా చాలమంది మట్టిపనికి దిగేరు. యల్లయ్య బృందంకూడా పనిలోకి దిగింది. చేతులారా పన్లుచేసుకుని కడుపార తినే రోజులొచ్చేసరికి, నేలకీ - వూరికీ కొత్త జీవకళ వచ్చింది.

చేతిలో నాలుగుడబ్బులు ఘల్లుమనేసరికి యథాప్రకారం తాగుడు, పేకాటలు, తన్నుకోటాలు, తగాదాలు తీర్చటాలు వూపందుకున్నాయి. ఈ పరిస్థితి గమనించి దళితవాడను కాస్తంత తట్టిలేపినవాడు ఎల్లయ్యే.

"ఇదుగో అబ్బాయ్! యిట్లా చేస్తే లాబంలేదు. ఇప్పుడు మనూరికి తల్లిలాంటి పంటకాలవ వొచ్చింది. ఎగసాయానికి యిక దిగులుండదు. కాబట్టి కూలిడబ్బుల్లోనే కొంత పొదుపు చేసుకుని, జోగినాథం గోరి అప్పు అణాపైసల్తో సహా తీర్చి మళ్లా మనం భూముల్ని మనం సాగుచేసుకుందాం. మనుషుల్లాగ బతుకుదాం"అన్నాడు.

అంతా సరేనంటే సరేనన్నారు.

పొదుపు మొదలెట్టేరు.

ఎల్లయ్య పెద్ద చదువుకున్నోడు కాకపోయినా, అతని వెనక యాభయ్యేళ్ల వయస్సు, వయస్సుకు మించిన అనుభవాలు వున్నాయి కనక అతని నాయకత్వంలో అందరూ కలిసి

మొన్నామధ్య జోగినాథాన్ని కలిసేరు.

"మీ అప్పు - అసలు ఫాయిదాలతో తీర్చేస్తాం. మా భూములు మళ్లీ మాకివ్వండి'
' అనడిగేరు.

"భూములు తీసుకుని ఏంచేసుకుంటారు. మళ్లీ నా దగ్గరకు వచ్చి తాకట్టు పెట్టాల్సిందేగదా"అని నవ్వి "కావాలంటే తలా యింత పారేస్తాను, భూముల సంగతి మరిచిపొండి"అన్నాడు జోగినాథం.

దళితులు అందుకు ఒప్పుకోలేదు. వీళ్లకు నచ్చజెప్పాలని చాలా రకాలుగా ప్రయత్నించిన మీదట జోగినాథం "అసలు ఆ భూములకూ మీకూ యిహనుంచి ఎట్లాంటి సంబంధమూ లేదు. అవన్ని మీరు నాకు అమ్మేసినట్టు అగ్రిమెంటు కాగితాలున్నాయి. పోయి ఎవళ్లతో చెప్పుకుంటారో చెప్పుకోండి" అని తేల్చేశాడు.

సరిగ్గా ఆవేళనే ఇటు దళితవాడలోనూ అటు బంగాళాఖాతంలోనూ అల్పపీడనం మొదలైంది.

★ ★ ★

దాదాపు అయిదింటప్పుడు ఎల్లయ్య మరికొంతమంది జోగినాథం దగ్గరకు వొచ్చేరు.

"ఇంతమంది వుంటే యవ్వారం బెడుసుద్ది. ఎల్లయ్యా నేనూ మాట్లాడుకుని ఏ సంగతీ మీకు చెప్తాం, పొండి" అంటూ దాదాపుగా వాళ్లను తరిమేసినంత పని చేసేడు జోగినాథం.

జోగినాథం చిన్నసైజు రేడియో చేతిలో పట్టుకుని తుఫాను హెచ్చరికలు వింటూ, హెచ్చరికల మధ్య సినిమా పాటలు వింటూ కాస్సేపు పచార్లు చేసేడు.

"తొందరగా తెమల్చండి. అవతల కాలవకట్ట తెగి ఊరిమాద పడుద్దేమోనని అడిలి చస్తన్నాం." అన్నాడు ఎల్లయ్య.

"ఒరే ఎల్లిగా!'శాంత గంభీరంగా నవ్వేడు జోగినాథం -

"నా కొడకా - నువ్విక అయిపోయినట్టేరా!" అన్నాడు.

ఎల్లయ్యకి అర్థంకాలేదు.

హనుమంతు తలొంచుకున్నవాడల్లా చివాల్న జోగినాథంకేసి చూసేడు.

"అయినా ఒరే కూలినాలి చేసుకోక మీకు ఎగసాయం ఎందుకురా, అందుకు మేవున్నాం గదా" కొవ్వుబట్టిన చేష్టలు కాకపోతే యీ యవ్వారాలేంది. నీకు చెప్పీ చెప్పీనాకు విసుగొచ్చింది. ఇక" - అని అంటూ వుండగా దూరంగా పెద్ద హోరు -

మాట్లాడుతున్న వాడల్లా చివాల్న తలతిప్పి వీధిగుమ్మంకేసి చూసేడు ఏమీ అర్థంకాలేదు. కిటికీల్లోంచి చూసేడు. ఏమీ కనపళ్లేదు. బాగా చీకటిగా వుంది.

"మొదట్లో 'పోనీలే ఎదవ' అని సరిపెట్టుకున్నా, రాన్రాను నీఎవ్వారం చూసినాక'
'జోగినాథం మాటలముందుకు సాగలేదు. బైట హోరు ఎక్కువవుతోంది; జనంకేకలు కూడా వినిపిస్తున్నాయి. జోగినాథం కనుబొమ్మలు అనుమానంతో అతుక్కుపోయాయి. అదేమిటో చూడమన్నట్టు హనుమంతుకు సైగ చేసేడు. హనుమంతు మేడమీదికి వెళ్లేడు. వెళ్లినవాడు రెట్టింపు వేగంతో కిందికి పరుగెత్తుకొచ్చి గుండెలు బాదుకుంటూ చెప్పేడు.

"వరద! నది పొంగినట్టుంది. మేడమీదకెళ్దాం, రండి"

ఆ తర్వాత ఎవళ్లేం పెద్దగా మాట్లాడుకోలేదు. ప్రాణభయంతో మేడమీదికి పరుగెత్తేరు.

తెల్లారింది

చుట్టూనీళ్లు.

వరద నీళ్లు.

దూరంగా అక్కడక్కడా మిద్దెలమీద చీమల్లా......మనుషులు. నీళ్ళమీద పూచిక పుల్లల్లా కళేబరాలు...కట్టెలు...

తినటానికి అన్నంవుండి తాగడానికి సారాయి, నీళ్లువుంటే జోగినాథం హుషారుగా ఆదృశ్యాన్ని చూస్తూ ఆనందించి వుండేవాడు.

జోగినాథానికి కడుపు మలమలా మాడిపోతోంది. తిందామంటే ఒక్క మెతుకు లేదు. తాగుదామంటే చుక్క నీళ్లూ లేవు. వంటమనిషి మీద కేకలెయ్యడానికి గొంతులో సత్తువా, కనీసం ఉరిమి చూడ్డానికి కళ్లలో ఓపికా లేవు. ఏదో యంత్రంపెట్టి అతని ఒంట్లోంచి జవసత్వాల్ని లాగేసినట్టు పిట్టగోడనానుకుని ఒక మూల కూలబడివున్నాడు. హనుమంతు కళ్లమీద ముంజేయి అడ్డంపెట్టుకుని కోడికునుకు తీస్తున్నాడు. వంటమనిషి దూరంగా కనిపించే భవంతుల మీద తనవాళ్లెవరైనా కనిపిస్తారేమోనని ఆశగా వెదుకుతున్నాడు.

ఎల్లయ్య పిట్టగోడమీంచి నీళ్లలోకి తొంగిచూస్తూ - నీళ్లమీద బోర్లాపడి తేలాడుతున్న శవం ఎవరిదో గుర్తుపట్టడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఇంతలో ఆకాశంలో సన్నగా ఒకధ్వని ప్రారంభమైంది. అందరూ ఒక్కసారిగా తలలు తిప్పి ఆకాశంలోకి చూసేరు.

హెలికాప్టర్.!

అందరికళ్లలో ఆశ.

హెలికాప్టర్‌లోంచి ఏవో రాలిపడుతున్నాయి.

ఆహార పొట్లాలు.

జోగినాథం పిచ్చిగా పరుగులు తీయసాగేడు.

కొన్ని పొట్లాలు జారవిడిచింది హెలికాప్టర్.

ఒక లిప్తపాటు ఒక ప్రపంచయుద్ధం.

పొట్లాలు నీళ్లలో పడిపోయాయి. ఒకే ఒక్కటి మాత్రం వాళ్ల మధ్యపడింది. అదీ ఎల్లయ్య చేతుల్లో పడింది.

ఎల్లయ్యకి బ్రేక్‌డాన్స్‌రాదు. కానీ బ్రేక్‌డాన్స్ చేసేడు. ఎల్లయ్యకి పాశ్చాత్య సంగీతం రాదు. కానీ మైకేల్ జాక్సన్ని మరిపించేడు, గంతులేసేడు అరిచేడు. ముఖ్యంగా తనచుట్టూ చేరి, తన చేతిలో వున్న పొట్లంకేసి తినేసేలా చూస్తున్న జోగినాథాన్ని, వంటమనిషినీ, హనుమంతునీ తేరిపారజూసేడు.

"ఒరే ఎల్లయ్య -" జోగినాథం గొంతు జోగినాథానికే వింతగా విన్పించింది. "ఆకలితో అల్లాడిపోతున్నా. ఆపొట్లం నాకియ్యరా."

"నేను నీలాంటి మణిసిని కాదా ఏంది. నాకు మాత్రం ఆకలుండదా ఏంది." అని నవ్వి "అయినా యీ పొట్లంనీకు యిచ్చేసినానే అనుకో నా కేందంటా ఒరిగేది" అన్నాడు ఎల్లయ్య.

"మీ భూములు మీకిచ్చేస్తా. అడిగినంత డబ్బులిస్తా. నువ్వేంజెయ్యమంటే అదిజేస్తా.

"నేన్నమ్మను."

"పోనీ ఏంజేస్తే నీకు నమ్మకం కుదురుద్దో చెప్పు."

ఇంతలో హనుమంతు అందుకున్నాడు. "ఎల్లయ్యా. ఎంతయినా మనం మనం ఒకటి. ఈ జోగినాదం మాటలు నమ్మబాక. ఆపొట్లం నాకివ్వు. ఈ పెద్దమణిసి మీకు బూములెట్టా యివ్వడో నేను జూస్త"

హనుమంతు మాటలకు నివ్వెరపోయేడు జోగినాథం. కనీసం తనవేపు తిరిగి ఊరికే ఉత్తిత్తికే ఆపొట్లాంకొట్టెయ్యటానికి ఇట్లా మాట్లాడుతున్నానని అర్థం వచ్చేట్టు కన్నగీటుతాడని ఎదురు చూశాడు. అట్టాంటిదేం లేదు. హనుమంతు కళ్లన్నీ ఆహార పొట్లం మీదే వున్నాయి.

వంటమనిషి పెద్దగా మాట్లాళ్లేదు గానీ, అతనివాలకం చూస్తే ఆహార పొట్లం అవసరం అందరికన్నా తనకే ఎక్కువ వుందన్నట్టు బేలగా మొహంపెట్టి "పొట్లం నా కొద్దు అందులోంచి ఒక్క పిడికెడన్నం పెట్టు"అన్నాడు.

ఎల్లయ్య కొద్ది క్షణాలు ఆలోచనలో పడ్డాడు.

"ఓ పన్చేద్దాం. ఈ పొట్లం నాకు అక్కరలేదు. మీకే యిస్తా. మీ అందర్లో ఒక్కళ్లకే యిస్తా. ఎవరిక్కావాలో మీరే తేల్చుకోండి" అన్నాడు.

అంతే!

జోగినాథం, హనుమంతు, వంటమనిషి ఒకళ్లనొకళ్లు చూసుకున్నారు, బతిమాలుకున్నారు, వాదించుకున్నారు,పోట్లాడుకున్నారు. నెత్తురులు కారేట్టు ముష్టియుద్ధం చేసుకున్నారు.

ఎల్లయ్య యిక భరించలేక 'ఆపండి'అని పెద్దగా అరిచేడు, అందరూ అతనికేసి కాదుగానీ అతని చేతిలోని అన్నంపొట్లంకేసి చూసేరు. జోగినాథం దగ్గరగా వెళ్లి నిల్చున్నాడు ఎల్లయ్య.

"ఒక్కపూట అన్నం లేకపోయేసరికి ఒకళ్లనొకళ్లు నెత్తురు కారేట్టు కొట్టు కున్నారే. రోజులతరబడి, ఏళ్లతరబడి, యుగాల తరబడి ఆకలితో అలమటిస్తున్న నాలాంటి వాళ్లంతా ఒక్కసారి చెయ్యెత్తేరనుకో - ఏంది పరిస్థితి" జోగినాథం మొహంలో మొహం పెట్టి మాట్లాడేడు ఎల్లయ్య.

"మాది ఒకళ్లకి పెట్టే జాతేగాని ఒకళ్లనించి లాక్కుతినే జాతికాదు. మా బూములు లాగేసుకో. మా చేతిలోవున్న కూడూ లాగేసుకో. హాయిగా కలకాలం సల్లగా వొర్ధిల్లు." అంటూ జోగినాథం చేతిలో పొట్లం పెట్టేడు ఎల్లయ్య.

ఇప్పుడు జోగినాథం కళ్లల్లో ఆశలేదు కసుర్లు లేదు. కన్నీళ్లున్నాయి. 

ఆ కన్నీళ్లు నిజం అనేందుకు దాఖలాలున్నాయి

పైడి తెరేష్‌బాబు, అనౌన్సర్, ఆకాశవాణి, హైద్రాబాద్ - 500004.